డని పిలువఁబడినటులనే 'అనంతధ్ర' దేశ మాంధ్రదేశమని పిలువఁబడుచున్నదనియుఁ గొందఱిమతమై యున్నది. వారలు

"శ్లో॥ అనంతంధారయచ్ఛేషా దేశశ్శైలాకృతిం తతః
అనంతధ్రస్యఏవాంధ్రః పరోక్షేణేంద్రవస్మృతః॥"

అను శ్లోకమును ప్రమాణముగఁ జూపించుచున్నారు. దీనిం బట్టి యనంతుఁడు శైలాకృతిని ధరించెననియు, నాశైలముండు భూభాగమే యాంధ్రదేశమని పేర్కొనఁబడి యుండెననియుఁ గన్పట్టుచున్నది. ప్రకృతకాలమునఁ 'దిరుపతి', 'అహోబలము' 'శ్రీశైలము' లను మహాపుణ్యక్షేత్రములను గలిగిన పర్వత పంక్తియే శేషశైలము, శేషాచలమని పిలువఁబడుచున్నది. ఈ శేషశైలమే శైలాకృతిగనుండిన యనంతుఁడనియు, ఫణ ప్రదేశము విష్ణ్వవతారమని పేరొందిన వేంకటేశ్వరనిలయమగు తిరుపతిక్షేత్రమనియు, మధ్యప్రదేశము నృసింహక్షేత్రమగు నహోబలక్షేత్రమనియుఁ బృచ్ఛభాగము శ్రీశైలక్షేత్రమనియుఁ జెప్పెదరు. ఈ క్షేత్రములుగల పర్వతపంక్తిఁ జూడ నొక సర్పాకృతిగ నుండినటులను, దిరుపతికడ నప్పర్వత మొక సర్పముయొక్క ఫణాకృతిగ నుండినటులను గన్పట్టును. "అనంతుఁడు", 'శేషుఁడు' అనునవి సర్పమునకు నామములు. సర్పాకృతిగ నుండుటచే నీ పర్వతపంక్తిని శేషాచలమని పేర్కొనుచుండిరి. అనంతుఁడే యిటుల శైలాకృతినొందియుండెననియు, నావిధి శైలాకృతినొందిన యనంతుని ధరించిన భూభాగము 'అనంతధ్ర' దేశమైయుండెననియు, నిదంద్రుఁ డింద్రుఁడని పేర్కొనఁ

బడినటులనే యీ యనంతర్ధదేశమే యాంధ్రదేశమని పేర్కొనఁ బడియుండెననియుఁ జెప్పుచున్నారు.

మనుష్యులు వసింపశక్యముగాని యంధకారబంధురం బగుటచే నౌత్తరాహులీదేశమును "ఆంధ్రదేశము" (అంధ + రక్ = ఆంధ్ర—దృష్ట్యుపఘాతే యని ధాతువు) అని వ్యవహరించుచు వచ్చిరనియు, కేవల మక్షరతత్త్వము నాధారముఁగ దీసికొని శ్రీ పాఁడి వేంకటస్వామిపాఠీగారు చెప్పియుండిరి. ‡ అదియునుంగాక కృష్ణా గోదావరీనదుల మధ్యనుండు ప్రదేశము మాత్రమే యాంధ్రదేశమని చెప్పియుండిరి.

ప్రాచీనకాలమున నాగరకులు వసింప శక్యముగాని యంధకారబంధురమైన మహారణ్యమధ్యమునందుఁ దొలుత వీరు నివసించియుండుటచే నౌత్తరాహులైన యార్యులు వీరి దేశము నాంధ్రదేశమనియు, వీరి నాంధ్రులనియుఁ బిలిచిరని చెప్పుమాట యుక్తియుక్తముగనే యున్నదని శ్రీ చరిత్ర చతురానన చిలుకూరి వీరభద్రరావుపంతులుగారు చెప్పియున్నారు.*

భరతఖండమునంగల వివిధభాగములకు నాయాభాగములఁ దొల్తొల్తఁ బ్రత్యేకరాజ్యవిభాగములుగాఁ గావించికొని పరిపాలనమొనర్చిన రాజనామములఁబట్టి ప్రత్యేకనామములు

‡ (See-ఆంధ్రాక్షరతత్త్వము-page 42 by Mr. P. Venkata swami Pathi)

(* See ఆంధ్రుల చరిత్ర. Vol. I page 12.)

గలిగినటులఁ బురాణములు వాకొనుచున్నవి. అందు ముఖ్యముగ దక్షిణాపథస్థరాజ్యవిభాగము లన్నిటికి నారీతిగనే నామములు గలిగినటులఁ గనిపించుచున్నది. యయాతివంశీయుఁడగు మహామనసుని రెండవకుమారుఁడగు తితిక్షువునిసంతతిలో నాలవతరమువాఁడగు 'బలి' యనురాజున కంగ, వంగ, కళింగ, సింహ, పుండ్ర, ఆంధ్రులను గుమారులార్గురు గలరనియు, వారు తూర్పుభాగముననుండు దేశంబుల బాలించుచు నాయాదేశంబులకుఁ దమతమ నామధేయంబులిడి పరిపాలించిరనియు భాగవతపురాణము జెప్పుచున్నది.

“అనోస్సభానరశ్చక్షుః పరోక్షశ్చత్రయస్సుతాః,
సభానరత్కాలనాధ స్సృంజయస్తత్పురంజయః॥ ౧.

జనమేజయ స్తస్యపుత్రో మహాశాలో మహామనాః ।
ఉశీనర స్తితిక్షుశ్చ మహామనసఆత్మజౌ॥ ౨.

శిబిర్వనః క్రిమిర్దర్పశ్చత్వారోఽశీనరాత్మజాః ।
వృషదర్పస్సువీరశ్చ మద్రః కేకయ ఆత్మజాః॥ ౩.

శిబేశ్చత్వార ఏవాసన్ తితిక్షోశ్చ రుశద్రథః ।
తతోహోమోఽధ సుతపాబలిస్సుతపసోఽభవత్॥ ౪.

అంగవంగకళింగాద్యాస్సింహ పుండ్రాంధ్రసంజ్ఞికాః ।
జజ్ఞిరేదీర్ఘతపసో బలేఃక్షేత్రే మహీక్షితః॥ ౫.

చక్రుస్స్వనామ్నా విషయాన్ షడిమాన్ ప్రాచ్యగాంస్మతే*

---

* Vide భాగవతపురాణము-నవమస్కంధము-ద్వావింశోధ్యాయము.

దక్షిణాపథమందలి పాండ్య, చోళ, కేరళదేశములను బాండ్య-చోళ-కేరళులను ముగ్గురున్నృపాలురు తొట్టతొలుత ప్రత్యేకరాజ్యములుగ భాగించుకొని పరిపాలనసల్పియుండుటచే నాపేరులు గలిగినటులఁ గన్పట్టుచున్నది. ఈవడువుననే భరత వర్షమునందలి పెక్కుభాగములకుఁ బ్రత్యేకనామము లేర్పడి యుండినటులఁ బురాణస్థచారిత్రాంశములవలనఁ దెలియు చున్నది. అటులనే 'బలి' కుమారుఁడగు నాంధ్రుఁ డనురాజు ప్రత్యేకరాజ్య విభాగముగఁజేసికొని పరిపాలించినదేశమగుటచే నాంధ్రదేశమని పిలువఁబడుచుండినటులఁ జెప్పుటయే సమంజస ముగ నున్నది.

ఆంధ్రులు వలసవచ్చి నివాసమేర్పఱుచుకొనిన ప్రదేశ మాంధ్రదేశమని కొందఱి యభిప్రాయముగానున్నది. మఱియు నాంధ్రు లనార్యులనియు, ననఁగా నార్యులకంటె భిన్నులనియు నార్యులీభరతఖండమునకు వలసవచ్చుటకుముందే యొకతెగవా రుత్తరదేశములనుండి వలసవచ్చి యిటనుండు దస్యు, దాస, పిశాచ, రాక్షసాది యనాగరకజాతులతోఁ గలిసిమెలసియుండి ఆర్యులు వలసవచ్చి యిటనుండువారలను తరిమివైచి స్థావరము లేర్పాటు గావించుకొనుకాలమున నీ రార్యులధాటికాఁగఁజాలక దక్షిణదేశములకు పఱుగువాఱి దక్షిణదేశమున స్థావరమేర్పఱుచు కొని యుండిరనియు, నాకారణమున వీరిని ద్రావిడులనియు, వీరుండు దేశమును ద్రావిడదేశమనియుఁ బిలువఁబడుచుండె ననియుఁ, గొందఱభిప్రాయపడుచున్నారు. ఆర్యులీభరతఖండ మునఁబ్రవేశించి యిచటనుండు నాదిమనివాసులగు దస్యు,

దాస, రాక్షస, పిశాచాదుల నోటువుచ్చి తఱిమివైచి, సప్తసింధు ప్రదేశము నాక్రమించుకొని పాలించుచుండినట్లును, ఆర్యులచేఁ బ్రథమమున నాక్రమించుకోఁబడి పరిపాలనము గావింపఁబడిన దేశముగాన 'ఆర్యావర్తమ'ని పేర్కొనఁబడియుండినట్లును, అయ్యదియే హిమవత్పర్వతములకును వింధ్యపర్వతములకును మధ్యనుండుప్రదేశమై యుండెననియు, దానినే నేఁటికాలమున హిందూస్థానమని యనుచుండిరనియుఁ గొందఱుజెప్పుచున్నారు. ఆర్యులట్టు లుత్తరదేశమును వశపఱుచుకొని దక్షిణదేశముం గూడ నాక్రమించుకొనుటకయి విచ్చేసిన మార్గమునకు దక్షిణాపథమనిపేరు వచ్చినట్లును, ఈదక్షిణాపథముననుండు దేశములకే దక్షిణాపథస్థదేశములని యనుచుందురనియు, దక్షిణ శబ్దమునుండి దక్కనము బుట్టినదనియు నయ్యదియే హిందీ భాషను 'డెఖ్ఖన్' అని పిలుతురనియు, దానినే యీకాలమున నాంగ్లభాషయందు 'డక్కన్'అని పేర్కొనఁబడుచుండెననియుఁ గొందరభిప్రాయముల వెలిబుచ్చియుండిరి.

ప్రాచీన హైందవవాఙ్మయమును బరిశీలించిన దక్షిణ సముద్రము మొదలుకొని యుత్తరమున హిమవత్పర్వతముల వఱకును నడుమనుండు భూభాగము 'భారతవర్ష'మనియు, నందుండుజనులు భారతీయులనియుఁ బూర్వము పిలువఁబడుచుండినటులఁ గన్పట్టుచున్నది.

శ్లో॥ హిమాహ్వాందక్షిణం వర్షమ్ భరతాయదదౌపితా ।
తస్మాచ్చభారతంవర్షం తస్యనామ్నామహాత్మనః॥ *

* (see శబ్దకల్పద్రుమము-8 కాండ 501 పేజీ)

"శ్లో॥ ఉత్తరం యత్సముద్రస్య హిమాద్రేశ్చైవదక్షిణమ్।
వర్షం తద్భారతంనామ భారతీ యత్రసంతతిః॥" *

"శ్లో॥ ఇదంతుమధ్యమంవర్షం శుభాశుభ ఫలోదయమ్।
దక్షిణస్యసముద్రస్య హిమవ్వాస్యా పిచోత్తరమ్॥ ౫.
వర్షంతద్భారతంనామ యత్రేమా భారతీప్రజాః।
భరణాత్తుప్రజానాం వై ననుభారతముచ్యతే॥" ౬

నిరుక్తవచనాచ్చైవ వర్షంతద్భారతం స్మృతమ్। ‡

పూర్వకాలమందీదేశ ముత్తరఖండమనియు దక్షిణఖండమనియు రెండు విభాగములుగ నుండినట్లును, ఆరెండు విభాగములను వేరుపరుచుసరిహద్దు వింధ్యపర్వతములుగఁజేసి వింధ్యకుత్తరభాగమును "ఉత్తరాపథమనియు, దక్షిణభాగమును దక్షిణాపథమనియుఁ బేర్కొనఁబడుచుండినట్లు గన్పట్టుచున్నది.

"శ్లో॥ దక్షిణాపథజన్మానః సర్వేనరవరాంధ్రకాః॥
గుహాఃపుళిందాః శబరాశ్చుచుకామద్రకైస్సహా॥ 42
ఉత్తరాపథజన్మానః కీర్తయిష్యామితానపి।
యానా,కాంభోజగాంధారాఃకిరాతాబర్బరై స్సహా॥" 43

* * *

పురాణములయం దుదాహృతమైన దేశవిభాగముల క్రమమును బరికించిన ప్రాగ్దక్షిణ భాగములరెంటను నాంధ్రుల

---

* (see విష్ణుపురాణము - అంశ 2. అధ్యా 3, శ్లో 1.)

‡ vide- మత్స్యపురాణము - 113 అధ్యా.శ్లో 5-7)

† vide- మహాభారతము - శాంతిపర్వము. 207 అధ్యా. శ్లో 42-43.]

ప్రశంసయున్నటులఁ గానిపించుచున్నది. ఆరెండు భూభాగము లను దక్షిణాపథమునందుండినటుల గాననగును. కాని యుత్తరా పథమునం దాంధ్రదేశప్రశంసగాని యాంధ్రుల ప్రశంసగాని చేయఁబడియుండలేదు. కాఁబట్టి యాంధ్రు లుత్తరదేశము నుండి దక్షిణాపథమునకు వచ్చియుండిరనిగాని దక్షిణభాగమునఁ దమ పేరనొక జనపథము నేర్పాటుఁగావించుకొని యుండిరని గాని చెప్పుట కవకాశము గాన్పింపదు.

సింధునది ఉత్తరాపథమునందుండినది. సప్తసింధువులని ప్రాచీనులచే బేర్కొనఁబడిన గంగ మున్నగు నదులును ఉత్తరా పథమునందే యుండియున్నవి. "సింధు" శబ్దమును పారశీకులు 'హిందు' శబ్దముగ బేర్కొనుచుండిరి. పారశీకుల భాషయగు జెండుభాషయందు 'స' కారమును 'హ' కారముగ వాడబడు చుండెను. ఆకారణమున ఉత్తరాపథదేశము నానుకొనియుండు పశ్చిమదేశవాసులగు పారశీకు లీదేశమును 'హప్తహిందూ' దేశమని పేర్కొనియుండిరి. అయ్యదియే క్రమ క్రమముగ 'హిందూదేశ' మని పిల్వఁబడుచువచ్చెను. అందుండువారు హిందువు లనబరగిరి. హిందువుల కునికిపట్టగుటచే హిందూ స్థానమనియు బిల్వఁబడుచు వచ్చెను.

## ఆర్యు లాదిమవాసులు కారా? వలసవచ్చినవారలా?

ఆర్యులీభరతఖండమునకు వలసవచ్చి నివాసమేర్పఱుచు కొనినవారని యిప్పటికి షుమారు రొకశతాబ్దమునుండియుఁ బాశ్చాత్య చరిత్రకారులచే సిద్ధాంతరాద్ధాంతములు గావింపఁ

బడుచున్నవి. ఈ సిద్ధాంతమునకుఁ దగిన చరిత్రాంశములఁ జూపెట్టక నూహాపోహలచే సృష్టిగావించియుండిరి. అట్టి సిద్ధాంతములనే స్థిరపఱుచుకొని పాఠ్యగ్రంథములలో నెక్కించి బాలురకు బోధసేయ సమకట్టిరి. అయ్యది నానాఁటికిఁ బెఱిగి పెద్దవృక్షమై దినదినాభివృద్ధిఁగాంచి నలుకెలంకుల కావరించుటయేగాక విద్యావిశారదులగు హైందవులలోఁ గూడ నార్యులు వలసవచ్చి యిటనివాసమేర్పఱచుకొని యుండినవారేయను మూఢవిశ్వాసమేర్పడుటకుఁ గారణమయ్యెను. పాఠశాలలలో బాలురకు హిందూదేశచరిత్రను బోధసేయుటకై యేర్పడిన పఠనీయగ్రంథములలో నొకదానియం దీక్రిందివిధి చెప్పఁబడియున్నది.

1. **Ancient Name.** The name generally given by Early Hindu writers to India is Bharata-Varsha 'the land of Bharata'. This Bharatha is said to have been a celebrated king, who ruled over a vast extent of territory in ancient days.

2. **The Aborigines.** Of the aborigines, that is, the first inhabitants of th. country, little is known. The Khonds in Central India, the Bhills in Rajaputana, the Santals in Bengal, the Todas in Southern India and many others are generally regarded as aboriginal tribes.

**3. The Turanians.** The first strangers that entered the country were the ancestors of the four great races of southern India, speaking the four languages Tamil, Telugu, Malayalam and Kanarese. They are generally supposed to have been Turanians of Mangolian and Scythian descent, who came from Tartary and Tibet, and entered India, by the passes of the Himalaya mountains. They have been called Dravidians, from Dravida the name of that part of Southern India peopled by them.

**4. The Aryans.** Following these Turanians came a people, who called themselves Arya, that is 'Noble'. Their home was in the plateau of Central Asia, somewhere near the sources of the river Oxus. They were a brave and enterprising people, and as they increased in numbers, many of them began to look out for better and richer lands to dwell in. Some of them came South and took up their abode at first on the banks of the river Sindhu (Indus); and their Persian Neighbours, naming them after the river on whose banks they had settled called them Hindus. Fresh swarms of their country-men from time to time

came and settled besides these, so that after many years they became so numerous and powerful that they crossed the Sindhu and took possession of the country on its Eastern Banks. But they were not allowed to do so unopposed. The original inhabitants of the country who were at the time called Rakshasas (Giants) Pisachas (Demons) and Dasyas (Demi-gods) were soon up in arms against the invaders, and many fierce fights would seem to have taken place. Steadily, however, though slowly, the Aryans continued to advance, until they overran the valley of the Ganges and occupied Central India. The whole of the country thus conquered by them was called by the Hindu writers 'Aryavarta' abode of the Aryans and it included all the provinces "as far as the eastern and as far as the western oceans between the two mountains" (the Himalaya and the Vindhya mountains). This part of India the Persians called "Hindustan", 'the land of Hindus' while the south of the Vindhya range began to be known as the Dekhan. *

* Outlines of Indian History by Mr. David Sinclair, M. A., Pages 1 & 2. Printed at S. P. C. K. Press, Vepery, Madras.

1. పురాతననామము. ప్రాచీన హైందవగ్రంథకర్తలు సామాన్యముగా 'భరతవర్షము' (భరతుని భూమి-రాజ్యము) అని హిందూదేశమును బేర్కొనియుండిరి. ఈ భరతుఁడు ప్రాచీనకాలమునందు బహువిశాల ప్రదేశమును పరిపాలనమొనర్చి ప్రఖ్యాతివడసిన యొక రాజయినటులఁ జెప్పఁబడియున్నాఁడు.

2. ఆదిమనివాసులు. ఆదిమనివాసు లనఁగా నీదేశమునందుఁ దొలుతఁ గాఁపురమున్నవారింగూర్చి తెలియుట లేదు. మధ్యహిందూదేశమునందలి 'ఖాండులు' రాజపుత్రస్థానమునందలి 'భిల్లులు', బెంగాలుదేశమునందుండు 'సంతాలులు', దక్షిణాపథమునందుండు 'తోడులు' ఇంక ననేకమంది సాధారణముగ నాదిమనివాసులుగఁ జూడబడుచుండిరి.

3. తురేనియనులు. ఈదేశమునఁ బ్రవేశించిన మొట్టమొదటి పరదేశీయులు దక్షిణాపథమున దమిళము(అరవము) తెలుఁగు, మలయాళము, కన్నడ మను నాలుగు భాషలుమాటాడు నాలుగు గొప్పతెగలకు మూలపురుషులై యుండిరి. వారు తార్తారు, టిబెట్టుదేశములనుండివచ్చిన మంగోలియనులు సిథియనుల వంశీకులగు తురేనియనులై యుండురనియు, హిమాలయపర్వతములలోని కనుమమార్గములగుండా హిందూదేశమును బ్రవేసించిరనియు సామాన్యముగ

నూహింపఁబడుచుండెను! వారిచే నివాసమేర్పాటు చేసికొనఁబడిన దక్షిణహిందూదేశములోని భాగమునకు నదివఱకున్న 'ద్రవిడ' యను నామముంబట్టి వారలు 'ద్రావిడు'లని పిలువఁబడుచుండిరి.

4 ఆర్యులు తురేనియనులపిమ్మట 'ఆర్యుల'మని(ఆర్యలనగా గొప్ప వంశస్థుఁడు) చెప్పుకొను మఱియొకజాతివారు వచ్చిరి. ఆక్స్యసునది పుట్టినప్రదేశమునకు దగ్గఱగా నెచ్చటనో మధ్యఆసియాలోని సమభూమియె వారి నివాసభూమియైయుండెను. వారు ధైర్యసాహసములుగలవారు. వారిసంఖ్య హెచ్చినకొలఁది వారిలో బహుమంది నివసించుటకు శ్రేష్ఠమును సారవంతమును ఫలవంతమును నగుభూములకై వెదక సాగిరి. వారిలోఁగొందఱు దక్షిణదిశగావచ్చి సింధునదిప్రక్కన మొట్టమొదట నివాసమేర్పఱచుకొనిరి. అచట వారిసమీపమునందుండు పారశీకులు సింధునది ప్రాంతభూముల నివాసమేర్పఱచుకొనియుండుటచే దానిపేరునుబట్టివారిని 'హిందువు'లని పేర్కొనియుండిరి. వారిదేశస్థు లప్పటప్పటికి ముఠాలు ముఠాలుగవచ్చి వారిప్రక్కభూములలో నివాసమేర్పఱచుకొనిరి. పెక్కేండ్ల తర్వాతవారు బహుళసంఖ్యాకులై ప్రబలులై సింధునదినిదాఁటి ప్రాగ్భాగమును స్వాధీనపఱచుకొనిరి. అట్టిచో వారిని నిరాటంకముగ స్వాధీనము జేసికొననిచ్చియుండ

> లేదు. ఆకాలమున రాక్షసులు, పిశాచులు, దస్యులు అనిపిలునఁబడుచుండు నాదేశపు టాదిమ నివాసులు దండెత్తివచ్చువారిపై తిరుగుబాటొన రించిరి. అట్టియెడఁ పెక్కు ఘోరయుద్ధములు జరిగి నటులఁ గన్పట్టెడిని. గంగానది ప్రవహించెడి పల్లపు భూములనెల్ల జయించువఱకు నిశ్చలముగ మెల్ల మెల్లగ ముందుకుపోసాగి మధ్యయిండియాదేశము నాక్రమించుకొనిరి. వారిచే జయింపఁబడిన దేశము నంతను హైందవ గ్రంథకర్తలు 'ఆర్యావర్తము' (ఆర్యుల వాసస్థలము) అని పేర్కొనియుండిరి. అందుఁ దూర్పునను బశ్చిమమునను సముద్రముల పర్యంతమును హిమాలయ, వింధ్య పర్వతముల రెంటికినిమధ్యనుండు ప్రదేశమునఁగల రాష్ట్రము లన్నియుఁ జేరియుండెను. హిందూదేశములోని యీభాగమును బారశీకులు 'హిందూస్థానము' హిందువులదేశము, అని పేర్కొనిరి. వింధ్యపర్వత ములకు దక్షిణభాగము'దక్కను'అని వ్యవహారింపఁ బడుచుండెను.[1]

ఇట్టి సిద్ధాంతములనే తదితర పాఠ్యగ్రంథములలో సైత మెక్కించి బాలురకు నుగ్గుబాలవలె నూరిపోయుచుండిరి.

---

([1] See— డేవిడ్ సింక్లెరుగారి "అవుట్లైన్సు అఫ్ ఇండియన్ హిస్టరి- పేజీలు 1 & 2.)

అయ్యవి క్రిమక్రమముగ భారతీయుల మనోహర్మ్యముల నధివసిలంచి సామాన్యముగ విద్యాధికుల మనుకొనెడువారలలో నూటికిం దొంబదిమంది కెక్కుడుగ నీ సిద్ధాంతములే వాస్తవ మను భ్రమ ప్రమాదములకు లోనయియుండిరని చెప్పిన భారతీయ సోదరులు మన్నింత్రుగాక !

ఈసిద్ధాంతములవలన నార్యులు భారతీయులుగారనియు, మధ్య ఆసియానుండి భారతదేశమునకు వలసవచ్చినవారనియుం, దమిళము, తెలుంగు, మలయాళము, కన్నడము నాలుగు భాషలను మాట్లాడువారలమూలపురుషులు తార్తారు, టిబెట్టు దేశములనుండివచ్చిన మంగోలియనులయొక్కయు, సిథియనులయొక్కయు సంతతివారనియు, నార్యులకంటె ముందుగనే భరతఖండమునకు వలసవచ్చి దక్షిణ హిందూదేశమును జేరియుండిరనియు, ఖాండులు, భిల్లులు, తోడులు, సంతాలులు మున్నగువారలే భరతఖండమున కాదిమనివాసులనియు, నార్యుల నెదుర్కొనినటులం జెప్పంబడు దస్యు, దాస, రాక్షస, పిశాచాదులు ఆర్యులకంటె భిన్నులనియు, ననార్య (ఆర్యులు కానివారు)లనియు వారలే భారతదేశ నివాసులనియు స్ఫురించుచున్నది.

మధ్యఆసియా ప్రదేశమునుండి యార్యులీభరతఖండమునకు వలసవచ్చినటులం జెప్పంబడు సిద్ధాంతములేగాక ధ్రువఖండ (North Pole Regions) ప్రాంత భూములనుండియు, యూరపుఖండ ప్రాంతభూములనుండియు, తురుష్కస్థానము

(Turkeystan), ఆసియా మైనరు, ఉత్తరమెసపొటోమియా బాక్ట్రియాప్రాంతభూములనుండియు వలసవచ్చియుందురనియుఁ జరిత్రకారులు గొందఱు తమ తమ యూహాపోహాలు సాగిన విధమున నిరాధారములగు సిద్ధాంతములఁ బెక్కింటిని బ్రతిపాదించియుండిరి.

ఇవ్విధముగఁ దెలుఁగుభాషను మాతృభాషగ మాటలాడుచు నాంధ్రులమని చెప్పికొనువారు భరతఖండమునందాదిమ నివాసులుకారా? కానిచో నేదేశమునుండి యేకాలమున నెట్లు వచ్చి యిచట స్థావరమేర్పఱచుకొని యుండిరో తెలిసికొనుట యాంధ్రసామ్రాజ్యచరిత్ర మెఱుంగఁగోరువారల కావశ్యకమని తోఁపక మానదు. భరతఖండమునంగల ఖాండులు, తోడులు, భిల్లులు, సంతాలులు మున్నగు తెగలవారుదక్కఁ దక్కిన తెగలవార లీభరతఖండవాసులుకారా? ఇతర ప్రదేశములనుండి వలసవచ్చియుండిరా? అటులేని యెచటనుండి యెప్పుడెట్లు వలస వచ్చియుండిరను నంశములను సందర్భానుసారముగఁ దెలిసికొన వలసియుండును.

## వలసవిధానమందలి ప్రధాన సిద్ధాంతములు.

ఆర్యు లీభరతఖండమునకు వలసవచ్చినవారలని ప్రతిపాదింపఁబడిన సిద్ధాంతములలో నుత్తర ధ్రువప్రాంతభూముల (North Pole regions)నుండియు,యూరపుఖండ(European Continent) ప్రాంత భూములనుండియు, మధ్య ఆసియా (Central Asia)ప్రాంతభూములనుండియు వలసవచ్చియుండిరని

ప్రతిపాదించిన సిద్ధాంతము లెక్కుడు ప్రాముఖ్యమును వహించి యుండెను.

### ఉత్తరధ్రువ సిద్ధాంతము.

ఉత్తరధ్రువ ప్రాంతభూములనుండి 'వలసక్రమము' జరగియుండుననను సిద్ధాంతమును తొలుదొల్త "మానవజాతి పుట్టుక" (Origin of Human Race) యను గ్రంథమును విరచించిన ఫ్రెంచిదేశీయుఁడగు సపోర్టాపండితుఁడు ప్రతిపాదించి యుండెను. సృష్ట్యారంభమున నుత్తరధ్రువ ప్రాంతప్రదేశము సమానమగు శీతోష్ణస్థితులుగలిగి మానవునకు నివాసయోగ్యముగ నుండెననియు, నాకాలమున హిందూదేశము (భరత ఖండము) శీతోష్ణాధిక్యతచే మానవునకు నివాసయోగ్యముగ లేకుండెననియు, నందువలన మానవసృష్టి మొదట నుత్తరధ్రువ ఖండ ప్రాంతమునందే జరగియుండవలయుననియు, అచటనుండి మానవుఁడు దక్షిణఆసియాభూములకు వలసవచ్చియుండు ననియుఁ గేవలము వారియూహాలనే యాధారముఁజేసి సిద్ధాంత మొకదానిఁ గావించియుండెను.

"The entire human race originated on the shores of the Polar Sea at a time when the rest of the Northern Hemisphere was too hot to be inhabited by man". [1]

---

1 Vide Origin of Human Race by Mr. D. Suporta.

“శేషించిన ఉత్తరభూగోళభాగము మానవనివాసమున కత్యుష్ణమైయున్న కాలమున మానవజాతియంతయు ధ్రువ సముద్ర తీరములం దుత్పత్తి యయ్యెను.” [1]

ఈ సిద్ధాంతము నూఁతఁగాఁగొని డాక్టరు వారను పండితుఁడు “స్వర్గస్థాపన లేక కనిపెట్టఁబడిన స్వర్గము.” (Paradise Found) అను గ్రంథమున మానవజాతియొక్క బాల్యదశ ఉత్తరధ్రువము దగ్గఱనయి యుండెనని చెప్పియున్నాఁడు.

“The Cradle of human race was at the North Pole” [2]

“మానవజాతియొక్క శైశవడోలిక ఉత్తరధ్రువము దగ్గఱనై యుండెను.” (Vide. స్వర్గస్థాపన by Dr. Warran)

లోకమాన్య బాలగంగాధరతిలకు పండితుఁడు ఆర్క్టిక్ హోమ్ (The Arctic Home) అను గ్రంథమున హిమప్రళయ యుగమునకుఁ బూర్వము వైదికమానవుల పూర్వీకుల నివాస ముత్తరధ్రువమున కెచ్చటనో దాపుననై యుండెనని చెప్పి యుండెను.

“The home of the ancestors of the Vedic people was somewhere near the North Pole before the Glacial Epoch.” [3]

---

1 (See మానవజాతి పుట్టుక.)

2 Vide. The Paradise Found by Dr. Warran

3 Vide. The Arctic Home by Lok. B. G. Tilak

## ఐరోపాఖండ సిద్ధాంతము.

ఆర్యుల శైశవడోలిక (Aryan Cradle) అను గ్రంథమునందు టోమశ్చెక్కు మున్నగువారలు యూరపుఖండమందలి ప్రాగ్భాగమునుండియు, వాన్ లోహరు మున్నగువారలు జర్మనీదేశమునుండియు, ఫ్రెడరిక్ ముల్లరు, కూనో మున్నగువారలు యూరపుఖండమందలి యుత్తరభాగమునుండియు, నార్యులు వలసవచ్చినటులఁ జెప్పియుండిరనియు, పెంకా పండితుఁడు స్కాండినేవియా (Scandinavia నార్వేస్వీడను దేశములు) ఆర్యుల కాదిమనివాసమని వాదించియుండిరనియు, వీరందఱీవిధమునఁ బ్రతిపాదనలు సల్పుచుండ విస్తీర్ణమైన "రాకిటినో బాడువప్రదేశ" మార్యుల కుత్పత్తిస్థానమైయుండెనని పోషీ పండితుఁడు సమర్థించుచుండెననియుఁ జెప్పఁబడియున్నది.

"Tomaschech and others are for Eastern Europe. A few such as Von Lohar etc., are for Germany, Frederick Muller, Cuno etc.,are for Central Europe, Linden, Schmidt and others are for Northern Europe; Penka argues that Scandinavia was the cradle of the whole Aryan Race; while Posche maintains that the Aryan race originated in the Great Rokitino swamps." 1

ఆర్యుల వ్యుత్పత్తి(Origin of Aryans)యను గ్రంథమును రచియించిన "ఈసాకు టెయిలరు" (Isaac Taylor) పండితుఁడు

1 Vide, Aryan Cradle, Page 35.

యూరపుఖండమందు వ్యవహారమందుండు భాషలన్నిటిలో లిథూనియను (Lithunian) భాష కెక్కుడార్షత్వముఁ గలదనియు, నా లిథూనియనుభాషనుండి సంస్కృతభాషపుట్టి యూరపుఖండమునుండి భరతఖండమునకుఁ జేరియుండుననియు మున్నగు విపరీత సిద్ధాంతములఁ గావించుచు నార్యులు యూరపుఖండము నుండి భరతఖండమునకు వలసవచ్చియుందురని చెప్పియుండెను.

"Sanskrit must have reached India from Europe"§

ఆర్యుల శైశవడోలిక (Aryan Cradle)గ్రంథకర్తయు గూడ అవెస్టా (Avesta- పారశీకుల వేదగ్రంథము) కంటెను, వైదిక సంస్కృతముకంటెను మఱి యేయితర భాషలకంటెను యూరపుఖండమందలి లిథూనియనుభాష మిగులఁ బ్రాచీనమైనటులఁ గన్పట్టుచున్నదనియు, నాకారణమున జాతులన్నిటికంటెను లిథూనియను జాతివారు మిక్కిలి ప్రాచీనులనియు నిప్పటికి నిలచియున్న అతిపురాతన ఆర్యజాతిచిహ్నమైనటులఁ గన్పట్టుచున్నదనియుఁ జెప్పియున్నాఁడు.

" The Lithunian language of Europe presents an Archaic character which no other tougue neither the Avesta nor even the Vedic Sanskrit does and therefore the Lithunians appear to be the oldest and the only surviving relie of the most ancient Aryan race." (*Aryan Cradle*)

యూరపుఖండమునుండి యార్యులు భరతఖండమునకు వలసవచ్చినటులఁ బ్రతిపాదించు "యీసాకుటెయిలరు"

§Vide. Origin of Aryans by Isaac Taylor- Page 20.

మున్నగువారు యూరపుఖండమున జర్మనులు, లెట్టులు, స్లైవో, నియనులు, గ్రీకులు, ల్యాటినులు, కెల్టులు అను నాఱుతెగల వారు కలరనియు, హిందూదేశమునుండి యాఱు తెగలు బైలు దేఱి యాఱు పర్యాయములు వలసవచ్చి యాఱు జాతులుగ యూరపులో స్థావరమేర్పఱుచుకొనిరని చెప్పుట యసంభవ మనియు, నా యాఱు శాఖలవారిలో నొకరు చీలిపోయి భరత ఖండమున (ఇండియాదేశమున) నార్యులుగా నిలిచిరని చెప్పుట సమంజసముగనుండుననియు మున్నగుకుతర్కములఁ గావించి యుండిరి. ఇంతియగాక హిందూదేశమునందలి యార్యులు దేశద్రిమ్మరులనియు, యూరపుఖండమునందు స్థావరముగనుండు జాతులవా రట్టియార్యులసంతతి యని చెప్పుట కవకాశముండ దనియు, వా రితరదేశములనుండి వలసవచ్చినటుల దృష్టాంత ములు గాన్పించుటలేదనియు సూచించియుండిరి. భరతఖండ ములోని యార్యులు యూరపుఖండమునుండి వలసవచ్చిరను నిరాధారములగు నూహాపోహలచేఁ గుతర్కములు గావించుచు సిద్ధాంతీకరించుటకు 'యీసాకు టైలరు' పండితుఁడు సాహసించి యుండెనుగాని యూరపుఖండములోని జాతు లితరదేశముల నుండి వలసవచ్చినటులఁజెప్పుట కేయాధారమును గాన్పించుట లేదట! అందుచే వా రితరదేశములనుండి వలసవచ్చినవారని చెప్పుట కవకాశము లేదట!

భరతఖండమునందలి యార్యులు యూరపుఖండము నుండి వలసవచ్చినటు లుపపాదించిన 'యీసాకు టైలరు' పండి తున కుత్తరధ్రువప్రాంతభూములనుండి వలసవచ్చినటుల సపోర్టా

పండితునిచే నుపపాదింపఁబడిన సిద్ధాంతము కంటకముగఁ గన్పట్టెను. ఆసిద్ధాంతమును ద్రోసిపుచ్చినంగాని తమ సిద్ధాంతమునకుఁ బ్రాముఖ్యత కలుగనేఱదని తలఁచి యుత్తరదేశమునుండి దక్షిణదేశమునకు 'వలసక్రమము' జరగినటుల నిదర్శనములు గాన్పింపవనియు, విధాయకముగ నుత్తరభూములయందలి తెగలవారిని దక్షిణభూములయం దుంచినను, దక్షిణదేశములందలి తెగలవారి నుత్తరదేశమందుంచినను నామరూపక్రియలులేక నశింతురనియు, నక్కారణమున నుత్తరధ్రువ ప్రాంతభూములనుండి యార్యులు భరతఖండమునకు వలసవచ్చిరని చెప్పుటకు వీలుండదనియుఁ జెప్పుచు నుత్తరధ్రువప్రాంతభూములనుండి యార్యులు భరతఖండమునకు వలసవచ్చియుందురని 'సపోర్టా' పండితునిచేఁ జేయఁబడిన సిద్ధాంతమును ద్రోసివైచియుండిరి.

యూరపుఖండమునుండి వలసవచ్చినట్లు వాకొనువారి సిద్ధాంతములను బట్టి—

1. భరతఖండమందలి హైందవుల భాషయగు సంస్కృతభాషకంటెను యూరపుఖండమందలి లిథూనియను భాష యెక్కువ పురాతనముగఁగన్పట్టుచున్నదనుటయు, సంస్కృతభాష యూరపునుండి హిందూదేశమునకు వచ్చియుండినదనుటయు,

2. యూరపుఖండమందలి పలుతెగలవారు పెక్కుసారులు భరతఖండమునుండి (ఇండియాదేశమునుండి) వలసవచ్చి యూరపులో స్థావరమేర్పఱుచుకొని యుండిరనుటకంటె

వారియందొక తెగవారు వలసవచ్చి హిందూదేశమున స్థావర మేర్పఱుచుకొనిరని చెప్పుట యెక్కుడు సంభవముగఁ గన్పట్టుచున్నదనుటయు,

3. యూరపుఖండమందలి తెగలవారొక్కచోట స్థిరముగఁ గాపురమున్న వారనియు, హిందూదేశములోని యార్యులు దేశదిమ్మరులనియు, నాకారణమున నొక్కచోట స్థిరముగఁ గాపురమున్న తెగలవారిలో నొకరు చీలి హిందూదేశమునకు వలసివచ్చిరని చెప్పుట సంభవముగ గన్పట్టుచున్నదనియుఁ జెప్పుటయు,

ముఖ్యముగ గమనింపఁదగిన విషయములై యున్నవి.

## మధ్యఆసియా సిద్ధాంతము.

ప్రస్తుతకాలమునం దెక్కుడు ప్రాముఖ్యతకలిగి విద్యార్థులకుఁ జిన్నఁటనాఁటనుండియు బోధించు సిద్ధాంత మార్యులు మధ్యఆసియా పరిసరభూములనుండి హిమాలయ పర్వతములలోని కనుమమార్గముల ద్వారమున హిందూదేశమునకు వలస వచ్చి నివసించు నాదిమనివాసులగు దస్యు, దాస, రాక్షస, పిశాచాదు లనువారల జయించి దేశము నాక్రమించుకొని యుండిరనుటయే!

ఆర్యులు మధ్యఆసియా ప్రాంతభూములనుండి భరతఖండమునకు వలసవచ్చినటులఁ దొలుత సిద్ధాంత మొనర్చినది "లాసెన్" పండితుఁడై నటులఁ గన్పట్టుచున్నది. మానవో

త్పత్తి తొట్టతొలుత ఆసియాఖండమునోని ఆక్సస్, జాక్సర్టిస్, నదుల వ్యుత్పత్తిస్థాన ప్రాంతభూములయందే యుండెననియు, నచటినుండి 'వలసక్రమము' బయలుదేఱి యుండెననియు 'లాసెన్' పండితుఁ డూహించియుండెను. ఆక్సస్, జాక్సర్టిస్ నదులు రెండును మధ్యఆసియా ఖండమునఁ జుట్టి పశ్చిమముగఁ బ్రవహించి కాస్పియన్ (Caspean Sea) సముద్రమునఁ గలియుచున్నవి.

“లాసెన్” పండితుని యభిప్రాయమును జేయూఁతఁ గాఁగొని పారశీకుల వేదగ్రంథమగు 'అవెస్టా' ను భాషాంతరీకరించు సందర్భమున “ఇండోజర్మను తెగలకుఁబుట్టుక హిందూ దేశమనెడి యూహను మనము వెంటనే త్రోసివేయవచ్చును. వారిజన్మభూమి యిరేనియన్ దేశమునందలి తూర్పుభాగమగు ఆక్సస్, జాక్సర్టిస్ నదుల వ్యుత్పత్తి ప్రదేశమునఁ గనుఁగొనవలసి యుండునను లాసెన్ పండితుని యూహను మే మంగీకరించుచున్నాము” అని ప్రొఫెసరు స్పీగెలుపండితుఁడు చెప్పె యుండెను.

“We may, therefore, at once set aside the supposition that India was the cradle of the Indo-German races. We prefer to assume with Lassen that their original abode is to be sought in the Extreme East of the Iranian country in the tract, where the Oxus & Jaxarties take their rise”[1]

---

1, Vide, Avesta by Prof. Spiegal.

మఱియు ప్రొఫెసరు ష్లెగలు (Prof. Schlegal) పండితుఁడు హిందువుల యుత్పత్తి (Origin of Hindus) అను గ్రంథమునం దీవిధముగఁ జెప్పియుండెను.

"It is no wise probable that the migration which have peopled so large a part of the Globe should have commenced at its Southern extremity, and have been constantly directed from that point towards the North and West. On the contrary, everything concurs to persuade us that the colonies set out from a central region in divergent direction. According to this supposition, the distances which the colonists would have to travel up to the time of their definitive establishment become less immense; the vicissitudes of climate to which they were exposed became less abrupt; and many of the emegrant tribes would thus make an advantageous exchange, as regards fertility of soil and the temperature of the air. And where is this Central country to be sought for, if not in the interior of the great continent in the neighbourhood and to the East of the Caspean Sea." [1]

"భూగోళమందలి దక్షిణప్రాంతమునుండి 'వలసక్రమము' బయలువెడలి విషువత్పుండ నచటనుండి యుత్తర పశ్చిమ దిశల కేఁగి యంత పెద్దభూభాగమును మానవతరంగములతో నింపె ననుట యేమాత్రమును సంభావితముగాదు. అందుల కతిరిక్తముగ నేదేని మధ్యప్రదేశమునుండి నలుకెలంకులకుఁ జీలికలుగ 'వలసక్రమములు' జరగియుండెనని ప్రోత్సహించు

1 Vide Origin of Hindus by Prof. Schlegal.

టకుఁ బ్రతివిషయమును సరిపోవుచున్నయది. ఈ యూహ ననుసరించి వలసపోవువారలు నివాసమేర్పాటుఁ గావించుకొనఁ దలఁచిన గమ్యస్థానమునకుఁ బ్రయాణము సేయవలసినదూరము తగ్గును. శీతోష్ణపరిస్థితులయందలి పరిణామములు స్వల్పవైప రీత్యముకలవి యగును. వలసపోవు తెగలవారు బహుమంది యీ విధముగ భూసారములందును, శీతోష్ణాది స్థితులయందును, అనుకూలమగు మార్పులు గావించుకొనఁ గలుగుదురు. కాస్పి యన్ సముద్రమునకుఁ దూర్పుఁగ నానుకొనియుండెడి యీ గొప్పఖండము (ఆసియాఖండము) యొక్క మధ్యప్రదేశము గాక కనుఁగొనవలసిన మధ్యప్రదేశ మింకెచ్చట యున్నది?"*

వీరి వ్రాతలనుబట్టి యార్యులు హిందూదేశ నివాసుల నియు, నచటనుండి కొందఱు జర్మనీప్రాంతములకు వలసవెళ్ళి స్థావరము లేర్పఱుచుకొనియుండిరనియుఁ బ్రాచీన సిద్ధాంతము లున్నటుల స్పష్టముగఁ గన్పట్టుచున్నది. పూర్వకాలమున హిందూదేశమునుండి వలసవచ్చి స్థావరమేర్పఱుచుకొనిన యా ర్యుల సంతతివారమని చెప్పుకొనుటకుఁగాని, యితరు లనుకొను టకుఁగాని, లాసెన్, స్పిగెలె, ష్లెగల్ మున్నగు పాశ్చాత్య పండితులు న్యూనతగఁ దలంచియుండినటులఁ గన్పట్టుచున్నది. అట్టి సంకుచిత భావముచే న్యాయమగు (నిజమగు) సిద్ధాంత

* (Vide హిందువుల యుత్పత్తి - by Prof. Schlegal, Origin of Hindus.)

ములఁ దాఱుమాఱుచేసి నూతనసిద్ధాంతముల సృష్టిచేయఁ బ్రారంభించినటులఁ గన్పట్టుచున్నది.

ఈ సిద్ధాంతమునే బన్సన్ పండితుఁ డామోదించుచు "బరంపరఁగవచ్చు చరిత్ర ప్రారంభకాలమునం దార్యులతెగలు హిమాలయపర్వతములలోని మంచుగడ్డలనుదాఁటి దక్షిణముగ సప్తనదులవైపు వలసవచ్చునటుల మనము చూచుచున్నారము."

"ఈవిధముగ వలసవచ్చుటకుఁ బూర్వము గ్రీకులు, ఇటాలియనులు, స్లైవోనియనులు, జర్మనులు, కెల్టులు అనువారల పూర్వులతోఁగలసి ఉత్తర పరిసరప్రదేశములలో నివసించుచుండిరి."

"సంకుచితములగు హిందూకుష్, హిమాలయ పర్వతలోయలను దాఁటినతరువాత హిమాలయపర్వతముల కీవలనున్న యాదిమవాసులను సులభముగ జయించి ముందుకుఁ దఱిమివైచిరి."

అని చెప్పియున్నాఁడు.

" At the first dawn of traditional History, we see these Aryan tribes migrating across the snow of Himalayas, southwards towards the 'Seven rivers".

" That before this time they had been living in more Northern regions, within the same precincts with the ancestors of Greeks, the Italians, Slavonians, Germans and Celts."

"After crossing the narrow passes of the Hindukush or Himalayas, they conquered or drove before them as it seems without much effort, the original inhabitants of the Trans-Himalayan Countries." 1

లాసెన్ పండితుఁడు మార్గమిదియై యుండునని యూహించెను. ష్లెగలు పండితుఁడంతకన్న వేఱుమార్గము కనుపింపదని చెప్పెను. స్పీగెలు పండితుఁడదియె నిశ్చయమగునని చెప్పియుండెను. చివఱకు బన్సెన్ పండితుఁడు చూచినటులఁ జెప్పియుండెను. నల్వురు పాశ్చాత్యపండితు లిటులఁజెప్పుచుండఁగా నసత్యమగుట యెట్టులని తక్కుంగల పాశ్చాత్యపండితులు కొందఱు తంధానపదములఁ బాడియుండిరి. ఆ సిద్ధాంతమునే విద్యావిధానమున హిందూదేశచరిత్రను బోధించుపట్లు విద్యార్థులకు నూఱిపోయుచుండిరి. కేవలము విదేశీయచరిత్రకారులేగాక విద్యాధికులగు భారతీయపండితులు గొందఱీసిద్ధాంతములనే స్వీకరించి సువ్విపాటలు పాడుచుండిరి.

### వలసవిధాన సిద్ధాంతముల విమర్శనము.

ఇట్టి విపరీతసిద్ధాంతములఁ బ్రసాదించిన పాశ్చాత్యవిద్వాంసులాసిద్ధాతముల నుపపాదించుపట్టున సలిపిన పరిశోధనలయందుఁ దమ నిశ్చితాభిప్రాయములకు (దాము ముందుగనిశ్చయించుకొనిన యభిప్రాయములకు) భిన్నముగఁ గన్పట్టు భారతీయుల శ్రుతి, స్మృతి, తిహాసపురాణములు మున్నగు వాఙ్మయమునం గలచరిత్రాంశములను—ఐతిహ్యములగు చరిత్రాంశము

1 Vide Bemsen's Outlines. Vol. I Pages 129 to 131.

లను—అన్నింటిని హైందవ గ్రంథకర్తలచే నతిశయోక్తులుగఁ జెప్పఁబడి యుండెననియు, సత్యేతరములనియు, గల్పితకథలనియు, విశ్వసింపఁదగనివనియు నొక్కగీటుతోఁ ద్రోసిపుచ్చుచుండిరేకాని వానియందలి సత్యాసత్యములను నిష్పక్షపాత దృష్టితోఁ బరిశోధనలు సలిపియుండిరనుట కవకాశము గానిపించుటలేదు. ఆదర్శములందును—సంప్రదాయములందును—సిద్ధాంతములందును— నడవడులయందును— బ్రాక్పశ్చిమములకు హస్తిమశకాంతరభేదము కలిగియుండఁగా పరిశోధనముననేమి, పరిశీలనముననేమి నిష్పాక్షిక దృక్పథ మెట్టులుండునో దురూహ్యముగా నున్నది.

"యాదృశీభావనాయత్ర సిద్ధిర్భవతితాదృశీ"— అని కదా భగవద్గీత—భారతీయులకుఁ జారిత్రిక గ్రంథములే లేనను చుండిరి. కాని భారతీయసిద్ధాంతముల విశ్వసించి పరిశోధనలుసలిపి సిద్ధాంతీకరింపఁ బ్రారంభించినచో వారిగుండియలవియు నటుల నెన్నియో కోట్ల సంవత్సరములనుండియున్న భారతీయులచరిత్రను జెప్పవలసివచ్చును గదా! భారతీయ సిద్ధాంత శాస్త్రగణితములనుబట్టి సృష్టిక్రమ మిప్పటికెన్నియో కోట్ల సంవత్సరములు వెనుకకుఁ బోవును. పాశ్చాత్య విద్వాంసుల మతమున కాధారమగు బైబిలులోని సృష్టిక్రమ వత్సరములను దలంచుకొని శకందుకాల మొకవత్సరముగ నెంచుకొనిన సింకను వెనుకకుఁ బోవుచుండెను. ఇట్టి సందర్భమున నెవరి శాస్త్రగణితము నొప్పుకొనవలసియుండును? హైందవ శాస్త్రగణితము సరియనిన తమ తమగ్రంథమగు బైబిలులోని సృష్టిపరిమితి

కాలాదులను గుఱించిఁ చెప్పినవిషయములు సరియైనవికావని చెప్పుటయేగదా! వారందులకంగీకరింతురా? ఎన్నటికట్టులంగీకరింపరు. కావుననే భారతీయుల గ్రంథములయందతిశయోక్తులు మెండనియు, విశ్వసింపఁదగనివనియు నొక్కి గీటుపెట్టి కుతర్కములచే సిద్ధాంతముల బయలుదేఱఁదీసియుండిరి. భారతీయుల ప్రాచీన వాఙ్మయమును గూడ నిష్పాక్షికభావముతోఁ బరిశోధించి విమర్శించి భారతదేశ యదార్థచరిత్ర నెఱుంగఁ బ్రయత్నించుట భారతీయుల విధియని తలంచెద. అయినను పాశ్చాత్య విద్వాంసులచేఁ బ్రకటింపఁబడినసిద్ధాంతము లన్నిటిని సరకుచేయక విడువవలసినదని యభిప్రాయముకాదు. న్యాయముగనుండినంతవర కంగీకరింపఁ తగియుండును. "బాలాదపి సుభాషితమ్" అని కదా!— భారతదేశ యథార్థచరిత్ర నెఱుంగఁగోరు ప్రతి భారతీయునకును దమ వాఙ్మయమునందుఁ జెప్పబడిన చరిత్రాంశములను, సాంప్రదాయములను, విదేశీయుల సిద్ధాంతములు మున్నగు వానినెల్లను న్యాయదృష్టితోఁ బరిశోధనలుసల్పి విమర్శించి వాస్తవమెద్దియో తెలిసికొని లోకమునకు వెల్లడిచేయుట కర్తవ్యమని వేఱుగ జెప్పనవసరములేదు.

ఈ సిద్ధాంతములు పెక్కురు వైదేశికపండితులు వ్రాసిన రచనలనుబట్టియే యెంతవరకొప్పిదములో మున్ముందు కనుఁగొందము.

ఉత్తరధ్రువఖండప్రాంత భూములనుండి యార్యులు వలసవచ్చియుందురని సపోర్టాపండితుఁడు సేసిన సూచనను

యూరపుఖండప్రాంత భూములనుండి వలసవచ్చియుందురని వాదనలు చేయువారలే త్రోసిరాజని. ఇక యూరపుఖండ ప్రాంత భూములనుండి వలసవచ్చియుందురను సిద్ధాంత మెంతవఱ కొప్పిదమైయుండెనో యోచింతము.

## భాషాసాంప్రదాయములన్నిటికి సంస్కృతభాష మాతృభాష కాదా?

యూరపుదేశమందలి లిథూనియనుభాష భరతఖండము నందలి సంస్కృతభాషకంటె నెక్కుడు పురాతనమయినదనియు, యూరపుదేశమునుండి సంస్కృతభాష హిందూదేశమునకుఁ జేరియుండెననియుఁ జెప్పుట యొకకారణముగఁ దీసికొని యుండిరి. ఈ సిద్ధాంతము నుపపాదించిన ఈసాకుటెయిలరు (Isaac Taylor) పండితుఁడు "ఆర్యుల శైశవడోలిక" సంస్కృతము జెండు భాషలు మాటలాడు ప్రదేశమునందయి యుండవలయు న"ని హాఫరు పండితుఁడు చెప్పియుండినటుల నుదాహరించి యుండిరి.

"The Cradle of Aryans must have been in the region where Sanskrit and Zend were spoken." 1

మఱియొకచోట లిథూనియన్ భాషకంటెను సంస్కృత వాఙ్మయము దాదాపు మూఁడువేల సంవత్సరములు పూర్వ కాలమునుండి యుండినటులను, లిథూనియన్ భాషయొక్క స్వరశాస్త్రవిధానము (ధ్వనులను తెలిపెడువిధానము)సంస్కృత

1 Vide Origin of Aryans - Page 39 by Isaac Taylor.

భాషావిధానమునకు మాత్రిమే తగ్గిపోవుచున్నదనియుఁ జెప్పి యున్నారు.

'The Sanskrit literature is older by nearly 3000 years than the Lithunic."

"Its Phonetic System is inferior only to Sanskrit."[1]

"సంస్కృత వాఙ్మయము లిథూనియను వాఙ్మయమున కంటె 3000 సంవత్సరములు ప్రాచీనమై యున్నది."

"దానియొక్క (లిథూనియన్ భాషయొక్క) స్వరశాస్త్ర విధానము (ధ్వనులను తెలియఁజేయు విధానము) సంస్కృత భాషా విధానమునకుమాత్రిమే తగ్గిపోవుచున్నది."

ఈ నిర్ణయములు తమచే నిర్ణీతమైనసిద్ధాంతమున కొక కారణముగఁ జూపించిన భాషావైషయక వాదనకు భంగకర ముగ నుండుటచే భాషావిషయ మొక జాతియొక్క ప్రాచీన తను స్థాపనచేయఁజాలదని యొక గెంటు గెంటిరి. లిథూని యను భాషకంటెను సంస్కృతవాఙ్మయము మిగుల ప్రాచీన ముగఁ గన్పట్టినను లిథూనియను భాషయే ప్రాచీనమనిరి. కాని కారణములఁ జూపినవారు కారు. ప్రథమమున లిథూనియను భాష సంస్కృతమునకంటె ప్రాచీనమగుటచే మానవసృష్టి తొట్టతొలుత లిథూనియను భాష మాటలాడు ప్రదేశమునం దేర్పడియుండెననియు, అటనుండి యితరదేశములకు 'వలసక్ర మము' జరగియుండుననియు, నా కారణమున సంస్కృతభాష

1 Vide Origin of Aryans- Page 259.

యూరపునుండి హిందూదేశమునకుఁ జేరియుండెననియుఁ జెప్ప సాహసించిరి. కాని సంస్కృతభాషయే మిగుల ప్రాచీనమగు భాషయని తేలినప్పుడు భాషావిషయ మొక కారణముగఁ బరిగణించుటకు వీలులేదనిరి. దీనింబట్టి సంస్కృతభాష యూరపుదేశమునుండి హిందూదేశమునకుఁ జేరలేదనియు, సంస్కృతభాష హిందూదేశములోనిదేననియు, యూరపు ఖండములోని భాషలన్నిటికంటెను మిగుల ప్రాచీనమయినటులఁ జెప్పఁబడు లిథూనియను భాషకంటె 3000 సంవత్సరములకుఁ బూర్వమే సంస్కృతవాఙ్మయము వ్యవహారములో నుండెననియు స్పష్టముగఁ దెలియుచున్నది. ప్రపంచమునఁగల భాషాసాంప్రదాయములను బరికించినచోఁ బ్రతిభాషయును సంస్కృతభాషాపదముల ననుకరించుచున్నది. మఱియు సంస్కృతభాష యున్నతో సంపూర్ణమగు భాషగానుండి ప్రత్యేకవాఙ్మయము గలిగియుండినది. ఇతర భాషాసాంకర్యములేనిది. ఇతర దేశీయభాషల యందు హిందూదేశమందలి పురాతనంబగు సంస్కృతభాషాపదము లెక్కుడుగ నుండుటచే మిగుల ప్రాచీనకాలములందు హిందూదేశవాసు లాదేశములకు వలసపోయియుందురనియుఁ, గ్రమక్రమముగ వారిభాష సాంకర్యమునొంది యారూపము మారియుండుననియుఁ జెప్పఁదగియుండును. భాషాసాంప్రదాయములను గుఱించి చెప్పు సందర్భమున కర్జన్ పండితుఁడొక వ్యాసమున "జెండు, గ్రీకు, ల్యాటిన్, గోథిక్ మున్నగు భాషలన్నియు సంస్కృతభాషనుండియే వెవ్వేరుకాలములందుద్భవించెనని చెప్పియుండెను.

"I venture to affirm that they Zend, Greek, Latin, Gothic etc., have all sprung up at different periods from the Sanskrit."[1]

ప్రొఫెసరు బీము (Prof: Beam) పండితుఁడును

"మనకిష్టమున్నను లేకున్నను (అన్ని భాషలయందును) మిగుల ప్రాచీనమగు సప్రరూపమగు ప్రయోగము లన్నిటికి మూలములకై గత్యంతరములేక సంస్కృతభాషమీఁదనే యాధారపడవలసి వచ్చుచున్నది. నిస్సందేహముగా నా భాషయందే (సంస్కృతభాషయందే) వాటిని మనము కనుఁగొనుచున్నాము."

"We are driven, whether we like it or not to look to 'Sanskrit' the oldest extant forms and we undoubtedly find them there".[2]

అని చెప్పియుండెను.

సంస్కృతభాషనుండి యితరభాషలన్నియు నుద్భవించి నటులఁ జెప్పుటచే సంస్కృతభాష ప్రాథమిక భాషయనియు, సట్టిభాషను మాటాడువారు మానవసృష్టిలో మొట్టమొదటి తెగవారనియుఁ గాన్పించుచున్నది. హిందువుల వేదభాష సంస్కృతభాషయని యెల్లఱొప్పుకొను విషయమే యైయున్నది. హైందవుల కాదిభాష వేదభాషయే యైయున్నది. కావున హైందవుల కాదిభాషయగు సంస్కృతభాషనుండియే యితర భాష లుత్పన్నములయి యుండెననియు అట్టిభాషల మాటాడు

1 Vide J. R. A. S. of Great Britain & Ireland Vol. XVI.

2 Vide Prof. Beam's article in J.R.A.S. Vol. V.

వారీ హైందవులనుండి చీలిపోయియుందురనియుఁ జెప్ప నొప్పు చున్నది.

ఫ్రెంచి విద్వాంసుఁడగు "లూయి జకోలియటు" (Mons: Louis Jaccolliat) పండితుఁడు 'ఐరాపాఖండ మంద లి తెగలన్నిటికిని హిందూదేశ మునికిపట్టనియు, హిందూ దేశమే మాతృభూమియనియు, సంస్కృతభాషయే నిరాక్షేప ణీయమైనట్టియు, విస్పష్టమైనట్టియు నిదర్శనముగ నున్నదనియుఁ జెప్పియున్నాఁడు.

"Sanskrit is in itself the most irrefutable and most simple proof of the Indian Origin of the races of Europe and of its maternity." 1

'జకోలియటు' పండితుఁడే సంస్కృతభాషను గురించి చెప్పు సందర్భమున నిట్లనెను "ప్రాచీన నవీనభాషా ప్రయోగములన్నియు నీ మూలభాష (సంస్కృతము) నుండి యే పుట్టుచున్న"వని చెప్పియున్నాఁడు.

"The primitive language from which ancient and modern idioms are descended" 2

"ఆర్యుల భాష యందలి మిగుల ప్రాచీనమగు ప్రయో గములన్నియు ఋగ్వేదమునందును, అవెస్టాయందును గలవు. కావున నార్యుల శైశవడోలిక సంస్కృతము, జెందుభాషలు మాటాడు ప్రదేశమునందై యుండవలయు" నని ప్రొఫెసరు హోఫర్ పండితుఁడు చెప్పియున్నాఁడు.

---

1 Vide- La- Bible Dance Le'Inde- Page 21 by Louis Jaccolliat.

2 Vide La-Bible Dance Le'Inde- page 178.

"The most archaic forms of Aryan Speech are preserved in the Rig Veda & Avesta and the Crade of the Aryans must have been in the region where Sanskrit and Zend were spoken"

మైలరు పండితుఁడును సంస్కృతభాషా విషయముం గూర్చి వ్రాయుచు నీవిధమునఁ జెప్పియుండెను.

హిందూదేశముపై దండువెడలి యెందఱో గెలుపొంది సర్వమును ధ్వంసముగావించి తమ విజయచిహ్నముల నెలకొల్పి యుండినను, రాజ్యములు మారుచు కాలపరిస్థితులు విషమస్థితుల జెందుచువచ్చినను, అసమానమైన భాషాసమృద్ధియు, వైచిత్ర్యములుగలిగిన యీభాష, యూరపుఖండమున గ్రాంధిక భాషలనిపేర్కొనఁబడు భాషాసంప్రదాయములకు మూలమగు నీభాష గ్రీకుభాషయందలి మృదుత్వమునకును, రోమను భాష యందలిపటుత్వమునకును మూలాధారమగు నీభాష(సంస్కృత భాష) యిప్పటికిని హిందూదేశమునం దిట్లు లభ్యమగుటఁజూడ నత్యాశ్చర్యమును-వర్ణనాతీతమును-నై యుండెను.

"It was an astounding discovery that Hindustan, over which so many conquerors had passed in wrath and left their foot-prints as they went, possessed, in spite of changes of realms, and chances of time a language of unrivelled richness and variety; a language, the parent of those dialects that Europe has fondly called classical- the source alike of Greek Flexibility and Roman Strength." [1]

1 Vide Mr. Taylor's paper on Sanskrit Literature in J. R. A. S. Vol. II

"హిందూదేశము మనకేమి నేర్పఁగలదు" ( India, what can it teach us) అను గ్రంథమును రచించిన ప్రొఫెసరు మాక్సుముల్లరు (Prof: Max-Muller) పండితుఁడు సంస్కృతభాషను గుఱించి వ్రాయుచు నీక్రిందివిధముగఁ జెప్పియుండెను

" సంఘవిప్లవములచేతను, మతసంస్కారములచేతను, విదేశీయుల దండయాత్రలచేతను బహువిధములగు విపత్పరంపరలకు లోనైనను హిందూదేశమునందిప్పటికిని ప్రాచీనకాలమునుండి యిప్పటివఱకును అవిచ్ఛిన్నముగ (సంస్కృతభాష) నిలిచియుండుట యాశ్చర్యకరమై యున్నది ఇప్పటికిని మిగుల విశాలమగు నీదేశమునం దెల్లెడల వాడుకభాష సంస్కృతభాష యనియే చెప్పతగియున్నది. నూఱేండ్లనుండి యాంగ్లేయులు ప్రభుత్వము సేయుచు నాంగ్లేయవిద్యాబోధనము గావించుచుండినను 'డాంటి' కాలమునందు ల్యాటిన్ భాష యూరపులో వ్యవహారమునందుండినదానికంటె నేఁడుగూడ హిందూదేశములో సంస్కృతభాష యెక్కువగా నుపయోగింపఁబడుచున్నది."

"Yet such is the marvellous continuity between past and present in India that in spite of Social convulsions, religious reforms, foreign invasions, Sanskrit may be said to be still the only language that is spoken over the whole extent of the vast country. Even at present moment after a century of English rule and English teaching, I believe, Sanskrit is more widely understood in India than Latin was in Europe at the time of Dante." 1

1 Vide- India what can it teach us- Page 80.

ఇటులనే పలువురు పాశ్చాత్య విద్వాంసులు భరతఖండ వాసులకు మాతృభాషయగు సంస్కృతభాష ప్రపంచమునఁ గల సంప్రదాయ భాషలన్నిటికంటెను మిగుల ప్రాచీనమగు భాషయనియు, నితర భాషలన్నిటికిని మూలమగు భాషయై యుండినదనియు, నంగీకరించియుండిరి. అట్టి యంగీకారము లను బట్టియే యితర భాషలకన్న మిగుల ప్రాచీనమగు సంస్కృత భాషను మాతృభాషగాఁగల భారతీయు లితర దేశములనుండి భరతఖండమునకు వలసవచ్చి యుండురనుట సంభావ్యముగాఁ గన్పట్టుటలేదు. మఱియు సంస్కృతభాష యూరపుఖండ మందు సంప్రదాయముగ నుపయోగింపఁబడుచున్న భాషల (Classical Languages) నుండి వెలువడినది కాదనియు, నట్టి భాష లన్నింటికిని సంస్కృతభాషయే మూలమైనటులఁ గన్పట్టు చున్నది. భాషాసాంప్రదాయమునుబట్టి ప్రాచీన హైందవులు లేక ప్రాచీనార్యు లితర దేశములనుండి హిందూదేశమునకు వలస వచ్చియుండురని యూహించుటకైన నవకాశము గన్పట్టుట లేదు.

ఇఁక భరతఖండవాసులు యూరపుఖండమునుండి వలస వచ్చియుండురను సిద్ధాంతమును వెలిబుచ్చినవారి కారణము లలో మఱియొకటి "యూరపుఖండమునందలి పలుతెగలవారు పెక్కుసారులు భరతఖండమునుండి వలసవచ్చి యూరపుఖండ ములో స్థావరమేర్పఱుచుకొని యుండుగనుటకంటె నా తెగల వారలలో నేదే నొక తెగవారు వలసవచ్చి హిందూదేశమున స్థావర మేర్పఱుచుకొని యుండురని చెప్పుట యెక్కువ సమంజ

సముగఁ గన్పట్టుచున్నదనుట"యై యున్నది. ఈ కారణమునం తగాఁ గమనింపఁ దగియుండదు. ఏలన మొట్టమొదట క్రైస్తవ మతము ఆసియాఖండములోని పాలస్తీనదేశమునఁ బుట్టి క్రమ క్రమముగ యూరపుఖండమునందలి దేశములన్నిటికిని వ్యాపించి యిప్పుడు యూరపుఖండమందంతటను ప్రధానమతముగఁ బ్రబలి యున్నది. యూరపుఖండమునందే గాక ఆఫ్రికా, అమెరికా, ఆసియా, ఆస్ట్రేలియా ఖండములందును వ్యాపించియున్నది. బౌద్ధమతము తొలుత హిందూదేశమునం దుద్భవించి యభివృద్ధిఁగాంచి దేశదేశములకు వ్యాపించి చైనా జపాన్, మున్నగు ప్రదేశములయందు నేఁటికాలమునఁ బ్రాధాన్యమతముగఁ బ్రబలియున్నది. ఈ కాలమునఁ గ్రైస్తవమతము పాలస్తీన దేశమునందును, బౌద్ధమతము హిందూదేశమునందును నామమాత్రావశిష్టములుగ నున్నవి. "ఈసాకు షైలరు" పండితుని సిద్ధాంతమును బట్టి యా మతములు అనఁగాఁ గ్రైస్తవ మతము యూరపుఖండములోని పెక్కుదేశములలో నేదేనొక దేశమునుండి చీలివచ్చిన యొక శాఖవారివలన పాలస్తీన దేశమునందును, బౌద్ధమతము చీనా, జపాన్ మున్నగు దేశములలో నేదే నొకదేశమునుండి చీలివచ్చిన యేదేనొకశాఖ వారివలన హిందూదేశమునందును స్థాపింపఁబడియుండునని చెప్పుటయే యెక్కుడు సంభవముగఁ గన్పట్టునని చెప్పవలసియుండును గదా! అటులఁ జెప్పుట కడు హాస్యాస్పదముగనుండునని వేఱుగఁ జెప్ప నగత్యములేదు. ఇట్టి కుతర్కములనుగావించుచుఁ జరి

తాత్రింశముల నిర్ధారణ చేయుబూను టంతకంటెను హాస్యాస్పద మని చెప్పవలెనా!

ఇఁక యూరపుఖండమునుండి వలసవచ్చియుందురని చూపఁబడిన కారణములలో

"యూరపుఖండమునందలి తెగలవారు స్థావరముగ నొకచోటఁ గాపురమున్నవారలట! హిందూదేశమందలి యార్యులు దేశద్రిమ్మరులఁట! ఆకారణమున స్థావరముగ నొకచోటఁ గాఁపురమున్న తెగలవారిలో నొకరు చీలి ఇండియాకు వలస వచ్చిరని చెప్పుట సంభవముగఁ గన్పట్టుచున్నద"నుట మఱి యొకటియై యున్నది.

ప్రాచీనహైందవులు గోవులను దమ సర్వస్వముగనెంచి కొనుచుండిరి. వేదములు మున్నగువానియందు గోప్రభావ మధికముగ వర్ణింపఁబడి యున్నది. గోవు లధికముగాఁగలవానిని సంపన్నునిగఁ బరిగణించియుండిరి. యజ్ఞయాగాది క్రతువుల యందును, శుభాశుభ కార్యములందును గోవులనే బహూకరణ మొనర్చుచుండిరి. ప్రభువులుమున్నగువారు దానములు, బహుమతులు మున్నగువానినిచ్చు పట్టున గోవులనే యిచ్చుచుండిరి. పందెములు వేయునప్పుడుసైతము గోవులనే యొడ్డుచుండెడివారలు. వీనినన్నిటిని గమనించినచోఁ బ్రాచీన హైందవులు ధనముకన్న గోధనమునే యెక్కువగఁ బరిగణించుచుఁ గాపాడుచు వచ్చియుండిరని విస్పష్టమగుచున్నది. అంతియె గాక హైందవులు వ్యవసాయమునం దెక్కుడభిలాష గలిగి

వ్యవసాయమువలన జీవనము చేయుచుండినటులఁ దెలియు చున్నది. వ్యవసాయమున కెద్దులావశ్యకములయి యుండెను. ఆకారణమునఁగూడ గోవులు ముఖ్యావసరమయియే యుండెను. ప్రాచీనహైందవులు (ఆర్యులు) గోవులనే తమసర్వస్వముగా నెంచి కాపాడి వృద్ధిచేసికొనుచుండుటనుబట్టియే వారలు దేశ ద్రిమ్మరులని తలంచుట కెక్కుడు ప్రతిబంధకముగఁ గన్పట్టు చున్నది. ఆలమందలఁజేర్చక గొఱ్ఱెలమందలఁజేర్చుకొని గొఱ్ఱెల కాపరులై యున్నయెడల స్పష్టముగ దేశద్రిమ్మరులని చెప్పిన విశ్వసించుట కొక్కింతబాగుండెడిది. దేశద్రిమ్మరులకు గొఱ్ఱె లుపకరించినట్లు గోవులుపకరింపవు. దేశములఁ బర్యటించు పట్టున శీతోష్ణాదిభేదములను గొఱ్ఱెలవలె గోవులు సహింపఁ జాలవు, దూరదేశములు ప్రయాణముసేయుటకును గోవులు పనికిరావు. ఎచ్చటనో స్థావర మేర్పాటుచేసికొనుటకై తగు ప్రదేశమును వెదకికొనుచు దేశదేశములు తిరుగువారలు తమ గోవులను బ్రతిదినమును జక్కఁగఁ బరామర్శ చేసికొనుట కేమాత్ర మవకాశ ముండనేఱదని వేఱుగఁజెప్పనగత్యములేదు, ప్రతిదినము గోవుసు బరామర్శింపక యుపేక్షించినను, దూర ప్రయాణములు సలిపినను దిగులువడి, భీతిఁజెంది క్షీణించును. కాళులు మెత్తవడి గిట్టలు పుండ్లుబడి రోగములకాకరమగును. ఆకారణమున నయ్యవి క్రమముగా నశించిపోవును. పూర్వము నుండియు గోవులనే తమసర్వస్వముగ నలవఱచుకొన్నదియు, వ్యవసాయము తమవృత్తిగా నలవఱచుకొన్నట్టియు నేజాతి యైనను స్థావరముగ నొకచోటనుండు జాతిగనే పరిగణింపఁబడ

వలసి యుండును గాని వేఱువిధముగ నెంచ వీలులేదు. వేద యుగమునాఁటి హిందూదేశ (Vedic India) మను గ్రంథమును రచించిన 'జినై డిరగోజిన్' పండితుఁడును, ఋగ్వేదమును భాషాంతరీకరించిన 'ప్రొఫెసర్ విల్సన్' పండితుఁడు మున్నగు పాశ్చాత్యపండితులే యీ యభిప్రాయములను వెల్లడించి యుండిరి.

"The cow unlike the sheep is unfit for a nomadic life and incapable of bearing the hardship of a continued change and marching. The least neglect in the case of them, the least pressure of overwork, causes loss of flesh and spirits, agonising sorehoofs, then illness and death in a very short time."[1]

"గొఱ్ఱెలవలెఁ గాక గోవులు దేశ దేశములు దిరుగు వారి (దేశద్రిమ్మరుల) జీవనమున కనుపయోగములు. ఎడ తెగని ప్రయాణములు చేయుటవలన, శీతోష్ణస్థితుల మార్పులవలనఁ గలుగు కష్టములను సహింపఁజాలవు. వానినిఁ (గోవులను) బరామర్శించుటలో నేమాత్రముపేక్షజరగినను, ఎక్కువ పనివలన నేమాత్రము బాధకలిగినను, అయ్యవి చిక్కి, అధైర్యముఁజెంది, గిట్టలువేదనతోఁ గూడిన పుండ్లువడి, రోగములకుఁ బాలై స్వల్పకాలములో మృతిఁ జెందును."[2]

"It has been a favourite notion with some eminent scholars that the Hindus at the period of the composition of Hymns were a nomadic and pastornal people. This opinion seems to rest only upon

---

1 Vide- Vedic India- Page 63

2 Vide Vedic India page 68

the frequent solicitations for food, horses, and cattle which are found in the Hymns and is unsupported by any more positive statement. That the Hindus are not nomades is evident from the repeated allusions to fixed dwellings and villages and towns. They were in a still greater degree, an agricultural people as is evidenced by their supplication for abundent rain and for the fertility of the earth and by the mention of agricultural products particularly barely."[1]

" హైందవులు (హిందువులు) వేదమంత్రములను రచించు కాలమున దేశద్రిమ్మరులనియుఁ, బసులకాపరులనియుఁ గొంతమంది ప్రఖ్యాతివహించిన పండితులకుఁ బ్రియమైన యభిప్రాయమయి యుండెను. ఆహారముం గూర్చియు, గుఱ్ఱములు, పశువులు, మొదలగువానిం గూర్చియు వేదమంత్రములయందుఁ బలుతావులనున్న ప్రార్థన శ్లోకములఁ బట్టి యట్టి యభిప్రాయముఁ జెందినటులఁ గన్పట్టుచున్నది. ఇంతకంటె నితర కారణము లెవ్వియును బలపఱుచుటలేదు. స్థిరనివాసములను గుఱించియుఁ బల్లెలు, పట్టణములను గుఱించియుఁ బదింబదిగఁ జెప్పఁబడు గాథలను బట్టి హిందువులు దేశద్రిమ్మరులు గారని స్పష్టముగఁ గన్పట్టును. సువృష్టికొఱకును, ఫలవంతముగ భూమి యుండు నిమిత్తమును గలవారి ప్రార్థనలఁ బట్టియు వారిచేఁ బేర్కొనఁబడిన ధాన్యములఁ బట్టియు నందు ముఖ్యముగ యవలను బేర్కొనుటను బట్టియు వా(హిందువులు) రెక్కువ పేర్గాంచిన వ్యవసాయ మవలంబించిన శాఖవారై యుండిరి.[2]

1 Vide. Prof. Wilson's Translation of Rig Veda.
2 Vide. Prof. Wilson's Translation of Rig Veda:

ఈ రీతిగఁ గొందఱు పాశ్చాత్య విద్వాంసులే హిందువులు దేశద్రిమ్మరులుగారని స్పష్టీకరించుచుండిరి. హైందవార్యులు దేశద్రిమ్మరులనియు స్థిరనివాసముగల యూరపుఖండమందలి తెగలవారలలో నొక తెగవారు చీలి హిందూ దేశమునకు వలసవచ్చియుందురనుట సంభవముగఁ గన్పట్టుచున్నదనుట యెంతమాత్రము విశ్వసనీయము గాదు.

మానవోత్పత్తి ఎచట జరగెను—భరతవర్షమునఁగాదా?

ప్రథమమున మానవోత్పత్తి యూరపుఖండముననై యుండుననియు, నటనుండి యితర భూభాగములకు వలసపోయి యుందురనియుఁ గనఁబడుచుటకై

"మానవజాతి నాల్గవయుగాంతమున ఫ్రాన్సు, బ్రిటను, దేశములందు నివసించియుండవలెను. ఖగోళశాస్త్ర సిద్ధాంతముల ననుసరించి డాక్టరు క్రోలు, ప్రొఫెసరు గీకీగార్లు చెప్పినటుల 80,000 సంవత్సరముల ప్రాచీనతఁగల క్రిందటి హిమప్రళయానంతరము వెనుక కరుగు హిమము ననుసరించి మానవజాతి పోయియుండవలెను"[1]

" Man must have inhabited France and Briton at the close of the quaternary period, and must have followed the retreating ice of the last Glacial Epoch, to the close of which Dr. Croll and Professor Giekie assign on astronomical grounds an antiquity of some 80,000 years. "[2]

---

1 Vide- Origin of the Aryans Page 19

2 Vide: Origin of the Aryans, Page 19.

అని యూసాకు టెయిలరు పండితుఁడు చెప్పియుండెను.

స్కాట్లాండు దేశమునఁ బ్రిభుత్వమువారిచే నియమితుఁడు గాఁబడిన భూగర్భశాస్త్రజ్ఞుఁడగు (Geologist) డాక్టరుక్రోలు (Dr: croll) పండితుఁడు స్కాట్లాండు దేశమున భూగర్భ పరిశోధనలు గావించి "శీతోష్ణస్థితియు-కాలము" (Climate and Time) అను గ్రంథమును రచించియుండెను. అందు భూగర్భ పరిశోధనలనుబట్టి క్రిందటి హిమప్రళయము ముప్పదిలక్షల వత్సరముల క్రిందట జరిగియుండుననియు, భూమియొక్క సృష్టిపరిమితకాలమదియే యైయుండుననియుఁ జెప్పియుండిరి. (Vide Climate & Time by James croll pages 312 & 313) ఈ పండితుఁడే చివరకుఁ బ్రకృతపు భూమియొక్క సృష్టికాల పరిమితి పదికోట్ల వత్సరముల కాలముకంటెను మించియుండఁ జాలదనియు, క్రిందటి హిమప్రళయకాల మిప్పటికి 240,000 సంవత్సరములకు మించియుండఁజాలదనియుఁ జెప్పియుండెను.

"The entire Geological history of our own Globe must be comprised within less than 100 millions of years, and that consequently the commencement of the Glacial Epoch cannot date much further back than 240,000 years"[1]

భూగర్భమును బరిశోధనలు సల్పునపుడు ఫ్రాన్సు, బ్రిటను దేశములయందు 80,000 సంవత్సరములక్రిందట సంభవించిన కాలమైపరీత్యముచేఁ దటస్థించిన హిమప్రళయమునకు ముందు మానవజాతి యుండినటుల సూచించుచు డాక్టరుక్రోలు, ప్రొఫెసరు గీకీగార్లు చెప్పియుండిరేగాని 'యూసకు' లైల రూహించి

1 Vide- Climate & Time- Page 355

నటులఁ దక్కిన భూభాగము మానవవిరహితమనిగాని, ఫ్రాన్సు, బ్రిటను దేశములయందే ప్రథమమున మానవోత్పత్తి జరగి యుండినటులఁ గన్పట్టుచున్నటులఁగాని, యఁటనుండి హిమప్రళయానంతరము వెనుక కరుగు హిమమునననుసరించి మానవజాతి వలసపోయి యుండుననికాని సూచనలనేనిఁ గావించియుండలేదు.

## భూగర్భశాస్త్ర సిద్ధాంతములు.

మానవోత్పత్తినిగుఱించి భూగర్భశాస్త్రజ్ఞులు (Geologists) గావించిన సిద్ధాంతములఁ గనుఁగొందము.

భూగర్భశాస్త్రజ్ఞులు సృష్టిపరిణామమును గుఱించి విమర్శలుసలిపి యీభూమియొక్క పైఖరినిబట్టి ప్రథమమున గ్రావరూపముగ నుండెననియుఁ, బిదపఁ గ్రమక్రమముగ గట్టిపడి యుండెననియుఁ దలఁచి యాకాలమునకు "అజాయిక్ యుగ" (Azoic Age) మని పేరిడియుండిరి. తరువాతి కాలములను లూరియన్, కంబ్రియన్—లారెంషిన్ యుగములని విభజించియుండిరి. కంబ్రియన్ యుగప్రారంభమునుండి యీకాలమువఱకు 7,00,00,000 (యేడుకోట్ల) వత్సరములకుఁ బైకాలమై యుండునని వాల్కాటు (Walcott) పండితుఁడును, 60 (అఱువది)కోట్ల వత్సరములై యుండునని మేక్‌గీ (Mac Gee) పండితుఁడునుఁ జెప్పియున్నారు. అజాయిక యుగమంతకుఁ బూర్వమైయుండెను. భారతదేశమున భూగర్భశాస్త్ర పరిశోధన గావించిన మెడ్లికాట్ (Meddlecot) బ్లాంఫోర్డు (Blamford) డాక్టరు ఓల్డుహామ్ (Dr. Oldham)డాక్టరు నోట్లింగు మొదలగు పండితులు గావించిన సిద్ధాంతములను గమనించిన

మొట్టమొదట మానవోత్పత్తి భారతదేశమునందే యైనటులఁ జెప్పు సిద్ధాంతమును బలపఱుచుచున్నవి.

" Aryavarta seems to have enjoyed mild climate from the end of Azoic Age and the commencement of Palazoic Epoch."

" There are some very curious indications of a low temparature having prevailed in the Indian Area at very ancient times "[1]

"అజాయికు యుగాంతమునుండియు పాలకోజాయికు యుగప్రారంభమునుండియు నార్యావర్తము మంచి శీతోష్ణస్థితిని గలిగియుండినటులఁ గన్పట్టుచున్నది."

"అతిప్రాచీనకాలములందు హిందూదేశమునఁ దక్కువైన శీతోష్ణస్థితులు వ్యాపించియుండినటుల మిగుల యపురూపమైన చిహ్నములు గొన్ని కలవు."[2]

" The combrian fossils in the Salt Range of the Punjab are decidedly a solid proof in favour of a Low Temperature having prevailed and the consequent origin of vitality in Aryavarta, in the extremely ancient period of the Earth's History."[3]

"పంజాబు దేశమందలి కంబ్రియన్ యుగీయములగు శిలాజములు (భూమిలోనుండి త్రవ్వి యెత్తఁబడిన శిలారూపమై పోయిన జంతుసంబంధమైనట్టియు, ఉద్భిజ్జసంబంధమైనట్టియు

1 Vide. Mannual of Geology of India by Meddlicot & Blamford preface Page 22

2 Vide- Mannual of Geology of India by Meddlicot & Blamford - preface page 22.

3 Vide Manual of Geology of India by R. P. Oldham Page 109.

వస్తువులు) ప్రపంచచరిత్రయం దతిప్రాచీనకాలమున నార్యావర్త మునఁ దక్కువైన శీతోష్ణస్థితి ప్రబలియుండెననియు, నాకారణ మునఁ దొలుత నట మానవోత్పత్తి జరగియుండెననియు ఖచిత ముగాఁ జెప్పుటకుఁ బ్రబలనిదర్శనములై యున్నవి."

"The elevation of the Aravalli Range probably dates from the Pre-Vindhyan times. The Vindhyans are the latest Azoic rocks of the Peninsula."[2]

"ఆరావళీపర్వతపంక్తియొక్క ఔన్నత్యము ప్రాయశః వింధ్యావళికిఁ బూర్వకాలమునుండియుండినటులఁ గన్పట్టుచున్నది. వింధ్యావళి యీ ద్వీపకల్పమున (హిందూదేశమున) అజాయిక యుగాంతమునందుండిన గుట్టలై యున్నవి." 2

మఱియు నభివృద్ధిసెందిన ఖండము తూర్పుదేశముగా నుండెననియు, నభివృద్ధిఁ జెందుటయం దయ్యదియే ముఖ్యస్థానము నాక్రమించి యుండెననియు, భూతకాలమున జరగిన సందర్భములఁబట్టి యీమహత్తర ప్రదేశమున నొకచోట మానవోత్పత్తి జరగియుండుననియు, మానవజాతి విస్తృతమగుటకు ఆసియా ఖండమునందు నైఋతి ( South-western Asia ) భాగముకంటె వేఱుభాగము తగియుండుటలేదనియు, నట్టి కేంద్ర స్థానమునుండియే గొప్పఖండములగు ఐరోపా, ఆసియా, ఆఫ్రికా ఖండములకు మానవజాతి వ్యాపించియుండెననియు ప్రొఫెసరు డానా(Prof. dana)పండితుఁడు చెప్పియుండెను. 4

---

1 Vide Manual of Geology of India by R. P. Oldham page 109.
2 ;Prof. Meddlicot & Blamford
3 Prof: meddicot & Blamford.
4 Manual of Geology by James D. Dana pages - 585 - 586, Ed. 863.

## ఇతరాధారములు.

ప్రొఫెసరు మాక్సుముల్లరు పండితుఁడు "మనమందరము ప్రాగ్దేశమునుండి వచ్చియున్నారము. మనమెక్కువగొప్పగాఁ దలఁచునదెల్లను (మనవిజ్ఞానమంతయు) మనకుఁ బ్రాచ్యఖండమునుండి వచ్చినదే" నని చెప్పియుండెను.

"We all come from the East, all that we value most has come to us from the East."1

హైందవుల దేవతలవంశావళి (Theogony of Hindus) అను గ్రంథమును రచియించిన కౌంటు బోర్న్ స్టుజర్నా (Count Bjornstjerna) పండితుఁడు

"బ్రాహ్మణమత శైశవడోలిక నిమిత్తమేగాక క్రమక్రమముగఁ బశ్చిమమున యెతోపియా, యీజిప్టు, ఫినోషియా దేశములకును, దూర్పున సయామ్, చైనా, జపాన్ దేశములకును, దక్షిణమున సిలోన్, జావా, సుమత్రా ద్వీపములకును, ఉత్తరమున పరిషియా, చాల్డియా, కొల్చిస్ దేశములకును, అటనుండి గ్రీసు రోములకును గట్టకడపట వానికుత్తరమునున్న మండలములకును వ్యాపించిన హైందవులయొక్క శ్రేష్ఠమగు నాగరకత శైశవడోలిక నిమిత్తముకూడ నచ్చటనే (భారతదేశమునందే) మనము వెదుకవలయు" నని చెప్పియున్నాఁడు."2

"It is there we must seek not only for the Cradle of the Brahmin Religion, but for the Cradle

---

1 Vide. India - What can it teach us - Page 32.

2 Vide Theogny of Hindus - Page 168.

of the High Civilisation of the Hindus, which gradually extended itself in the west to Ethopia to Egypt, to Phaenicia; in the east to Siam, to China, to Japan; in the south to Ceylone, to Java, and to Sumatra; and in the north to Persia, to Chaldea and to Colchis whence it came to Greece and to Rome, and at length to the remote abode of the Hyperboreans".[1]

### భరతఖండమే ఆర్యుల ఆదిమనివాసము.

హిందువు లాదినుండియు భరతఖండవాసులేకాని యితర దేశములనుండి వలసవచ్చినవారుకారు. అట్టి యభిప్రాయములను వెలిబుచ్చుచు సిద్ధాంతములు సలిపిన పలువురు చరిత్రకారులు పండితులు మున్నగువారి రచనల కొన్నిఁటి నీక్రిందఁ గనఁబఱిచెదను.

"To say that it (emigration) spread from a central point is a gratutious presumption and even contrary to anology for emigration and civilisation has not spread in a circle but from east to west."[2]

"'వలసక్రమ' మొక మధ్యప్రదేశమునుండి వ్యాపించి యుండె ననెడియూహ నిరాధారమేగాని వేఱుగాదు. ఇంతియె గాక సామాన్యపద్ధతికి విరుద్ధము. ఏలన వలసవిధానమును, నాగరకతావ్యాప్తియు, వలయాకారముగ నడచియుండలేదు. తూర్పునుండి పశ్చిమమునకు వ్యాపించియుండెను."

I Vide Theogony of Hindus - Page 168.

2 Vide Lord Elphinston's History of India. Page 95.

"It is opposed to their foreign origin, that neither in the Code of Manu, nor I believe in the Vedas, nor in any book that is certainly older than the Code, is there any allusion to a prior residence, or to a knowledge of more than the name of any country out of India. Even Mythology goes no further than the Himalayan chain in which is fixed the inhabitation of Gods."[1]

"మనుధర్మశాస్త్రమునందుఁగాని, లేక నాకుఁ దెలిసి నంతవఱకు వేదములయందుఁగాని, లేక మనుధర్మశాస్త్రమున కంటె నిశ్చితముగఁ బ్రాచీనములగు మఱి యేయితర గ్రంథముల యందుఁగాని వారి (హిందువుల) పూర్వపు వాసస్థలమును గుఱించిగాని, భరతఖండమునకు బాహిరమునందుండు నేయితర దేశనామములను గుఱైఱిఁగియుండినటులఁగాని, చెప్పఁబడియుం డమి వారు పరదేశజులని చెప్పుటకు ప్రతిబంధముగ నున్నది. వారి పురాణగాథలు సైతము దేవతల నివాసములు హిమవత్పర్వతములను దాఁటిపోవుటలేదు."

అని చెప్పియున్నాఁడు. ఇయ్యది హైందవులు వలస వచ్చినవారలుకారని సిద్ధాంతీకరించుచున్నది.

సంస్కృతవాఙ్మయమును బరిశోధన సల్పిన మూయర్ (Mr. Muir) పండితుఁడు—

"I must however begin with a candid admission that, so far as I know, none of the Sanskrit books, not even the most ancient, contain any distinct

1 Vide History of India by Lord Elphinstone.

reference or allusion to the foreign origin of the Indians."[1]

"నాకుఁ దెలిసినంతవఱ కేసంస్కృత గ్రంథమునందుఁ గాని, అతి పురాతనమగు నే యితర గ్రంథమునందుఁగాని, హిందూదేశస్థులకుఁ బరదేశజన్మత్వ మారోపింపఁదగిన సంబంధములుగాని, గాథలుగాని కాన్పించుటలేదని యథార్థముగ నొప్పుకొనుచునే బ్రారంభింపవలయును."[2] అని చెప్పియున్నాఁడు.

ఆర్యులు హిందూదేశమునకు వలసవచ్చినవారలా యను విషయమును జర్చించుచు కర్జ్ఞ్ పండితుఁ డీవిధముగ వ్రాసియుండెను.

"This region is not acquired by invasion or subjugation, when, had such an event really happened, or had any tradition of any such event existed, it is more probable that the circumstances would have been mentioned with some degree of national pride, or been alluded to in some manner or other. No such tradition is to be found throughout the whole extent of Sanskrit Literature ancient or modern."[3]

"ఈప్రదేశము దండయాత్రలవలనఁగాని, జయించిగాని సంపాదింపఁబడి యుండలేదు. అట్టిసందర్భమే నిజమై యుండిన, లేక అట్టిసందర్భమేదియైనను జరగియుండినట్లు లేవిధ

1 Vide Muir's Original Sanskrit Texts Vol. II page 322.
2 Vide- Original Sanskrit Texts Vol II p. 322.
3 Vide- J. R. A. S. Vol. XVI Page 191.

ముగనో సాంప్రదాయసిద్ధముగఁ జెప్పుకొనఁబడుచుండిన, అట్టి విజయమును జాతీయపరాక్రమగర్వముతో నెచ్చటనేని యేదో నొకవిధముగ సహజముగఁ జెప్పుకొనియుందురు. ప్రాచీనాధునికసంస్కృతవాఙ్మయమునం దెచ్చట నట్టి వృత్తాంతమే కానరాదు.''§ అనియు,

"Assuming the Aryans to have been immigrants in India, let us inquire from what quarter they are likely to have entered India?

1. *Firstly*. Could they have penetrated from the West?

From an examination of the structure of the Persic and Zendic, the oldest forms of dialects of ancient Persia, it is evident that both have been derived from Sanskrit, thus proving that ancient Persians derived both the names of Personages mentioned in their scriptures and their language itself from the Aryans.

2. *Secondly*. Did the Aryans enter India from the North or North-West?

History does not record the existence of any civilised people....with a language and religious system similar to those of the Aryans from whom they might have decended and who could have entered India.

3. *Thirdly*. Did the Aryans migrate from the East?

---

§ Vide J. R. A. S. Vol. XVI - Page 191.

The only people who could have penetrated into India from this quarter are the Chinese who belong, I need scarcely remark, to a race entirely distinct in Language, Religion, Laws, Manners, from the Aryans who have clearly no geneological relations with them.

4. *Fourthly.* Did the Aryans originally issue from the table-land or Tibet in the North-East?

Independently of the Physical barrier of great chain of Himalayas, which appear to have been one of the causes which determined the westernly and North Westernly direction of the Aryan migrations, the same ethnical objection applies to this hypothesis as to that of their Chinese origin.

5. *Fifthly.* Could they have migrated from any quarter originally inhabited by the Phenicio-Arabian or semitic race?

Under this supposition, words of an undoubted semitic origin would long since have been found in Sanskrit. But the structure of the latter and its total dissimilarity to any semitic dialect, are fatal to such a conjucture.

6. *Sixthly & Finally.* Are the Indians to be traced to an Egyptian Origin?

It would appear that the language of that people belongs rather to the semitic family which would seem to separate them at once from the

Aryans, thus rendering the descent of the latter from the former highly improbable.

From these considerations, it follows that there is not sufficient foundation for the Hypothesis that the Ancient Aryans, Indians or Hindus entered India proper from some external region. On the contrary, the facts above delineated point out to the conclusion that the rise and progress advanced in arts and civilisation of these remarkable people are the growth of their own land developed during the course of long ages and communicated to the other nations "$

" ఆర్యులు హిందూదేశమునకు వలనవచ్చిన వారలే యని యూహించి, యేవైపునుండి హిందూదేశమున బ్రవేశించి యుందురో విచారింతము.

1. మొదటిది. పశ్చిమమునుండి ప్రవేశించి యుందురా?

ప్రాచీన పర్షియాదేశమునందలి పురాతనభాషారూపము లగు పర్షిక్, జెండుభాషల స్వరూపములను బరీక్షించి చూచినచో రెండుభాషలును, సంస్కృతభాషనుండియే వెలువడినటుల స్పష్టముగఁ గన్పట్టుచున్నది. ప్రాచీన పారశీకులకు వారి వేదములయందుఁ జేర్చఁబడిన దేవతలనామములును, వారి భాషలును, ఆర్యులనుండి వచ్చినట్లు దీనింబట్టి ఋజువగుచున్నది.

2. రెండవది. ఉత్తర దిశనుండి కాని పశ్చిమోత్తర దిశనుండి కాని ఆర్యులు హిందూదేశమును బ్రవేశించి యుండిరా?

---

$ Vide J. R. A. S; Vol, XVI pp, 191 to 199

ఆర్యుల యుత్పత్తిస్థానమును గుఱించియు, వలసక్రమములను గుఱించియుఁ బలువురు విద్వాంసులు పలుసిద్ధాంతములు గావించియుండిరి. పెక్కుమంది ఆర్యుల కీభరతఖండమే జన్మభూమియై యుండెననియు, ఇటనుండి పెక్కుగేశములకు వలసపోయి రాజ్యస్థాపనలు గావించుకొని యుండిరనియుఁ దమ కళాకౌశల్యవిజ్ఞానాదికముల నితరదేశములందు వ్యాపింపఁజేసి యుండిరనియు, హైందవకళాకౌశల్యవిజ్ఞానాదికములు, నాగరకత మున్నగునవి నేఁటికిని ఇతరదేశములందు విరాజిల్లుచుండినటులఁ జెప్పియుండిరి.

"గ్రీసుదేశములో ఇండియా" (India in Greece) యను గ్రంథమును రచించిన ప్రొఫెసరు పోకాకు పండితుఁడు హిందూదేశమును, హైందవార్యులను గుఱించి చెప్పుచు,

" The Greek Language is a derivation from the Sanskrit; therefore Sanskrit speaking people ie., Indians, must have dwelt in Greece and this dwelling must have preceded the settlement of those tribes which helped to produce the corruption of the old language or in other words the people who spoke that language ie., the Indians must have been the primitive settlers; or at least they must have colonised the country so early and dwelt there so long, as to have effaced all dialectic traces of any other inhabitants; just as the Saxons displaced the feeble remains of the dialect of the ancient Britons, in this Island, and imparted a thoroughly Saxon stamp to the genius of the English Language. But if the evidence of Saxon Colonisation in this Island,

లేమాత్రమును లేవని తేలుచున్నది. పై వివరించిన యథార్థము లన్నియు హైందవార్యు లితరదేశమునుండి యిండియాకు వలస వచ్చియుందురను సిద్ధాంతమునకు వ్యతిరేకముగ సుప్రసిద్ధులగు నీ హైందవార్యుల కళాకౌశల్యనాగరకతాభివృద్ధుల కంతకును అనఁగాఁ గళలును, నాగరికతయును వారి స్వదేశమునందే పుట్టి పెరిగి పెక్కుయుగములనుండి మహోన్నతాభివృద్ధిఁ గావింపఁ బడి యితర దేశములంగల ప్రజాసంఘములందు వ్యాపింపఁ జేయఁబడినటుల నిశ్చితాభిప్రాయమును గనఁబఱుచుచున్నవి.[1]

ఏదేనొకవిధమగు సిద్ధాంతమును జేయవలయునని ముం దుఁగాఁదలపెట్టక వాస్తవమును దెలిసికొనుటయే ప్రధానోద్దే శ్యముగాఁగొని సుప్రసిద్ధ పాశ్చాత్యవిద్వాంసులలో నొకరగు కర్జె పండితుఁడు హైందవులు "ఇండియాదేశజులా లేక ఇతర దేశములనుండి వలసవచ్చినవారా" యను విషయమునుగుఱించి పెక్కుపరిశోధనలుగావించి యనుకూల ప్రతికూలాభిప్రాయ ముల వెలిబుచ్చిన యితరవిద్వాంసుల రచనలను దదనుగుణ్య ములగు వాఙ్మయమును సంపూర్ణముగఁ బరిశీలనలనుసల్పి హిందువు (హిందూదేశవాసు) లితరదేశములనుండి వలసవచ్చి నటులఁ జెప్పుట కాధారములేవియుఁ గాన్పించుటలేదనియు, స్వదేశజులేనని చెప్పుటకే యాధారములు గాన్పించుచున్ననియు హైందవులు ఇండియాదేశజులేననియు నిరాఘాటముగ సిద్ధాం తముఁ గావించియుండిరి.

---

[1] Vide- J. R. A. S, Vol, XVI pages. 191-199.

ఆర్యుల యుత్పత్తిస్థానమును గుఱించియు, వలసక్రమములను గుఱించియుఁ బలువురు విద్వాంసులు పలుసిద్ధాంతములు గావించియుండిరి. పెక్కుమంది ఆర్యుల కీభరతఖండమే జన్మభూమియై యుండెననియు, ఇటనుండి పెక్కుదేశములకు వలసపోయి రాజ్యస్థాపనలు గావించుకొని యుండిరనియుఁ దమ కళాకౌశల్యవిజ్ఞానాదికములు నితరదేశములందు వ్యాపింపఁజేసి యుండిరనియు, హైందవకళాకౌశల్యవిజ్ఞానాదికములు, నాగరకత మున్నగునవి నేఁటికిని ఇతరదేశములందు విరాజిల్లుచుండినటులఁ జెప్పియుండిరి.

“గ్రీసుదేశములో ఇండియా” (India in Greece) యను గ్రంథమును రచించిన ప్రొఫెసరు పోకాకు పండితుఁడు హిందూదేశమును, హైందవార్యులను గుఱించి చెప్పుచు,

“The Greek Language is a derivation from the Sanskrit; therefore Sanskrit speaking people ie., Indians, must have dwelt in Greece and this dwelling must have preceded the settlement of those tribes which helped to produce the corruption of the old language or in other words the people who spoke that language ie., the Indians must have been the primitive settlers; or at least they must have colonised the country so early and dwelt there so long, as to have effaced all dialectic traces of any other inhabitants; just as the Saxons displaced the feeble remains of the dialect of the ancient Britons, in this Island, and imparted a thoroughly Saxon stamp to the genius of the English Language. But if the evidence of Saxon Colonisation in this Island,

( I shall speak independently of Anglo-Saxon History ) are strong both from language and political institutions, the evidences are still more decessive in the parrellel case of an Indian Colonisation of Greece.

Not only her language, but her Philosophy, her religion, her rivers, her mountains, her tribes, her subtle turn of intellect, her political institutes, and above all the mysteries of that noble land irresistably prove her colonisation from India."[1]

" The primitive history of Greece is the primitive history of India"[2]

" I shall demonstrate that these evidences were but the attendant tokens of Indian Colonisation with its corresponding religion and language. I shall exhibit dynasties disappearing from Western India appear again in Greece. Clans whose martial fame is still recorded in the faithful chronicles of North-West India as the gallant bands who fought upon the plains of Troy."[3]

" The mighty human tide that passed the barriers of the Punjab rolled on towards its destined channels in Europe and Asia to fulfil its beneficient office for the moral fertilisation of the world."[4]

"గ్రీకుభాష సంస్కృతమునుండి వ్యుత్పత్తి అయి యున్నది. కనుక సంస్కృతము మాటాడువారు—ఇండియనులు

---

1 Vide India in Greece pp, 18 & 19

2 Vide Ibid p- 30

3 Vide, India in Greece p. 12

4 Vide. India in Greece- Page 26

(హైందవులు) గ్రీసులో నివసించి యుండవలెను. ఈ నివాసము ప్రాచీనభాషకు సాంకర్యమును గలుగఁజేసిన జాతులవారి నివాసమునకుఁబూర్వమే యైయుండవలయును. ఆ భాషను మాట్లాడెడుజనులు—ఇండియనులు—ఆదిమవాసులుగ నుండవలెను. లేదా ఆదియందు వలసవచ్చి నివాసమేర్పఱుచుకొని, యీ ద్వీపమునందు (బ్రిటను దేశమునందు) శాగ్జనులు (Saxons) ప్రాచీన బ్రిటనుల భాషాచిహ్నములను మార్పుచేసి ఇంగ్లీషు భాషకు సంపూర్ణముగ శాగ్జనుభాషాసాంప్రదాయ మలవడఁజేసినటులనే, యితరనివాసస్థుల భాషాచిహ్నము లేమాత్రము గానరాకుండ నశింపగునంత దీర్ఘకాలముండి యుండవలయును. ఆంగ్లోశాగ్జను చరిత్రసంబంధము లేకుండఁగ నీద్వీపమునందు (బ్రిటను దేశమునందు) భాషనుబట్టియుఁ, బరిపాలనా విధానముల ననుసరించియు, శాగ్జనులు వలసవచ్చి నివాస మేర్పఱుచుకొనిరనుటకు బ్రబల దృష్టాంతములన్నచో నట్టిసాక్ష్య సాధనములే గ్రీసు దేశమునకు ఇండియా దేశవాసులు (హైందవులు) వలసవచ్చి నివాస మేర్పఱుకొనిరని నిష్కర్షగఁజెప్పుట కింకను బ్రబలతమముగ నున్నవి." * * * *

"తన భాషనుమాత్రమే కాక తన తత్వజ్ఞానము, తన మతము; తన నదీనదములు — గిరిగహ్వరములు, జాతులు, సూక్ష్మబుద్ధి, రాజ్యాంగవిధానములు—అన్నిటికంటె ముఖ్యముగ నీ దివ్యమైన దేశము (గ్రీసు దేశము) నందలి రహస్యములు, (Mysteries) అన్నియు, ఇండియా దేశమునుండి వలసవచ్చి

నివాసమేర్పఱచుకొనినటుల నిరాక్షేపణీయముగ ఋజువుసేయు చున్నవి.” 1

“హిందూదేశపు ప్రాచీనచరిత్ర గ్రీసుదేశపు ప్రాచీన చరిత్రయై యున్నది ”2

“ఈ నిదర్శనము లన్నియు ఇండియనులు తమ మతము తోడను, భాషతోడను, సరియైన మత భాషా సాంప్రదాయముల తోడను, (గ్రీసుదేశమునకు) వలసవచ్చి నివాసమేర్పఱచుకొను టచేఁ గలిగిన చిహ్నములని నేను ఋజువుచేసితిని. హిందూ దేశమందలి పశ్చిమభాగమం దంతరించిన వంశములు మరల గ్రీసుదేశములోఁ గానుపించినటుల నేను దృష్టాంతములఁజూపి దను. హిందూదేశమందలి పశ్చిమోత్తరభాగముల నిజచరిత్రా వళిలో యేవంశమువారి పరాక్రమ ధైర్యత యశఃకాంతా పరిష్వంగన సుఖమిప్పటికిని జ్ఞాపకార్థము లిఖియింపఁబడియుం డెనో “ట్రాయి” మైదానములయందు ధైర్యసాహసోపేతంబు లగు పరాక్రమ కృత్యంబులసల్పిన జనసంఘము లయ్యావియే యనియు నిరూపించెదను.”3

“పంజాబు సరిహద్దులను దాఁటివెడలిన బ్రహ్మాండ మగు మానవతరంగము (ప్రవాహము) ప్రపంచనైతికాభి వృద్ధికిఁగాను తమ పరోపకారోద్యమమును సఫలీకృతము

1 Vide- India in Greece- Page 18 & 19.

2 Vide- India in Greece- Page 30.

3 vide. India in Greece. p. 21.

గావించుకొనుటకయి యూరపు ఆసియాఖండములలోని గమ్య స్థానములవంకకుఁ దరలిపోయినది." 2

అని చెప్పియున్నాఁడు. వీనిఁబట్టి చూడ ఇండియనులు ఇండియాదేశజులేననియు, నితర దేశములనుండి వచ్చినవారలు గారనియు, ఇండియాదేశమునుండియే బ్రహ్మాండమగు మానవ తరంగములుబయల్వెడలి పశ్చిమమున సరిహద్దురాష్ట్రమగు పంజాబుదేశముపు సరిహద్దులనుదాఁటి వెడలిపోయి చీలికలలై పలుదేశములకు వలసపోయి స్థావరము లేర్పాటుఁ గావించుకొని నట్లును, అటులనే యొకశాఖవారు యూరపుఖండమందలి గ్రీసు దేశమునకుఁజేరి స్థావరమేర్పఱుచుకొని యొక జాతివారుగా మానవ ప్రపంచమునఁ బరిగణింపఁ బడుచున్నట్లును గన్పట్టు చున్నది. అట్టి సిద్ధాంతములను పోకాకుపండితుఁడు కేవల యూహాపోహాలచేఁగాక పెక్కు నిదర్శనములతోఁ గనఁబఱచి యుండెను.

గ్రీసుదేశమందలి పెక్కురాష్ట్రములను గుఱించియు, వాటి యుత్పత్తియున్న నువానిని గుఱించియు పోకాకు పండితుఁడు చెప్పిన విషయములఁగొన్నిఁటి నీక్రింద గనఁబఱచెద. అయ్యవి హైందవులే (ఇండియాదేశజులే) యితర దేశములకు వలసపోయి రాజ్యస్థాపనలు గావించుకొని యుండినటుల స్పష్టముగ ఋజువిచ్చుచున్నవి.

"If the very basis of our geographical knowledge, as derived from the Greeks, is totally

2 vide- India in Greece, - page, 26.

unsound in its nominclature, not less deceptive in the history in connection with it. Thus Strabo, one of the most judicious writers upon Greek Geography, in presenting us with the antiquarian Origin of the **Abantes,** very gravely tells us that, having settled in Phocis, and built the city of **Abae,** they afterwards removed to Euboea, and in consequence were called "Abantes." The Geographer, however, does not state whence they derived the original appellation "**Abae.**" Yet these are the clans that distinguished themselves permanently on the plains of Troy, as daring and hardy warriors. Justice shall be done to their birth place. Homer has nobely sung their fame, and I feel proud, as the historical exponent of a bard [2] ([2] See col. Tod's Account of the Rajaput Bardai in his Rajastan.), too often gratutiously set down as non-historical, to declare the lineage of these magnificient chieftains of an ancient race. The **Abantes** were the splendid Rajapoot tribes of **Abanti** [3] ([3] written "Avante" the 'V' and 'B' are pronounced indifferently in India, according to provincial use.) in the Province of Malwa." $

"Asins, one of the early poets of Greece, about B. C. 700 makes King Palasgus, the ancestor of Pelasgi, spring from the black earth.........

But how stands the plain historical fact in connection with this? Do we desire truth, and not theory? Then it will be understood that it was Gaya, a sacred city of Pelasa, that broughtforth

---

**$ Vide- India in Greece - page 33 by E. Pococke Esq. Ed: 1853**

King Palasgus, and not Gaia, the earth. This is history in Sanskrit, but fable in Greek. Again Arschylus makes King Pelasgus, the son of Palaecthon and this he undoubted was Palasgus was a son of Pali-cthon or the land of Pali, so called from Pali, the language of Palasa, Magadha or Behar."

(In Ceylon according to Captain Makony, and in Ava, according to Mr. Buchnan, the appellation of Pali, or Bali, and Magadhi are considered as synonymous, at least when applied to their sacred language: which I consider from the circumstances, to be the old dialect of Magadha, which is called also, the Kingdom of Pali by the Chinese. In India, the name for Magadha is unknown but its origin may be traced through the Puranas." Col. Wilfords Ind: Geog: As. Res- Vol. IX p. 33.[1]

" The origin of Cyclopes was attempted to be found out from the sounds of the Grecian Language .... .... .... ...."

" Certain it is, however, that these walls, of which we have been speaking, were built by the Pelasgians and for the same reason, it is equally probable that they were built by Cyclopes and for this I appeal to the Pelasgian Language."

" When these walls were built, the Great Homer was not in existence— the language of Pelasa was still the medium of oral communication in Greece. In short, the term " Cuclopes " is a corrupt form of Goclopes; the Gocula Chiefs:— (From Gokula, and Pa - a prince or chief) that is the chiefs who lived

1 Vide Pococke's India in Greece, Page 34

in the "Gocla" country, a district lying along the banks of the Jumna; the "Gocla Pes" being so called from their pastural habits in tending the Goclas or herds of cattle. The Gokla district is the residence of Nanda and of Krishna during his youth and the science of that prince's triumph amongst the Gopies or pastural nymphs and so far Homer is correct in giving to his Cyclopes. "Polyphemus" the character of a Sheppard. That part of Greece which was colonised by those Gocla Pes of the Jumna, was the Gucla Des by the Greeks written Cuclades by us Cyclades, that is the land of Guclas."[1]

"గ్రీకులనుండి మనము తెలిసికొనిన భూగోళశాస్త్ర పరిజ్ఞానమునకుఁగల మూలాధారములు వారి పరిభాషాపద సాంప్రదాయములను బట్టి యేమాత్రము సరికానియెడల, వానితో సంబంధించిన చరిత్రయంతయు స్వల్పభ్రమ ప్రమాదముగాదు. (ఎక్కువ వంచకమైనది, లేక నిజముకానిది.) గ్రీకుల భూగోళశాస్త్రమును రచించిన పండితులలో నొకరగు "స్ట్రాబో" పండితుఁడు "అబాంతీస" యొక్క ప్రాచీనోత్పత్తిని గురించి చెప్పు సందర్భమున "ఫోసిస" నకు వచ్చి నివాసమేర్పఱుచుకొని "ఆకెయి" నగరమును నిర్మించి కొంతకాలమునకుఁ దరువాత "యూబోకా" కు నెళ్ళి యుండిరనియు, నా కారణమున "అబంతీసు" లని పిలువఁబడుచుండిరనియు గంభీరముగఁ జెప్పియుండెను. ఈ

1 Vide, India in Greece pp. 39 - 40

భూగోళశాస్త్రవేత్త "ఆబెయి అను ప్రథమ నామము వారికేటులఁ గలిగినది చెప్పినవాఁడు కాఁడు. అయినను "ట్రాయి" మైదానములమీఁద ధైర్యసాహసముగల యోధవరులని ముఖ్యముగఁ బ్రసిద్ధిఁజెందినట్టివార లీతెగవారలే యైయుండిరి. వారి జన్మస్థానమునకుఁ దగిన గౌరవ పదవి నొసంగవలయును. "హోమరు" కవి వారికీర్తి నెక్కువగా గొనియాడి యుండెను. చరిత్రకు సంబంధము లేదని పలుమారు రూరకనే వదలివేయఁబడిన "బార్డు" యొక్క చరిత్రాంశములను వెల్లడిచేయువాఁడనగుటచే నీ ప్రాచీన జాతియగు ప్రఖ్యాతిగలఁ ప్రముఖుల వంశమును వెల్లడిచేయుటకు నేను గర్వపడుచున్నాను. (రాజపుత్రి "బార్డయి చరిత్రికఁగాను 'కర్నల్‌టాడ్' యొక్క రాజస్థానమును జూచునది.) ఈ 'అబంతీసు'లనువారు 'అబంతి' యందలి ప్రఖ్యాతిఁగల రాజపుత్రవంశములవారై యుండిరి. (ఇండియా దేశమందలి రాష్ట్రియ పరిభాషలనుబట్టి 'అవంతి' యందలి 'వ' కారమును 'బ' కారముగ "అబంతి" యని భిన్నముగ వాడుచుందురు.) §

భరతఖండమునందలి మాళవదేశభాగమునకే 'అవంతి' యని ప్రాచీన నామధేయమై యున్నది.

"క్రీస్తుకుఁ బూర్వము 700 సంవత్సరముల ప్రాంతమున నున్న గ్రీసు దేశపు ప్రాచీనకవులలో నొకరగు 'అసియసు'

---

§ Vide- గ్రీసులో ఇండియా — పేజీ 33

కవి "పెలస్గీల" మూలపురుషుండగు "పెలాస్గసు" రాజు నల్లభూమినుండి పుట్టించినట్లు చెప్పియున్నాఁడు. * * * కాని దీనికిసంబంధించిన యదార్థచరిత్రాంశ మేమి తెలియుచున్నది? మనకు సత్యమే కావలయునుగాని యూహలతోఁ బనిలేదు. "పెలాస్గసు" రాజునకు జన్మస్థానమని చెప్పఁబడిన "గయా" అనునది "పెలాస" దేశమునకలి గొప్ప పుణ్యక్షేత్రమగు "గయా" నగరమనియు, భూమియనుసగము గల "గాంగ్" కాదనియు మనము గ్రహించవలసియున్నది. సంస్కృతమున నిది చరిత్రాంశము. గ్రీకులకుఁ గట్టుకథయైనది. మఱియు "ఎయుస్బిలసు" పండితుండు "పెలాస్గసు" రాజు "పాలిక్తను" నకుఁ గుమారుఁడని చెప్పియున్నాఁడు. అయ్యది నిశ్చయమే. * * * "పలాస్గసు" రాజు " పాలిక్తాను " నకు లేక "పాలి" దేశమునకుఁ బుత్రుఁడే! అయ్యది—పాలిదేశము—'పలాసా' లేక 'మగధ' లేక 'బీహారు' నందలి భాషయగు 'పాలి' నుండి పాలిదేశమని పిలువఁబడుచుండెను.

("కెప్టన్ మేకనీ—చెప్పినటుల సింహళదేశమునందును, బచ్చినన్ చెప్పినటుల ఆవా దేశమునందును, పాలి. బలి—మాగధియను నామము లోకేనామమునకుఁ బర్యాయ పదములుగ భావింపఁబడుచున్నవి. వారి పవిత్రమగు భాషా విషయమునందట్లే పరిగణింపఁబడుచున్నది. సందర్భములను బట్టి యయ్యది మగధదేశమునందు మిగుల ప్రాచీనమగు భాషయని నేను భావించుచున్నాను. ఈ మగధదేశమే

చైనాదేశీయులవలన పాలిరాజ్యమని పేరొ్కనఁబడుచున్నది. ఇండియాలో మగధ కింకొకపేరు తెలియదు. కాని దాని మూలమును పురాణములద్వారమున గుఱుతింపవచ్చును.[1] (చూ. కర్నల్ విల్ఫర్డుగారి ఇండియాజాగ్రఫీ—ఏషియాటిక్ రీసర్చి. వాల్యూం IX పేజీ 33.)

"గ్రీకు భాషాశబ్దములఁబట్టి" "సైక్లోప్సు" యొక్క యుత్పత్తిని కనుఁగొనుటకుఁ బ్రయత్నములు చేయఁబడియుండెను. * * * కాని మనము ప్రస్తావించిన భిత్తికలు "పలాస్గియన్సు" వలనఁ గట్టింపఁబడినవనుట వాస్తవమని చెప్పుటకుఁగల కారణములనుబట్టియే అయ్యది 'సైక్లోప్సు' వలనఁ గట్టింపఁబడినవని చెప్పుటయు నదేవిధముగ నమ్మఁదగియున్నది. ఇందుకు "పలాస్జియను" భాషమీఁద నాధారపడుచున్నాను.

"ఈ భిత్తికలు కట్టింపఁబడినపుడు పేర్వడసిన "హోమరు"కవి పుట్టియుండలేదు. అప్పటికి గ్రీసుదేశమునందు "ప్రిలాస" దేశమునందలి భాషయే ముఖ్యముగ మాటాడుకొను భాషయైయున్నది. ఇంతయేల? "కుక్లోప్సు" అనునది "గోక్లోప్సు" (గోకుల ప్రముఖులు) యొక్క సంకరరూపమై యున్నది. గోకుల ప్రముఖులు (గోక్లు + ప పురుషుడు—రాజకుమారుఁడు=నాయకుఁడు) యమునానదీతీరమునందున్న యొక జిల్లాయగు గోకులదేశమునం

---

1 Vide- గ్రీసులోని ఇండియా - పేజీ 33.

మండినవారు. వీరు గోవులమందలను పెంచెడు వ్యవసాయదారుల యలవాట్లుగలవారగుటచే వీరు "గోక్లపేస్" అని పిలువఁబడుచుండిరి. గోకులమండలము 'నందునకు' ను బాల్యమునఁ 'గృష్ణునకును' నివాసభూమియై యుండెను. అయ్యదియే కృష్ణుఁడు గోపికలు లేక శాఁఖానస్యకులంగో స్వేచ్ఛమెయి వర్తించిన ప్రదేశము "క్లైక్లోప్సు" కు గొల్లవారిస్థితిని లేక లక్షణములను గలుగఁజేయుటమాత్రము సరిగనే యున్నది.

"యమునానదీ ప్రాంతమునుండు గోపుల బృందారకులు వలసపోయి ఆక్రమించుకొనిన గ్రీసు దేశభాగమే 'గూక్ల' దేశమై యున్నది. దానినే గ్రీకులు "కూక్ల" దేశమనిరి. మనము దానినే "సైక్లేడ్సు" అనుచున్నాము. అయ్యది గోపులులభూమియై యున్నది."*

ఇటులనే గ్రీసు మున్నగు పాశ్చాత్య దేశములకు హిందూదేశమునందలి పలుభాగములనుండి జనులు వలసపోయి దేశములజయించి నివాసము లేర్పఱుచుకొనియుండినటులఁ బెక్కుదృష్టాంతములతోఁ జెప్పఁబడి యుండెను.

సర్ విల్లియం జోన్సు(Sir William Jones) పండితుఁడుకుఁ గాశ్మీరదేశములో దొఱకిన బాక్ట్రియాదేశరాజు వంశావళినిఁబట్టి అలెగ్జాండరు దండయాత్రకుఁ బూర్వము దాదాపు ఆఱువేల సంవత్సరములనుండియు బాక్ట్రియాదేశమును బాలిం

* Vide- గ్రీసులో ఇండియా—పేజీ 39.

చిన రాజనామములను, వారిచరిత్రలును బరిశీలనమొనర్చిన వారు హైందవులయినటులఁ దెలియుచున్నది. బాక్ట్రియాదేశమున హైందవులిప్పటికిఁ బూర్వము కనీస మెన్మిదివేల సంవత్సరముల పై కాలముక్రింద నటనే పరిపాలనసల్పుచున్నటులఁ దెలియుచున్నది.

వీనింబట్టి హైందవుల (ఇండియాదేశజుల) లోఁ గొన్ని తెగలవారప్పుడప్పుడు తమదేశమునువదలి వలసపోయినటుల స్పష్టముగఁ గన్పట్టుచున్నయది. వలసవిధానములు సంపత్తి వలసలనియు, విపత్తి వలసలనియు రెండుతెఱంగులుగఁ జెప్పఁదగియుండును. అందు కేవల వ్యాప్తిమాత్రోద్దిష్టమై విజ్ఞాన ప్రసారార్థము జరగినవలసలు సంపత్తి వలసలనియుఁ, గాటకముల చేతను, యుద్ధములచేతను, దేశకాల వైపరీత్యములచేతను జరగిన దేశాంతరగమనములు విపత్తి వలసలనియుఁ బేర్కొనుచుండిరి. అట్టి వలస లేయే కాలములయందు జరగియుండినది స్పష్టముగఁ జెప్పుటకవకాశము గన్పట్టదు. ఈ కాలమునఁ గనిపించుచున్న చరిత్రాధారములనుబట్టి భారతయుద్ధకాలమున కావలివలి కాలములయందుకూడ నట్టి వలసలు జరిగియుండినటులఁ జెప్పఁదగియున్నది. "పోకాకు" పండితుని రచనలను బట్టి హైందవకళలుఁ శాస్త్రవిజ్ఞానముమున్నగునవి ప్రథమమున వలసపోయిన హైందవులు తమతోఁబాటు 'ఛాల్డియా', 'బేబిలోనియా' దేశములకుఁ గొంపోయి వ్యాప్తిగావించినటులను, అటనుండి ఈజిప్టు దేశీయులు గొంపోయినటులను, ఈజిప్షియనులనుండి గ్రీకులు, రోమనులు నేర్చుకొని యుండినటులను.

గన్పట్టుచున్నది. ఇంతియెగాక అప్పటప్పటికి వలసలుపోయి గ్రీసు, మున్నగు పాశ్చాత్య దేశములయందు నివాసము లేర్పాటుఁగావించుకొనిన హైందవులవలనఁగూడ వ్యాప్తిఁజేయఁబడినటులఁ జూపట్టుచున్నది. మఱియు గ్రీకులచేఁ జేర్కొనఁబడెడు "ట్రాయి" మున్నగు యుద్ధములు ఇండియా దేశమునుండి వలసపోయి రాజ్యస్థాపనముఁగావించుకొనఁ బ్రయత్నములుసల్పు సందర్భమున వలసపోయిన హైందవులకును, అదివరలో నచట నుండిన యాదిమనివాసుల (Aborgines) కును సంఘటిల్లిన ప్రతిఘటింపులలో కలిగిన యుద్ధములయ్యుండుననియుఁ దోఁచుచున్నది. "ట్రాయి" మైదానములలో జరగిన యుద్ధముల యందుఁ భారతయుద్ధానంతరము హిందూదేశ చరిత్రయందు జేర్కొనఁబడక విడువఁబడిన హిందూదేశము పశ్చిమోత్తరభాగములందుండు రాజకుటుంబములలోఁ జేరినవారు పాల్గొని యుద్ధములుఁ గావించి జయప్రదులై వారియోధత్వము ను బ్రకాశింపఁ జేసియుండినటులఁ దగిన నిదర్శనములతో "పోకాకు" పండితుఁడు చెప్పినవిషయము లద్దానికిఁ బ్రబల సాక్ష్య మిచ్చుచున్నవి.

మఱియు హిందూదేశమందలి యుత్తరభాగమునుండి వలసపోయిన "శాక్యుల సంతతివారలే "ఆంగ్లో శాగ్జనులు" (Anglo-Saxons) అయి యుందురనియు సూచించుచుండెను.[1] దీనిం బట్టి హిందూదేశమునుండి శాక్యులు పశ్చిమదేశములకు వలసపోయి జర్మనీదేశప్రాంతమున స్థావరమేర్పఱుచుకొని యుండి

[1] Vide- India in Greece—Page 29.

రనియు, వారు స్థావరమేర్పఱుచుకొనిన దేశమే "శాగ్జనీ" (Saxony) దేశమనిపిలువఁబడుచుండెననియుఁగానిపించుచున్నది. ఇటులనేయూరపుఖండమందలి దేశములన్నియు హిందూదేశము నుండి వలసపోయి స్థావరముల నేర్పాటుఁ గావించుకొనిన తెగల యొక్క నామములచేఁ బేర్కొనఁబడుచుండినటులఁ గన్పట్టు చున్నది. (యూరపుఖండమునుండి యార్యులువలసవచ్చి ఇండి యాలో స్థావరమేర్పఱుకొని యుండిరని కుతర్కముల నెన్నియో గావించుచు విపరీతసిద్ధాంతముల నుపపాదింప ప్రారంభించినది ప్రప్రథమమున జర్మనీదేశపు బండితులై నటులఁ గన్పట్టుచున్నది. చారిత్రిక పరిశోధకతంబునఁ బ్రపంచచరిత్రయందగ్రస్థానము వహించి పేరెన్నికఁగాంచిన భరతఖండ మీనాఁటికి పరాధీనమై యుండ నిట్టిపరాధీనుల పూర్వులయొక్క సంతతివారని లోక మెఱుంగుట యొక గొప్ప న్యూనతఁగనెంచి హైందవులే (ఇండి యనులే) యూరపుఖండమునుండి వలసవచ్చిన తెగవారి సంతతి వారనియు, హైందవ విజ్ఞానవికాసములకన్న యూరపుఖండ వాసుల విజ్ఞానమే మిగుల ప్రాచీనమైనదనియుఁ బాశ్చాత్య విజ్ఞానమును జూచి హైందవులు నేర్చికొనియుండిరనియు, లోక మును భ్రమింపఁజేయుటకై యట్టి విపరీతసిద్ధాంతములను బ్రతి పాదింపఁ గడంగినటులఁ గన్పట్టుచున్నది.)

మఱియుఁ "దూర్పుదేశములనుండి దండెత్తివచ్చిన వీరు, యూరపుదేశమును బ్రవేశించి యటనుండు ఆదిమనివాసులగు 'తురేనీయు' లను నిర్మూలముఁ గావించియు లేక తమకుబానిస లుగఁ జేసుకొనియు నుండిరనియు, 'బాస్క్యులు' అనువారలు

"పెరినీసు" పర్వతములకును, 'ఫిన్సు' అనువార లుత్తరముగ నుండు అడవిప్రదేశములకును, బాడువప్రదేశములకును పారి పోయి తలలు దాఁచుకొనియుండిరనియు, ఆర్యులగుంపులు తూర్పుదిక్కునుండి పశ్చిమదిక్కునకు వలసపోయి జొరఁబడి స్థావరమేర్పఱుచుకొనిన ప్రదేశములయందు "తురు" సంతతి వారు మృగప్రాయులగు మనుజులు నివసించుచుండినట్లును గనుగొనియుండిరి." అని ప్రొఫెసరు మాక్సుముల్లరు పండి తుఁడు చెప్పియుండినటుల "ఆర్యోత్పత్తి" అను గ్రంథమును రచించిన ఈసాకు టైలరు పండితుఁడే క్రోడీకరించి యుంచెను.[1]

"These invaders penetrated into Europe from the east, exterminating or enslaving the 'Turanians' aborgines; the Basques taking refuge in the Pyrenese, and the Finns in the swamps and forests of the north. This theory has been stated by Prof. Maxmuller with his habitual lucidity. He informs us that wherever the Aryan columns penetrated in their migration from the East to the West they found the land occupied by the Savage descendents of 'Tur'[2]

యూరపుదేశమునుండి ఇండియాదేశమున కార్యులు, వలసవచ్చి నివాసమేర్పాటుఁ గావించుకొని యుండిరనియు నార్యులకు జన్మభూమి యూరపుఖండమని యుపపాదింపఁబడిన తమ నవీనసిద్ధాంతమున కయ్యది ప్రతిబంధకముగాఁ గన్పట్టెను. తమ యభిప్రాయములను మాక్సుముల్లరు పండితుఁడు మార్చు

1 Vide- Origin of Aryans- page 215.
2 Vide Origin of Aryans. Page 215

కొనవలసియుండునని యీసాకుౖెలరు పండితుఁడు పలుప్రయత్నములఁ గావింపఁబడినటులఁ గాన్పించుచున్నది. కాని మాక్సుముల్లరు పండితుఁడు "అదివరలో నలువదిసంవత్సరములక్రిందటఁ దాఁ జెప్పియుండినటులనే యార్యు లాసియాఖండమునుండియే వచ్చియుండురని యిప్పటికిని చెప్పెదనేగాని యంతకంటె నధికమేమియుఁ జెప్పుటలేద"ని ఘంటాపథముగఁ జెప్పియుండిరఁట.1

"Prof. Maxmuller, the only surviving scholar of the old school, has recently given a final pronouncement on the subject. He thus writes in 1887, "I should still say, as I said forty years ago, 'somewhere in Asia' and no more"2

మాక్సుముల్లరు పండితుని యీ కడపటినిశ్చిత హితవాక్యములు ఈసాకుౖెలరు పండితునకు రుచించినవి కావు. వారి రచనలు సంధిగ్ధములైనవనియు, నలువది సంవత్సరములు గడచినను తమ పూర్వపు (ప్రథమ) సిద్ధాంతమును మార్చుకొనకుండుటనుబట్టి క్రొత్త నూతనాంశముల సారమును గ్రహించియుండినటులఁ గన్పట్టుటలేదనియు, 'తా బట్టిన కుందేటికి మూఁడే కాళ్ళ'ని మొండిపట్టు పట్టినట్టులున్నదనియు, సూర్యసంచారమననుసరించి తూర్పుదేశమునుండి పశ్చిమదేశమునకు వలసవిధానములు జరగియుండెనని "పాట్టు" (Mr. Pott) పండితుఁడు చేసిన నిరర్థకయూహాలనే యున్నదనియు నేమేమియో వెక్కసమును వెలిఁబుచ్చియుండెను. (Vide- Origin of Aryans- pp. 53-54) మాక్సుముల్లరుపండితుఁడు చెప్పినవాక్యములు

1 Vide- Origin of Aryans - P. 53.

2 Vide. Origin of Aryans. Page 53

1887 సంవత్సరము ఆగష్టునెలలో "హితవాక్యములు" (Good Words) అను శీర్షికక్రిందఁ బ్రచురించియుండిరి.

ఇట్టి విపరీతసిద్ధాంతములు ప్రతిపాదింపఁబడకపూర్వము పాశ్చాత్యపండితులచే హిందూదేశమునందలి (ఇండియాదేశమునందలి) ప్రజలు హైందవులు (హిందూదేశజులు), మహమ్మదీయులని రెండుతెగలుగనే విభజింపఁబడి వ్యవహరింపఁబడుచుండినటులను, ఇండియాదేశముపై దండువెడలి జయించి స్థావరమేర్పఱుచుకొనినవార లార్యులనియుఁ దదితరు లాదిమనివాసులనియు భేదజాతులుగ ఇండియాదేశవాసులు పరిగణింపఁబడి యుండలేదనియు, అట్టిభేదముల నిటీవల కాలమున సృష్టిసేయఁబడియుండెననియుఁ గన్పట్టుచున్నది. ఆర్యావర్తగృహము (Aryavartic Home) ను రచియించిన పావగీ పండితుఁడును (Mr. N. B. Pavgee) మద్రాసు రాజధానియందలి పాఠశాలల యుపయోగము నిమిత్తము ఇండియాదేశపు ప్రజల సంగ్రహచరిత్రము (A Brief Histry of the Indian people by W.W. Hunter-special Edition for the Madras schools only - Ed. 1881) నురచియించిన హంటరు పండితుఁడును వ్రాసినవిషయము లద్దానిని బలపఱుచుచున్నవి.

"Mr. Nesfield .... .... in his, 'Brief view of the Caste system of the North Western Provinces and Oudh'* * * uncompromisingly denies the truth of any such divisions of the people of India as the Aryan Conquerors of India, and the aborigines of the Country, and even asserts that, it is the

modern doctrine which divides the popuation of India into Aryan and Aboriginal. He further advocates and argues forcibily in favour of the fact that there is essential unity of the Indian race and maintains that the great majority. of Brahmins are not of a lighter complexion or of a finer or better bred features than any other caste or distinct in race and blood from the scavangers who swept the roads.''$

"నెస్ఫీల్డు పండితుఁడు తానురచించిన పశ్చిమోత్తర రాష్ట్రములు, అయోధ్యలయందలి కులపద్ధతులయొక్క సంగ్రహమైన అభిప్రాయమునందు హిందూదేశమును జయించిన ఆర్యులనియు, ఈదేశమునందలి అదిమనివాసులనియు, ఇండియాదేశమునందలి ప్రజలను విభజనము గావించు సిద్ధాంతమునం దెంతమాత్రము యధార్థములేదని నిశ్చయముగఁ జెప్పుచున్నాఁడు. ఇండియాదేశమునందలి జనులను 'ఆర్యుల' నియు 'ఆదిమనివాసు' లనియు విభజన చేయునది యిక్కాలపు నవీనసిద్ధాంతమై యుండెననియుఁ గూడఁ జెప్పియున్నాఁడు. మఱియు హైందవ(ఇండియనుల) జాతియంతయునొక్కటియేనని బలవత్తరమగు హేతువాదము గావించుచుఁ జెప్పుచున్నాఁడు. అంతియెగాక బ్రాహ్మణులలో నెక్కువమంది యితరకులములవారికన్న నెక్కుడు ప్రకాశమానమగు ముఖవర్చస్సీగాని, శ్రేష్ఠమైనట్టియు, యధికమైనట్టియు ముఖవైఖరిగాని కలిగినవారు కారనియు,

$ Vide, Aryavartic Home. page 271

వీధులూడ్చెడువారికంటెఁ బ్రత్యేకమైనజాతి, వంశము కల వారు కారనియు సమర్థించుచుండెను "[1]

"European writers formerly divided in Indian population into two races— the Hindus and the Muhammadans. But when we look more closely at the people we find that they consist of four elements. These are, First, the Non-Aryan tribes, sometimes called the Aborigines. * * * Second the descendants of the Aryan or Sanskrit-speaking Race, now called Brahmins and Raja-puts. * * * Third, the Great mixed population, generally known as the Hindus, which has grown out of the Aryan and Non-Aryan elements (chiefly from the latter.) * * * Fourth, the Muhammadans who began to come to India about 1000 A. D.

* * * *

"**The Two races of Pre-historic India:**— The great sources of the Indian population were therefore, the Non-Aryans and the Aryans."[2]

"పూర్వమందు యూరపుఖండవాసులగు గ్రంథకర్తలు హిందూదేశప్రజలను హిందువులు, మహమ్మదీయులని రెండుతెగలుగ విభజించియుండిరి. కాని మనమెక్కువగాఁ బ్రజలనుఁ బరిశీలనమొనర్చిన నాలుగుజాతులుగ నుండినటుల గన్పట్టుచున్నది. అవియెవ్వియన:—మొదటిది:—ఆర్యేతర

1. Vide - Aryavartic Home-page 271

2 A Brief History of the Indian People. by W. W. Hunter. Page 32. (Special Edition for the Madras Schools only. Ed. 1881)

జాతులు. వీనినే యొకొకప్పుడు "ఆదినువాసు"లని పేర్కొ నియెదరు * * * రెండవది:—ఆర్యులయొక్క లేక సంస్కృతభాషమాటలాడు జాతియొక్క సంతతివారు. వీరే బ్రాహ్మణులు, రాజపుత్రులని యిపుడు పిలువఁబడు చుండిరి. * * * మూఁడవది:—సామాన్యముగ హిందువులని ప్రసిద్ధిఁజెందిన బహుసంఖ్యాకులగు మిశ్రమ జనులు. వీరార్యులు, ఆర్యేతరులనుండి (ముఖ్యముగఁ గడ పటివారినుండి) యేర్పడియుండిరి. * * * నాలవది:— క్రీ. శ. 1000 సంవత్సర ప్రాంతమునుండి హిందూదేశము నకు రానారంభించిన మహమ్మదీయులు * * *

* * * *

"హిందు (హిందూదేశముయొక్క వేతిహాసిక యుగ మునకుఁ బూర్వమునందు రెండుతెగలు:—కావున హిం దూదేశమునందలి జనసంఖ్య ఆర్యేతరులు, ఆర్యులను రెండు గొప్పతెగలవారై యుండిరి. *

లూయి జకోలియట ను ఫ్రెంచివిద్వాంసుఁడు రచించిన 'లా బైబిల్ డాంసు ల ఇండి' (La 'Bible Dan's Le Inde) అను గ్రంథమున

---

* Vide- హిందూదేశపు ప్రజల సంగ్రహ చరిత్రము by W. W. Hunter page 32— చెన్నరాజధాని యందలి పాఠశాలల యుపయో గమునిమిత్తము ప్రత్యేకముగాఁ బ్రచురము సేయఁబడినది.

"ప్రాచీన నవీన జాతులన్నిటియొక్క భాషాసాంప్రదాయములు, మతసాంప్రదాయములకన్నిటికి మూలాధారములకై వెదకినయెడల ఇండియాలోనే కాన్పించుచున్నవి. ప్రపంచమునకంతటికిని ఇండియా శైశవడోలిక. ఇచ్చటనుండి తనసంతానమును బశ్చిమ దిగంతమునకు సైతముపంపి మన ప్రాథమిక జన్మస్థానమును శశ్వన్నిదర్శనములతో ఋజువుపఱుచునటులఁ దాన భాషను-తనధర్మము లను-తన నీతులను-తన వాఙ్మయమును - తనమతమును మనకుఁ బ్రసాదించిన దీజననియే. (ఇండియా దేశమే.) మైయున్న"

దని చెప్పియున్నాఁడు. ఇటులనే పెక్కురు ప్రాచీన వైదేశిక చరిత్రకారులును బండితులునుగూడ హైందవులు (హిందూదేశజులు) ఇండియా దేశమునుండి యితర దేశములకు వలసపోయి స్థిరనివాసము లేర్పాటుఁ గావించుకొనియుండిరనియుఁ బ్రకృతిమా దేశములందుండు జాతులవారు వారిసంతతివార లేయనియు సిద్ధాంతములఁ గావించియుండిరి.

ప్రాచీన చరిత్రాంశముల విపులముగఁ బరిశీలించి చూచిన హిందూదేశమునుండియే యితర దేశములకు వలసపోయినటులఁ గాన్పించునేగాని యితర దేశములనుండి ప్రజలు హిందూదేశమునకు వలసవచ్చి స్థిరనివాసము లేర్పాటుఁగావించుకొనినటులఁ గన్పట్టదు. ఒకవేళ యట్టినిదర్శన మేదియేనిఁ గన్పట్టినను నయ్యది హిందూదేశమునుండి యితరదేశములకు వలసపోయిన హైందవుల శాఖవారేఁగిన దేశముయొక్క శీతో

ష్ణాది స్థితులు వారికనుగుణ్యముగ నుండునుచే దమజన్మభూమి యగు హిందూదేశమునకు మరలివచ్చిన సందర్భమున జెప్పఁబడియుండినటులఁ గన్పట్టుచున్నది. హిమప్రళయకాలమున నార్యులుత్తరధ్రువప్రాంతభూములనుండి దక్షిణముగ హిందూదేశమునకు వలసవచ్చి నివాసమేర్పఱుచుకొని యుండిరని లోకమాన్య బాలగంగాధరతిలకు పండితుడు చెప్పియుండెను. హిందువుల సాంప్రదాయములఁబట్టియు జరిత్రలనుబట్టియు యుగపరిణామకాలములందొక ప్రళయము గలుగుచు నుండుటులఁ గన్పట్టుచున్నది. ఒక్కొక మహాయుగము కృత, త్రేత, ద్వాపర, కలి యుగములుగ విభజింపఁబడి యుండెను. ఇప్పటికి సృష్ట్యాది 27 మహాయుగములు గడచి 28 మహాయుగము జరుగుచున్నటుల భారతీయ వాఙ్మయము సెప్పుచున్నది. ఇండియాదేశమును వీడి యుత్తరభూములకు వలసపోయిన హైందవులచ్చట మంచు జాస్తిగనుండుటచే యాశీతలమును సహింపఁజాలక తిరిగి దక్షిణాభిముఖులై తమజన్మభూమియగు ఇండియాదేశమునకు తిరిగి వచ్చియుందురని చెప్పఁదగియున్నది. ఉత్తరధ్రువఖండప్రాంత భూములకు వలసపోయిన ఆర్యులగాధయు, హిమప్రళయ గాధయు శతపథబ్రాహ్మణమునఁ గలదని చెప్పెదరు. కొన్ని యితరదేశములందును హిమప్రళయగాథలు కలవు.

## హిమప్రళయకాలము—దానిగుఱించిన గాథలు.

ఇప్పటికి షుమారు పదివేలసంవత్సరముల క్రిందట హిమప్రళయము వచ్చియుండునని యూహించి హిమప్రళయానంతర

మార్యులు ధ్రువఖండప్రాంత భూములనుండి దక్షిణముగ హిందూదేశమునకు వలసవచ్చియుండుగసియు లోకమాన్య బాలగంగాధరతిలకు పండితుని యభిప్రాయమైనటులఁ గన్పట్టు చున్నది. హిమప్రళయము షుమారు పదివేల సంవత్సరముల క్రిందట జరగియుండుననిభూగర్భశాస్త్రజ్ఞులు (Geologists) కొందఱూహించియుండుటచే హిమప్రళయ మిప్పటికిఁ బదివేల సంవత్సరముల క్రిందట సంభవించియుండెనని తిలకు పండితుఁ డభిప్రాయపడినటులఁ దోఁచెడిని. యూరపు దేశీయులగు డాక్టరు. క్రోలు (Dr. Croll) మున్నగు భూగర్భశాస్త్రజ్ఞులు (Geologists) కొందఱు హిమప్రళయానంతరకాల మిప్పటికి దాదాపు 240,000 సంవత్సరముల క్రిందటఁ బ్రారంభమై యుండవలయుననియు, గత ముప్పదిలక్షల సంవత్సరములలో ముమ్మారట్టి కాలవైపరీత్యములు కలిగియుండెననియుఁ బ్రథమమున 170,000 సంవత్సరములకును, ఆ పిదప 260,000 సంవత్సరములకు రెండవమారును, అటుతరువాత 160,000 సంవత్సరములకు మూఁడవసారియు అట్టి కాలవైపరీత్యములు కలిగియుండెననియు, మూఁడవమారట్టి కాలవైపరీత్యము కలిగి యిప్పటికి 80,000 వత్సరములు గడచియుండుననియుఁ జెప్పియుండిరి. స్కాట్లండు దేశమునఁ బూర్వకాలమునఁ గలిగిన హిమప్రళయమునకుముందు మానవులుండినటుల భూమినుండి త్రవ్వి తీయఁబడినశిలారూపకమైన జంతుసంబంధములగు వస్తువు లందు మానవకళేబర చిహ్నము లగపడుచున్నవనియు, సక్రమముగ లెక్కించి చూచిన గత హిమప్రళయమునుండి 240,000

సంవత్సరములకాలము గడచియుండునని భూగర్భశాస్త్రజ్ఞుఁడగు ప్రొఫెసరు, జే. డబ్ల్యు. డ్రేపరు (Prof. J. W. Draper) పండితుఁడు చెప్పియుండెను. వీరినిబట్టి చూచిన హైందవుల పురాణాదులయందుఁ జెప్పఁబడిన ప్రళయములు, మహాప్రళయములు గాక అప్పుడప్పుడు మధ్యకాలములలోఁ గాలవైపరీత్యములు కలుగుచు నుత్తరధ్రువప్రాంతములనుండి హిమము (మంచు) చెలరేఁగి దక్షిణముగ వీచి యొక్కొకదిక్కున కొంత భూభాగమును మంచుచేతను, మంచుగడ్డలచేతను గప్పివేయుచు మానవనివాసమునకు దుర్భరముగాఁ గావించుచు దేశములను నాశనము సేయుచుండినటులను జూపట్టెడిని. అట్టి వైపరీత్యములు కలుగుటకు ముందు కొలఁదికాలముక్రిందట నీ హిందూదేశమును వీడి యుత్తరభూములకు వలసపోయిన హైందవులట్టి హిమప్రళయము సంభవించఁగా శీతమును సహింపఁజాలక తిరిగి తమ జన్మభూమియగు హిందూదేశమునకు వచ్చియుందురు. ఆ విషయములే శతపథబ్రాహ్మణమున వర్ణింపఁబడి యుండినటులఁ గన్పట్టుచున్నది. ఉత్తరదేశములకేఁగిన హైందవులు (హిందూదేశవాసులు) తిరిగి దక్షిణముగఁ దమజన్మభూమియగు హిందూదేశమునకు వచ్చునప్పుడు వారలీ హిందూదేశమున కుత్తరముగనుండు హిమవత్పర్వతపంక్తిని జూచి యుత్తరగిరియని పేర్కొనియుండినటులఁ గానిపించుచున్నది. నిక్కువముగ నుత్తరధ్రువప్రాంతభూమియే వారిజన్మభూమియై దక్షిణముగనుండు భూములకు వలసవచ్చుచు మార్గమున నీ హిమవత్పర్వతమును గాంచినపుడు వారిదేశమునకు దక్షిణముగ నుండుటచే నద్దానిని

దక్షిణగిరియని పేరొందనవలసియుండెను. అటులఁగాకుండ నదివలలో దాము గూడు తెలుంగనట్టి యాపర్వతమును ఉత్తరగిరియని పిలుచుటయే సంభవింపదు. వారా హిమవత్పర్వతమును ఉత్తరగిరియని పేరొందియుండుటచే వారు పూర్వ మీ హిందూదేశవాస్తవ్యులై యుండి యుత్తరభూములకేఁగి తిరిగి తమ దేశమునకు వచ్చుచుఁ బూర్వపు వదంతి ననుసరించి యాపర్వతమును ఉత్తరగిరియని పేరొందియుండినటుల నెన్నఁదగి యుండును. లోకమాన్య తిలకుపండితుఁ డార్యులు దక్షిణముగవచ్చియుండిరను విషయమును మాత్రమే యంగీకరించి వారిరాకను గురించి చెప్పఁబడిన యితరవిషయములను గమనించినటులఁ గన్పట్టదు.

## వేదప్రామాణ్యము.

ఆర్యుల జన్మభూమి నిర్ధరించుటకయి వేదములందుఁ బెక్కునిదర్శనములు గాన్పించుచున్నవి. ఋగ్వేదమున నార్యుల జన్మభూమియందు గంగ (Ganges,) యమున (Jumna ), సరస్వతి, శతద్రు (Sutlej), పరుష్ణి (Ravi ), అసిక్ని (చంద్రభాగ - Chenab), సింధు (Indus) నదులను సప్తనదులున్నటులఁ జెప్పఁబడియున్నది. ఈ సప్తనదులు ప్రవహించు దేశమే యార్యుల జన్మభూమిగాఁ జెప్పఁబడియుండెను. ప్రపంచమునంగల సమస్తదేశములలో నేదేశమునం దీసప్తనదులు ప్రవహించుచుండునో యాదేశమే యార్యుల జన్మభూమియని చెప్పవలసియుండును. అట్టి దేశము ప్రపంచమునంగల దేశము

లన్నిటిలో నా సప్తనదులుగల హిందూదేశము గాక మఱి యే దేశము కాఁగలదు. కావున "ఇండియా" దేశమే యార్యుల జన్మభూమియని చెప్పఁదగియున్నది. కర్జిక్ మున్నగు విదేశీయ చరిత్రకారుల సిద్ధాంతములుగూడ హిందూదేశమే యార్యుల జన్మభూమియని చెప్పెడు వేదప్రామాణ్యమును బలపఱుచుచున్నవి. ఆర్యులెచ్చటనుండియో హిందూదేశమునకు వలసవచ్చియుందురను లాసెన్, స్పీగెల్, ష్లెగలు మున్నగు పండితుల సిద్ధాంతములను వేదప్రామాణ్యము మూలచ్ఛేద మొనర్చుచున్నది.

వేదప్రామాణ్యముబట్టి యీ సప్తనదులుగల హిందూదేశ మార్యులకు జన్మభూమియని యంగీకరించిన ధ్రువప్రాంత భూములనుండి యార్యులు హిందూదేశమునకు వలసవచ్చి యుందురని తమచేఁ బ్రతిపాదింపఁబడిన సిద్ధాంతమునకు భంగము కలిగించునని భీతిచే లోకమాన్య తిలకు పండితుఁడు వేదములలో సూచింపఁబడిన సప్తనదులు దేవలోకనదులైనటు లూహింపవలయునని గంతువేసియుండిరి. అయ్యవి భూలోక నదులు కావనియు, దేవలోకనదులై యుండవలయుననియుఁ జెప్పుట కెట్టి యాధారములుఁ గనబఱచినవారు కారు. పారశీకుల వేదగ్రంథమగు జెండు అవెస్టా (Zend Avesta) లోని సంగతులను బట్టియు హిందూదేశమే సప్తసింధుదేశమని చెప్పఁబడియుండుట తిలకుపండితుని సిద్ధాంతమునకు మఱింత బాధకరముగాఁ గాన్పించుచున్నది. ఆర్యులు హిందూదేశమునకు వచ్చినపుడు తమ ప్రాఁతపురాణములలోని నామములను దాము నూతనముగ స్థావరము గావించుకొనిన దేశములోని

పెక్కు ప్రదేశములు నదులు మున్నగువానికిఁ బెట్టియుండిరనుకొనుట యెక్కువ సహజముగఁ గన్పట్టుచున్నదని యూహించి సమర్థింపబూనిరి కాని యాధారములెవ్వియుఁ గనఁబఱుపమి వారివాదనమంత సమంజసముగఁ గన్పట్టుటలేదు.[1] అటులనే ఆర్యులు ఇండియాదేశమునుండి యితరదేశములకు వలసపోయి యట స్థావరమేర్పాటుచేసుకొని తమజన్మభూమి జ్ఞాపకార్థము ఇండియాదేశములోని నామములనే యటనుండు పలుచోట్ల నదులకు పెట్టియుందురని చెప్పుటకు వారియూహయే నాధారముగఁ జెప్పఁదగియున్నది.

కావున వీని నన్నిటినిబట్టి చూచిన ఆర్యులు లేక హిందువులు, లేక ఇండియాదేశవాసులు, ఇతరదేశములనుండి వలస వచ్చినవారు కారనియు, ఇండియాదేశమును ప్రవేశించి యిట నంతకుఁ బూర్వమునుండియున్న జాతులవారిని జయించి దేశమును లోఁబఱుచుకొనినవారలు కారనియు, వారికి హిందూదేశమే జన్మభూమియనియుఁ దెలియుచున్నది. హైందవులే యితరదేశములకు వలసవెల్లి రాజ్యస్థాపనలు గావించుకొనినటులఁ బెక్కునిదర్శనములు గన్పట్టుచున్నవి.

## దస్యు, దాస, రాక్షసాదు లార్యేతరులా?

ఇక దస్యు, దాస, రాక్షసాదులని పేర్కొనఁబడిన దేశవాసు లార్యులుకారా? ఆర్యేతరులా యను విషయ మాలోచింపవలసియుండును.

[1] Vide- Arctic Home in Vedas- pages 290-293.

దస్యుశబ్దము దస్ ధాతువునుండి పుట్టినదనియు, దస్ అనఁగా నాశముచేయుటయని యర్థముగాన దస్యులనఁగా నాశముచేయువారని యర్థమును జెప్పుచున్నారు. వేదములందీ దస్యులనుగుఱించి పలుతావులఁ జెప్పఁబడియుండెను. వేదములకు భాష్యమునురచించిన సాయనాచార్యులవారు దస్యులనఁగా వేదవిదితకర్మల నాచరింపనివారనియుఁ, జోరులనియుఁ, గర్మవిరోధులనియుఁ,గర్మల నాచరించువారిని బాధించువారలనియు, నితరవ్రతముల నాచరించువారనియుఁ బలుతావులఁ జెప్పిరి యున్నారు. నిరుక్తకారుఁడగు యాస్కాచార్యులవారును దస్యులన వేదకర్మలను నాశముచేయువారని చెప్పియున్నారు. వేదవిదితకర్మల నాచరింపమి యార్యులనుండి బహిష్కరింపబడినవారలు దస్యులనిపిలువఁబడుచుండినటుల శ్రుతి,స్మృతులవలనఁ దెలియుచున్నది. ఆర్యులైనను బ్రాహ్మణకర్మలనుబరిత్యజించి బ్రాహ్మణ సహాచర్యమును విడనాడిన క్షత్రియులు బహిష్కృతులై వృషలత్వము జెందినందున దస్యులని పిలువఁబడుచుండినటులమనుస్మృతినిఁబట్టియుస్పష్టముగఁదెలియుచున్నది.[1]ఇంతియ కాక విశ్వామిత్రునియాజ్ఞల నుల్లంఘించిన యాతనికుమారులు కర్మభ్రష్టులగుటంజేసి దస్యులుగాఁబరిగణింపబడినటుల ఐతరేయ బ్రాహ్మణమునందుఁ జెప్పంబడియున్నది.[2] భీష్ముఁడు యుధిష్ఠిరునకు రాజధర్మములను బోధించుపట్టునఁ గర్మభ్రష్టులగు దస్యుల ధనమును క్షత్రియుఁడు గ్రహింపఁదగదని బోధించియుండెను.

---

[1]Vide— మనుస్మృతి- 10 అ- 45 శ్లో.

[2]See— ఐయితరేయ బ్రాహ్మణత్వము- 7-18.

కావున దస్యులు హిందూదేశమునం దార్యజాతికిఁ బూర్వమం దుండు జాతివారు కారనియు, మొఁకుజాతివారు కారనియు, నార్యేతరులు కారనియుఁ గర్మభ్రష్టులగు నార్యులును, వారి సంతతివారును నై నటుల నార్యులచేఁ బిలువఁబడి యుండిరనియు గన్పట్టుచున్నది.

## దాసులు.

దాసులును దస్యులవంటివారే యైనటుల శ్రుతిస్మృతులనుబట్టి తెలియంబడుచున్నది. శ్రుతి, స్మృతి, పురాణముల జూచిన దస్యులను దూషించినవిధమున దాసులను దూషించి నటులఁ గన్పట్టదు. దాసులును ఆర్యసాంప్రదాయమయినటులఁ జెప్పఁబడియుండెనేగాని యార్యేతరులై నటుల నెచ్చటను జెప్పఁ బడి యుండలేదు.

## రాక్షసులు.

కర్మభ్రష్టులై క్రూరకర్మల నాచరించుచు లోకభీకరులై ఘోరమగు పాపకార్యములఁ గావించుచుఁ బ్రజలకు భీతికలుగు నటులఁ బ్రవర్తించుచుండినవారలను రాక్షసులుగఁ బరిగణింపఁ బడియుండినటుల శ్రుతి, స్మృతి, పురాణేతిహాసాదులనుబట్టి తెలియుచున్నది. వీరును దస్యులవలెనే యార్యులనుండి బహిష్కరింపఁబడి యుండినటులఁ దెలియనగును. తమకుఁ దామే రక్షణము సేసికొందుమని చెప్పుకొనుటచే రాక్షసులని పేరు కలిగియుండినటుల రామాయణమునందు జెప్పఁబడియున్నది.[1]

---

1 See. వాల్మీకిరామాయణము- 7-4-18.

యాస్కాచార్యులవారు "ఎవరిబాధలనుండి సర్వజనులు రక్షింపఁబడవలసియుండునో వారేరాక్షసులు" అని చెప్పియున్నారు.[1] వేదములందు రాక్షసులను భయంకరాకారులు, బ్రహ్మద్వేషులు, పాపకర్ములు, యజ్ఞద్వేషులు, నిరీశ్వరులు, క్షుద్రదైవముల నారాధించువారలని చెప్పఁబడియున్నది. వేదములందును, స్మృతులు, పురాణములు మున్నగువానియందును వీరింగూర్చి యట్లే చెప్పఁబడియుండెను గాని యార్యేతరులయినట్టు లెచ్చటను జెప్పఁబడియుండలేదు.

రామాయణమునందు రాక్షసరాజగు రావణుని "అనార్యుఁడని" వాల్మీకి చెప్పియుండుటచే రాక్షసులు ఆర్యేతరులని కొందఱభిప్రాయపడుచుండిరి. రావణునితండ్రి విశ్రవసుబ్రహ్మ. పితామహుఁడు పులస్త్యబ్రహ్మ. వీరు పవిత్రమగు బ్రహ్మర్షులు. ఆర్యులుగఁ బరిగణింపఁబడుచుండిరి. రావణుని చరిత్ర హైందవులందఱకును దెలిసియేయున్నది. బ్రాహ్మణకుమారుఁడగు రావణుఁడు గావించు క్రూరకర్మలవలన రాక్షసుఁడుగఁ బరిగణింపఁబడియుండెను. ఆర్యసాంప్రదాయసిద్ధమగు వేదవిదిత కర్మలను దూషించుచు భిన్నముగఁ బ్రవర్తించి యుండుటచే "అనార్యః" అని వాల్మీకి చెప్పియుండినటుల నెన్నవలసియుండునేగాని యార్యేతరుఁడనిగాని, యార్యజాతికంటె భిన్నమగు జాతీయుఁడనిగాని యుద్దేశించి చెప్పియుండలేదని యెంచఁదగియున్నది. వాల్మీకిరామాయణమును బరికించిచూచిన దుష్టా

---

1 See—నిరుక్తము- పూ. ష. 4-18,

త్ములై యార్యసాంప్రదాయములకు విరుద్ధముగ ధర్మాధర్మ వివేకరహితముగ దుష్కర్మల నాచరించెడి యార్యులనుసయిత మనార్యులని వాల్మీకి పేర్కొని యుండినటులఁ గన్పట్టును. దశరథమహారాజు తృతీయభార్యయగు కైకేయినిగూడ వాల్మీకి మహర్షి 'అనార్యే' అని తిట్టియున్నాఁడు. అంతమాత్రమున నార్యేతరులను భావమును గ్రహించుట కెంతమాత్రము నవకాశముఁ గన్పట్టదు. రాక్షసులు ఆర్యజాతిలోఁ జేరినవారలై నటుల వేదములయందే ప్రమాణములుగన్పట్టుచున్నవి. ఆర్యులు తాముగావించు యజ్ఞయాగాది క్రతువులకు భంగముఁగావించు క్రూరులగు రాక్షసాదులను నాశము గావించుమని యింద్రునిఁ బ్రార్థించు సందర్భమున,

"అనేకవిధముల మమ్ము హింసఁజేయు నీ ఆర్యజాతినుండి, యేయింద్రుఁడు మమ్ముఁగాపాడఁగలడో యట్టియింద్రునిఁ బ్రార్థించుచున్నాము" అని చెప్పఁబడియున్నది.[1]

మఱియు హైందవార్యుల వాఙ్మయమును బరిశీలన మొనర్చిన మూయరుపండితుఁ డీవిధమునఁ జెప్పియుండెను.

"I have gone over the names of Dasyus and Asuras etc., mentioned in the Rig-Veda, with a view of discovering whether any of them could be regarded as Non-Aryan or indegenous origin but I have not observed any that appear to be of this character"[2]

---

1 See—ఋగ్వేదము- 8-24-27.

2 See. Muir's Sanskrit Texts. Vol, II page 387.

"ఋగ్వేదమునందుఁ జేర్కొనఁబడిన దస్యులు, అసురులు మున్నగువారు ఆర్యేతర జాతులవారలా లేక ఆర్యులకుఁ బూర్వము హిందూదేశమున సహజముగఁ బుట్టిన యాదిమనివాసులాయని కనుగొనఁగోరినవాడనై దస్యులు, అసురులు, మున్నగువారి నామములును, వారిచరిత్రలును, సంపూర్ణముగఁ బరిశీలించి చూచితినిగాని వారట్టివారైనట్లు నాకేమియు నిదర్శనములు గాన్పింపలేదు. [1]

జర్మనీదేశీయుఁడగు రాథ్ (Mr. Rath) పండితు డీరీతిగాఁ జెప్పియుండెను.

"It is but seldom if at all that the explanation of Dasyu, Dasa &c., as referring to Non-Aryans the barbarians is advisable."

"దస్యు, దాసాదు లార్యేతరులనియు మొఱకుజాతుల వారనియుఁ గావించెడు వ్యాఖ్యాన మెంతమాత్రమును యోగ్యముగాదు."

వీని నన్నిటినిఁబట్టి చూచిన దస్యు, దాస, రాక్షసాదులు ఆర్యేతరజాతులవారు కారనియు, నార్యులలోఁజేరిన వారలేయనియుఁజెప్ప నొప్పుచున్నది. కావున మంగోలియనులు సిథియనుల సంతతివారగు తురేనియనులుగాని, తదితరులుగాని యితరదేశములనుండి హిందూదేశమునకు వలసవచ్చి యిట నివాసము లేర్పఱచుకొని యుండలేదనియు, నార్యులను వార లెచ్చటనుండియో వలసవచ్చి యిట నివాసమేర్పఱచుకొనిన

1 See- Muir's Sanskrit Texts-Vol II page 387

వారు కారనియుఁ బ్రాచీన హిందూదేశమునందుండు పలు తెగలవారలకు హిందూదేశమే జన్మభూమియనియు, నార్యులని పిల్వఁబడువారలు హిందూదేశజులేననియుఁ బ్రాచీన హైందవు లలో నొకతెగవారగు నాంధ్రులును హిందూదేశ జన్మవాసన గల ప్రాచీనహైందవులు లేక ఆర్యులు లేక ఇండియాదేశజుల సంతతివారలే సనియు, నితరదేశములనుండి హిందూదేశము నకు వలసవచ్చిన వారలుగాని వారి సంతతివారలుగాని కార నియు విశదమగుచున్నది. అటులేని ప్రాచీనకాలమున భరత ఖండమునం దేభాగ మాంధ్రదేశమైయుండెనో మనము తెలిసి కొనవలసి యున్నది.

## ఆంధ్రదేశము—ఆంధ్రము—తెలుఁగు.

ప్రాక్తనమున శ్రీకాకొలము, ధాన్యవాటి, ప్రతిష్ఠాన పురము లాంధ్రదేశమునకు రాజధానీ నగరములుగ నుండెనని చెప్పుచున్నారు. శ్రీకాకొలము ప్రస్తుతము కృష్ణామండలమున నున్నది. "ధాన్యవాటి" యనునది గుంటూరు మండలమునందలి సత్తెనపల్లితాలూకాలోని యమరావతి కొక మైలుదూరమున నుండిన "ధరణికోట" యై యున్నది. ప్రతిష్ఠానపురము నైజాముురాష్ట్రములోని "పైఠాణ్" యని చెప్పుచున్నారు. ఈ పట్టణముల క్రమమునుబట్టి చూచినచోఁ దూర్పు సముద్ర ప్రాంతమున "శ్రీకాకొలము" ను, దానికిఁ బశ్చిమముగ "ధాన్యవాటియు", ధాన్యవాటికిఁ బశ్చిమ దిశయందుఁ బ్రతిష్ఠానపురమును నుండినటులఁ గన్పట్టుచున్నది.

కృష్ణా గోదావరీనదులకు మధ్యనుండెడి ప్రదేశమునందలి తూర్పుభాగమే అనఁగా ప్రస్తుతకాలమునఁ గృష్ణామండలము, పశ్చిమ గోదావరి మండలములని బిలువఁబడు ప్రదేశమును, నైజాం రాష్ట్రమునందలి నలగొండ జిల్లాయును, ఓరుగల్లు జిల్లాలోని కొంతభాగమునుగలిసిన దేశభాగమే పూర్వమాంధ్రుల నివాసమని కొందరు చరిత్రకారు లభిప్రాయపడి యుండిరి. అంతియెగాక ఆనాఁడాంధ్రులు మగధదేశ ప్రాంతముల నుండినవారనియు, దరువాత వారు దక్షిణముగవచ్చి యిట నుండు ఆటవికులను జయించి యీదేశము నాక్రమించుకొని యుండిరనియు నాఁటినుండి యీదేశ మాంధ్రదేశమని పేర్కొనఁబడి యుండెననియుఁ గొందఱభిప్రాయము కలవారలై నటుల గన్పట్టుచున్నది. పాశ్చాత్యవిద్వాంసు లీయభిప్రాయమును దొట్టతొలుత సూచించియుండిరి. దానినే కొందఱు భారతీయ విద్వాంసు లామోదించియుండిరి. ఆంధ్రవంశపురాజులు మగధ యందుఁ బరిపాలన సల్పినటులఁ బురాణములు లోనగువాని యందుఁ జెప్పఁబడియుండుటయే వారట్టు లభిప్రాయపడుటకుఁ గారణంబయ్యెనని తోఁచుచున్నది. మఱియు నాసిద్ధాంతమును బ్రతిపాదించుపట్టున రామాయణ కథాకాలమున శ్రీరామచంద్రుఁడు వనవాసముచేయునపు డాతనిమార్గమున దక్షిణాపథంబున నాంధ్రదేశ ముండినటులఁ జెప్పఁబడి యుండలేదనియు, నయ్యది దండకారణ్యముగఁ జెప్పఁబడి యుండెననియు, భారత కథాకాలంబునఁ బాండవమధ్యముని తీర్థయాత్రావిధానమున నీయాంధ్రదేశమునుగుఱించి చెప్పఁబడియుండలేదనియు, నా

కారణమున రామాయణ భారత కథాకాలములయందు దక్షిణాపథమునం దాంధ్రదేశము లేదనియుఁ దరువాతికాలములందీ దేశమున కాంధ్రులు త్తరమునుండివచ్చి జయించి నివాస మేర్పఱుచుకొనుటచే నాంధ్రదేశమని పేర్కొనఁబడి యుండెననియు భావించియుండిరి. రామాయణమునందే కిష్కింధా కాండములో దక్షిణాపథమునందలి దేశములను వివరించు సందర్భమున నాంధ్రదేశప్రశంస గావింపఁబడి యుండెను. మహాభారతమునందును సభాపర్వములో యుధిష్ఠిరుని రాజసూయయాగ నిర్వహణమునకయి సహదేవుఁడు గావించిన దిగ్విజయ యాత్రావిధానమున నాంధ్రదేశమును, నాంధ్రులును దక్షిణాపథమున నుండినటులఁ జెప్పఁబడి యున్నది. [1] మఱియు భీష్మపర్వమున జంబూఖండ వినిర్మాణపర్వమునం దాంధ్రులయొక్కయు నాంధ్రదేశము యొక్కయు బ్రశంస గావింపఁబడియున్నది. [2] కావున రామాయణ భారత కథా కాలములయం దాంధ్రులును, నాంధ్రదేశమును దక్షిణాథము నందుండినటుల స్పష్టముగఁ జెప్పఁదగియున్నది.

శబ్దకల్పద్రుమమునం దుదాహరింపఁబడిన శక్తిసంగమ తంత్రమునఁ గనంబడు దేశనామావళిలో

"జగన్నాథాధూర్ధ్వభాగమర్వాక్ శ్రీభ్రమరాంబికాత్।
తావదంధ్రాభిదోదేశః॥"

1 మహాభారతము-సభాపర్వము-అధ్యా-31 శ్లో 72-73.

2 మహాభారతము-భీష్మపర్వము-అధ్యా-9 శ్లో ౪౧

అని యాంధ్రదేశమును,

"శ్రీశైలంతు సమారభ్య చోళేశాన్మధ్యభారతః ।
తైలంగదేశో దేవేశిధ్యానాధ్యయనతత్పరః॥"

అని తైలంగదేశమును నిర్దేశింపఁబడియుండెను. శ్రీశైలమున కుత్తరముగ జగన్నాథక్షేత్రమునకుఁ బైభాగము వఱకునుగల మధ్యదేశ మంధ్రదేశమనియు, శ్రీశైలమునకు దక్షిణముగఁ జోళప్రభువుల రాజ్యమువఱకుఁగల మధ్యదేశము తైలంగదేశమనియుఁ బిలువఁబడుచుండినటులఁ గన్పట్టుచున్నది. దీనింబట్టి యాకాలమునఁ బశ్చిమమున శ్రీశైలమునుండి యుత్తరమున జగన్నాథక్షేత్రము పైభాగమువఱకును దక్షిణమున శ్రీశైలమునుండి తూర్పునఁ గృష్ణానది తూర్పుసముద్రమున గలియు ప్రదేశమువఱకును సరళరేఖలు గీచిన యారేఖలకును నుత్తరమునఁ దెలివాహానదికిని దూర్పున సముద్రమునకును మధ్యనుండు ప్రదేశ మంధ్రదేశమనియు, శ్రీశైలమునుండి కృష్ణానది సముద్రముఁ గలియు చోటువఱకును గీచిన సరళరేఖకు దక్షిణముగఁ జోళరాజ్యమువఱకును నడుమంగల ప్రదేశము తైలంగదేశమనియుఁ బేర్కొనఁబడుచుండినటులఁ గన్పట్టుచున్నవి.

మత్స్యపురాణమున భారతవర్ష వర్ణనము గావింపఁబడియున్నది. అందు భరతవర్షమునఁ బ్రాగ్దక్షిణ పశ్చిమోత్తర భాగములయందును మధ్యభాగమునందుఁగల దేశములు వివరింపఁబడియున్నది. మధ్యభాగమునఁగల జనపథములను వర్ణించుపట్టున,

"శూరసేనాధకామ్భోజా
ఆన్ధ్రాశ్చైవ సబర్బరాః
మత్స్యాః కిరాతాః కుల్యాశ్చ
కాశీకున్తల కోసలాః ॥ 39 ॥
"అవన్త్యాశ్చాను లిఙ్గాశ్చ
మూకాశ్చైవాన్ధ్రకైస్సహా ।
మధ్యదేశ్యాజనపదాః
ప్రాయశః పరికీర్తితాః ॥40॥" *

అని చెప్పఁబడియుండెను. మఱియు విన్ధ్యవాస్తవ్యుల గుఱించి వివరించుచు నాంధ్రులు విన్ధ్యపర్వతమునకు దక్షిణభాగమున నుండువారలనియు చెప్పబడియున్నది. ‡ కాణ్వాయనుల యనంతరమున నాంధ్రులు మగధరాజ్యమును స్వాధీనపఱుచుకొని మహాసామ్రాజ్యము నేర్పాటుఁ గావించుకొని పాటలీపుత్త్రిమును రాజధానీనగరముగాఁ జేసికొని పరిపాలన సలిపియుండిరటులఁ బురాణములు వాకొనుచున్నవి.

వీని నన్నిటినిబట్టిచూడఁ దొలుత నాంధ్రదేశము శ్రీశైలమునుండి జగన్నాధక్షేత్రపై భాగమువఱకును గల సరళరేఖకును దూర్పున బంగాళాఖాతమునకును నడుమనుండు ప్రదేశమై యుండెననియు, నాకాలమున శ్రీకాకొళము ప్రధాన రాజధానీనగరమును, ధాన్యవాటి రెండవరాజధానీనగరమునునై

---

* మత్స్యపురాణము 118 అధ్యా. 39-40 శ్లో.

‡ మత్స్యపురాణము 118 అధ్యా, 56-60 శ్లో.

యుండెనని చెప్పఁదగియున్నది. తరువాతికాలమున నాంధ్రులు విజృంభించి పశ్చిమమున రాజ్యమును విస్తరించుకొనియుండిరనియు, నాకాలమునఁ బ్రధానరాజధానీనగరము రాజ్యమధ్యమున నుండుటకయి ధాన్యవాటికి (ధరణికోటకు) మార్పఁ జేసికొని యుందురనియుఁ గ్రమక్రమముగఁ దమదేశమును నాంధ్రులు వింధ్యపర్వతప్రాంతములవఱకును వ్యాపింపఁజేసికొని యుండిరనియు, నాకాలమునఁ బ్రతిష్ఠానపురమునుగూడ నొక రాజధానినగరముగఁ జేసికొని పరిపాలన మొనర్చియుందురనియు జెప్పఁదగియున్నది. ఆ ప్రకారమే యేకాలములందు జరగి యుండినది స్పష్టముగఁ దెలియుటలేదు. కాని పురాణములు చెప్పఁబడుకాలమునాఁటికి వింధ్యపర్వతములవఱకు వ్యాపించి యుండెననియే స్పష్టముగఁ జెప్పఁదగియున్నది. కాణ్వాయనులలోఁ జిట్టచివరివాఁడగు సుశర్మను సంహరించి పాటలీపుత్త్రమును స్వాధీనపఱుచుకొని మగధయం దాంధ్రరాజుల పరిపాలనమును నెలకొల్పిన శ్రీముఖశాతకర్ణి ప్రతిష్ఠానపురమును బరిపాలించుచుండిన శాతవాహనవంశజుండని చెప్పఁబడియుండుటనుబట్టి యానాఁటికి శాతవాహనవంశజులు ప్రతిష్ఠానపురమును రాజధానిగాఁ జేసికొని యాంధ్రదేశమును బరిపాలించుచుండినటులఁ గన్పట్టుచున్నది. మఱియు నాంధ్రమహాసామ్రాజ్యమునకుఁ బాటలీపుత్త్రము ప్రధాన రాజధానీనగరముగను బ్రతిష్ఠానపురమును ధాన్యవాటియుఁగూడ సహాయ రాజధానీనగరములుగా నుండినటులఁ గన్పట్టుచున్నది. ఈ విషయములు ముందు ప్రకరణములయందు విపులముగఁ జర్చింపఁబడును.

దాక్షారామము, శ్రీశైలము, కాళేశ్వరములను క్షేత్రములయందుండు శివలింగములు మూఁడింటికి మధ్యనుండు ప్రదేశము త్రిలింగదేశమని పిలువఁబడుచుండినటులఁ గన్పట్టుచున్నది. క్రీ. శ. పదుమూఁడవ శతాబ్దాంతమందుండిన విద్యానాథ మహాకవి

"యైర్దేశస్త్రిభిరేష యాతి మహతీం ఖ్యాతిం త్రిలింగాఖ్యయా।
యేషాం కాకతిరాజకీర్తివిభవైః కైలాస శైలాః కృతాః।
తే దేవాః ప్రసరత్ప్రసాదమధునా శ్రీశైల కాళేశ్వర।
ద్రాక్షారామ నివాసినః ప్రతిదినం త్వచ్ఛ్రేయసే జాగ్రతు॥" 1

అని చెప్పియున్నాఁడు. ఈనాటకమునకుఁ గుమారస్వామి సోమయాజి,

"త్రయోలింగరూపాః శ్రీశైలనాథాదయో దేవా।
యస్మిన్ దేశే త్రిలింగోఽఽంధ్రదేశ, ఇత్యర్థః॥"

అని వ్యాఖ్యానము సేసియుండిరి. క్రీ. శ. పదునేఁడవ శతాబ్దమునందుండిన కాకునూర్యప్ప కవియును,

"కం॥ శ్రీక్షితి ధరకాళేశ
దాక్షారామంబులనఁగఁ దనరారెడు నీ
త్రిక్షేత్రంబుల లింగము
లీక్షితిని త్రిలింగసంజ్ఞ నెన్నిక కెక్కెన్॥"

1 ప్రతాపరుద్రీయం. పంచమాంకము. శ్లో.

"గీ॥ తత్త్రిలింగ నివాసమై తనరుకతన
నాంధ్రదేశంబు దా( ద్రిలింగాఖ్యమయ్యె,
దెలుఁగనుచుఁ దద్భవము దానివలనఁ గలిగె,
వెనుకఁ గొందఱు దానినే తెనుఁగనందురు॥"

అని చెప్పియుండెను. వీనింబట్టి సూచిన త్రిలింగక్షేత్రమధ్యస్థమగు దేశము త్రిలింగదేశమని బిలువఁబడుచుండినటులఁ గన్పట్టుచున్నది. ఈ త్రిలింగము లాంధ్రదేశమునఁ గలవు. "సూక్ష్మదృష్టితోఁ బరిశీలించినయెడల నంధ్రదేశమునందీ మూఁడు లింగములు వెలసియుండుటవలనఁ ద్రిలింగదేశమను సంకేతమేర్పడియెఁగాని యీత్రిలింగక్షేత్ర మధ్యస్థమయిన దేశము మాత్ర మంధ్రదేశమని తలంప నవసరము గానరాదు" అని శ్రీ మహోపాధ్యాయ ఆచంట వేంకటరాయసాంఖ్యాయనశర్మగారు చెప్పియుండిరి.[1] మఱియు "అప్పకవి చెప్పినట్లు "త్రిలింగ" శబ్దతద్భవము—"తెలుఁగు"—అని యంగీకరించుట కవకాశమేమియుఁ గానరాదుగాని "తెలుఁగు" శబ్దమునకు సంస్కృతీకృత తద్ధితరూపముగా శక్తిసంగమ తంత్రకారుఁడు 'తైలంగ' శబ్దము ప్రయోగించెనని యూహింపఁదగియున్నది" అనియుఁ జెప్పియుండిరి. వీరియూహ సమంజసముగ గన్పట్టుచున్నది. కాని యెట్టులూహించినను త్రిలింగక్షేత్రములు గలిగియుండుటచే నంధ్రదేశము త్రిలింగదేశమనియుఁ దెలుఁగు దేశమనియుఁ బేర్కొనఁబడుచుండినటులఁ

---

1 శారద Vol. II P 5.

గన్పట్టుచున్నది. అయ్యదియు శ్రీశైలమునకుఁ బ్రాగ్భాగము నందుండు దేశమునకే వర్తించుచున్నది. దీనింబట్టి యాంధ్రి మహాసామ్రాజ్య మస్తమించినవెనుక యీప్రదేశముమాత్రమే యాంధ్రదేశముగఁ బరిగణింపఁబడి యుండెననియు, లేదా ప్రథమమున నియ్యదియే యాంధ్రదేశముగ బరిగణింపబడియుండె ననియు, నూహింపఁ దగియున్నది.

త్రిలింగ దేశాధీశులు కళింగదేశమందలి ప్రాగ్దక్షిణభాగమునుజయించి తమరాజ్యమునం గలుపుకొని రాజ్యమును విస్తరింపించుకొని యుండిరనియు, నట్టియెడ నాకళింగదేశభాగమును "త్రిలింగకళింగము" అని పేర్కొనియుండు రనియు, నయ్యదియే క్రమక్రమముగఁ ద్రికళింగమని పేర్కొనఁబడి యుండెననియుఁ జెప్పఁదగియున్నది.

త్రిలింగదేశస్థుల భాష తెలుఁగనియుఁ దెనుఁగనియుఁ బేర్కొనఁబడియుండెను. ఆంధ్రదేశస్థులభాష గావుననాంధ్రమనియుఁ బేర్కొనఁబడియుండెను తెలుఁగు బాసనే యాంధ్రమని పిలువఁబడుచుండుటను జూడఁ బ్రథమమున నాంధ్రదేశము తెలుఁగు మాతృభాషగాఁగల ప్రజలు నివసించెడి దేశభాగమై యుండెనని విదితమగుచున్నది. అయ్యది శ్రీశైలమునకును దూర్పుసముద్రమునకును మధ్యనుండు ప్రదేశమని స్పష్టముగఁ జెప్పనొప్పును.

ఓం.

# ఆంధ్రమహాసామ్రాజ్యము

—:౦:—

## ద్వితీయాశ్వాసము.

### ఏకాలమునుండి యాంధ్రులును నాంధ్రదేశమును ప్రశంసింపఁబడియున్నది.

భరతఖండమే యార్యులకు జన్మభూమియనియు, దస్యు దాస, రాక్షసాది జాతులవా రార్యేతరజాతులవారు కారనియు, భరతఖండమునందలియార్యుల సంతతిలోఁ జేరినవారలేయనియు, నాంధ్రులును భరతఖండము జన్మభూమిగాఁగల యార్యుల సంతతివారలేయనియు, నాంధ్రుల పూర్వికులగు హైందవు (ఇండియా దేశవాసు)లితర భూభాగములనుండి భరతఖండము నకు వలసవచ్చినవారలుకాగనియు గత ప్రకరణమునఁ దెలిసి కొని యుంటిమి. ప్రాచీనార్యులు లేక హైందవులు లేక ఇండి యా దేశస్థుల సంతతిలో నొకశాఖవా రాంధ్రులన పేరితో నెప్పటినుండి వ్యవహరింపఁబడుచువచ్చినది తెలిసికొనుట యన వసరముకాదు. ఆంధ్రులప్రశంస భారత కథాకాలమునందును,

రామాయణ కథాకాలమునందును, వేదకాలమునందునుజేయఁ బడియున్నది.

రామాయణ కథాకాలము క్రీస్తుకుపూర్వము 15 వ శతాబ్ద ప్రాంతమునను, భారత కథాకాలము క్రీ. పూ. 12 వ శతాబ్దప్రాంతమునను జరగియుండునని సహేతుకములగు దృష్టాంతములను గనఁబఱుపకనే తమయూహాపోహలచేఁ గుతర్కములఁ గావించుచు సర్ విల్లియం జోన్సు, కర్నల్ విల్ఫర్డు, విల్సన్ మున్నగు పాశ్చాత్యవిద్వాంసులు ప్రాదిపతికవేసి చెప్పియుండిరి. క్రైస్తవ మతగ్రంథమగు బైబిలునందుఁ జెప్పఁబడిన సందర్భములనుబట్టి సృష్టిక్రమము క్రీ. పూ. షుమారు నాలుగువేల వత్సరములకంటె వెనుకకు నడచుటలేదు. భారత రామాయణ కథాకాలములను గుఱించి విపరీత సిద్ధాంతములను బ్రతిపాదించిన పాశ్చాత్యపండితులెల్లఱును క్రైస్తవమతావలంబులై యుండిరి. వారు భారతీయుల వాఙ్మయమును బరిశోధనలు సల్పితిమనుచుండిరి. నిష్పక్షపాతబుద్ధితో న్యాయముగ భారతీయుల వాఙ్మయమునను సరించి సృష్టికాలపరిమితిని పరిగణనముచేసిన బైబిలులోఁ జెప్పఁబడిన సృష్టికాలపరిమితిలోని ప్రతిక్షణమును వత్సరములుగ లెక్కించినను హైందవులచేఁజెప్పఁబడిన సృష్టికాలపరిమితి పెక్కుకోట్లవత్సరములు వెనుకకుఁబోవును. అద్దానినంగీకరించిన హైందవుల నాగరక-మత-చరిత్ర-వైభవములు లోనగునవి పాశ్చాత్యదేశీయుల చరిత్రకంటెఁ బెక్కు కోట్ల వత్సరములకుఁ బూర్వమే ప్రపంచచరిత్రయందు బెక్కుడు ప్రాముఖ్యతను వహించియుండినటులఁ గన్పట్టును. బైబిలులో చెప్పఁ

బడిన సృష్టికాలపరిమితియే సరియైనటుల నిర్ధారణము గావించు కొని అట్టి స్వల్పకాలపరిమితిలో హైందవుల చరిత్రను సరిపుచ్చు టకుఁ బ్రయత్నించి యట్లు గావించుట కసంభవముగఁ గన్పట్టుటచే హైందవార్యుల వాఙ్మయమునందా విషయము లెక్కు డతిశయోక్తులతో నింపఁబడి యుండెననియు, వానిని విశ్వసింపఁ దగదనియు, కుతర్కములఁ గావించుచుఁ గాకులలెక్కగా గణితములు వేయుచు నిరాధారములగు నూహాపోహల వెదఁజల్లుచు భారతీయుల చరిత్రాంశముల కాలములను సృష్టిఁజేసి చరిత్ర నల్లసాఁగిరి. హైందవుల పురాణములు మున్నగు వాఙ్మయమునందుఁ జెప్పఁబడిన రాజవంశముల కాలపరిమితులును, ఆయా వంశములంగల రాజన్యుల పరిపాలనా కాలపరిమితులును, అధికముగాఁ జెప్పఁబడియుండెనఁట ! విశ్వసింపఁ దగవఁట ! బైబిలులో అబ్రహాము మొదలగువారలు పెక్కువందల సంవత్సరములు జీవించియుండి పరిపాలనము లొనర్చియుండిరనియుఁ జెప్పిన విషయముల కేమి సమాధాన మొసంగుచుండిరి? క్రైస్తవ మతగ్రంథమగు బైబిలులోఁ జెప్పఁబడిన జీవితపరిమాణములు సరియైనవని నమ్మినచో నట్టి పూర్వరాజన్యులకుఁ జెప్పఁబడిన స్వల్పకాల జీవితపరిమాణము లేల విశ్వసింపఁగూడదో? అట్టి కాలపరిమితి యెట్లు లసంభవమో గ్రహింపఁజాలకున్నారము. ఆ విషయములన్నియు బ్రసక్తాను బ్రసక్తముగఁ జర్చింపఁబడును.

## సృష్టికాలపరిమితి—భూగర్భశాస్త్రపరిశోధనము.

ఇటీవలికాలమునఁ బాశ్చాత్య భూగర్భశాస్త్రజ్ఞులు సృష్టి కాలనిర్ణయ మెట్లుగావించియుండిరో కనుఁగొందము.

సృష్ట్యాదియం దీభూభాగము కరుగఁబడిన ముద్దవలెఁ బెక్కువేల వత్సరములుండియుండెననియు, నా తరుణమున స్థలజల వాయువు లతివేఁడిగ నుండుటచే జీవరాశి నివసించుట కనర్హముగ నుండెననియుఁ గాలక్రమమున నయ్యది చల్లపడి ఘనీభవించి జీవకోటికి వాసయోగ్యమయ్యెననియుఁ జెప్పియుండిరి. భూప్రదేశమట్లు గ్రావరూపముగ నుండు కాలమునకు "అజాయిక్ యుగము" (Azoic Age) అని పేరిడియుండిరి. భూమి ఘనీభవించి గట్టిపడిన పిదపఁ గ్రమముగ నోషధులు, జల వనచరములు, మనుష్యులు జన్మించినట్లును జెప్పుచున్నారు. సృష్టిపరిణామవాదులుగూడ నిదేవిధముగ మత్స్య, కూర్మ, వరాహ, వానరములు వరుసక్రమముగఁ బరిణామమంది మానవుత్పత్తియైనటులఁ జెప్పుచున్నారు. హైందవులచేఁ బేర్కొనఁబడు విష్ణువుయొక్క దశావతారముల వరుసక్రమ మాసిద్ధాంతమును బలపఱచుచున్నటులఁ గొందఱు సెప్పుచున్నారు. భూమి గట్టిపడి యేర్పడిన భూసారములను, ధాతుసారములను, భూశకలములను బరిక్షచేసి భూసృష్టికాలమును సిలూరియన్ యుగము (Silurian Epoch) కాంబ్రియన్ యుగము (Cambrian Epoch) లారెంషియన్ యుగము (Laurentian Epoch) లను మూఁడు యుగములుగ విభజించియున్నారు. భూశకలములం

దలి మొదటి 22,000 అడుగుల వఱకు సిలూరియన్ యుగ మనియుఁ బిదప 18,000 అడుగులు కాంబ్రియన్ యుగ మనియు, నాతరువాత 30,000 అడుగులు లారెంషియన్ యుగమనియు విభజించి యుండిరి. ఆయుగములం దొక్కొక్క యుగముమారి మఱియొక యుగము యొక్క స్థితిని బొందుటకు 20 (యిరువది) కోట్ల వత్సరముల కాలపరిమితి పట్టునవియుఁ జెప్పుచుండిరి. ఇట్టి సిద్ధాంతములనుబట్టి చూచిన సృష్ట్యారంభ కాల మిప్పటి కఱువదికోట్ల వత్సరములకంటె నెక్కువ కాల మైనటులఁ గన్పట్టుచున్నది. సృష్టికాలపరిమితి నిర్ణయమును గుఱించి భూగర్భశాస్త్రజ్ఞులలోఁగూడ యభిప్రాయ భేదము లున్నటులఁ గన్పట్టెడి. రెండవయుగమగు కంబ్రియన్ యుగము ప్రారంభమయి యిప్పటికి షుమారు 7 కోట్ల సంవత్సరము లైయుండునని ప్రొఫెసరు వాల్కాట్టు (Prof. Walcott) పండితుఁడు చెప్పియుండెను. ప్రొఫెసర్ మేక్గీ (Prof. McGee) పండితుఁడు కంబ్రియన్ యుగము ప్రారంభ మయి యిప్పటికి దాదాపు 60 (అరువది) కోట్ల వత్సరములపై కాల మయియుండునని చెప్పియుండెను. డాక్టరు క్రోలు (Dr. Croll) మున్నగువారలు తుదకుఁ దటస్థించిన హిమ ప్రళయ మిప్పటికి దాదాపు 240,000 సంవత్సరముల క్రిందట జరగియుండెననియు, గత ముప్పదిలక్షల వత్సరములలో మున్మూరట్టి కాలవైపరీత్యములు కలిగియుండెననియుఁ బ్రథమమున 170,000 వత్సరములకును, నాపిదప 260,000 వత్స రములకు రెండవమారును, అటుతరువాత 160,000 వత్సరము

లకు మూఁడవమారును అట్టికాలవైపరీత్యములు గలిగియుండె ననియు, మూఁడవసారి కాలవైపరీత్యము కలిగి యిప్పటికి 80,000 వత్సరములు గడచియుండుననియుఁ జెప్పియుండిరి. పూర్వము స్కాట్లండు దేశమునఁ గలిగిన హిమప్రళయమునకు ముందు మానవులుండినట్లు భూమిలోనుండి త్రవ్వి యెత్తఁబడిన శిలారూపకమగు జంతుశకలములయందు మానవకళేబర చిహ్నములు గానవచ్చుచున్నవనియు, గత హిమప్రళయకాల మిప్పటికి 240,000 వత్సరములకిందట జరగియుండుననియు ప్రొఫెసరు, డబ్ల్యు, డ్రేపరు (Prof. W. Draper) పండితుఁడు చెప్పియుండెను. పాశ్చాత్య సిద్ధాంతముల ననుసరించి పరిశోధనలు సల్పిన పాశ్చాత్య భూగర్భశాస్త్రజ్ఞులే (Geologists) సృష్ట్యారంభ మిప్పటికిఁ బెక్కులక్షలు, కోట్లు వత్సరము లయినటుల నిర్ణయించియుండిరి. అట్టి సిద్ధాంతములనుబట్టియే బైబిలు నందుఁ జెప్పఁబడిన సృష్టికాలపరిమితి సరియైనదిగాదని స్పష్టపడుచున్నది. శాస్త్రీయంబగు (Scientific) పరిశోధనలు గావించి పాశ్చాత్య భూగర్భశాస్త్రజ్ఞులే సృష్ట్యారంభకాలము పెక్కులక్షలు, కోట్లు వత్సరములయి యుండుననని నిర్ధారణచేసి చెప్పుచుండఁగా హైందవుల (భారతీయుల) పురాణాది వాఙ్మయము నందుఁ జెప్పఁబడిన సృష్టికాలపరిమితి సిద్ధాంతములను ద్రోసిరాజనుచుఁ బాశ్చాత్య చరిత్రకారులచే నూహించి చెప్పఁబడిన సిద్ధాంతములతో భారతదేశ చరిత్రాంశముల కాలనిర్ణయమును గావించుట కడుంగడు శోచనీయము.

## హైందవుల సృష్టికాలపరిమితి—ప్రస్తుత కలియుగ ప్రారంభకాలము.

ఇఁక హైందవులచేఁ జెప్పఁబడిన సృష్టికాల నిర్ణయ సిద్ధాంతముల గనుఁగొందము. హైందవులు కాలపరిమాణాదులను మనుస్మృత్యాది స్మృతులయందును, సిద్ధాంత గ్రంథముల (Astronomical works) యందును, బురాణములు మున్నగువానియందును జెప్పియుండిరి. ఆకాలమానములను (Time-Tables) సంప్రదాయసిద్ధముగ భరతఖండమునవాడుచుండిరి. వాని ననుసరించియే భారతీయుల వాఙ్మయమునందు అనఁగా—శ్రుతి, స్మృతి, పురాణేతిహాసాదులయందు—భారత దేశచరిత్రాంశముల కాలనిర్ణయాదులు చెప్పఁబడియుండెను. హైందవుల శ్రుతి, స్మృతి, పురాణేతిహాసాదులును, జ్యోతిష సిద్ధాంత గ్రంథములును, అహోరాత్రములు మాసములు, వత్సరములు మున్నగువాని పరిమాణములీ విధముగఁజెప్పుచున్నవి.

| స్మృత్యాదుల ననుసరించి. | జ్యోతిషసిద్ధాంతముల ననుసరించి. |
|---|---|
| 18 రెప్పపాట్లకాలము=1 కాష్ఠ | 6 ప్రాణములకాలము=1 విగడియ |
| 30 కాష్ఠల ,, =1 కళ | 60 విగడియలు ,, = 1 గడియ |
| 30 కళలు ,, =1 ముహూర్తము | 60 గడియలు ,, = 1 అహోరాత్రము |
| 30 ముహూర్తములు=1అహోరాత్రము | |

ఈ అహోరాత్రమే యొక మానవదినమని చెప్పఁబడియున్నది.

30 అహోరాత్రములు = 1 మానవమాసము

15 అహోరాత్రములు = పక్షము (శుక్లపక్షము లేక కృష్ణపక్షము)

(ప్రతి చాంద్రమాసమునందును శుక్లపక్షము మొదలు.)

2 పక్షములు లేక 1 మానవమాసము = పితృదేవతల లోక అహోరాత్రము (శుక్లపక్షము పగటికాలము కృష్ణపక్షము రాత్రికాలము)

12 మానవమాసములు = 1 మానవ సంవత్సరము లేక దేవతలలోక యహోరాత్రము.

6 మానవమాసములు = 1 ఆయనము

6 మానవమాసములు (పుష్యమాసము మొదలు జ్యేష్టమాసము వరకు.) = ఉత్తరాయనము లేక దేవతలకు పగటికాలము

6 మానవమాసములు (ఆషాఢమాసము మొదలు మార్గశిరమాసము వరకు) = దక్షిణాయనము లేక దేవతలకు రాత్రికాలము

30 మానవ సంవత్సరములు = దేవతలలోక మాసము.

12 దేవమాసములు = 1 దివ్యవర్షము లేక దేవవత్సరము

4800 దివ్యవర్షములు లేక దేవవత్సరములు (ఇందు యుగసంధి సంధ్యాంశ కాలములుచేరియున్నవి) = కృతయుగము

3600 ,, ,, = త్రేతాయుగము

2400 ,, ,, = ద్వాపరయుగము

1200 ,, ,, = కలియుగము

12000 దేవవర్షములు = 1 దేవయుగము లేక మానవమహాయుగము.

1000 దేవయుగములు = బ్రహ్మలోక పగటికాలము

1000 దేవయుగములు = బ్రహ్మలోక రాత్రికాలము

అట్టి 30 అహోరాత్రములు = బ్రహ్మలోక మాసము

12 బ్రహ్మమాసములు = బ్రహ్మలోక సంవత్సరము
100 బ్రహ్మవత్సరములు=బ్రహ్మజీవితము లేక బ్రహ్మకల్పము.

కృత, త్రేత, ద్వాపర. కలియుగములుచేరినకాలము చతుర్యుగమనియు, మహాయుగమనియుఁ దేవయుగమనియుఁ జెప్పఁబడుచున్నది. కృతయుగమునకు 4800, త్రేతాయుగమునకు 3600, ద్వాపరయుగమునకు 2400, కలియుగమునకు 1200 దేవవర్షముల పరిమితి నిర్ణయించియుండిరి. అనఁగా నాలుగు యుగములు చేరినకాలము 12,000 దేవవర్షములు. ఆకాలము దేవయుగమని పిలుపఁబడుచున్నది. అట్టిదేవయుగములు 1000 చేరి బ్రహ్మలోక పవలగుచున్నది. అంతకాలమే రాత్రియగుచున్నది. 12 మానవమాసములు లేక యొకమానవ సంవత్సరము దేవతలకొక యహోరాత్రమగునని చెప్పఁబడి యుండుటచే నొకొక్క దేవవత్సరము మానవులకు 360 సంవత్సరముల కాలమగుచున్నది. కావున బ్రహ్మలోకదినము (అహోరాత్రముల) కాలపరిమితి యెంతయగునో కనుఁగొందము.

| యుగము. | దేవవర్షములు. | మానవవర్షములు. |
|---|---|---|
| 1 కృతయుగము. | 4800 | 17,28,000 |
| 2 త్రేతాయుగము. | 3600 | 12,96,000 |
| 3 ద్వాపరయుగము. | 2400 | 8,64,000 |
| 4 కలియుగము. | 1200 | 4,32,000 |
| 1 మహాయుగము లేక దేవయుగము. | 12,000. | 43,20,000. |

[1] Vide—మనుస్మృతి. అ I శ్లో 64-74.

కావున బ్రహ్మయొక్క పగటికాలపరిమితి 1000 దేవయుగములనియు నంతియే పరిమితి రాత్రికాలమనియు చెప్పఁబడి యుండుటచే బ్రహ్మయొక్క యహోరాత్రములు 1000 × 2 మహాయుగములు లేక 2,40,00000 దేవవర్షములు లేక 864,00,00,000 మానవ సంవత్సరము లగుచున్నది.

"శ్లో॥ యత్ ప్రాగ్ద్వాదశ సహస్రముదితం దైవికంయుగమ్ ।
తదేకసప్తతిగుణం మన్వంతర మిహోచ్యతే॥"[1]

అని మనుస్మృతియందును,

"యుగానాంసప్తతిః సైకామన్వంతర మహోచ్యతే"

యని సూర్యసిద్ధాంతమునందును చెప్పఁబడి యుండుటచే పన్నెండువేల దైవికవత్సరములుగల దైవికయుగము డెబ్బది యొక్కమారులు దిరిగివచ్చిన యొక మన్వంతరమగుచున్నది. అనఁగా 8,52,000 (71 × 12000) దేవవర్షములు లేక 30,67,20,000 (71 × 43,20,000) మానవాబ్దము లొక మన్వంతరకాలమగుచున్నది.

హైందవులు ప్రతిదినమును దాము వైదికలౌకిక కర్మలను గావించునపుడు విధాయకముగ దేశకాలసంకీర్తనము గావించుచు సంకల్పమును జెప్పుకొనుచున్నారు. హిందువులు సంప్రదాయముగఁ బ్రతిదినము చెప్పుకొనుచుండు సంకల్పమున నీకాలసంకీర్తనము చేయుచున్నారు.

---

[1] మనుస్మృతి- అధ్యా I శ్లో. 79

"శ్రీమహావిష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య, అద్యబ్రహ్మణః, ద్వితీయ పరార్థే, శ్వేతవరాహకల్పే, వైవస్వతమన్వంతరే, అష్టావింశన్మహాయుగే కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, మేరోః దక్షిణదిగ్భాగే శ్రీశైలస్య ... ... ప్రదేశే ... ... అస్మిన్ వర్తమానేన వ్యావహారిక చాంద్రమానేన...వత్సరే...అయనే...ఋతే... మాసే......పక్షే......తిథౌ...వాసరే...నక్షత్రే......యోగే.... కరణే... * * *"

కాలసంభావనుంబట్టి ప్రస్తుతము బ్రహ్మయొక్క ద్వితీయ పరార్థమునందు, శ్వేతవరాహకల్పములో, వైవస్వతమన్వంతరమున 28వ మహాయుగములందలి కలియుగముయొక్క ప్రథమపాదము జరుగుచున్నటులఁ దెలియుచున్నది.

బ్రహ్మకు నాయుర్దాయము 100 బ్రహ్మవత్సరములై యుండెను. ఆ కాలము రెండుభాగములుగ విభజింపఁబడి యుండెను. అందు మొదటిభాగము 50 సంవత్సరములు ప్రథమ పరార్థమనియు రెండవ 50 సంవత్సరములు ద్వితీయపరార్థమనియుఁ బేర్కొనఁబడుచుండెను. బ్రహ్మమానమునందలి దినము లొక్కొక్కటి యొక్కొక కల్పముగఁ బేర్కొనఁబడు చున్నది. అందు శ్వేతవరాహకల్పము ప్రథమదినమయి యుండెను.[1] దీనింబట్టి బ్రహ్మయొక్క ఆయుర్దాయము 51వ సంవత్సరములో ప్రథమదినము జరుగుచున్నటుల బోధపడు చున్నది. బ్రహ్మగారికి ఆయుర్దాయములో ప్రతిరోజును "స్వాయంభువ, స్వారోచిష, ఉత్తమ, తామస, రైవత, చాక్షుస, వైవస్వత, సావర్ణి, బ్రహ్మసావర్ణి, దక్షసావర్ణి, రుద్ర

---

1 మత్స్యపురాణము - అధ్యా- 289.

సావర్ణి, ధర్మసావర్ణి, భౌమ, భౌత్య" అను పదునాలుగు మన్వంతరములు జరుగుచుండును. బ్రహ్మయొక్క యీ ప్రథమదినమున నాఱు మన్వంతరములు గడచి యేడవ మనువగు వైవస్వతమనువుకాలములో 27 మహాయుగములు గడచి 28 మహాయుగమునందు కలియుగకాలమునఁ బ్రస్తుతము 5030 సంవత్సరము జరుగుచుండెననియు విదితమగుచున్నది. ఇదివఱకాఱుమన్వంతరముల కాలము గడచియుండినటులఁ జెప్పబడియుండుటచే (306720000 × 6) 184,03,20,000 మానవవత్సరములు గడచియుండెననియుఁ బిమ్మట యేడవమనువగు వైవస్వతమనువుకాలములో 27 మహాయుగములు అనఁగా (27 × 4320000) 116640000 మానవాబ్దములు జరగి 28 వ మహాయుగములోని కలియుగమునందుఁ బ్రస్తుతము కలియుగము 5030 మానవాబ్దములు జరుగుచుండెననియుఁ జెప్పఁబడుచున్నది.

| | | | |
|---|---|---|---|
| ఆర్వురు మనువుల కాలము | ... | 184,03,20,000 | మానవాబ్దములు |
| సప్తమ మనువగు వైవస్వతమనువు కాలములో 27 మహాయుగముల కాలము | | 11,66,40,000 | |
| 28 మహాయుగమునందలి కృతయుగ కాలము | | 17,28,000 | ,, |
| త్రేతాయుగకాలము | ... | 12,96,000 | ,, |
| ద్వాపరయుగకాలము | ... | 8,64,000 | ,, |
| కలియుగకాలమునందలి ప్రస్తుతాబ్దమువరకు జరగిన వత్సరములు | ... | 5,030 | ,, |
| మొత్తము | | 196,08,53,030 | ,, |

ఈ కాలపరిమితినిఁబట్టి బ్రహ్మయొక్క 51 వ సంవత్సరము ప్రథమదినముగాం దిప్పటికి 196,08,53,030 సంవత్సరములు గడచినటులఁ గన్పట్టుచున్నది. హైందవుల పురాణాది గ్రంథములనుబట్టి బ్రహ్మయొక్క దినాంతమున నొక్క బ్రహ్మప్రళయమును, నొక్కొక మన్వంతరమున నొక్క మహాప్రళయమును, నొక్కొక మహాయుగాంతమున నొక్క యుగప్రళయమును గలుగుచుండునటులఁ దెలియుచున్నది. వైవస్వతమన్వంతరమునసే యిప్పటికి 27 యుగప్రళయములు సంభవించినటులఁ గన్పట్టుచున్నది. బ్రహ్మయొక్క ఆయుర్దాయ కాలమున బ్రతిదినమును 1000 ప్రళయములు సంభవించునటులఁ గన్పట్టుచున్నది. ఇంతవఱకు బ్రహ్మయొక్క ఆయుర్దాయమగు 50 సంవత్సరముల లో $(1000 \times 360 \times 50) + (6 \times 71) + 27 = 18000453$ ప్రళయములు కలిగియుండెనని చెప్పఁదగియున్నది. అందు 18000 బ్రహ్మాండప్రళయములు జరిగియుండినటులను ఒక్కొక బ్రహ్మాండ ప్రళయమునకు మధ్య 432,00,00,000, మానవాబ్దముల కాలపరిమితి యుండినటులను గన్పట్టుచున్నది. ఇట్టి బ్రహ్మకల్పము లిదివఱకెన్ని గడచియుండెనో? ఈ కాలనిర్ణయము క్రీస్తుశకమునకుఁ బూర్వము షుమారు నాలుగువేలసంవత్సరములకంటె నధికముగాని సృష్టికాలపరిమితిని నిర్ధారణచేసికొని, యెన్నియోకోట్ల సంవత్సరములక్రిందట నేర్పడిన సృష్ట్యాది నుండి చెప్పఁబడిన హైందవుల చరిత్రను స్వల్పకాల పరిమితి యగు నారువేలవత్సరములలో నిమిడ్చి భారతీయుల చరిత్రను వ్రాయఁదలఁచిన నెటుల సమన్వయమగును? భారతీయుల సృష్టి

కాలవిధానము పాశ్చాత్య చరిత్రకారులను విభ్రమచేతస్కు
నొనర్చియుండెననుటకు సందేహములేదు.

హైందవుల యాసృష్టికాల నిర్ణయగణితములను జూచి
హాల్హెడు పండితుడు

"To such antiquity the mosaic creation is but as yesterday and to such ages the life of Methusulah is no more than a span."

"అట్టి ప్రాచీనతయెదుట మన మోసెసుసృష్టి నిన్న
మొన్నటిది మాత్రమే యైయున్నది. ఆ యుగముల గణన
మున మన 'మెథూసిలా' జీవితము బెత్తెడుకంటె మించదు"

అని విభ్రమము జెందియుండెను. హైందవుల యాసృష్టికాల
విధానమునుజూచి సర్ మానియల్ విల్లియమ్సు పండితుడు

"The Europeans accustomed as they are to a limited horizon, will find this vast antiquity bewildering. Billons surely are incredible to ears accustomed to a scale, the highest note of which rises no higher than 6000 years. But matters are improving and even these souls will in time come out into a world in which centuries will be replaced by melliniums."

"స్వల్ప పరిమితిగల కాలవిధానమునకలవడిన యూరపు
దేశీయు లీయగణ్యంబగు ప్రాచీనతను జిత్తవిభ్రమముతో
జూచెదరు. ఆఱువేలవత్సరములు మించిన పరంపరను విన
నట్టి చెవులకు అర్బుదములలెక్క నిశ్చయముగ అవిశ్వాస
నీయమని తోచక తప్పదు. కాని పరిస్థితు లున్ముఖములగు

చున్నవి. ఈ జీవులుసయితము కాలక్రమేణ శతాబ్దములను సహస్రాబ్దములుగ లెక్కించుచు ప్రపంచమునఁబ్రవేశింతురు."

అని చెప్పియుండెను. ప్రాచీన అమెరికాయను గ్రంథమును రచియించిన "బాల్డ్విక్ పండితుఁడు,

"Archæology and Linguistic Science, not to speak of Geology, make it clear that the period between the beginning of Human Race and birth of Christ would be more accurately stated if the centuries counted in the longest estimate of the rabbinical chronologies could be changed to milleniums."[1]

"భూగర్భశాస్త్ర విచారణ మటుండనిచ్చి—పురాతన వస్తుశాస్త్రమును, వాఙ్మయశాస్త్రమును మానవోత్పత్తి ప్రారంభమునుండి క్రీస్తు జన్మకాలమునకునుంగల మధ్యకాలము యూదియాదేశపు గురుసాంప్రదాయిక వంశావళిచే లెక్కింపఁబడు శతాబ్దములను సహస్రాబ్దములుగ మార్చినచో నెక్కుడు ఖచితముగఁ జెప్పఁదగియుండునని స్పష్టపఱుచుచున్నవి" 2

అని చెప్పియున్నాఁడు.

హైందవ సాంప్రదాయముల ననుసరించిచూచిన సృష్ట్యాది నుండి యిదివఱకెన్నియో బ్రహ్మకల్పములు గడచియుండెను.

1 Vide. Ancient America p. 181

2 Ibid.

ఎన్నియో ప్రళయములు, మహాప్రళయములు జరగియుండెను. ఎన్నిసారులో తిరిగి సృష్టి కాఁబడుచువచ్చెను. అయ్యది గణనాతీతమని చెప్పవలసివచ్చుచున్నది. కాని ప్రస్తుత బ్రహ్మ కల్పపరిమితిని మాత్రము హైందవుల శ్రుతి, స్మృతి, పురాణేతిహాసాదులును, జ్యోతిష సిద్ధాంత గ్రంథములును, హైందవులు సాంప్రదాయముగఁ జెప్పుకొనుచువచ్చిన సంకల్పమునందలి కాల సంకీర్తనమును, గణితము చేఁ దెలిసికొనుటకుఁ దోడ్పడుచున్నవి. ప్రస్తుతకాలమున బ్రహ్మయొక్క ఆయుర్దాయములో 51 సంవత్సరమునందలి ప్రథమదినమునం దిప్పటికి 196,08,53,030 సంవత్సరము జరుగుచున్నటుల బోధితమగుచున్నది. ఇయ్యదియే ప్రస్తుత ప్రపంచసృష్ట్యాది వత్సరములుగఁ బరిగణించెదము. ఈ గణితమునుబట్టి ప్రస్తుతము సప్తమ మన్వంతరమగు వైవస్వత మన్వంతరమున 28 మహాయుగమునందలి కలియుగమున 5030 సంవత్సరము జరుగుచున్నటులఁ దెలియుచున్నది అనఁగాఁ బ్రస్తుతకాలమగు క్రీ. శ. 1929-30 సంవత్సరమున కలియుగాబ్దము 5030 సంవత్సరము జరుగుచున్నటులఁ గన్పట్టుచున్నది.

## గోపాలయ్యరుగారి సిద్ధాంతము.

ప్రాచీన హైందవ దేశచరిత్ర కాలనిర్ణయము (Chronology of Ancient India)నురచించినగోపాలయ్యరుగారు (Mr. V. Gopala Aiyer) యుగ కాలనిర్ణయమును గుఱించి యొక విపరీతసిద్ధాంతమును వెలిబుచ్చియుండిరి. కలి

యుగ ప్రమాణము 1000 వత్సరములనియు, సంధ్య సంధ్యాంశ ములకాలములుచేరి 1200 సంవత్సరములు మాత్రమేననియు క్రీ. పూ. 1177 సంవత్సరము చివరభాగములో సంభవించిన దక్షిణాయనకాలమున కలియుగము ప్రారంభమయ్యెననియుఁ, గ్రీ. పూ. 177 సంవత్సరముననో లేక క్రీ. శ. 25 సంవత్సర మునో నంతమయి యుండుననియు, నింత స్వల్పకాలమునఁ గృతయుగము ప్రవేశమయియుండెనని యంగీకరించుటకు హైందవుల కిష్టములేక కలియుగ ప్రమాణముగఁ జెప్పఁబడిన 1000 లేక 1200 సంవత్సరములు దేవవర్షములని నిపుణతగ వ్యాఖ్యానము చేసియుంశిరనియు నవ్విధిఁ గలియుగప్రమాణ మతిదీర్ఘ కాలమగు 4,32000 మానవవత్సరములకుఁ బెంచియుండిరనియు జెప్పియుండిరి. వీరి విమర్శనావిధానమును గాంచిన కేవలము పాశ్చాత్యసిద్ధాంత రసావేశ పరవశులై వెనుకముందారయఁ దలఁపులేక హైందవశాస్త్రసారము నిస్సారముగఁ ద్రోసిపైచి నటులఁ గన్పట్టెడిని. తమ విపరీతసిద్ధాంతమునకు మనుస్మృతి ప్రథమాధ్యాయములోని

"శ్లో॥ చతుర్యాహుస్సహస్రాణి వర్షాణాంతు కృతంయుగమ్।
తస్యతావచ్ఛతీ సంధ్యా సంధ్యాంశశ్చతథావిధః॥" 69

"శ్లో॥ ఐతరేషున సంధ్యేషు ససంధ్యాంశేషుచత్రిషు ।
ఏకాపాయేనవర్తంతే సహస్రాణి శతానిచ॥" 70

అను శ్లోకము లాధారములని చెప్పియుండిరి. ఈ రెండు శ్లోకముల ననుసరించి కృత, త్రేత, ద్వాపర కలి యుగములు

నాలుగును,సంధ్య సంధ్యాంశలకాలములతోఁగలిసి క్రమముగా 4800;3600;2400;1200 సంవత్సరముల కాలపరిమాణము కలవని చెప్పఁబడుచున్నవి.

మనుస్మృతి ప్రథమాధ్యాయము 64 మొదలు 73 శ్లోకములును 79 శ్లోకమును కాలపరిమాణములను గుఱించి చెప్పఁబడియున్నవి. వాని నీక్రిందఁ గనఁబఱుపఁబడినవి.

శ్లో॥ నిమేషాదశచాష్టాచ కాష్ఠాత్రింశత్తుతాః కలా ।
త్రింశత్కలాముహూర్తస్స్యా దహోరాత్రంతుతావతః ॥ 64
అహోరాత్రే విభజతే సూర్యోమానుషదైవికే ।
రాత్రిస్స్వప్నాయ భూతానాం చేష్టాయై కర్మణామహః ॥ 65
పిత్ర్యేరాత్ర్యహనీమాసః ప్రవిభాగస్తు పక్షయోః ।
కర్మచేష్టా స్వహః కృష్ణః శుక్లస్స్వప్నాయ శర్వరీ ॥ 66
దైవేరాత్ర్యహనీవర్షం ప్రవిభాగస్తయోః పునః ।
అహస్తత్రోదగయనం రాత్రిస్స్యా ద్దక్షిణాయనమ్ ॥ 67
బ్రహ్మస్యతుక్షపాహస్య యత్ప్రమాణం సమాసతః ।
ఏకైకశోయుగానాంతు క్రమశస్తన్నిబోధితః ॥ 68
చత్వార్యాహుస్సహస్రాణి వర్షాణాంతు కృతంయుగం ।
తస్యతావచ్ఛతీ సంధ్యా సంధ్యాంశశ్చతథావిధః ॥ 69
ఇతరేషు ససంధ్యేషు ససంధ్యాంశేషు చత్రిషు ।
ఏకాపాయేనవర్తంతే సహస్రాణి శతానిచ ॥ 70
యదేతత్పరిసంఖ్యాత మాదావేవ చతుర్యుగమ్ ।
ఏతద్ద్వాదశ సహస్రం దేవానాం యుగముచ్యతే ॥ 71

దైవికానాం యుగానాంతు సహస్రం పరిసంఖ్యయా ।
బ్రాహ్మమేకమహర్జ్ఞేయం తావతీరాత్రిరేవచ ॥ 72

తద్వై యుగసహస్రాంతం బ్రాహ్మం పుణ్యమహర్విదుః ।
రాత్రించ తావతీమేవ తేఽహోరాత్రవిదోజనాః ॥ 73

♦ ♦ ♦ ♦

యత్ప్రాగ్ద్వాదశసాహస్రముదితం దైవికం యుగమ్ ।
తదేకసప్తతిగుణం మన్వంతరమిహోచ్యతే ॥ 79

పూర్వ శ్లోకములయొక్కయుఁ దరువాతి శ్లోకముల యొక్కయు భావములను గమనించకనే 69-70 శ్లోకములు రెంటిని విడఁదీసి చూచినచో నందుఁ జెప్పఁబడిన వత్సరముల సంఖ్య దేవవర్షములయినదియు, మానవవర్షములయినదియు స్పష్టీకరింపఁబడనటులఁ గన్పట్టునుగాని పూర్వోత్తర శ్లోకములను వాని భావములను గమనించిన యా రెండుశ్లోకములందుఁ బ్రశంసింపఁబడిన వత్సరములు దేవవర్షముల ప్రశంసయనియే స్పష్టముగఁ గన్పట్టును. పూర్వోత్తర సందర్భములను గమనించియే పూర్వమునుండియు వ్యాఖ్యాతలందఱును దేవవర్షములనియే చెప్పియుండిరి. ప్రొఫెసరు బూలరు (Prof. Buhler) పండితుఁడు సయితము దేవవత్సరములనియే భాషాంతరీకరించియుండెను. [1]

ఇదియునుంగాక మహాభారతమునందును నాలుగుయుగములకాలము 12,000 సంవత్సరములని చెప్పఁబడియుండెనని

1 Sacred Books of the East Series.

యాధారమును గనఁబఱచి యుండెను. కాలమానములఁ గూర్చి మహాభారత మారణ్యపర్వతమునందును శాంతిపర్వమునందును జెప్పఁబడియుండినటులఁ గన్పట్టుచున్నది. అరణ్యపర్వము 188 అధ్యాయము 22-27 శ్లోకములయందుఁ గృత త్రేత ద్వాపర కలియుగముల చేరిక 12,000 సంవత్సరములని చెప్పఁబడియుండెను. అయ్యవి మానవవర్షము లయినదియు లేక దేవవర్షము లయినదియు స్పష్టముగఁ జెప్పఁబడి యుండలేదు. ఇట్లునఁ గూడ గోపాలయ్యరుగారు పూర్వోత్తర సందర్భములనారయక నే భారతమునందును నాలుగు యుగములచేరిక 12,000 సంవత్సరములని చెప్పఁబడియుండెననియు, నయ్యవి మానవవత్సరములే ననియు మహాభారతము నాధారముగఁ గనఁబఱచినట్లు తోఁచె డిని. వాని యనంతరము సెప్పఁబడిన శ్లోకమునందు నట్టి 12000 సంవత్సరములుగల నాలుగు యుగముల కాల మొక దేవయుగ మనియు నట్టి 1000 దేవయుగముల కాలము బ్రహ్మకొక దిన మనియుఁ జెప్పఁబడియున్నది. మహాభారత వ్యాఖ్యానకారుఁ డగు నీలకంఠుఁడును 12000 వర్షములు దేవవర్షములనియే చెప్పి యుండెను. కాలపరిమాణములను గుఱించి భారతము శాంతి పర్వములో శంకారహితముగఁ జెప్పఁబడి యున్నది. గోపా లయ్యరుగారద్దాని గమనింపకుండుటఁ గడువిచారము. బహుశః తమ సిద్ధాంతమును మూలచ్ఛేదము గావించునను దలంపుతోఁ చేర్కొనక నెమ్మదిగాఁ జారవిడిచియుందురని తోఁచుచున్నది. వీరును హైందవ వాఙ్మయమునందుఁ జెప్పఁబడిన యుగశేషము లను, ముందుగనే నిశ్చయించుకొని సిద్ధాంతీకరింపఁ దలఁచిన

తమ యభిప్రాయములతో నేకీభవించినంతవట్టు కంగీకరించుచుఁ దాము సేయఁదలఁచుకొనిన సిద్ధాంతములను మూలచ్ఛేదము గావించు వ్యతిరేకాంశముల నన్నిటిని నతిశయోక్తులనియో, క్రొత్తమార్పులనియో, యిటీవల కాలమున నిముడ్పఁబడిన వనియో తోసిరాజను గొందఱు పాశ్చాత్యపండితుల మార్గమునే యవలంబించినట్లుఁ గన్పట్టెడిని. దేవ-మానవ కాలపరిమాణములను గుఱించి భారతమందలి శాంతిపర్వములో నేమి చెప్పఁబడియెనో కనుఁగొందము.

"శ్లో॥ కాష్ఠానిమేషాదశపంచచైవ త్రింశత్తుకాష్ఠాగణయేత్కలాం తామ్।

త్రింశత్కలాశ్చాపి భవేన్ముహూర్తోభాగః కలాయాదశమశ్చయస్స్యాత్ ॥ 12

త్రింశన్ముహూర్తంతు భవేదహశ్చరాత్రిశ్చ సంఖ్యామునిభిః ప్రణీతా।

మాసస్మృతోరాత్ర్యహానీచ త్రింశత్సంవత్సరోద్వాదశమాసఉక్తః ॥

సంవత్సరంద్వేత్వయనేవదంతి సంఖ్యావిదో దక్షిణముత్తరంచ ॥ 13

అహోరాత్రే విభజతే సూర్యో మానుషదైవికే।

రాత్రిఃస్వప్నాయ భూతానాం చేష్టాయై కర్మణామహః॥ 14

పిత్ర్యేరాత్ర్యహానీమాసః ప్రవిభాగస్తయోఃపునః।

శుక్లోఽహఃకర్మ చేష్టాయాం కృష్ణస్స్వప్నాయ శర్వరీ॥ 15

దైవే రాత్ర్యహనీవర్షం ప్రవిభాగస్తయోః పునః ।
అహ స్తత్రోదగయనంరాత్రి స్స్యాద్దక్షిణాయనమ్॥ 16
యేతేరాత్ర్యహనీపూర్వే కీర్తితేదైవమానుషే ।
తయోస్సంఖ్యాయ వర్షాగ్రం బ్రహ్మోవక్ష్యామ్యహఃక్షపే॥
దివ్యైర్వర్షసహస్రైస్తు కృతత్రేతాదిసంజ్ఞికమ్ ।
చతుర్యుగం ద్వాదశాని స్తద్విభాగం నిబోధమే ॥ 18
చత్వార్యాహు స్సహస్రాణి వరాణాం తత్ కృతంయుగమ్ ।
తస్యతావచ్ఛతీసంధ్యాం సంధ్యాంశశ్చ తథావిధః ॥ 19
ఇతరేషుససంధ్యేషు సంధ్యాంశేషుతతస్త్రిషు ।
ఏకపాదేన హీయంతే సహస్రాణి శతానిచ ॥ 20



తతఃపరంకృతయుగే త్రేతాయాం జ్ఞానముత్తమమ్ ।
ద్వాపరేయజ్ఞమేవాహు ర్దానమేకం కలేయుగే ॥ 28
ఏతాంద్వాదశసహస్రీం యుగాఖ్యాం కవయోవిదుః ।
సహస్రపరివర్తే తద్బ్రాహ్మం దివసముచ్యతే ॥ 29
రాత్రిమేతావతీంచైవ తదాదావిశ్వమీశ్వరః ।
ప్రళయేధ్యామమావిశ్య సుప్త్వాసోఽన్తేవిబుధ్యతే ॥ 30
సహస్రయుగపర్యంత మహర్యద్బ్రహ్మణోవిదుః ।
రాత్రిం యుగసహస్రాంతాం తేఽహోరాత్రవిదోజనాః॥ ”‡

వీనింబట్టి మహాభారతమునందును యుగముల కాల పరిమాణములు దేవవర్షములలోఁ జెప్పఁబడి యుండినట్లును

‡ శాంతిపర్వము. 231 అధ్యాయము.

గృత, త్రేత, ద్వాపర, కలియుగములు నాలుగునుగలిసి 12,000 దేవవత్సరముల కాలపరిమితి కలిగియుండినట్లును స్పష్టముగ దెలియుచున్నది. కలియుగ కాలపరిమితి 4320000ల మానవాబ్దములైనటులను దెలియుచున్నది. ప్రస్తుతకాలమున అనఁగా క్రీ.శ. 1929_30 సంవత్సరమునఁ గలియుగాబ్దము 5030 సంవత్సరము జరుగుచున్నటులఁ జెప్పఁబడుచుండుటచేఁ గలియుగము క్రీ. పూ. 3102 సంవత్సర ప్రాంతమునఁ బ్రారంభమయినటులఁ గన్పట్టుచున్నది. హైందవులు జ్యోతిష సిద్ధాంతముల ననుసరించి గణితములనైచి క్రీ. పూ. 3102 సంవత్సరము ఫిబ్రవరి నెల 20 తేది 2 గంటల 27 నిముసముల 30 శెకండ్లకాలమప్పుడు కలియుగ ప్రవేశమయినటుల హైందవగణితశాస్త్రజ్ఞులిదివఱలో స్ఫుటనమొనర్చి చెప్పియుండిరి. అక్కాలమున గ్రహము లేమేరాశియందుండినది చెప్పియుండిరి. కలియుగ ప్రవేశకాలమును గనుఁగొనుటకై లాకైలీ యను ఫ్రెంచి విద్వాంసుఁడు పరిశోధనలుసల్పి హైందవగణితశాస్త్రజ్ఞులచేఁ జెప్పఁబడిన కలియుగకాల ప్రవేశకాలమున నొక్కక్షణమైనను వ్యత్యాసమురాలేదని హైందవుల జ్యోతిశ్శాస్త్ర గణితశాస్త్ర విజ్ఞానమున కచ్చెరువందియుండెను.

ఇతర దేశీయులురచించిన చరిత్రాంశములను, ప్రాచీన జ్యోతిష సిద్ధాంతవేత్తలుజెప్పిన కాలపరిస్థితులను బరిశీలింతము.

## చరిత్రాధారములు.

సర్ విల్లియం జోన్సు (Sir William Jones)పండితునకుఁ గాశ్మీరదేశమున బాక్ట్రియా (Bacteria) దేశ రాజవంశావళి దొఱకియుండెను. అలెగ్జాండరు దండయాత్రకుఁ బూర్వము షుమారు రాఱువేలసంవత్సరముల పైకాలమునుండియుఁ బరిపాలనమొనర్చిన రాజవంశావళులయొక్కయుఁ బరిపాలనగావించిన రాజులయొక్కయు నామధేయములును, సంగ్రహచరిత్రయుఁ జెప్పఁబడియుండెను. అలెగ్జాండరు దండయాత్ర క్రీ. పూ. 327 సంవత్సరప్రాంతమున జరిగియుండినటులఁ జరిత్రకారులు చెప్పుచుండిరి. కావున ఈ వంశావళినిబట్టి సృష్టికాల మిప్పటికెన్మిదివేలసంవత్సరముల పైకాలమునకుఁ బోవుచున్నది.

ఈ విషయము గ్రీసుదేశస్థుఁడగు మెగాస్థనీసు (Magasthenese) ను చెప్పియున్నాఁడు. ఇందునుగూర్చి కెప్టెన్ ఫ్రాన్సిస్ విల్ఫర్డు (Captain Francis Wilford-afterwards Col. Wilford.)పండితుఁ డీక్రింద జెప్పియుండెను.

" The loss of Magasthenes' works is much lamented. From the few scattered fragments preserved by the Ancients, we learn that the history of the Hindus did not go back above 5402 years. The Mss differ; in some we reach 6042; and in others 5402 and three months to the invasion of India by Alexander. Megasthenes certainly made very particular enquiries, since he noted even the months. Which is the true reading, I cannot

pretend to determine; however I incline to believe it is 5042, because it agrees best with the number of years assigned by Albumuzar, as cited by Mr. Bailly, from the creation to the flood. This famous astronomer, whom I mentioned before, has derived his ideas about the time of the creation, and of the Flood, from the learned Hindus he had consulted: Magasthenes, according to Pliny and Arrian, seems to say that 5042 years to be reckoned between Dionysius or Deo Nausa and Alexander, and that 153 Kings reigned during that period; but I believe it is a mistake of Pliny and Arrian; for 153 reigns or even generations, could never give so many years."[1]

"మెగాస్థనీసు రచించిన గ్రంథములు రూపఱుట (కనుపడకపోవుట) చాల విచారము గలుగఁజేసినది. ప్రాచీనులు జాగ్రతపఱచిన కొన్నిముక్కలను బట్టి హిందువుల చరిత్ర అలెగ్జాండరు దండయాత్రకుఁ బూర్వము 5402 సంవత్సరములకంటె వెనుకకుఁ బోలేదని మనము తెలిసికొను చున్నాము. వ్రాఁతప్రతులు భేదించుచున్నవి. కొన్నిటినిఁ బట్టి అలెగ్జాండరు దండయాత్రకుఁ బూర్వము 6042 సంవత్సరములకుఁ జేరుచున్నాము. మఱికొన్నిటినిఁబట్టి 5402 సంవత్సరముల మూఁడు మాసములకుఁ జేరుచుంటిమి. నెలలనుసైతము గమనించుటనుబట్టి మెగాస్థనీసు నిక్కువముగ నెక్కువవిచారణ చేసియుండెను, ఆరెంటిలో నెయ్యది సరియైన సంఖ్యయో నే నిశ్చయించెదనని నటించఁజాలను.

1 Vide Asiatic Researches- Vol. V. pp 191 & 192

ఎటులైనను 'బేయిలీ' క్రోడీకరించినటుల 'అల్బుమజారు' చెప్పిన సృష్ట్యాదినుండి ప్రళయమునకుఁగల వత్సరముల సంఖ్యతో నియ్యది సరిపోవుచుండుటచే 5042 అనియే నేను నమ్ముచున్నాను. ఇదివఱలో నేఁ జెప్పిన యీ ప్రఖ్యాతిఁగల సిద్ధాంతి (అల్బుమజారు) సృష్టికాలమును ప్రళయకాలము గూర్చి పండితులగు హిందువులతో సంప్రతించి తెలిసి కొనియుండెను. 'డయోనిసియస్' లేక 'డియోనేసు' నకును అలెగ్జాండరునకును మధ్యగల కాలము 5042 సంవత్సరములుగ నెంచవలయుననియు, నాకాలమున 153 రాజులు పరిపాలించియుండిరనియు, మెగాస్థనీసు చెప్పినటుల 'ప్లీని', 'అర్రియను' ల రచనలనుబట్టి తెలియుచున్నది. కాని అయ్యది 'ప్లీని,' 'అర్రియను' లు పొరపాటుగఁ జెప్పియుండిరని నేను నమ్ముచున్నాను. ఏలన 153 రాజులు లేక అన్ని వంశములైనను అన్ని వత్సరముల కాలము పరిపాలన సల్పజాలరు.$

మెగాస్థనీసు రచించిన గ్రంథములు నశించినవఁట! అందులకుఁ గడువిషాదము కలుగుచున్నదఁట! ప్రాచీను లెవ్వరో కొన్ని ముక్కలను మాత్రము జాగ్రతపఱచిరట! వారు వ్రాసిన వ్రాఁతలును భేదించుచున్నవఁట. అట్టివానినే యాధారములుగాఁ దీసికొని సిద్ధాంతములు సేయఁబూనిరి. కొన్ని 6042 సంవత్సరములు చెప్పుచున్నవఁట! మఱికొన్ని 5042 సంవత్సరముల మూఁడుమాసములు చెప్పుచున్నవట! 5042 సంవత్స

$ Asiatic Researches - Vol V. pp. 191 & 192.

రముల మూఁడుమాసముల పాఠాంతరమే నిజమనినమ్ముచున్నా రఁట! అందులకు రెండుకారణములఁ జెప్పిరి. అందు

1. నెలలలోఁగూడఁ జెప్పఁబడియుండుటచే 'మెగాస్థనీసు' సంపూర్ణముగ విచారణచేసి వ్రాసియుండురనుట నొక కారణముగను,

2. సృష్టికిని, ప్రళయమునకును గల కాలవ్యవధి 'అల్బిముజారు' చెప్పిన సంవత్సరముల సంఖ్యతో సరిపోవు చున్నదనుట మఱియొక కారణముగను గన్పట్టుచున్నది.

మాసములతోఁ గూడ వత్సరములను దనకు స్వయముగాఁ దెలియనివిషయముల నెచ్చటనోయుండి యెవ్వరినో, యెప్పుడో, యెట్లో విచారించి చెప్పియుండునని యూహించి పరస్పరభేదములుగల తరువాతికాలపువారి వ్రాఁతలను నమ్ముటకంటె వత్సరములు, మాసములు, రోజులు, గడియలు, విగడియలతోఁగూడ నిరుపముగ నెన్నిశతాబ్దముల క్రిందటనో చెప్పఁబడిన హైందవగణితము నేల నమ్మఁగూడదో? 'అల్బిముజారు' హైందవులతో సంప్రతించి సృష్ట్యారంభమునకును బ్రళయమునకును నడుమఁగల కాలపరిమితిని వారివలనఁ దెలిసికొనియుండెనని యూహించి 'అల్బిముజారు' చెప్పిన సంఖ్యనే నమ్మటకంటెఁ బ్రాచీన హైందవులు చెప్పిన సంఖ్య నేల విశ్వసింపఁగూడదో కారణములఁ జెప్పినవారు కారు.

నూటయేఁబది మువ్వురు (153) రాజులు 5042 సంవత్సరములకాలము పరిపాలనము జేసియుండఁజాలరఁట! 153 రాజ

వంశములైన నంతకాలము పరిపాలన మొనర్చుజాలరుట! మన యోధుఁడు కారణములు చెప్పినవాఁడు కాఁడు. అట్లు 'మెగాస్థ నీసు' చెప్పియుండినట్లు 'ప్లీని' 'అరియను'లు వ్రాసినవ్రాతలు తప్పులఁట! బైబిలునందుఁ జెప్పఁబడిన ప్రకారము ఆదాము (Adam) 930 సంవత్సరములు, నోవా, (Noah) 950 సంవ త్సరములు, జారిద్ (Jarid) 962 సంవత్సరములు, సేత్ (Seth) 912 సంవత్సరములు, మెతూసిలా (Methusila) 969 సంవత్సరములును, యీ యైదుగురును 4723 సంవత్సర ములు పరిపాలనము జేసినటుల చెప్పఁబడియుండెనే! దానిం గూడ మనకోవిదుఁ డసంభవ మనుచున్నాఁడా? ఐఁదుగురు 4723 సంవత్సరములు పరిపాలనము గావించుట నిశ్చయమును సంభవమును అగుచో నూటయేఁబదిముగ్గురు (153) 5042 సంవత్సరములుపరిపాలనముసేయుట యసంభవముగునా? అసత్య మగునా? సగటున నొక్కొకరి రాజ్యపాలనము (33) ముప్పది మూఁడు సంవత్సరములు మాత్రమే యైయుండును. అయ్యది అసంభవమా! బైబిలులోఁ జెప్పఁబడిన సంవత్సరములసంఖ్యను బట్టి సగటుపరిపాలనావత్సరములు(Average years of reign) 945 సంవత్సరములని చెప్పిన సంభవమా? మనవిల్సుఫర్డు మోసుఁడు చెప్పినటుల నలెగ్జాండరు దండయాత్రకుఁబూర్వము 5042 సంవత్సరముల క్రిందటనుండియే హిందూరాజుల చారిత్రము చెప్పఁబడియుండునని తలంచినను అయ్యది యిప్పటికి కేవలవేల సంవత్సరముల కధిక కాలమైయున్నది. అంతకుఁ బూర్వము నాల కాలముక్రిందటనే సృష్టిక్రమముజరిగియుండెనని తేలుచున్నది.

చున్నది. ఇంతకు నిపాశ్చాత్య విమర్శకులనుత్తమునకు వేద గ్రంథమునందు బైబిలునందలి సృష్టిప్రారంభకాల మిప్పటి కాఱువేలసంవత్సరములకు మించె బైబిలు కాలగణనంబున నీ యుగ్రకాలములో నైన సవరించి నిరూపించుట కెన్నియో పట్టీలు కొట్టఁబడినవి యున్నవి.

పాశ్చాత్యపండితు లాంగ్యముగ నిశ్చయించిన బైబిలులోని సృష్టికాలవిధానమెంతవఱకు గారవమో తెలిసికొనుట యనావశ్యకముగాదు. 'మతమునకును శాస్త్రము (Science) నకును గల సంఘట్టనచరిత్రము' (History of the Conflict between Religion and Science) ను రచించిన డాక్టరు జాన్ విల్లియం డ్రేపరు (Dr. John William Draper M. A. LLD.) పండితుఁ డీటులఁ జెప్పియుండెను.

"It was generally admitted that the Earth was about four thousand years old at the birth of Christ, but, so careless had Europe been in the study of its ameals, that not until A. D. 527 had it a proper chronology of its own. A Roman Abbot, Dionysius Exignus or Dennis the Less, then fixed the Vulgar Era, and gave Europe its present Christian Chronology."

× × × ×

"Persons who had given much attention to the subject affirmed that there were not less than one hundred and thirty two different opinions as to the year in which the Messiah appeared, and

have they declared that it was inexpedient to press for acceptance the Scriptural number too closely, since it was plain, from the great differences in different copies, that there had been no providential intervention to perpetuate a correct reading, nor was there any mark by which man could be guided to the only authenetic version."$

"Geologists having unanimously agreed for perhaps there is not a single dissenting voice, that the Chronology of the Earth must be greatly extended, attempts have been made to give precision to it. Some of these have been based on Astronomical, some on Physical principles. Thus calculations founded on the known changes of the eccentricity of the Earth's Orbit with a view of determining the lapse of time since the beginning of the last glacial period, have given two hundred and forty thousand years."

× × × ×

"The Mosaic time is too short, the order of creation incorrect, the devine interventions too anthropomorphic;............"†

"క్రీస్తు జన్మించునప్పటికి భూమికి షుమారు నాలుగు వేల వత్సరముల వయస్సుండెనని సాధారణముగ నంగీకరించి యుండిరి కాని క్రీస్తుశకము 527 సంవత్సరమునందగిన చరిత్ర కాలనిర్ణయము గావించువఱకుఁ దనచరిత్రమును గుఱించి

---

$ Vide: History of the conflict between Religion & Science by Dr, J. W. Draper. pp. 183 to 185.

† Ibid pp. 194 - 195

తెలిసికొను ప్రయత్నములయందు యూరపు దేశమెక్కు డశ్రద్ధవహించియుండెను. అప్పుడు "డయోనిసియస్ యక్సి జ్నిసు లేక డెన్నిసు ది లెస్" అను యొకరోమను మహంతు (సన్యాసుల మఠాధ్యక్షుఁడు) సామాన్య జనసంబంధమగు శకకాలము నేర్పాటుఁగావించి ప్రస్తుతముండు క్రైస్తవ చరిత్ర కాలనిర్ణయమును యూరపు దేశమునకుఁ బ్రసాదించి యుండెను."

"ఇవ్విషయమునుగుఱించి యెక్కువ కృషిసల్పినవారలు క్రీస్తు జన్మవత్సరమునుగుఱించి (132) నూటముప్పది రెంటికిఁ దక్కువగాని భిన్నాభిప్రాయము లుండెననియు, వెవ్వేఱు ప్రతులయందు స్పష్టముగఁ గన్పట్టు గొప్పవ్యత్యాసములను బట్టి వానిలో నేది సత్యమగువ్రాతయో గ్రహించుటకు దైవసాహాయ్యము లేకుండుటచేతను, మానవుఁడు గ్రహించుట కితరాధారములు లేకుండుటచేతను, బైబిలునందుఁ జెప్పఁబడిన వత్సరసంఖ్యనంతసూక్ష్మముగాఁ బరిశీలన మొన ర్చుట యయుక్తమనియుఁ బ్రకటించియుండిరి." 1

" భూమియొక్క చరిత్రకాలమెక్కువగాఁ బొడుగింప వలసియుండునని భూగర్భశాస్త్రజ్ఞులందఱును జెప్పియుండిరి. అందున కొక్కరేని భిన్నాభిప్రాయులై యుండలేదు. ఆ కాలమును నిక్కచ్చిగఁ దేల్చుటకుఁ బ్రయత్నములు సేయ బడియుండెను. అట్టి ప్రయత్నములుగొన్ని జ్యోతిష సిద్ధాం

1 History of conflict between Religion & Sceince-by J. W. Draper pp. 183 to 185.

తములమీఁదను, గొన్ని ప్రకృతిశాస్త్రములమీఁదను నాధార పడియుండెను. ఆవిధముగ వెనకటి హిమప్రళయకాలము నుండి గడచిన కాలనిర్ణయము గావించు నుద్దేశముతో జ్యోతిశ్చక్రమున భూమండలము తిరుగుమార్గమున కెలుకు (కేంద్రచ్యుతులయందుఁ గనుగొనిన) మార్పులను బట్టి కావించిన గణితములు కాలము రెండువందల నలుబదివేల (240,000) వత్సరములని చెప్పుచున్నవి"

* * * * *

"మోసెసు చెప్పినకాలము బహుస్వల్పము. సృష్టి విధానము దోషభూయిష్ఠమైయున్నది. పలుమారు చెప్పఁ బడిన దైవవాక్యములు ఈశ్వరునికి మనుష్యరూపము నేర్పాటుచేయుటయు నయ్యున్నది" 1

చూచితిరా! బైబిలులో చెప్పఁబడిన లెక్కలను సూక్ష్మదృష్టితో విమర్శనలుచేయుట అయుక్తమఁట! కావున క్రీస్తుజనన వత్సరమెయ్యదియైనదియు స్పష్టముగ తెలియనప్పటి కిని, వేర్వేరు వత్సరములనియు, నొకొక్కదానికి బహుకాల వ్యత్యాసము కలిగియు, శతాధికభిన్న సిద్ధాంతములు చేయఁ బడియుండినను క్రీస్తుశకము 527 సంవత్సరమున నొక కాథలు గణితముచేసి చెప్పిన యొక రోమనుమహంతు సిద్ధాంతముల నాధారముచేసికొని, యెన్నివేల వత్సరములనుండియో నిర్దుష్ట ముగు గణితపద్ధతితో చెప్పఁబడిన కాలనిర్ణయ విధానములను

1 History of conflict between Religion and science - by J. W. Draper- pp. 194-195.

త్రోసిపుచ్చుచుండిరి. హైందవ వాఙ్మయమున రాజుల పరిపాలనా కాలములు జాస్తిగ జెప్పఁబడి యుండినవనియు, విశ్వసింప రాదనియు త్రోసివైచుట కడుసాహసము.

## జ్యోతిష సిద్ధాంతములు.

ప్రాచీన జ్యోతిషసిద్ధాంతములనుబట్టి ఆయాసిద్ధాంతము లెప్పుడేర్పడియుండెనో కనుఁగొనుట కేమేని యాధారములు దొరకునేమో విమర్శింతము. 'వరాహమిహిరుఁడు' పంచసిద్ధాంతికయను సిద్ధాంతగ్రంథమును రచించియుండెను అందుఁ బ్రాచీన సిద్ధాంతములు పెక్కింటిలో ముఖ్యముగ నైదింటిని గుఱించి విపులముగ చెప్పియుండెను. ఆయా సిద్ధాంతకర్త లాయాసిద్ధాంతములఁ జెప్పుచున్నప్పుడుగల వత్సరపరిమాణములను జెప్పియుండిరి. సూర్యసిద్ధాంతమునకు వ్యాఖ్యను రచించుకాలమున సంవత్సర పరిమాణము 365 దినముల 15 గడియల 31 విగడియ 31 పలల 24 విపలల కాలమైయుండినటులఁ జెప్పఁబడియున్నది. ఇయ్యది 365 రోజుల 6 గంటల 12 నిముసముల 36.56 సెకండ్ల కాలమగుచున్నది. సూర్యసిద్ధాంతము కృతయుగాదిని రచింపఁబడినటులఁ జెప్పఁబడియుండెను. ఇటులనే పౌలిశమహార్షిచేఁ జెప్పఁబడిన పౌలిశసిద్ధాంత కాలమున సంవత్సరపరిమాణము 365 రోజుల 6 గంటల 12 నిముసములని చెప్పఁబడియుండెను.[1] రోమశమహార్షిచే రోమశసిద్ధాంత గ్రంథము చెప్పఁబడినది. దీనినే రోమక సిద్ధాంతమని సామాన్యముగ వాడుచుండిరి.

---

1 Varahamihira's Panchasidhantiha-Chap. III p. 4.

ఈ సిద్ధాంతము చెప్పఁబడిన కాలమున సంవత్సరపరిమాణము 365 రోజుల 5 గంటల 55 నిముసముల 12 శెకండ్ల కాలముగఁ జెప్పఁబడినది. [1] ఆర్యజ్యోతిష, అర్కజ్యోతిషసిద్ధాంతములు చెప్పఁబడినకాలమున సంవత్సరపరిమాణము 365 రోజుల 5 గంటల 50 నిముసముల 36 శెకండ్లకాలమై యుండినటులఁ జెప్పఁబడియున్నది. క్రీ. శ. పదునెన్మిదవ శతాబ్దాంతమందుండిన ఫ్రెంచి దేశీయ విద్వాంసుఁడగు లాకైయిలీ (Mons. D La Caillee) పండితుఁడు గణితముచేసి యప్పటికాలమున సంవత్సర పరిమాణము 365 రోజుల 5 గంటల 48 నిముసముల 48 శెకండ్లకాలమైయుండెనని చెప్పియుండిరి.

సంవత్సరముయొక్క కాలపరిమితి క్రమక్రమముగా క్షీణించుచుండునని ప్రాచీనాధునిక జ్యోతిష సిద్ధాంతవేత్తలందఱు నంగీకరించుచుండిరి. ఇట్లు సంభవించు సంవత్సరక్షీణతను గణితముచేసిన 4900 సంవత్సరములకు 40. 5 (40½) శెకండ్ల కాలమగునని సిద్ధాంతవేత్తలు చెప్పియుండిరి. క్రీ. శ. పదునెన్మిదవ శతాబ్దాంతమున లాకైయిలీ పండితుఁడు చేసిన సంవత్సర కాల పరిమాణముకంటె ఆర్యజ్యోతిష, అర్కజ్యోతిషసిద్ధాంత కాలములయందలి సంవత్సరపరిమాణ మొకనిముసము, నలువదియెనిమిది శెకండ్లకాల మధికమగును. రోమకసిద్ధాంతకాలమునందలి సంవత్సర పరిమాణము ఆఱు (6) నిముసముల యిఱువదినాలుగు (24) శెకండ్లకాల మెక్కువగును, పౌలిశసిద్ధాంత

---

[1] పంచసిద్ధాంతిక- Chap. I. p. 15.

కాలమునందలి సంవత్సరపరిమాణ మిఱువదిమూఁడు (23)నిమిసముల పన్నెండు (12) శెకండ్లకాల మెక్కువగను, సూర్యసిద్ధాంతమునకు వ్యాఖ్య రచింపఁబడిన కాలమునందలి సంవత్సర పరిమాణ మిఱువదిమూఁడు(23)నిముసముల నలువదితొమ్మిది (49) శెంకడ్లకాల మెక్కువగనుండెను.

ఒకకాలమందలి సంవత్సర పరిమాణమునకును మఱియొక కాలమందలి సంవత్సర పరిమాణమునకును 40. 5($40\frac{1}{2}$) శెకండ్లకాల వ్యత్యాసముండిన యీరెండు కాలములమధ్యఁగల కాలవ్యవధి 4900 సంవత్సరము లయియుండునని జ్యోతిష సిద్ధాంతవేత్తలు చెప్పుచుండుటచే ౧౯. శ. పదునెనిమిదవ శతాబ్దాంతమందుండిన లాక్లైయిలీ పండితుని కాలమునకును అర్కజ్యోతిష, ఆర్యజ్యోతిష కాలమునకును నడుమంగల కాలవ్యవధి $4900 \times \frac{2}{81} \times$ (1ని 48 శెకండ్లు లేక $\frac{108}{1}$ శెకండ్లు) =13066 సంవత్సరములు 8 మాసములగుచున్నది. ఇట్లే లాక్లైయిలీ పండితుని కాలమునకు—

రోమశ సిద్ధాంతకాలమునకు మధ్యగల కాలవ్యవధి } $4900 \times \frac{2}{81} \times 384 = 46,459$ సం. 3 మా. $3\frac{1}{3}$ రోజులు,

పౌలిశసిద్ధాంతకాలమునకు మధ్యగల కాలవ్యవధి } $4900 \times \frac{2}{81} \times \frac{1392}{1} =$ 1,68,414సం. 9 మా. $23\frac{1}{3}$ రో,

సూర్యసిద్ధాంత వ్యాఖ్యకాలమునకు మధ్యగల కాలవ్యవధి } $4900 \times \frac{2}{81} \times \frac{1429}{1} =$ 1,72,891 సం. 4 మా. $8\frac{8}{9}$ రోజులు,

అగుచున్నది.

ఈ గణితమునుబట్టి లాక్కైయిలీ పండితునకు బూర్వము 13066 సంవత్సరముల క్రిందట ఆర్యజ్యోతిష అర్ధజ్యోతిష సిద్ధాంతమేర్పడినకాలమునియు, 46,459 సంవత్సరముల క్రిందట రోమకసిద్ధాంతమేర్పడిన కాలమునియు, 168,414 సంవత్సరముల క్రిందట పౌళిశసిద్ధాంత మేర్పడిన కాలమునియు, 172,891 సంవత్సరముల పై కాలము క్రిందట సూర్యసిద్ధాంతమునకు వ్యాఖ్యానించబడిన కాలమునియు ధృవపడుచున్నది. చూచితిరా! ప్రాచీన జ్యోతిష సిద్ధాంతవేత్తలచే రచింపఁబడిన సిద్ధాంతకాలము లాయావత్సరములని తేలుటచేఁ బ్రస్తుత సృష్ట్యారంభకాల మిప్పటికి 1,73,000 సంవత్సరముల పై కాలమునకుఁ బూర్వమయి యుండుననియైనను స్పష్టముగ గన్పట్టుచున్నది.

మఱియు యేల్ (Yale) పట్టణమునగల విశ్వభారతీస్థానమునందుఁ బదార్థవిజ్ఞానశాస్త్రకోవిదుఁడగు ఆలోయిస్ కోవరెక్ (Prof. Alois Kovarek) పండితుఁడు లోహాదిఖనిజ పదార్థములయందుఁగల కిరణప్రసారముల శక్తినిఁబట్టి వానివాని యుత్పత్తి కాలనిర్ణయములఁ గావించుచు యూరినైటు (Urinite) అను ఖనిజపదార్థముయొక్క యుత్పత్తికాలనిర్ణయమును గావించుచుఁ బ్రస్తుత ప్రపంచసృష్టి యిప్పటికి షుమారు 1852 మిలియనుల వత్సరములక్రిందట అనగా—1852000000 (నూటయెనుబదియైదుకోట్ల యిరువదిలక్షల) సంవత్సరములక్రిందట జరగియుండెనని యిటీవల జరిగిన కన్నెక్టికట్ (Connecticut) విద్వత్సభయందు సప్రమాణముగ

గను సాదృశ్యముగను కనుబఱచియుండినటులఁ జెప్పఁబడి యుండెను. [1] ఇయ్యది ప్రాచీన హైందవ సిద్ధాంతగణితములను బట్టి ప్రస్తుత ప్రపంచముయొక్కసృష్టి యిప్పటికి 196 కోట్ల వత్సరముల పై కాలముక్రిందట జరగియుండినటులఁ గస్పట్టు సిద్ధాంతమునే బలపఱచుచున్నది.

## మహాభారత యుద్ధకాలము.

హైందవుల పురాణములు మున్నగునవి భారతయుద్ధము కలియుగప్రవేశమునకుఁ బూర్వమే జరగియుండెననియు, నా మహాభారత యుద్ధానంతరము పాండవాగ్రేసరుఁడగు యుధిష్ఠిరుఁడు 37 సంవత్సరములు రాజ్యమును బాలించియుండెననియు, నప్పుడు కలియుగ ప్రవేశముగానుండ శ్రీకృష్ణపరమాత్ముని నిర్యాణము జరగియుండెననియు, శ్రీకృష్ణనిర్యాణమును విని పాండవులురాజ్య మర్జునుని మనుమఁడగు పరీక్షిత్తున కొప్పగించి దేశయాత్రగావించి యుండిరనియుఁ, గలియుగ ప్రవేశమయి 25 సంవత్సరములు గడచినతరువాత యుధిష్ఠిరుఁడు స్వర్గస్థుఁడయ్యెననియు, యుధిష్ఠిరుని స్వర్గారోహణ జ్ఞాపకార్థము లౌకికాబ్దము(Laukika Era)ప్రారంభింపఁబడి యుండెననియు, మొదలగు విషయములను చెప్పుచున్నవి. భారతయుద్ధకాల నిర్ణయము ప్రాచీనహిందూదేశచరిత్రకు సంబంధించిన ప్రభుత్వ వంశముల రాజవంశముల కాలనిర్ణయమునకేగాక ఆంధ్రులేకా లమునుండి భరతఖండమునందొక ప్రత్యేకపరిపాలనా తెగగను,

---

1. The Hindu Illustrated Weekly of 22 Feb. 1931 page 33.

ఆంధ్రదేశమొక ప్రత్యేక రాజ్యవిభాగముగను బే... నకుఁ బూర్వ
ముండినది తెలిసికొనుట కావశ్యకము. భారతకథా... అర్ధ జ్యో
దును, రామాయణ కథాకాలమునందును, వేదకా... త్సరముల
దును నాంధ్రులప్రశంస చేయఁబడియుండుటచే నాయాక... 14 సంవ
లఁ దెలిసికొనినయాంధ్రు లేకాలమునుండి ప్రత్యేకముగఁ... గియు,
గణింపఁబడుచున్నదియు నిర్ధారణ కావచ్చును. ...నాంత ...ది

## రామాయణ కథాకాలము.

రామాయణకథ త్రేతాయుగమునందు జరగినట్లుఁ జెప్పఁబడుచున్నది. ప్రస్తుతము జరుగుచున్న మహాయుగము నందలి త్రేతాయుగము కాదనియు, నంతకుఁ గ్రితము గడచిన మహాయుగమునందలి త్రేతాయుగములో జరగియుండెననియుఁ గొందఱనుచుండిరి. అయ్యది వివాదాంశము. ఈ వివాదము నుండనిచ్చి ప్రస్తుతము జరుగుచున్న మహాయుగమునందలి త్రేతాయుగములోనే రామాయణకథ జరగియుండుననిఁ యెంచి నను ఇప్పటివఱకుజరగిన కలియుగాబ్దములు 5030, ద్వాపరయుగ కాలపరిమితి వత్సరములు 864000 లును గలిసి 869030సంవత్సరములక్రిందటఁ త్రేతాయుగముపరిసమాప్తి నొందినట్లుఁ గనుపట్టు చున్నది. రామాయణకథానాయకుఁడగు శ్రీరామచంద్రమూర్తి లోకకంటకుఁడగు రావణవధానంతరము పదునొకండువేల సంవత్సరములు రాజ్యమును బాలించినటులఁ జెప్పెదరు. కావున యిప్పటికి 880030 సంవత్సరములకుఁ బూర్వము అనగా క్రీ. పూ. 8,78,101 సంవత్సరములకు బూర్వము రామాయణ కథా

కాలము జరగియుండినటులఁగన్పట్టును. భారతీయులచరిత్రాంశము లకు సంబంధించిన యిక్కాలపరిమితియు, నీప్రాచీనతయు, 6000 వత్సరములకు మించని సృష్టిపరిమితిగల కాలవిధానమున కల వాటువడిన కొందఱు పాశ్చాత్యపండితులను విభ్రమసముద్రము ధినిఁ బడవైచి తలక్రిందులు చేసివైచియుండెననుటకు సంది యము లేదు. వారు నంగీకరించిన నాచ్యవి తామము సేయఁ దలపెట్టిన సిద్ధాంతములకుఁ బ్రతిబంధములుగఁ గన్పట్టుచుండెను. హైందవుల వాఙ్మయమును బూర్తిగ కాల్పనికములన సాహ సించఁజాలకుండిరి. తమ సిద్ధాంతములకుఁ బ్రతిబంధకంబులుగఁ గన్పట్టు విషయములుకొన్ని నూతనసృష్టి యనిరి. కొన్ని అతి శయోక్తులనిరి. కొన్ని యీ మధ్యకాలములో నిముడ్పఁబడి యుండెననిరి. ఇటుల నేమేమియో సమాధానముల వ్రాసియుం డిరి. వ్రాయునకాని మానసము ననుసరించి లేఖిని (కలము) సాగుచుండునుగదా! కొందఱు భారతీయులుసైతము మూర్ఖులై తల నామోదించి వంతపాటలు పాడసాగిరి. చిట్టచివఱకు ప్రొఫెసరు వీబరు (Prof. Weber) పండితుఁడు రామాయణ కథ మిథ్యయన సాహసించెను. రామాయణకథ కేవల మార్యుల వ్యవసాయవృత్తిని బోధించు కట్టుకథ యనిరి.[1] గణిత శాస్త్రమునం దొకవస్తువునకు సమానమగు వస్తువులన్నియు నొకదానితో నొకటి సమానములని నిర్వచింపఁబడియుండు దాని నాధారము గావించుకొని వీబరు పండితుఁడు కుతర్కముఁ

1 Vide- Weber's Indian Literature- page 192.

గావించినటులఁ గన్పట్టుచున్నది. వారి వాదపటిమ చదువరులు గమనించుటకై నీక్రింద నుల్లేఖింపఁబడినది.

" But in Ramayana we find ourselves from the very outset in the region of allegory; and we only move upon historical ground in so far as the allegory is applied to an historical fact, namely, to the spread of Aryan Civilisation towards the South, more especially to Ceylone. The characters are not real historical figures, but merely personifications of certain occurances and situations. Sita, in the first place, whose abduction by a giant demon, and subsequent recovery by her husband Rama, constitute the plot of the entire poem, is but the field-furrow, to which we find divine honours, paid in the songs of the Rik, and still more in the Grihya Ritual. She accordingly represents Aryan husbandry, which has to be protected by Rama whom I regard as originally identical with Balarama, " halabhrit," "the Ploughbearer," though the two were afterwards separated against the attacks of the Predatory aboriginese........."§

" రామాయణము మొదటినుండియు రూపకాలంకార మండలములో నున్నట్లు కనుగొనుచున్నారము. చరిత్రాంశముల కా రూపకాలంకారము వర్తింపఁజేసినంతవట్టుకు మనమును జరిత్రవిషయమే కనుఁగొందము. అది యేదియన, దక్షిణదేశమున—ముఖ్యముగ సింహళమున—ఆర్యుల

§ Vide. Weber's Indian Literature- page I92.

నాగరకతను ప్రవేశపెట్టుట. అందు చెప్పఁబడిన పేరులు యథార్థ చారిత్రమున జెప్పఁబడియుండు వ్యక్తులుగావు. అయ్యవి సంఘటనలకును, బరిస్థితులకును వ్యక్తిస్వరూపమును గల్పించి నామకరణములు జేసినవై యున్నవి. రాక్షసరాజుచేఁ దోలుత సీత గొంపోఁబడుటయుఁ బిదప భర్తయగు రామునిచేఁ దిరిగిస్వాధీనము జేసికొనఁ బడుటయు నీ కథకంతకును మూలమై యున్నది. సీతయన నాగటిచాలు. దీనినిగుఱించి ఋగ్వేదమునందును, గృహ్యసూత్రములయందును బ్రశంసలు గలవు. కావున సీతామె యార్యుల వ్యవసాయవృత్తి చిహ్నముగా నున్నది. అయ్యది రామునివలన రక్షింపఁబడవలసియుండెను. అనిచెప్పుచుండు నాదిమనివాసులపై నొనర్చిన పోరాటములలో చేర్చఁబడుగాఁ జెప్పఁబడియుండినను, 'హాలభృతుఁడును నాగలిమోయువాఁడు' నగు 'బలరాముఁడును' రాముడు నొక్కరే యని(ఒకేవ్యక్తియని) నే నెంచుచున్నాను."[1]

హిందువుల పురాణేతిహాసాది గ్రంథములలో శ్రీరామచంద్రమూర్తియు, బలరాముఁడును విష్ణువు యొక్క అవతారములని చెప్పఁబడి యుండుటచేతను, బలరామునకు హాలభృతుఁడని మఱియొక పేరుండుటచేతను, హాలభృతుఁడనగా నాగలిమోయువాఁడని యర్థముండుటచేతను, నాగలిని వ్యవసాయదారుఁడు మోయుచుండునుగాన వ్యవసాయదారునకు రాముఁ

1. Weber's Indian Literature-Page 192.

డని వ్యక్తీకరించి యుందురనియు, సీతయన నాగటిచాలని యర్థముండుటచేతను, శ్రీరామచంద్రమూర్తి భార్య సీతయని చెప్పబడియుండుటచేతను, వ్యవసాయదారుఁడు నాగలిచే భూమిని దున్నుటవలన నాగటిచాలేర్పడుచున్నదిగాన భూమిని దున్ని వ్యవసాయమును జేయుపద్ధతిని జెప్పుటకొఱకుగాను రామాయణ కథ చెప్పఁబడియుండెననియు, గావున రామాయణ మార్యుల వ్యవసాయవృత్తినిబోధించు కట్టుకథయనియు, నిక్కమగు చరిత్రను తెలియఁజేయునదిగాదనియు, రామాయణకథ మిథ్యయనియు ప్రొఫెసరు వీబరు పండితుఁడు సిద్ధాంతముచేయు సాహసించెను. త్రేతాయుగమునందు జన్మించినట్లు చెప్పఁబడు శ్రీరాముఁడును, ద్వాపరయుగాంతమున జన్మించినట్లు చెప్పఁబడు బలరాముఁడును నొక్కరేయని తలఁచెదరఁట!

వేదకాలము రామాయణకథాకాలమునకంటె నింకను దాదాపు ముప్పదిలక్షల సంవత్సరములు వెనుకకుఁబోవును. రామాయణ కథాకాలమునకే విభ్రాంతిఁజెందు పాశ్చాత్య పండితులు వేదకాలమంతకంటెను బ్రాచీనమైనదని యొప్పుకోందురా? వేదములిటీవలి వనిరి. పాణిన్యాచార్యునకుఁ బూర్వము హైందవులకు వ్రాయుటయే తెలియదనిరి. క్రీస్తు జనించుటకుఁ బూర్వము షుమారు 15 శతాబ్దములక్రిందట వేదములు చెప్పఁబడి యుండుననిరి. సంహితలు, బ్రాహ్మణములు, ఉపనిషత్తులు, మున్నగునవి క్రమక్రమముగఁ దరువాతి కాలములందుఁ బుట్టఁబడియెననిరి. భారత రామాయణాదులు నిన్న మొన్నటి

వనిరి. ఏది యెట్టులున్నను బాశ్చాత్యవిద్వాంసుల వాదోపవాద ముల గమనించిన హైందవవాఙ్మయ, చరిత్ర, నాగరక,విజ్ఞాన, వైద్య, వైభవాదులన్నిటియందుఁగల ప్రాచీనతను నిర్మూలముగావించి యాధునికత్వము నారోపించుటయే ముఖ్యోద్దేశముగలిగి యట్టి కుతర్కములఁ గావించుచు విపరీతసిద్ధాంతములఁ జేయఁగడంగినటులఁ గన్పట్టకమానదు.

"హిందువుల సంబంధమగు సర్వమున కాధునికత్వము నాపాదించుటయే యూరపుఖండవాసులగు పండితుల లోను, బురాతత్త్వవిమర్శకులలోను ఎక్కువమంది యభిప్రాయమైయున్నది."

"The tendency of most European Scholars and antiquarians is to modernise every being Hindu."

అని ప్రొఫెసరు భాండార్కరు పండితుఁడును,

"కారణములరయుటకుముందే నిశ్చయించుకొనఁబడిన యీ సిద్ధాంతములు వానిప్రాచీనతను నాశముచేయుచున్నవి. వారు కోరినదానినే స్వప్నమునఁగాంతురు. వారి స్వప్నములను వారునమ్ముచుందురు" అని చెల్లంగివర్త్ చెప్పినటుల వీరిట్లు నిర్ణయించుటకు వీరికేమియధికారముఁ గలదో? ఇట్టిసిద్ధాంతము లక్రమములు. నేనీసందర్భమున సవినయముగ నా యసమ్మతిని తీవ్రముగఁ బ్రకటించుట నా విధియని తలంచుచున్నాను."

"These foregone conclusions are doing damage to its antiquity. To borrow Chellangworth's lan-

guage "They dream what they desire and believe their own dreams."— "What right has he to express or feel likings"—"I feel bound to lodge my humble but Emphatic protest on this present occasion."

అని జస్టిస్ టిలాంగు (Mr. Justice Telang) పండితుఁడును పాశ్చాత్య విద్వాంసులయొక్కయు జరిత్రకారులయొక్కయు సిద్ధాంతములను విమర్శించి చెప్పినవాక్యములు సత్యములని తోఁపకమానవు.

వేదములప్రశంస రామాయణమునందును, భారతమునందును జేయఁబడియున్నది. భారతీయులు మహాభారతయుద్ధకాలము రామాయణకథాకాలమునకంటె నర్వాచీనమైయుండినటులఁ జెప్పుచుండిరి. మహాభారతయుద్ధము జరిగినదనుట నిర్వివాదాంశము. భారతదేశ చరిత్రాంశములును భారతయుద్ధకాలమునుండియు, నాతరువాతఁ బ్రవేశమైన యుక్కలియుగాదినుండియుఁ బేర్కొనఁబడుచున్నవి. భారతయుద్ధకాలము ప్రాచీన భారతదేశ చరిత్రాంశములఁ గనుఁగొనుటకుఁగూడ నొక యాధారముగఁ గానిపించుచున్నది.

## భారతయుద్ధ కాలనిర్ణయము.

### భారతయుద్ధకాలమును గుఱించిన సిద్ధాంతములు—వాని విమర్శనములు.

మహాభారతయుద్ధకాలమును క్రీ. పూ. 20 వ శతాబ్దమునుండి మొదటి శతాబ్దమువఱకు నడుమనుండు సంవత్సరము

లలోఁ గొందఱు ప్రాశ్చ్య పాశ్చాత్యవిద్వాంసులు వారి వారి యిష్టమువచ్చినరీతిని సిద్ధాంతముల నల్లియుండిరి. మాసిడో నియా దేశపురాజగు అలెగ్జాండరుచక్రవర్తి (అలకసుందర చక్రవర్తి) హిందూదేశముమీఁదికి దండయాత్ర సలిపినపుడు ప్రాచ్యదేశమును బరిపాలించుచున్నటుల గ్రీకు చరిత్రకారులచేఁ బేర్కొనఁబడిన సాండ్రకోటస్ లేక సాండ్రసిప్టస్ అను రాజు మౌర్యవంశీయుఁడగు చంద్రగుప్తుఁడై యుండుననియు, మౌర్య చంద్రగుప్తుని పరిపాలనము క్రీ. పూ. 327 సంవత్సరమునుండి ప్రారంభమయి యుండెననియుఁ జంద్రగుప్తునకుఁ బూర్వము పరిపాలనమొనర్చిన నందుని పరిపాలనాప్రారంభకాలమునకును జంద్రగుప్తుని రాజ్యారంభకాలమునకును మధ్య 100 సంవత్సరముల వ్యవధియుండెననియు, నందుని పట్టాభిషేకమునకుఁ బూర్వము 1015, లేక 1050, లేక 1115 సంవత్సరముల క్రిందట కలియుగకాలము ప్రారంభమైయుండుననియు, మౌర్య వంశ్యుఁడగు చంద్రగుప్తుఁడు క్రీ. పూ. 322 సంవత్సరమున రాజ్యమును బాలించుచుండినటుల నేర్పరించుకొని పురాణము లలోఁ జెప్పఁబడిన రాజవంశములయొక్కయు నా యా రాజ వంశములలోఁ బరిపాలన సల్పియుండినటులఁ జెప్పఁబడిన రాజుల యొక్కయుఁ గాలపరిమితులను ముందువెనుకలకుఁ ద్రోచియు గణితములువేసి యావిధి సిద్ధాంతములఁ గావించియుండినటులఁ దోఁచుచున్నది. పరీక్షితుని జన్మమును, యుధిష్ఠిర పట్టాభిషేక మును, మహాభారతయుద్ధమును గలియుగారంభమునకుఁ బూర్వము ముప్పదియేడు సంవత్సరములకిందట జరగియుండినటులఁ

ఁబడియుండినను, నయ్యవి యన్నియు నేకకాలమునందే యుండినటులనెంచి కొందఱు సిద్ధాంతములఁ గావించి ఁ దోఁచెడిని.

## పర్గిటరుపండితుని సిద్ధాంతము.

ఇదివఱలోఁ గలకత్తా యున్నతన్యాయస్థానమున న్యాయపతిగానుండిన జస్టిస్. యఫ్. యి. పర్గిటర్ (Justice .. Pargiter) పండితుఁడు కలియుగము క్రీ. పూ. 1733 త్సరమునఁ బ్రారంభమైనట్లు జెప్పియుండిరి.[1] ఈపర్గిటరు ఁడే కలియుగములోని రాజవంశము (Dynasties of the Age) లనుదానిని వ్రాయుటలో మహాభారతయుద్ధము రా. 1810 సంవత్సరమున జరగియుండెనని చెప్పియుండిరి. తుని జననకాలమునుండి యనఁగా భారతయుద్ధ కాలము నందవంశ్యుఁడగు మహాపద్మనందుని రాజ్యపరిపాలనా భ కాలమువఱకుమధ్యగలకాలమున బృహద్రథవంశములో ాధి' మొదలు 'రిపుంజయుని' వఱకు 22 రాజులు 920 సరముల కాలమును, వారియనంతరము ప్రద్యోతనవంశీ 5గురు 138 సంవత్సరములును, ఆ ప్రద్యోతనుల యనం శిశునాగవంశీయులు పదిమందిరాజులు 330 సంవత్సర కాలమును రాజ్యభారమువహించి పరిపాలించియుండి , నమ్మూఁడు వంశములవారలు (920 + 138 + 330) సంవత్సరములు పరిపాలనము జేసియుండిరనియు, దామది

[1] R. A. S. of 1910 His paper [on Ancient Indian Geneologies & ...onology.

వఱలోఁ జెప్పియుండినప్రకారము మహాపద్మనందుని పరిపాలనా వత్సరము క్రీ. పూ. 422 సంవత్సరమయి యున్నందున మహాభారతయుద్ధము క్రీ. పూ. 1810 (1388 + 422) సంవత్సరమున జరగియుండుననియు సిద్ధాంతీకరించి యుండిరి.

## శ్రీ శచంద్రవిద్యార్ణవుని సిద్ధాంతము.

గ్రీకులచేఁ బేర్కొనఁబడినటులఁ జెప్పంబడు సాండ్రి కోటస్ లేక సాండ్రిసిప్టస్ యనునతడు మౌర్యవంశ్యుఁడగు చంద్రిగుప్తుఁడేయను భ్రిమము కొందఱు భారతీయవిద్వాంసులను గూడ నావరించియుండినటులఁ గన్పట్టెడి. అట్టిభ్రిమలో మునింగియే రాయబహద్దరు శ్రీ శచంద్రివిద్యార్ణ వుఁడు సైతము కలిగము క్రీ. పూ 1733 సంవత్సరమునఁ బ్రారంభమైనటులఁజెప్పియుండిరి.1 అందు శ్రీ శచంద్రివిద్యార్ణవుఁడు మహాభారత యుద్ధకాలమును గలియుగ ప్రివేశకాలమును నొకేకాలమైనటులనే చెప్పియుండిరి. గ్రీకులచేఁ బేర్కొనఁబడిన సాంద్రకోటసు' మౌర్యవంశజుఁడగు 'చందంగుప్తుఁడ' ని పాశ్చాత్య విద్వాంసులు గలిగించిన భ్రిమమే వారిని సంపూర్ణముగ నావరించి యట్టి సిద్ధాంతముల బ్రితిపాదించుటకుఁ బురికొల్పియుండెనని చెప్పుటకు వారిచేఁ జెప్పఁబడిన యీక్రిందివాక్యములే తార్కాణములు.

" The method of calculation adopted by the Puranas, however, is to take Nanda as the starting point. The last of Sisunaga was Mahanandi,

1 See. Appendices to the English Translation of the Matsya Purana in the Sacred Books of the Hindus' series.

who had a son by a Sudra woman. He was known as Mahapadma or the famous Nanda, whose eight sons succeeded him. This Nanda family was brought to an end by the Indian Machiavelli, Kautilya or Chanakya. Chandra Gupta was placed on the throne of the Nandas by the King-maker, Chanakya. About this event Mr. V. A. Smith says:—

"Mahanandin, the last of the Dynasty, is said to have had by a Sudra or low caste woman, a son named Mahapadmanandin who usurped the throne, and so established the Nanda Family or Dynasty. This event may be dated in or about B. C. 372."

"The Greek or Roman historians........ ranking as contemporary witnesses throw a light on real history. When Alexander was stopped in his advance at the Hyphasis, in 326 B. C. he was informed.... ........that the King of the Prachi etc., .... .... .... .... was Xandrames or Agramis."

"The reference of this King is evidently to one of the Nandas. The date of the acession of Nanda is calculated from that of Chandra Gupta, Maurya, who ascended the throne in B. C. 322. The Nanda Dynasty according to Mr. Vincent Smith, lasted for 50 years, when it was replaced by the Maurya. So adding 50 to 322, the above figure 372 B.C. is arrived at by Mr. V. A. Smith as the date of the acession of Mahapadma Nanda. But all the Puranas are unanimous in stating that the Nine Nandas reigned for 100 years, and we have taken that in our calculations. The date of

acession of Mahapadma Nanda would, therefore, be 422 B. C. instead of 372 B. C."

This 422 B. C. is the starting point backwards and forwards in Puranic calculations.

Chandra Gupta, Maurya, displaced the Nanda Family. The nine Nandas reigned for 100 years. Before that, there was the Sisunaga Dynasty, and before which there was the Pradyota Dynasty, and before that the Brihadradhas. The following table shows the periods of the reigns of these dynasties:—

| | |
|---|---|
| 1. Chandra Gupta | 322 B. C. |
| 2. Nanda Dynasty | 100 years. |
| 3. Sisunagas | 360 " |
| 4. Pradyotas | 152 (?) " |
| 5. Barhadradhas from the time of Chaidyoparicharn | 1000 " |
| Total.... | 1612 |
| Deduct from Chaidya to Sahadeva. | 171 |
| Balance.... | 1441 |
| adding | 322 |
| | 1763 B.C., |

the year of the Great War.

The Mahabharata War took place when Sahadeva of Barhadradha Family was King. From Vasuchaidya Uparichara up to Sahadeva there was 13 Kings, namely (1) Vasuchaidya Uparichara, (2) Brihadradha, (3) Kusagra, (4) Vrishabha, (5) Punyavan or Pushpavan, (6) Punya or Pushpa, (7) Satya Dhrithi, (8) Dhanusha, (9) Sarva, (10) Sambhava, (11) Brihadradha,

(12) Jarasandha, (13) Sahadeva. After Sahadeva there were 19 or 32 Kings (or 22 according to Mr. Pargitor) upto Ripunjaya, the last. The Great War therefore took place, on the above assumption, one thousand four hundred and forty one years before the accession of Chandra Gupta in B. C. 322 or in other words that the Great War took place in or about 1763 B. C."

"పురాణములలో నందునినుండియే కాలపరిమితిని జేసియుండిరి. శిశునాగులలోఁ గట్టకడపటివాఁడు మహానందుఁడు. ఆతనికి శూద్రవనితయం దొకకుమారుఁడుండెను. ఆతనిపేరు మహాపద్మనందుఁడు. ఆతనికుమారు లెనమండ్రుగురు. వాని యనంతరము పరిపాలించిరి. ఈనందవంశము భారతీయ మెకివెల్లి (Machivelle) యని పేర్వడసిన కౌటిల్యుఁడను నామాంతరముంగల చాణక్యునిచే సంతమొందింపఁబడినది. ఈ విషయముంగూర్చి విన్సెంటు స్మిత్తు (Mr. Vincent Smith) గారిటులఁ జెప్పియుండిరి."

"ఈవంశమునఁ జిగురువాఁడగు మహానందునకు శూద్రవనిత లేక తక్కువజాతి వనితవలన మహాపద్మనందుఁడను గుమారుఁడు గలిగెను. ఆతఁడు సింహాసన మాక్రమించుకొని నందవంశమును స్థాపించెను. ఈ విషయము క్రీ.పూ. 372 సంవత్సరములోఁగాని యా ప్రాంతములోఁగాని జరిగియుండవచ్చును."

'సమకాలిక నిదర్శకులగు గ్రీకు రోమను చరిత్రకారులు నిజమయిన చారిత్రకవిషయములు విస్పష్టమొనర్చుచు

న్నారు. క్రీ. పూ. 326 సంవత్సరములో హైఫాసిస్ నదీ ప్రాంతముల ముందుకుజరుగనీకుండ నలెగ్జాండరున కడ్డువడి నపుడు ప్రాచ్యదేశపురాజు గ్జాండ్రేమ్సు (Xandrames) లేక అగ్రిమిస్ (Agramis) అనువాఁడై యుండెనని చెప్పఁ బడియున్నది."

"ఈచెప్పఁబడిన రాజు సాక్షాత్తు నందులలో (నంద రాజులలో) నొకఁడై యున్నాఁడు. క్రీ. పూ. 322 సంవత్స రమున సింహాసనాధిష్ఠుఁడైన మౌర్య చంద్రగుప్తుని కాలము నుండి నందుఁడు సింహాసనమెక్కిన కాలమువఱకు లెక్కించ బడుచున్నది. విన్సెంటు స్మిత్తు పండితుని సిద్ధాంతము ననుస రించి నందునివంశ మేఁబదిసంవత్సరములు పరిపాలించియుం డెనని వ్యక్తమగుచున్నది. అంతట రాజ్యము మౌర్యవంశ జుల పరమయ్యెను. గనుక విన్సెంటు స్మిత్తు పండితుఁడు 322 సంవత్సరమున కేఁబదినిజేరిచి మహాపద్మనందుఁడు రాజ్యము నకువచ్చిన వత్సరము క్రీ. పూ. 372 సంవత్సరమని తేల్చి యున్నాఁడు. కాని పురాణములన్నియు నైకకంఠముగ నవ నందులు 100 సంవత్సరములు రాజ్యమును బాలించినటులఁ జెప్పుచున్నవి. మేమును దాని ననుసరించియే లెక్కవేయు చున్నారము. కనుక మహాపద్మనందుఁడు సింహాసనాధిష్ఠితు డయినవత్సరము క్రీ. పూ. 372 సంవత్సరమునకు బదులు క్రీ. పూ. 422 సంవత్సరమునందె యైయుండును."

"పురాణములందుఁ జెప్పబడినప్రకారము పూర్వోత్తర కాలపరిమితి నిర్ధరించుటకుఁ గ్రీ. పూ. 422 సంవత్సరమే ప్రాదిపదికయై యున్నది."

మౌర్యవంశీయుఁడగు 'చంద్రగుప్తుఁడు' నందవంశమును దొలఁగించెను. నవనందులు 100 సంవత్సరములు పాలించిరి. అంతకుముందు శిశునాగవంశజులును, వారికిఁబూర్వము ప్రద్యోతన వంశజులును, వారికిముందు బార్హద్రథులును బరిపాలించిరి. వారలెంతెంతకాలము పరిపాలించినది యీక్రింది పదకమువలనఁ దెలియఁగలదు.

| | | |
|---|---|---|
| 1. చంద్రగుప్తుని రాజ్యప్రారంభము. క్రీ. పూ. 322. | | |
| 2. నందవంశము | 100 | సంవత్సరములు |
| 3. శిశునాగులు | 360 | ,, |
| 4. ప్రద్యోతనులు | 152(?) | ,, |
| 5. చైద్యోపరిచరుని దగ్గరనుండి బార్హద్రథులు. | 1000 | ,, |
| మొత్తం | 1612 | ,, |
| చైద్యునిదగ్గరనుండి సహదేవునివఱకు మధ్యగలకాలము తీసివేత. | 171 | ,, |
| గాక నిల్వ | 1441 | ,, |
| చేర్చవలసినది | 322 | ,, |
| మొత్తము | 1763 | క్రీ. పూ. |

భారతయుద్ధకాలము.

బార్హద్రథ వంశీయుఁడగు సహదేవుఁడు పరిపాలించు కాలమున మహాభారతయుద్ధము జరగియుండెను. వసుచైద్యోపరిచరునిదగ్గరనుంచి సహదేవునివఱకుఁ బదమూఁడురు రాజులు పాలించియుండిరి. వారు (1) వసుచైద్యోపరిచరుఁడు, (2) బృహద్రథుఁడు, (3) కుశాగ్రుఁడు, (4) వృషభుఁడు, (5) పుణ్యవానుఁడు లేక పుష్పవానుఁడు, (6) పుణ్యుఁడు లేక పుష్యుఁడు, (7) సత్యధృతుఁడు, (8) ధనుషుఁడు, (9) సత్వుఁడు, (10) సంభవుఁడు, (11) బృహద్రథుఁడు, (12) జరాసంధుఁడు, (13) సహదేవుఁడు. సహదేవుని యనంతర మావంశమునఁ గడపటివాఁడగు రిపుంజయుని పర్యంతము 19 లేక 32 రాజులు (పర్గిటరుమతము ననుసరించి 22 రాజులు) పాలించియుండిరి. పైఁజెప్పఁబడిన ప్రకారము క్రీ. పూ. 322 సంవత్సరమునఁ జంద్రగుప్తుఁడు రాజ్యమునకు రాకపూర్వము 1441 సంవత్సరముల క్రిందట మహాభారతయుద్ధము జరగియుండెను. అనఁగా క్రీ. పూ. 1763 సంవత్సరములోఁగాని యాప్రాంతములఁగాని మహాభారతయుద్ధము జరగియుండెను."

శ్రీ శచంద్రవిద్యార్ణవుఁడీవిధముగఁ దొలుత సిద్ధాంతము జేసియుండియుఁ బిమ్మట మహాభారత యుద్ధకాలము క్రీ. పూ. 1922 సంవత్సరములో జరగియుండెనని మఱియొక సిద్ధాంతమును జేసియుండెను. ఈ రెండవసిద్ధాంతము చేయు పట్టున నీవిధముగఁ జెప్పియుండిరి.

"It may be noted here that though the Vishnu Purana repeats the traditional verse that 1050 years was the interval between the inauguration of Nanda, and the birth of Parikshit; yet the totals given by it are approximately, the same as those given by the Matsya Purana. It says the Barhadradhas reigned for 1000 years from Somadi (our figure is 920 years from Somadi to Ripunjaya.) It then gives the reign of Pradyotas as 138 years which coincides with our figure. The Sisunagas reigned for 362 years according to the Vishnu Purana. Thus the total of these figures is 1500 (1000 plus 138 plus 362) years. This would give the year of the Mahabharata War as 1922 B. C. Thus whether we take 1922 B. C. of the Vishnu Purana or 1763 B. C. according to one calculation or 1810 B. C. according to Mr. Pargiter, we can fairly say that the figure 1477 B.C. given in the dictum of the above verse, is untenable. Therefore we repeat that for the present, we take 1922 B. C. as the year of the Great War."

"పరీక్షితుని జన్మమునకును నందుని పట్టాభిషేకమునకును నడుమనుండు కాలము 1050 సంవత్సరములని విష్ణుపురాణమునందొక శ్లోకము చెప్పుచున్నను, నందుఁజెప్పఁబడిన పరిపాలనావత్సరముల మొత్తము మత్స్యపురాణములోఁ జెప్పబడిన మొత్తమునకుఁ గొంచెమించుమించుగ సరిపోవుచున్నదని యిచ్చట మనము గుఱుతింపవలసియుండును. సోమాదికాలమునుండి బార్హద్రధులు 1000సంవత్సరములు

పరిపాలించియుండిరి. (సోమాదినుండి రిపుంజయునివఱకుఁ బరిపాలనావత్సరములు మా లెక్కప్రకారము 920 అయి వున్నవి.) ప్రద్యోతవంశజుల పరిపాలనము 138సంవత్సరము లని చెప్పఁబడినది. అయ్యది మాలెక్కకు సరిపోవుచున్నది. విష్ణుపురాణములోఁ జెప్పఁబడినప్రకారము శిశునాగ వంశ్యులు 362 సంవత్సరములు రాజ్యమును బాలించియుండిరి. కనుక వీనిమొత్తము 1500 (1000 + 138 + 362)సంవత్సరము లగుచున్నవి. ఈలెక్క మహాభారతయుద్ధము క్రీ. పూ. 1922 సంవత్సరమున జరగియుండినటులఁ జెప్పుచున్నది. విష్ణుపురాణము ననుసరించి భారతయుద్ధకాలము క్రీ. పూ. 1922 సంవత్సరమనిగాని, మఱియొక గణితముం బట్టి క్రీ. పూ. 1763 సంవత్సరమనిగాని, పర్గిటరు పండితుఁడు చెప్పియుండినటులఁ గ్రీ. పూ. 1810 సంవత్సరమనిగాని యెంచినను పై శ్లోకమువలన విదితమగు క్రీ. పూ. 1477 సంవత్సర మనువాదముమాత్రము నిలువనేరదని స్పష్టముగఁ జెప్పఁదగియున్నది. కాఁబట్టి మహాభారతయుద్ధము క్రీ. పూ. 1922 సంవత్సరమున జరిగియుండినట్లు తాత్కాలికముగ సిద్ధాంత పఱుచుచున్నారము.

వీర లెవ్విధముగ లెక్కలువేసి గుణించినను గ్రీకులచేఁ బేర్కొనఁబడిన'సాంద్రకోటస్''సాంద్రసిప్టస్' (Sandracottus Sandracyptus) అను నతఁడు మౌర్యవంశ్యుఁడగు చంద్రగుప్తుఁడని సిద్ధాంతపఱచుకొని భారతయుద్ధకాల నిర్ణయమునకుం

గడంగినటుల స్పష్టమగుచున్నది. వీరాధారముగఁ దీసికొనిన విష్ణుపురాణములోని శ్లోకము

"యావజ్జన్మ పరీక్షిత్తు తావన్నందాభిషేచనమ్ ।
ఏకమేవసహాస్రంతు జ్ఞేయం పంచాశదుత్తరమ్॥"

అనునదిగానె యుండునని దోచుచున్నది. ఈశ్లోకముయొక్క యదార్థరూపమును కనుఁగొనఁ బ్రయత్నము సేయకున్నను మత్స్యపురాణమునందలి వచనములనుబట్టి మహాపద్మనందుని పట్టాభిషేక కాలమునకును పరీక్షితుని జననకాలమునకును నడుమనుండు కాలవ్యవధి 1500సంవత్సరములై యుండుననియే యంగీకరించి విష్ణుపురాణములోని పాఠాంతరమును వ్రాసివైచి యుండిరి. గ్రీకులచేఁ బేర్కొనఁబడిన 'సాంద్రకోట్టసు', సాంద్ర సిప్టసు' అనునతఁడు మౌర్యవంశీయుఁడగు చంద్రగుప్తుఁడవునా, కాదా, కానిచో నేచంద్రగుప్తుఁడై యుండునను విషయములు గూడఁ జర్చనీయాంశములుగఁ గన్పట్టుచున్నవి.

## కల్హణపండితుని సిద్ధాంతము.

ఈసిద్ధాంతము లిట్లుండ వరాహమిహిరాచార్యునిచేఁ జెప్పఁబడిన

"శ్లో॥ ఆసన్మఘాసుమునయః
శాసతిపృథ్వీం యుధిష్ఠిరేనృపతౌ ।
షడ్ద్వికపంచద్వియుతః
శకకాలస్తస్యరాజ్ఞస్య॥"

అనుశ్లోకము నాధారముజేసికొని శకకాలమునకును యుధిష్ఠిరునకును మధ్యగనుండు కాలవ్యవధి 2526 సంవత్సరములని చెప్పఁబడియుండుటచే, మహాభారతయుద్ధము క్రీ. పూ. 2448 (2526-78) సంవత్సరమున జరగియుండినటుల మఱియొక సిద్ధాంతమును గల్హణపండితుఁడు సూచించియుండెను. అందు దహరింపఁబడిన శకకాలము క్రీ. శ. 78 సంవత్సరమునఁ బ్రారంభమయిన శాలివాహన శకకాలమున కంటఁగట్టియే యట్లుసూచించిరని ద్యోతమగుచున్నది. కురుపాండవులు కలియుగము 653 సంవత్సరములు గతించినతరువాత నుండినటులీ క్రింది శ్లోకమును గల్హణపండితుఁడు చెప్పియుండెను.

"శ్లో॥ శతేషుషట్సు సార్ధేషు త్ర్యధికేషుచ భూతలే ।
కలేర్గతేషువర్షాణా మభూవన్ కురుపాండవాః॥$

పురాణములు మున్నగు ప్రాచీనహైందవ వాఙ్మయము సప్తర్షులు మఘానక్షత్రములో 75 సంవత్సరములుండినపిదప గలియుగము ప్రవేశమై యుండెననియుఁ గలియుగ ప్రవేశమయిన 25 సంవత్సరములతరువాత ఆశ్లేషానక్షత్రమునఁ బ్రవేశించిరనియు, నాకాలమున యుధిష్ఠిరుఁడు స్వర్గారూఢుడయ్యెననియు, నపుడే యుధిష్ఠిరుని జ్ఞాపకార్థము లోకమున లౌకికాబ్దమేర్పాటు కాఁబడియుండెనియుఁజెప్పుచుండ, అనఁగా క్రీ.పూ. (3102-25) =3077 సంవత్సరమున యుధిష్ఠిరుఁడు స్వర్గారూఢుఁడయ్యెననియు, నదియె లౌకికాబ్దము ప్రారంభమనియుఁ జెప్పుచుండ, వానినిబట్టి కురుపాండవులకు జరిగిన మహాభారతయుద్ధము

$ Raja Tarangini- I Tarangam- 5I verse.

కలియుగప్రవేశమునకుఁ బూర్వము జరగియుండినటులఁ గానిపిం చుచుండ, కల్హణపండితుఁ డావిషయములను గమనించకనే వరాహామిహిరునిశ్లోకమునఁ బ్రస్థావించఁబడిన శకకాలము శాలివాహన శకకాలమను భ్రమప్రమాదమునకులోనయి యుధిష్ఠిరుఁడు కలియుగప్రవేశమయినపిమ్మట 653 సంవత్సరమునఁ బుట్టెనని సూచించియుండినటులఁ దోఁచుచున్నది. వరాహామిహిరునిచేఁ జేర్కొనఁబడిన శకకాలము శాలివాహన శకకాల ప్రశంసయని కల్హణపండితుఁ డూహించుటయే యిట్టివిపరీత సిద్ధాంత ముపపాదింపఁబడుటకు హేతువయియుండెను.

## తిబాటు, సుధాకరద్వివేది పండితుల సిద్ధాంతములు.

మహామహోపాధ్యాయ సుధాకరద్వివేది, డాక్టరు. జి. తిబాటు ( Dr. G. Tibaut ) మున్నగు పండితులుగూడఁ గల్హణపండితుని త్రోవనేత్రొక్కి భారతయుద్ధకాల నిర్ణయము గావించియుండిరి. వరాహామిహిరునిచేఁ జెప్పఁబడిన "ఆసన్మఘాసుమునయః......" అను శ్లోకమునందును, బృహత్సంహితయందును బేర్కొనఁబడిన శకకాలము శాలివాహనశకకాల ప్రశంసయా, లేక మఱియొక శకకాలప్రశంసయా, మఱియొకశకకాల ప్రశంసయైనచో నయ్యది యేశకప్రశంస, యను విషయనిర్ధారణ మొనర్పవలసియుండును. ఇప్పట్టున వరాహామిహిరుని కాలమును, నాతనికాలమునం దేయేశకములు పేర్కొనఁబడుచుండినదియు యోజింపవలసిన యంశములుగాఁ గన్పట్టుచున్నవి.

## గోపాలయ్యరుగారి సిద్ధాంతము.

ప్రాచీన హిందూదేశచారిత్రికకాలనిర్ణయము (Chronology of Ancient India) ను రచించిన శ్రీయుత వి. గోపాలయ్యరుగారు భారతయుద్ధము క్రీ. పూ. 1193 సంవత్సర ప్రాంతమున జరిగియుండునని చెప్పియుండెను. వారాకాల నిర్ణయ సిద్ధాంతమునకుఁ గల్హణపండితుని రాజతరంగిణియందు యుధిష్ఠిరునకును శకకాలమునకును—నడుమంగల కాలవ్యవధిని దెలియఁజేయుచు వరాహమిహిరునిచేఁ జెప్పఁబడిన

"శ్లో॥ ఆసన్ మఘాస్సుమునయః శాసతిపృథ్వీంయుధిష్ఠిరేనృపతౌ।
షట్ ద్వికపంచద్వియుతః శకకాల స్తస్యరాజ్ఞస్య॥ [1]

అను శ్లోకమునాధారముగాఁ దీసికొని యుపార్థమును గల్పన చేసి వారిష్టమువచ్చినట్లు సవరణ లొనర్చియుండిరి. ఈ శ్లోకమునకు హైందవ పాశ్చాత్యపండితులెల్లఁను,

"యుధిష్ఠిరమహారాజు భూమిఁ బరిపాలించునపుడు సప్తర్షిమండలము మఖానక్షత్రమునందుండెను. అతని పరిపాలనా కాలమునకును—శకకాలమునకును — మధ్యగల కాల వ్యవధి 2526 సంవత్సరములు" అని యర్థముఁ జెప్పుచుండిరి.

యుధిష్ఠిరుని రాజ్యకాలమునకుఁ దరువాత 2526 సంవత్సరములకు శకకాల మేర్పడియుండెనని యీ శ్లోకము ధృవపఱుచు చున్నది. ఇందుఁజెప్పఁబడినయుధిష్ఠిరుడు భారతయుద్ధమునాఁటి పాండవులం దగ్రేసరుఁడని చెప్పుచున్నారు.

---

1 Raja Tarangini- I- 56.

ఈ శ్లోకమునం దుదాహరింపఁబడిన శకకాలము శాలి వాహన శకకాలమని కొందఱును, విక్రమార్క శకకాలమై యుండునని కొందఱును జెప్పుచుండిరి. కొందరయ్యవి రెండును గాదనుచుండిరి. శాలివాహన శకకాలమని యెంచినచో యుధిష్ఠిర రాజ్యపాలనము (2526—78) క్రీ. పూ. 2448 సంవత్సరమును, విక్రమార్క శకకాలమని యెంచినచో క్రీ. పూ 2583 (2526 + 57) సంవత్సరమును గానలసియుండును. అయ్యవి గోపాలయ్యరుగారు చేయఁదలఁచుకొనిన సిద్ధాంతమున కతిరిక్తముగఁ గనుపట్టుచున్నది. అందుఁ దప్పుపడిన దనిరి. నాలవ పాదమునందొకమాత్ర తక్కువనిరి. కల్హణపండితుఁడు పొరపడి యొక మాత్ర తక్కువవ్రైచెనఁట! తమ సిద్ధాంతమున కెట్టుపకరించునాయని యోజించి "శకకాల' యనుదానిని 'శాక్యకాల' యని సవరించిరి. 'శాక్యకాల'మన 'శాక్యముని' (గౌతమబుద్ధుఁడు) క్రీ. పూ. 543 సంవత్సరమున నిర్వాణముఁ జెందినటుల వ్రాసిరి. 'శాక్యకాల'మని సవరణచేసినను దాము చేయఁదలఁచిన సిద్ధాంతమునకింకను బ్రతిబంధకముగనే తోఁచెను. ఏలన యుధిష్ఠిరునికాలము క్రీ. పూ. 3067 (2526 + 543) సంవత్సరమునకు బోవుచున్నది. కానిండు! అట్టులుంచినను గొంచెము యథార్థమునకుఁ దగ్గఱగానే యుండియుండును. కాని వారియుద్దేశ మొకసంవత్సరమున జరగియుండునని సిద్ధాంతము సేయఁదలఁచినటులఁ జూపట్టెడిని. వారనుకొనినట్లు భారత యుద్ధము క్రీ. పూ. పన్నెండవ శతాబ్దమునకెట్లు సరిపోల్పనగునాయని యోచించిరి. మూఁడవపాదమునఁ జెప్పఁబడిన

వత్సరసంకేతమున కపార్థము గల్పించిరి. "షట్ద్వికపంచద్వియుత" యనుదానికి 25 × 26 అని అర్థముచేసి 650 అనిరి. ఆ మొత్తమునకు శాక్యముని నిర్వాణవత్సరమగు 543 ను గలిపి 1193 (650 + 543) జేసి భారతయుద్ధకాలము క్రీ. పూ. 1193 సంవత్సరమయియుండెననిరి. భారతయుద్ధానంతరము 16 సంవత్సరములకుఁ గలియుగప్రవేశమనిరి. కలియుగ ప్రవేశకాలము క్రీ. పూ. 1177 (1193—16) సంవత్సరమనిరి.

వరాహమిహిరునిచేఁ బ్రస్తావించఁబడిన శకకాలమే శక ప్రశంసయనున దటుండనిచ్చి, గోపాలయ్యరుగారి సవరణయు, వ్యాఖ్యానమును, ఎంతవఱకు సమంజసములో కనుగొందము. ఆ శ్లోకమునందలి శకకాలప్రశంస శాలివాహన శకకాలప్రశంస కాదని మఱియొక శకకాలప్రశంస యయ్యుండెననియు వారి యభిప్రాయమైనటుల స్పష్టము. కల్హణపండితునిచేఁ గోడీకరింపఁబడిన శ్లోకముయొక్క నాలవపాదమున నొకమాత్ర తక్కువని 'శకకాల' యనుదానిని 'శాక్యకాల'యని సవరణచేయుట యొకవిషయము, ఒకవృత్తముయొక్క అంతమందుండు లఘువు గురువునకు సమమనుసంగతిని గమనించకను, దాముసేయు సవరణచే నొకమాత్ర యెక్కువగుననియైనను యోజించకను మన అయ్యరుగారు తన సిద్ధాంతమున కనుకూలముగ గనుపించు నట్లు సవరణచేయుట యావశ్యకమని తలంచి 'శాక్యకాల' మనుటకుంగల కారణముల గనుబఱచకనే సవరణ గావించియుండిరేగాని యా శ్లోకము ఛందోబద్ధమనుట వారికిఁదోఁపకుండుటఁ గడు విచారకరము. ఆ శ్లోకముంజెప్పిన వారియుద్దేశమును

'శకకాల'మనియే కాన్పించుచున్నది. కల్యాణపండితునకుఁ బూర్వ మీశ్లోకమును సిద్ధాంతవేత్తలెందఱో యుదహరించియుండిరి. అయ్యరుగారు సూచించినటుల నిజముగ నాశ్లోకము లక్ష్యలక్షణములకుఁ దత్సంప్రదాయములకు భిన్నముగానుండియే యుండినఁ బేరెన్నికఁగాంచిన కవిశ్రేష్ఠులగు వరాహమిహిరుఁ డద్దాని గ్రహింపఁజాలకుండెనందమా ? కల్యాణాది పండితులద్దాని గనుఁగొనఁజాలకుండి రందమా? శాస్త్రీయవిమర్శ (Scientific Criticism)శక్తి వారికిలేదని యనవచ్చునా? క్రీ. పూ. పన్నెండవ శతాబ్దకాలమునకు భారతీయుద్ధకాలమును గొంపోవలెనను అయ్యరుగారి నిశ్చితాభిప్రాయమును గనుఁగొనఁజాలకుండిరనవచ్చునా? ఈ శ్లోకము లక్ష్యలక్షణ సమన్వితముగ నుండెననియు నందుఁ దప్పేమియుఁ గాన్పింపదనియుఁ బలువురు పండితులు చెప్పియుండిరి- చెప్పుచుండిరి.

మఱియు 'షట్ ద్వికపంచ ద్వియుత' అను దానికి 25 × 26 అని అర్థముసేయుట మఱియొక విషయము. అట్లేల గణితము సేయవలసియుండునో అయ్యరుగారు కారణముల నేమియుఁ జూపియుండలేదు. 'ఆఱు, రెండు, అయిదు, రెండు' అను నాలుగంకెలుగలిసి 15 (6 + 2 + 5 + 2) అనియేలఁ జెప్పఁగూడదు? లేక ఆనాలుగంకెల నొకదానితో నొకటి గుణించిన వచ్చెడులబ్ధము 120 (6 × 2 × 5 × 2) అనియేలఁజెప్పరాదు? లేక 1512 (6 × 252) అనియో, గాక 1250 (625 × 2)అనియో యేలఁజెప్పఁగూడదు. ఒకవిధముగ యోచించినచో నాయంకెలుకలిసిన మొత్తమనికాని యొకటితోనొకటి గుణించఁగ

వచ్చెడు లబ్ధమునిగాని యర్థముఁజెప్పినఁ జెప్పవచ్చునేమోకాని 26 ను 25 చే గుణించిన వచ్చెడు మొత్తమని చెప్పుటకేమియు నాధారములు గాన్పింపవు. హిందువులగణితశాస్త్రనియమముల ననుసరించి యంకెల మొత్తములను జెప్పినపుడు కుడినుండి యెడమనైపునకు లెక్కించుకొనవలయుననుపద్ధతి ననుసరించి యాశ్లోకమునఁ జెప్పఁబడిన 'షట్ద్వికపంచద్వి' యను వాక్యము 2526 సంఖ్యను జెప్పుటకయియే యైయుండెనని స్పష్టీకరించి చెప్పదగియుండునేగాని గోపాలయ్యరుగారు సూచించినట్లు 26 ను 25 చే గుణించిన వచ్చుసంఖ్య యనుభావముతో మాత్రము చెప్పఁబడి యుండలేదని స్పష్టముగఁ జెప్పఁదగియున్నది. అందలి భాషాసౌలభ్యముఁబట్టి 2526 అనుటకంటె వేఱువిధముగ నర్థముజెప్పుట కవకాశములేదు. కలియుగము క్రీ. పూ. 3102 సంవత్సరమున ప్రారంభమయినదనియు, ప్రస్తావనశ్లోకములోని సంఖ్య 2526 సంఖ్యయనియుఁ గల్హణపండితుని యభిప్రాయమైనటుల గోపాలయ్యరుగారే యొప్పుకొనియుండిరి. ఈసందర్భములఁబట్టియే కలియుగకాలముంగాని, భారతయుద్ధకాలముంగాని క్రీ. పూ. పన్నెండవ శతాబ్దమునం దయియుండినటులఁ దాముచేయఁదలచుకొనిన సిద్ధాంతమున కననుకూలముగనున్నందున గోపాలయ్యరుగారు శ్లోకపాదము తప్పని సవరణగావించి సంఖ్యార్థసూచకవాక్యమున కపార్థములు గల్పించియుండిరని చెప్పవలసివచ్చుచున్నది.

గోపాలయ్యరుగారు కల్హణపండితునిచే రాజతరంగిణియం దుదాహరింపఁబడిన శ్లోకము ననుసరించియేగాక సిద్ధాంత

వేత్తలగు వరాహమిహిరాదులచే సూచింపఁబడిన అయనగతులు మున్నగు వానింగూర్చి భారతమునఁ జెప్పబడియుండు గ్రహగతులు మున్నగువానిం గూర్చియుఁ జర్చించియుండిరి. వీరే గాక భారతయుద్ధకాల నిర్ణయము గావింపఁగడంగిన పెక్కురు పాశ్చాత్య విద్వాంసులు గర్గ, పరాశరులకాలనిర్ణయము భారత యుద్ధకాల నిర్ణయమునకుఁ దోడ్పడుననియుఁ, బారాశర్యాది సిద్ధాంతవేత్తలు వారి వారి సిద్ధాంతగ్రంథములయందు సూచించిన గ్రహగతులు, అయనగతులు మొదలగువానిఁ జర్చించియుండిరి. భారతీయుల వాఙ్మయమునందును, శాసనాదులయందును, బేర్కొనఁబడిన శకకాలములను గుఱించియుఁ జర్చించియుండిరి. వీనివిషయమై వారుచేసిన విమర్శలు, సిద్ధాంతములు ఎంతవఱ కంగీకరింపవలసియుండునో మనము తెలిసికొనవలసియుండును. హైందవుల సిద్ధాంతగ్రంథములు మున్నగునవి వెవ్వేఱుకాలములయందు రచింపఁబడియుండెను. అందుఁ గాలనిర్ణయములు గావించుకొనుటకుఁ గొన్ని శకములు, గ్రహగతులు అయనగతులు ఇంకను బెక్కుతార్కాణలు సూచింపఁబడియున్నవి. చరిత్రపరిశోధకు లాయాశకములను వారివారి స్వేచ్ఛననుసరించి యూహించి కాలనిర్ణయమునకు గడంగినట్లు తోఁచుచున్నది. ఇట్లొక శకమున కింకొక శక మంటగట్టుటచే నాయాగ్రంథములయందుఁ జెప్పఁబడినటులఁ గాలనిర్ణయమును గావించుకొనఁజాలకను, ఆ విధముగ వీరికిఁదోఁచు కాలనిర్ణయములు వారిచేఁజెప్పఁబడిన చరిత్రాంశములకు సరిపోమిచేఁ బ్రాచీన హైందవ చరిత్రకారుల కాలనిర్ణయములు సంధిగ్ధము

లుగ నుండెననియుఁ జరిత్రాంశములకు విరుద్ధములనియుఁ దేలికగాఁ ద్రోసివేయుచు వారి వారి యిష్టము ననుసరించి సిద్ధాంత ప్రతిపాదనలకుఁ గడంగినట్లు జూపట్టెడిని. అట్టి సిద్ధాంతప్రతిపాదనలలో నొకరికొకరు తీసిపోవుటలేదు. ప్రాచీన హైందవ చరిత్ర కారుల సిద్ధాంతముల యాథార్థ్యమును గనుఁగొను ప్రయత్నములు పూర్తిగఁ గావింపఁబడియుండలేదు. కొందఱు ప్రయత్నములఁ గావించి యీ నూతన విపరీతసిద్ధాంతములఁ బ్రతిఘటించుచు వచ్చియుండిరి కాని యీ ప్రతిఘటింపుల లెక్కఁగొనరైరి. భరతఖండమునఁ గలియుగాదినుండియుఁ, గలియుగాబ్దములు, యుధిష్ఠిరశకము, లౌకికాబ్దములు, శకకాలము, శకనృపకాలము, శకభూపకాలము, శకారికాలము, హార్షశకము, విక్రమార్కశకము, శాలివాహనశకము మున్నగు శకములఁ బెక్కింటినిఁ బ్రాచీనార్వాచీన హైందవులు తమ వాఙ్మయమునందును, శాసనాదులయందును, బేర్కొనియుండిరి. భరతఖండమునందలి వేర్వేఱు దేశములయందు వేర్వేఱు శకవత్సరములను బేర్కొనియుండినట్లు జూపట్టుచున్నది. ఏయే శకములే యే వత్సరమునఁ బ్రారంభమయినదియు, నే యే కాలములయం దే యే శకవత్సరము లుపయోగింపఁబడి యుండినదియు మనము తెలిసికొనఁగలిగినచో భారతదేశ యథార్థచరిత్ర కాలనిర్ణయము కరతలామలకమగును. అట్లు పెక్కుశకముల కాలనిర్ణయముఁ గావించి ప్రాచీనహైందవ వాఙ్మయమునంగల వ్రాఁతలను సమన్వయ మొనర్చినచోఁ బాశ్చాత్య విద్వాంసులు

ప్రసాదించిన వితండవాదములు, విపరీతసిద్ధాంతములు, పశ్చిమ మార్గముం బట్టుననుటకు సందియము లేదు

హైందవ వాఙ్మయమునుబట్టియు, సాంప్రదాయములను బట్టియు భారతయుద్ధకాలము క్రీ. పూ. 3139–40 సంవత్సర మనియుఁ గలియుగప్రవేశకాలము క్రీ. పూ. 3102 సంవత్సరమని యుఁ దెలియుచున్నది. యుధిష్ఠిరశకము భారతయుద్ధానంతరము యుధిష్ఠిరుని పట్టాభిషేకముతోనే ప్రారంభమయినట్లుఁ జెప్పఁ బడియున్నది. యుధిష్ఠిరుని రాజ్యాంతమునుండి యుధిష్ఠిరశక మారంభమయినట్లు కొందఱభిప్రాయులై యుండెనని చెప్ప నగును.

## లౌకికాబ్దము లేక సప్తర్షియుగము.

లౌకికాబ్దమునే సప్తర్షిశకమనియు, సప్తర్షియుగమనియు, లోకకాలమనియుఁ జెప్పెదరు. జ్యోతిశ్చక్రాలయమునంగల సప్తర్షిమండల చలనమునుబట్టి ప్రాచీనహైందవ సిద్ధాంతు లీశక కాలము నేర్పాటుఁగావించినటులఁ దెలియుచున్నది. కాశ్మీర దేశప్రాంతమున నీశకమును సాంప్రదాయముగ వాడుచుండిరి. రాజతరంగిణ్యాదిగ్రంథములం దీశకప్రశంస చేయఁబడియుం డెను. సప్తర్షిమండల మొకనక్షత్రమునుండి మఱియొకనక్షత్రము నకుఁబోవుట కొకశతాబ్దకాలము అనఁగా 100 సంవత్సరముల కాలముపట్టునని చెప్పఁబడియున్నది. అద్దానినే కాలగణితమున కుఁ బ్రధానముగ దీసికొని ప్రాచీనహైందవ గ్రంథకర్తలు కాల నిర్ణయములఁ జేసియుండిరి. యుధిష్ఠిరుని రాజ్యకాలమునం దీస

ప్తర్షిమండలము మఘానక్షత్రమందుండినటులఁ జెప్పఁబడియుం డెను. కలియుగప్రవేశమై 25 సంవత్సరములు జరగినపిమ్మట ఆశ్లేషానక్షత్రమునఁ బ్రవేశించినట్లును, ఆకాలమున యుధిష్ఠిరుఁడు స్వర్గారోహణుఁడైనట్టును, యుధిష్ఠిరువిజ్ఞాపకార్థము లౌకికాబ్దమేర్పాటుకాఁబడినట్లును జెప్పఁబడియున్నది. ఈ శకాబ్దములనే యుధిష్ఠిరశకాబ్దములుగఁ గొందఱెంచినట్లును గన్పట్టుచున్నది. కలియుగరాజ వృత్తాంతమున—

"శ్లో॥ పంచవింశతి వర్షేషు
ప్రయాతేషుకలౌయుగే।
యుధిష్ఠిర జ్ఞాపనార్థం
లౌకికోఽబ్దఃప్రవర్తితః॥[1]

యని చెప్పఁబడియున్నది. మఱియు మత్స్యపురాణ భాషాంతరీకరణమున కనుబంధములు రచించిన శ్రీ శచంద్ర విద్యార్ణవులు

"శ్లో॥ కలేర్గతైః సాయకనేత్ర వర్షైః।
సప్తర్షివర్యాస్త్రిదివం ప్రయాతాః।
లోకేహిసంవత్సర పత్రికాయాం।
సప్తర్షిమానం ప్రవదంతి సంతః॥"

యనియుఁ జెప్పియున్నారు.

ఈ లౌకికాబ్దము (సప్తర్షియుగము లేక సప్తర్షిశకము)ను గుఱించి పురాణము లన్నింటియందును దాదాపు నొకేరీతిగఁ

1 Kaliynga Raja Vruthantam- Chapter 3.

జెప్పఁబడియున్నది. కలియుగ రాజవృత్తాంతమునందుఁ నదేవిధముగఁజెప్పఁబడియున్నది. ఈ శకమునుగుఱించి చెప్పఁబడిన విషయములు ప్రాచీన భారతదేశ చరిత్రాంశముల దెలిసికొనుటకు దోడ్పడునుగాన నా విధానము నీక్రిందఁ గనఁబఱుపఁబడినది.

"శ్లో॥ సప్తవింశతిపర్యంతే కృత్స్నే నక్షత్రమండలే ।
సప్తర్షయస్తుతిష్ఠంతి పర్యాయేణ శతంశతమ్॥
సప్తర్షీణాం యుగంహ్యేతద్దివ్యయా సంఖ్యయాస్మృతమ్।
సమాదివ్యాః స్మృతాః సప్తదివ్యామాసాః షడేవహి॥
ఋక్షాదృక్షం శతేనాఽబ్దైర్యాతి చిత్రశిఖండినః ।
దివ్యః సప్తర్షికాలోఽయం క్రమాదేవం ప్రవర్తతే॥
సప్తర్షీణాంతుయౌ పూర్వౌ దృశ్యేతేహ్యుదితౌదివి ।
తయోస్తుమధ్యే నక్షత్రం దృశ్యతేయత్ సమంనిశి॥
తేనసప్తర్షయోయుక్తా స్తిష్ఠన్త్యబ్దశతం నృణామ్ ।
నక్షత్రాణామృషీణాంచ యోగస్యైతన్నిదర్శనమ్॥
యదాదేవర్షయః సప్తమఘాసువిచరింతిహి ।
తదాప్రవృత్తశ్చ కలిర్ద్వాదశాబ్దశతాత్మకః॥
యస్మిన్ కృష్ణోదివం యాతస్తస్మిన్నేవహివత్సర ।
ప్రతిపన్నం కలియుగమితిప్రాహుః పురావిదః॥
యావత్ సభగవాన్ విష్ణుఃపస్పర్శేమాంవసుంధరామ్।
తావత్ పృథ్వీం పరాక్రాంతం సమర్థోనాఽభవత్ కలిః॥
యదామఘాభ్యోయాస్యంతి పూర్వాషాఢాం మహర్షయః।
తతః ప్రభృత్యేవకలిర్వృద్ధిం యాస్యతి నిశ్చితమ్॥

యదాయుధిష్ఠిరోరాజా శక్రప్రస్థే ప్రతిష్ఠితః ।
తదాసప్తర్షయః ప్రాపుర్మఘాః పితృహితేరతాః ॥
పంచసప్తతివర్షాణి ప్రాక్కలేః సప్తతేద్విజాః ।
మఘాస్వాసన్ మహారాజే శాసత్యుర్వీం యుధిష్ఠిరే ॥
పంచవింశతి వర్షేషు గతేష్వధకలౌయుగే ।
సమాశ్రయిష్యన్త్యాశ్లేషాం మునయస్తే శతం సమాః॥
తథైవధర్మపుత్రోఽపి మహాప్రస్థాన మాస్థితః ।
భువంపరిభ్రమన్నంతే స్వర్గమారోక్ష్యతి ధ్రువమ్ ॥
తదైవ లౌకికాబ్దేపి సప్తవింశ శతాత్మకః ।
ధర్మపుత్ర జ్ఞాపకార్థం లోకేతావత్ ప్రవర్తితః॥
సప్తవింశాన్ధ్రనృపతేః కాలే భావ్యస్యతేపునః ।
ఆశ్లేషాంసమ్ప్రయాస్యంతి యుగస్యాంతేసురర్షయః॥
సప్తర్షయో మఘాయుక్తాః కాలేయౌధిష్ఠిరేశతమ్ ।
శ్రవణేతేభవిష్యంతి కాలేనందస్య భూపతేః॥
చతుర్వింశేఽధనక్షత్రే భవిష్యంతి శతంసమాః ।
ఆన్ధ్రరాజ్యారంభకాలాదారభ్యతేసురర్షయః ।
మహాపద్మాభిషేకస్తు యావజ్జన్మ పరిక్షితః ।
ఏకమేవ సహస్రంతు జ్ఞేయం పంచశతోత్తరమ్॥
ఆన్ధ్రరాజ్యోపక్రమాంతు యావన్నంధాభిషేచనమ్ ।
అన్తరంతచ్ఛతాన్యష్టౌ ప్రమాణజ్ఞైః సమాఃస్మృతాః ॥
యదాపునర్వసుం యాస్యన్త్యేతే సప్తర్షయఃపునః ।
తదా శ్రీగుప్తవంశ్యానాం రాష్ట్రం దైన్యంగమిష్యతి॥

పూర్వాభాద్రాం యదా తేతు ప్రవేక్ష్యంతి పునర్ద్విజాః।
గుప్తేభ్యో మాగధం రాజ్యం తదాపాలాన్గమిష్యతి॥[1]

ఆశ్లోకముల భావ మీవిధముగఁ జెప్పఁదగియున్నది-

1. నక్షత్రమండలమునఁగల యిఱువదియేడు నక్షత్రములను సప్తర్షులు (అనఁగా సప్తర్షిమండలము — దీనినే పాశ్చాత్య సిద్ధాంతులు—ఉర్సామేజర్ (Ursa Major) లేక గ్రేట్ బేర్ (The Great Bear) అని చెప్పెదరు) ఒక్కొక్క నక్షత్రమునందు శతవత్సరములపర్యంతము నిలుచుచుఁ జుట్టివచ్చుచున్నారు.

2. ఇదియే సప్తర్షియుగము. అయ్యది యేఁడు దివ్యవత్సరములు ఆఱు దివ్యమాసములసంఖ్య ప్రమాణముకలదిగ పరిగణింపఁబడుచున్నది.

(ఒక్కొక దివ్యవత్సరము లేక దేవవర్షము 360 మానవ వత్సరముల కాలమునకు సమానమగునని యిదివఱలో గనఁబఱిచియుంటిని. ఆ గణితమునుబట్టి సప్తర్షియుగ కాలము 2700 $(360 \times 7\frac{1}{2})$ మానవాబ్దములగుచున్నది)

3. ఒక్కొక్క నక్షత్రమునుండి సప్తర్షు లింకొకనక్షత్రమునకుఁ బోవుటకు శతవత్సరములుపట్టును. ఈరీతిగ సప్తర్షికాలము లెక్కింపఁబడుచున్నది.

4. ఈ సప్తర్షిమండలములోని పూర్వనక్షత్రములు రెంటిమధ్య ను సరిగా యర్ధరాత్రమున నేనక్షత్రముండునో యానక్షత్రమున సప్తర్షులుండినట్లు లెంచవలయును.

---

1. Kaliyuga Raja Vrittantam, Bha. III Chap: III.

5. ఆనక్షత్రమునందు సప్తర్షులు 100 మానవవత్సరము లుం దురు. ఇదియే సప్తర్షి కాలమును లెక్కించుటకు నిదర్శనము.

6. ఈవిధముగ దేవర్షు లేడ్వురును మఖానక్షత్రమునఁ జరించు నపుడు పన్నెండువేల దేవసంవత్సర ప్రమాణముగల కలి యుగము ప్రారంభమగుచున్నది.

7. శ్రీకృష్ణభగవానుఁ డేవత్సరమున దివంగతుండయ్యెనో య ప్పుడే కలియుగము ప్రారంభమైనట్లు ప్రాచీనపండితులు చెప్పుచున్నారు.

8. శ్రీవిష్ణుభగవానుఁడు పృథ్విని పాదములచే స్పృశించుచున్నం తకాలము ప్రపంచమునఁ గలిప్రవేశించుట కశక్తుఁడుగ నుం డెను.

9. సప్తర్షులు మఖానక్షత్రమునువదలి పూర్వాషాఢకుఁ జేరినపు డు నిశ్చయముగ కలియుగ మభివృద్ధియగును. (కలిరాజ్య ము వృద్ధియగుట నిశ్చయము.)

10. శక్రప్రస్థమున (ఇంద్రప్రస్థమున) యుధిష్ఠిరుఁడు పట్టాభి షిక్తుఁడై నపుడు సప్తర్షులు పితృహితమగు మఖానక్షత్రము ను బ్రాపుచేసికొని సంచరించుచుండిరి.

11. కలియుగప్రవేశమునకు 75 సంవత్సరముల పూర్వము సప్త ర్షులు మఘానక్షత్రమునఁ బ్రవేశించిరి. సప్తర్షులు మఖయం దుండినకాలమున యుధిష్ఠిరుఁడు రాజ్యమును బాలించెను.

(సప్తర్షులు క్రీ. పూ. 3177 (3102 + 75) సంవత్సర మున మఖానక్షత్రమునఁబ్రవేశించినట్లు గన్పట్టుచున్నది.)

12. కలియుగములో 25 సంవత్సరములు గడచినపిదప సప్తర్షులాశ్లేషానక్షత్రముంజేరి 100 సంవత్సరము లుందురు.

(క్రీ. పూ. 3077—(3102—25) సంవత్సరమున ఆశ్లేషానక్షత్రమునుజేరి క్రీ. పూ. 2977 సంవత్సరమువఱకచటనుందురు—దీనినిబట్టి సప్తర్షి మండలము వెనుకకు నడచుచుండినట్లు బోధితమగుచున్నది.

13. ధర్మజుఁడు (యుధిష్ఠిరుఁడు) భూప్రదక్షిణము గావించి సప్తర్షులు మఘానక్షత్రమును విడిచి యాశ్లేషానక్షత్రముంజేరినకాలమునందే స్వర్గారోహణముఁ గావించెను. ఇది నిశ్చయము.

(యుధిష్ఠిరుఁడు స్వర్గారోహణము గావించుట-అనఁగా, స్వర్గస్థుఁడగుట క్రీ. పూ. 3077 సంవత్సరమగుచున్నది.)

14. అపుడు లోకమునందు ధర్మజుని (యుధిష్ఠిరుని) జ్ఞాపకార్థ మిఱువదియేఁడువందల (2700) వత్సరముల కాలపరిమాణముఁగల లౌకికాబ్ద మేర్పాటుకాఁబడి తదాదిప్రచారములోనుండును.

(దీనింబట్టి లౌకికాబ్దప్రారంభకాలము క్రీ. పూ. 3077 వ సంవత్సరమైనటులఁ దెలియుచున్నది.)

15. దేవర్షులు నక్షత్రమండలము నొకమారు చుట్టి తిరిగి రెండవమారు ఆశ్లేషానక్షత్రమున కాంధ్రవంశమునందలి యిఱువదియేఁడవ (27) యాంధ్రరాజు రాజ్యపాలనాకాలమునకు వచ్చి చేరెదరు.

(దీనింబట్టి సప్తర్షులు తిరిగి రెండవమారు ఆశ్లేషానక్షత్రమునకు క్రీ. పూ. 377 (3077—2700) సంవత్సరమునకు వచ్చెదరనియు నప్పు డిఱువదియేడవ (27) ఆంధ్ర రాజు పరిపాలనాకాలమై యుండెననియు విదితమగుచున్నది.)

16. యుధిష్ఠిరుని కాలమునందు సప్తర్షులు మఖానక్షత్రమున 100 సంవత్సరములుండిరి. నందభూపతికాలమునందు సప్తర్షులు శ్రవణానక్షత్రమునం దుండెదరు.

(ఈ సప్తర్షులు వెనుకకు నడచుచుండినట్లుజెప్పఁబడియుండుటచే మఖానక్షత్రము మొదలు శ్రవణానక్షత్రము వఱకు వెనుకకు లెక్కించిన 15 నక్షత్రములు దాఁటి యుందురు. ఒక్కొక నక్షత్రమున నూఱేండ్లుందురని చెప్పఁబడియుండుటచే 1500 సంవత్సరముల పై కాలమగును. కనుక యుధిష్ఠిరుని కాలమునుండి నందభూపతి కాలమువఱకు 1500 సంవత్సరములు గడచియుండునని తేలుచున్నది—అనఁగా నంధభూపతి క్రీ. పూ. 1577 (3077—1500) సంవత్సర ప్రాంతమున రాజ్యపాలనము జేయుచుండినటులఁ గన్పట్టుచున్నది.)

17. ఆంధ్రరాజుల రాజ్యారంభ కాలమునుండి సప్తర్షు లిఱువది నాలుగవ నక్షత్రమునుండి ప్రారంభింతురు.

(సప్తర్షిమండల చలనముంబట్టి మఖానక్షత్రము ప్రారంభము జేసికొని వెనుకకు లెక్కించిన నిఱువదినాలుగవ (24) నక్షత్రము చిత్తానక్షత్రమగును. ఆంధ్రరాజుల

పరిపాలనాకాలమునందు సప్తర్షులు చిత్తానక్షత్రమునం దుండినట్లు గన్పట్టుచున్నది.

18. పరీక్షితుని జన్మకాలమునుండి మహాపద్ముని పట్టాభిషేక కాలమునకును పదియైదువందల (1500) సంవత్సరముల కాలమని తెలిసికొనవలయును.

(పరీక్షితుఁడు యుధిష్ఠిరుని తమ్ముఁడగు నర్జునుని మనుమఁడు—అర్జునుని కుమారుఁ డభిమన్యుఁడు. అభిమన్యునికుమారుఁడు పరీక్షిత్తు. ఈ పరీక్షిత్తు మహాభారత యుద్ధకాలమునఁ దల్లిగర్భమునం దుండినట్లు దెలియు చున్నది. భారతయుద్ధానంతర మితఁడు జన్మించినట్లు చెప్పఁబడియున్నది. మహాభారత యుద్ధకాలమును, బరీక్షిత్తు జన్మకాలమును నొకేసంవత్సరమందని చెప్పఁదగి యున్నది. నందవంశమునకు మూలపురుషుఁడగు నంద భూపతియే మహాపద్మఁడనియు, మహాపద్మనందుఁడని యుఁ బేర్కొనఁబడియుండెను.)

19. నందభూపతి పట్టాభిషేకకాలమునుండి యాంధ్రరాజుల రాజ్యప్రారంభ కాలమువఱకు నెన్మిదివందల (800)సంవత్స రములకాలము గడచెనని పౌరాణికులు చెప్పియుండిరి.

20. సప్తర్షిమండలము తిరిగి పునర్వసు నక్షత్రమునకు వచ్చిన పుడు శ్రీ గుప్తవంశీయుల రాజ్యము దీనగతిఁజెందును.

(సప్తర్షిమండలము రెండవమారు పునర్వసు నక్షత్రము నకు క్రీ. పూ. 177 సంవత్సరమున వచ్చి క్రీ. పూ. 77

సంవత్సరమువఱ కుండును. ఈ మధ్యకాలములో గుప్త వంశీయుల రాజ్యము క్షీణించుటకుఁ బ్రారంభమగును.

21. సప్తర్షి మండలము మరలఁ బూర్వాభాద్ర నక్షత్రమునకు వచ్చినపుడు మగధరాజ్యము గుప్తవంశీయుల పాలనము నుండి 'పాల' వంశీయుల పాలనముక్రిందకుఁబోవును.

(దీనినిబట్టి సప్తర్షి మండలము రెండవమారు పూర్వాభాద్రా నక్షత్రమునకు వచ్చినపుడు గుప్తవంశీయుల రాజ్యకాలము పరిసమాప్తినొంది పాలవంశపురాజుల పరిపాలన మారంభమగునని తెలియుచున్నది. సప్తర్షి మండలము రెండవమారు పూర్వాభాద్రా నక్షత్రమునకు క్రీ. శ. 725 సంవత్సరమునకు వచ్చెను. అప్పటికి మగధరాజ్యమునందు గుప్తవంశీయుల రాజ్యపాలనము సంపూర్ణముగనశించి పాలవంశీయుల హస్తగతమగునని చెప్పఁబడియుండెను.)

పైఁజెప్పఁబడిన విషయములంబట్టి లౌకికాబ్దము కలియుగ మిఱువదియైదు (25) సంవత్సరములు గడచినపిమ్మట సప్తర్షిమండలము ఆశ్లేషానక్షత్రమునకు వచ్చినకాలమున యుధిష్ఠిరుఁడు స్వర్గస్థుఁడైనట్లును, ఆసమయమున యుధిష్ఠిరుని జ్ఞాపకార్థము లోకమునఁబ్రారంభింపఁబడియప్పటినుండియుఁబ్రచారమునందుండినట్లును దెలియుచున్నది. కలియుగప్రవేశమై యిప్పటికి 5030 సంవత్సరము లయినట్లు హైందవ సాంప్రదాయసిద్ధంబగు చరిత్రలవలనఁ దెలియుచున్నది. క్రీ. పూ. 3102 సంవత్సర

మునఁ గలియుగప్రవేశమనియుఁ, గ్రీ. పూ. 3077-76 సంవత్స రము లౌకికాబ్దప్రారంభమనియుఁ దేలుచున్నది.

సప్తర్షియుగ మశ్వనీనక్షత్రమునుండి ప్రారంభమగు చున్నదని కొందఱును, భారతయుద్ధమునకుఁ బూర్వము మఖా నక్షత్రమున సప్తర్షులున్నపుడు అనఁగా భారతయుద్ధమునకుఁ బూ ర్వము 2700 సంవత్సరములక్రిందటఁ బ్రారంభమైనదని మఱి కొందఱును జెప్పుచుండిరి. ఎవరిసిద్ధాంతము లెట్టులుండినను 'లౌకికాబ్దము' కలియుగము ప్రవేశమయి 25 సంవత్సరములు గడచినపిమ్మట సప్తర్షులు మఖానక్షత్రమునువిడిచి యాశ్లేషా నక్షత్రమునకు వచ్చినపుడు యుధిష్ఠిర స్వర్గారోహణము జరగి యుండెననియు, నాకాలమునుండియే యుధిష్ఠిరుని జ్ఞాపకార్థము లోకమునఁ బ్రచురము సేయఁబడియుండెననియుఁ జెప్పఁబడి యుండుటచేతను, మహాభారత యుద్ధకాలమునందు సప్తర్షులు మఖానక్షత్రమునందుండినట్లు జెప్పఁబడి యుండుటచేతను, గలి యుగమునందలి చరిత్రాంశముల కాలనిర్ణయమునకయి యప్పటి నుండియె సప్తర్షియుగమును గణితము సేయఁబడినది. ఇంతమా త్రమున కలియుగారంభకాలమునకుఁ బూర్వము సప్తర్షియుగము లేదనిగాని యట్టి యుగమును బ్రామాణికులు గణితముజేసి యుండలేదనిగాని యెంచుట కెంతమాత్రమవకాశములేదు. కొందఱు ప్రామాణికులు కలియుగ వృత్తాంతముల కాలనిర్ణ యముమహాభారతయుద్ధకాలమునుండి యీ సప్తర్షిమండలచలన మునుబట్టి గణితము సేసియుండుటచే నావిధానమునేయవలంబిం చినచో యదార్థకాలనిర్ణయమును గ్రహించుట కవకాశముం

డును. మఱియొకవిధమున గణితముచేసిన కాలములు తాఱు మాఱగుటయేగాక యదార్థకాలనిర్ణయముఁ గావించుట కడుం గడు దుస్తరముగదా !

రాజతరంగిణి రచనకాలము.

కల్హణపండితుఁడు 'రాజతరంగిణి'యను గ్రంథమును రచించుకాలమును దెలియఁజేయుచు నీవిధముగఁ జెప్పియుండెను.

శ్లో॥ లౌకికాబ్దే చతుర్వింశే
శకకాలస్య సాంప్రతమ్ ।
సప్తత్యాఽధికంయాతం
సహస్రం పరివత్సరాః॥ $

(ప్రస్తుతకాలమున లౌకికాబ్దము 24 సంవత్సరమున 1070 శకకాలవత్సరము జరుగుచున్నదని యాశ్లోకముయొక్క భావమయి యున్నది.)

లౌకికాబ్దము (Laukika Era) క్రీ.పూ. 3077 సంవత్సరమునఁ బ్రారంభమైనట్లు గాన్పించుచున్నదని యిదివఱలో సూచించియుంటిని. శాలివాహనశకము క్రీ. శ. 78 సంవత్సరమునుండి ప్రచారమందుండెను. కల్హణుఁడు రాజతరంగిణిని రచించిన కాలము శకకాలము 1070 సంవత్సరమయినట్లు జెప్పుకొనియుండెను. శకకాలమన శాలివాహనశకమని కల్హణుని యభిప్రాయమయినట్లు నిదివఱలో దెలిసికొనియుంటిమి. శాలి

$ Raja Tarangini- Taranga I vers. 52.

వాహన శకారంభకాలమునకు లౌకికాబ్దములు 3154 (3077 + 77) సంవత్సరములు గడచియుండినటులఁ జెప్పఁదగియుండును. కావున రాజతరంగిణి వ్రాయుకాలమునకు లౌకికాబ్దములు 4224 (3154 + 1070) సంవత్సరములు గడచియుండెను. ప్రస్తుత సంవత్సరముఁ బేర్కొను సందర్భమున సామాన్యముగ శతసంఖ్యనువదలి చెప్పెడు పద్ధతియే యుండెను. క్రీ. శ. 1929 సంవత్సరమును సామాన్యముగ 29 సంవత్సరమని పేర్కొనుచుందుము. అట్లే లౌకికాబ్దము 4224 సంవత్సరమును జెప్పుటకయి 24 సంవత్సరమయియుండెనని కల్హణపండితుఁడు చెప్పియుండినటుల విదితమగుచున్నది. అట్లు కాదనినచో లౌకికాబ్దము శాలివాహనశకము 1070–24=1046 సంవత్సరమునందనఁగాఁ క్రీ. శ. 1124 (1046 + 78) సంవత్సరమునఁ బ్రారంభమైనటులఁ జెప్పవలసివచ్చును. యుధిష్ఠిరుఁడు క్రీ. శ. 1124 సంవత్సరమునఁ బరమపదించెననియు, భారతయుద్ధము క్రీస్తుశకము పన్నెండవ శతాబ్దప్రాంతమున జరగియుండెననియుఁ, జెప్పవలసివచ్చును. ఇయ్యది చరిత్రాంశము లన్నింటికిని విరుద్ధముగ నుండుటయే గాక కల్హణుని సిద్ధాంతమునకే విరుద్ధముగ నున్నది. కావున కల్హణపండితుఁడు లౌకికాబ్దము 4224 సంవత్సరములో రాజతరంగిణిని రచియించియుండెననియు దానినే 24సంవత్సరముగఁజెప్పియుండెననియుస్పష్టమగుచున్నది. క్రీ. పూ. 3077 సంవత్సరమున 'లౌకికాబ్ద'మారంభమైయుండెనను సిద్ధాంతమును గల్హణపండితుని సంఖ్యావిధానము బలపఱుచుచున్నది.

మఱియు శకకాలమన శాలివాహన శకకాలమని కల్యాణపండి తుని యభిప్రాయమైనట్లును గన్పట్టుచున్నది.

వరాహమిహిరుఁడు పేర్కొనిన శకకాలము
శాలివాహన శకకాలమా ?

ఇందుఁ గల్యాణపండితుఁ డుపయోగించిన శకకాలము శాలివాహన శకకాలమైనట్లు లంగీకరించిన వరాహమిహిరుఁడు బృహత్సంహితయందుఁ జెప్పిన 'ఆసన్ మఘాసుమునయః' అను శ్లోకమందలి శకకాలమునకును శాలివాహనశకమని యెందుల కెన్నఁగూడదని కొందఱికి సంశయ మొదవవచ్చును. అట్టి నిరర్థక సంశయములచేతనే కొందఱు చరిత్రకారులు—వారు వీరననేల! కల్యాణపండితుఁడున్నై తము—శాలివాహన శకమని భావించియే కాలనిర్ణయమునఁ బప్పులోఁగాలువైచి భారతదేశ చరిత్రాంశములఁ గొన్నిఁటిఁ దాఱుమాఱుజేసియుండిరి. వరాహమిహిరునికాలమును, వరాహమిహిరుని కాలమువఱకుండు శకములును, వరాహమిహిరుని కాలమునాఁటికి శాలివాహనశక మేర్పడియుండినది లేనిది, గమనించిన వాస్తవమగు చరిత్రాంశముల నెఱుంగుటకుఁ దోడ్పడును.

వరాహమిహిరుఁడు పేర్కొనినశకకాలము శాలివాహన శకముగాకుండిన మఱియేశకకాలమైయుండును? యుధిష్ఠిరకాలమునుండి శకకాలమువఱకు నడుమంగల కాలవ్యవధి 2526 సంవత్సరములని వరాహమిహిరునిచేఁ జెప్పఁబడిన శ్లోకార్థమైయుండెను. యుధిష్ఠిరుఁడు కలియుగ ప్రవేశమైన 25 సంవత్సరము

లకుఁ బరమపదించినట్టు లాసంవత్సరమునే—అనఁగా క్రీ. పూ. 3077 (3102—25) సంవత్సరమునుండి—యుధిష్ఠిరుని జ్ఞాపకార్థము లోకములోఁ 'లౌకికాబ్దము' ప్రచురము కాఁబడియుండెననియుఁ దెలిసికొని యుంటిమి. కావున వరాహమిహిరునిచే చెప్పఁబడిన శకకాలము క్రీ. పూ. 550 (3076—2526) సంవత్సరప్రాంతమునం దేర్పడియుండినటులఁ జెప్పఁదగియుండును. వరాహమిహిరుఁడుబృహత్సంహితయందు శకకాలమనియు,శకభూపకాలమనియు, శకేంద్రకాలమనియు, శకనృపకాలమనియుఁ బేర్కొనియుండెను. వీని నన్నింటి నొక శకమును గుఱించియే చెప్పియుండినట్లు దోఁచుచున్నది. ఇంకఁ గ్రీ. పూ. 550 సంవత్సరప్రాంతమున నేదియైన శకకాలమేర్పడియుండెనేమో చరిత్రాంశముల నారయుదము.

## శ్రీహర్షశకము లేక శ్రీహర్షవిక్రమాదిత్యశకము.

అలెగ్జాండరు దండయాత్రకుఁ బూర్వమే హిందూదేశముపై శకనులు, (పారశీకులు) దండెత్తివచ్చినట్లును వారిలో హిస్టాస్పసు (విష్టరాశ్వుఁడు)కుమారుఁడగు డెరయసు(Darius-ధైర్యబాహుఁడు) సింధునదినిదాఁటి భరతఖండముయొక్క వాయువ్యభాగమునఁ గొంతప్రదేశము నాక్రమించుకొని రాజ్యమును స్థాపించికొనియుండినట్లును, ఆప్రదేశము గ్రీకులదండయాత్రానంతరమున నక్షత్రపుల (Satrapies) రాజ్యమని పేర్కొనఁబడియుండినట్లును తెలియుచున్నది. ఆదేశముధైర్యబాహుని (డెరయస్‌హిస్టాస్పసు) యనంతరము కొన్నితరములవఱకు వారి యధీనమందుండినట్లును, క్షయార్షుఁడు(Xerxes I),ఆర్తక్షత్రు

(Artaxerxes I)ల పరిపాలనాకాలములయందుక్షీణదశనొంది యుండినట్లును దెలియుచున్నది. క్రీ. పూ. 457 సంవత్సరమున మాళవదేశ ప్రభువగు శ్రీహర్షవిక్రమాదిత్యుఁడు శకనుల నోడించి భరతఖండమునుండి తఱిమివైచి దేశమును స్వాధీన పఱుచుకొనియుండినట్లు జెప్పఁబడియున్నది. ఆ కాలమున శ్రీహర్షవిక్రమాదిత్యుఁడు భరతఖండమునఁ బ్రఖ్యాతివడసియుండెను. ఈ శ్రీహర్షవిక్రమాదిత్యుఁడు 'శకారి' యనియు, 'శకాంతకుఁడ'నియు బిరుదు నామములచేఁగూడఁ బేర్కొనఁబడియుండెను. రాజతరంగిణి చరిత్రకారుఁడగు కల్హణపండితుండీ శ్రీహర్ష విక్రమాదిత్యుని దిగ్విజయమును గుఱించి యుదాహరించి యుండెను. ఇతఁడు (శ్రీహర్షవిక్రమాదిత్యుఁడు) కాశ్మీరమును బరిపాలించిన హిరణ్యుఁడు, మాతృగుప్తుఁడు, ద్వితీయ ప్రవరసేనులకు సమకాలికుఁడనియు, శకనులమీఁద దండయాత్రసలిపి దిగ్విజయమును గాంచియుండెననియు, నా విజయజ్ఞాపకార్థము ఆవత్సరంబున నొక శకమును స్థాపించినట్లును జెప్పియున్నాఁడు.[1]

## శకనుల ప్రశంస.

పారశీకులను శకనులని హైందవు లనుచుండిరి. భరతఖండమునకుఁ బ్రక్కనుండుటచే నా భాగమును పార్శ్వదేశమని పేర్కొనియుండినట్లును, అయ్యది క్రమక్రమముగఁ బారశీకదేశమని పిలువఁబడుచుండినట్లును గన్పట్టుచున్నది. పార్శ్వదేశవాసులు పార్శ్వులని పిలువఁబడుచుండినట్లును గ్రమేణ పారశీకు

1 Vide. Raja Tarangini- Taranga III vers. 124-129.

లని పిలువఁబడుచువచ్చినట్లును గానిపించుచున్నది. ప్రాచీన హైందవులు భరతఖండమునకుఁ బశ్చిమమందుండు దేశమును మూఁడు భాగములుగఁ బరిగణించి పరిసరంబుననుండు దేశమును పార్శ్వదేశమనియు, మధ్యభాగమును మధ్యదేశమనియుఁ జివఱభాగమును ఆసురదేశమనియుఁ బేర్కొనియుండినట్లును, దరువాతికాలములయం దీపార్శ్వదేశము 'పారశీక దేశ' మనియు, మధ్యదేశము 'మిడీయా' (Mede) దేశమనియు, నాసురదేశము 'అస్సీరియా' దేశమనియు బిలువఁబడుచుండినట్లును స్పష్టమగుచున్నది. ఇమ్మూఁడు దేశములను పారశీకుల పాలనముక్రిందకుఁ జేర్చుకొని సైరసు (కురు) చక్రవర్తి (Cyrus the Great) పారశీక సామ్రాజ్యమును స్థాపించియుండెను. హైందవులు పారశీకులను శకనులనియుఁ బేర్కొనియుండిరి.

శకనులని పేర్కొనఁబడిన పారశీకుల చరిత్రకును, హిందూదేశ (భారతదేశ)చరిత్రకును సంబంధముండినటులఁ గన్పట్టుటచే నాసంబంధ మేమేని మన భారతవర్ష చరిత్రాంశముల కాలనిర్ణయమునకుఁ దోడ్పడునేమో కనుగొందము.

శకనులచరిత్ర—శకసామ్రాజ్యస్థాపనము.

ఇటీవల వీరిచరిత్ర బాబిలోను(Babylon) నందుఁ గనుఁగొనఁబడిన సైరసు (కురువు) శాసనములనుబట్టియు, పెర్సిపోలిసు (Persepolis)నందు నక్షీరుస్తుము (Nakshi-Rustum) నందుఁ గనుగొనఁబడిన ధైర్యబాహు (Darius—డెరయస్) కాలమునాఁటి బీహుస్తూన్ (Bihustun) శాసనములనుబట్టియు,

గ్రీకు చరిత్రకారులగు స్కైలాక్సు (Scylax) హెరొడొటసు (Herodotus) స్టీసిసు (Ctesis) జనొఫను (Xenophon) ము న్నగువారి రచనలనుబట్టియుఁ గొంతవఱకుఁ దెలియుచున్నది.

స్కైలాక్సు (Scylax) డెరయస్ హిస్టాస్పసు (Darius Hystaspes విష్టరాశ్యుని కుమారుఁడగు ధైర్యబాహుఁడు) యొక్క సేనానియైనట్లును, గ్రీ. పూ. 515—509 సంవత్సరముల మధ్యకాలమాప్రాంతమున సింధునదిలో నౌకాప్రయాణములు సలిపి యప్పటి వృత్తాంతములను వ్రాసియుండినట్లును జెప్పెదరు. ఆయన రచించిన చరిత్రయంతయుఁ గాన్పించుటలేదనియు, నచ్చటచ్చటఁ గొన్నిభాగములు మాత్రమే కానవచ్చుచున్న వనియుఁ జెప్పెదరు. హెరొడొటసు (Herodotus) రచించిన చరిత్ర కేవల పారశీకసామ్రాజ్య (Persian Empire) స్థాపనముం గూర్చియు వృద్ధిక్షయములం గూర్చియు రచియింపఁబడిన చరిత్రమనియే గాకుండఁగ బారసీకముమీఁద దండు వెడలి పారశీకులను జయించిన గ్రీకులవిజయమును గుఱించి చెప్పిన జాతీయకథనమనియుఁ జెప్పనొప్పుచున్నది. ఇతఁడు చాలదేశములఁ దిరిగి తా దెలిసికొనినట్టియు, కనుగొనినట్టియు సంగతులను విపులముగ వ్రాసియుండెనని చెప్పఁబడు చున్నది. ఇతఁడు రచించిన చరిత్రయందు భారతీయ (Indian) సామ్రాజ్యమునకును బారశీక సామ్రాజ్యమునకునుగల సంబంధములఁ గొన్నింటిని జెప్పియుండెను. అలెగ్జాండరు దండయాత్రను గుఱించి యతిశయోక్తులతో రచించిన గ్రీకుపండితుల చరిత్రలవలెఁ గాక నీతఁడు యదార్థములగు సంగతులనే రచి

యించెనని చెప్పెదరు. ఇతఁడు క్రీ. పూ. 490 సంవత్సరప్రాంతమునఁ జనిపోయినట్లును జెప్పెదరు. స్టీసిసు (Ctesis) పారశీక రాజధానీనగరమున ధైర్యబాహు, ఆ రక్షత్త్రిల పరిపాలనా కాలములందు 17 సంవత్సరములుండినట్లును, హిందూదేశమును గుఱించి 'ఇండికా' యను గ్రంథమును వ్రాసియుండినట్లును జెప్పెదరు. ఇతఁడు పేర్వడసిన వైద్యశిఖామణి. ఇతఁడు రచించిన 'ఇండికా' యనునదియే గ్రీకులు హిందూదేశమును గుఱించి వ్రాసిన ప్రథమగ్రంథమైనటులఁ దెలియుచున్నది. అయ్యది పూర్తిగ లభ్యమగుటలేదుగాని గ్రీకుపండితుండగు ఫోటియాస్ (Photios) క్రోడీకరించిన కొన్ని భాగములు మాత్రమే కానవచ్చుచున్నవి. స్టీసిస్ క్రీ. పూ. 398 సంవత్సరమునఁ జనిపోయినట్లు వచింతురు. గ్జనోఫను (Xenophon) యను గ్రీకు చరిత్రకారుఁడు పారశీకసామ్రాజ్య స్థాపకుఁడగు సైరసు (Cyrus కురువు) యొక్కయుఁ, నాతని తరువాత పరిపాలన మొనర్చిన వారియొక్కయుఁ జరిత్రను వ్రాసియుండెను. ఆతఁడు క్రీ. పూ. 430—355 సంవత్సరముల మధ్యకాలమున జీవించియుండినట్లు జెప్పెదరు. వీరందఱును అలెగ్జాండరు దండయాత్రకుఁబూర్వమే పారశీక దేశచరిత్రను వ్రాసియుండిరి. వీరు పారశీకసామ్రాజ్య మేర్పడినకాలమునకు సమీపకాలమున నుండినవారు. గ్రీకుచరిత్రకారు లందఱును పారశీక సామ్రాజ్యము (శకసామ్రాజ్యము) సైరసుచక్రవర్తి (Cyrus the Great) అనువానిచే స్థాపింపఁబడినట్లు జెప్పుచున్నారు. పారశీక సామ్రాజ్య (శకసామ్రాజ్య) స్థాపనమునుగుఱించి చెప్పఁబడిన

విషయములఁ గనుఁగొందము.

పారశీక సామ్రాజ్యమునకుఁబూర్వము భరతఖండము నకుఁ బశ్చిమముగనుండు దేశము మూఁడురాజ్యములుగ నుం డెను. అదివఱలోనుండెడు బాబిలోనియా సామ్రాజ్యము (Babylonian Empire ) నశించియుండెను. బాబిలోని యాసామ్రాజ్యము క్రీ. పూ. 2240 సంవత్సరము మొదలు క్రీ.పూ.1780 సంవత్సరప్రాంతమువఱకును గణుతికెక్కి యుండె నని చెప్పుచున్నారు. అయ్యది క్షీణించుటతోటనే'అస్సీరియా' సామ్రాజ్యము (Assyrian Empire) బయలుదేఱెను. అస్సీరియా సామ్రాజ్యమునకుఁ బ్రథమమున నసురపట్టణమును (Assur), దరువాత నైనీవా (Ninevah) పట్టణమును రాజ ధానీనగరములుగ నుండెను. క్రీ. పూ. 625 సంవత్సరప్రాంత మున బాబిలోనియారాజగు నబోపోలస్సరు(Nabo Polassar) మీడియా (Mede) దేశపురాజగు సువక్షతరుని (Cyaxares- శ్యాక్షరీస్) సాయముంబొంది సామ్రాట్టుపైఁ దిరుగుబాటొన రించి రాజధానీనగరమగు నైనీవా (Ninevah) పట్టణమును బట్టుకొని విధ్వంసముఁగావించి యస్సీరియాసామ్రాజ్యము నడు గంటఁజేసెను. మీడియాదేశస్థులు మీడియను (Medes) లని పిలువఁబడుచుండిరి. వారిదేశమును మధ్యదేశమనియు, వారిని మధ్యగు (మధ్యదేశవాసు)లనియు భారతీయులు పేర్కొనియుం డిరి. ఈ మధ్యదేశీయులు (Medes) ప్రవృత్తిని (Phraortes) కుమారుఁడగు దయాకసుని (Deioces ) కాలమున రాజ్యస్థా పనముఁ గావించుకొనియుండిరి· దయాకసుని పుత్రుఁడగు రెం

డవ ప్రవృత్తునికాలమున పార్శ్వకులను (పారశీకులను) జయించి తమదేశమునఁ గలుపుకొని పాలించుచుండిరి. ఈ దయాకసుఁడు అస్సీరియా సామ్రాజ్యమును లోఁబఱుచుకొనఁ బ్రయత్నములు సలిపియుండెను గాని కొనసాఁగియుండలేదు. ఆయన కుమారుఁడగు సువక్షతరుఁడు బాబిలోనియారాజునకుఁ దోడ్పడి అస్సీరియాసామ్రాజ్య విచ్ఛిన్నముఁ గావించెను. పిమ్మట అష్కుజా (Ashkuza) రాష్ట్రపుఁ బ్రభువు వీరిని లోఁబఱుచుకొని మీడియను సామ్రాజ్యమును (Median Empire) నెలకొల్పెను. అస్సీరియా సామ్రాజ్యమునుండి విడివడిన బాబిలోనియా మీడియా దేశములు స్వతంత్రతను బ్రకటించి ప్రత్యేకరాజ్యములుగ నేర్పడియుండెను. ఎవరికివారు తక్కినవారినిజయించి దేశము నపహరింప నువ్విళ్లూరుచుండిరి. సువక్షతరుని యనంతరము అహిదంసకుఁడు (Astyages) రాజ్యమునకువచ్చెను. ఈ అహిదంసకుఁడు మెసపొటోమియా (Mesopotomia) మీఁదికి దండెత్తి హార్రాన్(Harran)పట్టణమును ముట్టడించెను. బాబిలోనియా రాజ్యమునకు క్రీ. పూ. 555 సంవత్సరమున నబోనిడసు (Nabonidus) రాజయ్యెను. ఈ నబోనిడసు రాజ్యపాలనమున నహిదంసకుఁడుగావించిన దండయాత్రనుండి బాబిలోనియా దేశమును సంరక్షించుకొనుట 'నబోనిడసు'కుఁ గష్టతరముగ నుండెను. ఆ సమయముననే యస్సీరియా దేశపురాజు ఆహిదంసకుని రాజ్యముపై దండువెడలెను. ఈవిధముగ మీడియారాజ్యము బాబిలోనియా,అస్సీరియారాజ్యముల రెంటితోఁ బోరాడుచుండి మీడియా దేశమును జయించునటులఁ గన్పట్టెను. అయినను

జివఱకు మూఁపురురాజులునుసంధిఁజేసికొని యుద్ధములుచాలించి యుండిరి.

ఇట్లుండ బాబిలోనియా దేశపురాజు అకారణముగను, అనవసరముగను మీఁడియా దేశముమీఁదికి దండెత్తివచ్చెను. అపుడు మీఁడియా దేశపురాజగు అహిదంసకుఁ డాతనికడ్డుపడి యుద్ధముసేయవలసివచ్చెను. ఆ యుద్ధములలో అహిదంసకునకు సైరసు (Cyrus) తోడ్పాటై జయమును జేకూర్చెను. ఈ సందర్భమున సైరసను నాతఁడెవ్వఁడో మనము తెలిసికొనఁగోరుట యనవసరముగాదు. ఆతనింగుఱించి హెరొడోటసు (Hero-dottus) మున్నగు చరిత్రకారులిట్లుఁ జెప్పియుండిరి.

## సైరసు చక్రవర్తి.

అహిదంసకుఁడు (Astyages)తనకుమార్తెయగు మానధనాదేవిని (Mandane) భరతఖండము నానుకొనియున్న యిలావృతమునందలి రాజకుమారుఁడగు అత్రిదత్తునకుఁ గాంభోజుఁడను (Cambyses) బేరిడి పారశీకదేశమునకుఁ దన సామంతరాజుగ నేర్పాటుఁజేసియుండెను. కాంభోజుఁడని పేర్కొనఁబడిన యత్రిదత్తునకును మానధనాదేవికిని 'అగ్రిదత్తుఁ' (Agradates)డను కుమారుఁడుగలిగెను. అగ్రదత్తునిజననకాలముంబట్టి మాతామహునకును మతామాహుని రాజ్యమునకును గీడుగలుగునని జ్యోతిషశాస్త్రజ్ఞులు సెప్పుటచే నాబాలుని వధించుటకై అహిదంసకుఁడు తీసికొనివెళ్లి తనకు నమ్మినబంటగు మిత్రదత్తున (Mitradates) కిచ్చి శిరచ్ఛేదముఁ గావిం

చుట కాజ్ఞనొసంగెను. రాజాజ్ఞననుసరించి యా బాలుని వధించుటకై మిత్రదత్తుఁడు తీసికొనివెడల నాతనిభార్యయగు శుని (Cyno) యాబాలుని సౌందర్యాతిశయంబున కచ్చెరువంది జాలిఁగొని తన భర్తను బ్రార్థించి నిశితకరవాలము పాలుఁగాకుండఁ గాపాడి రహస్యముగఁ బెనుచుచుండెను. మిత్రదత్తుఁడును దనభార్య వేఁడికోలునంగీకరించి మృతుఁడైన మఱియొక బాలుని శిరచ్ఛేదముఁ గావించి యా శిరమును దనయేలికకు గుఱుతుఁజూపి శాంతపఱచెను. ఇట్టులాబాలునిఁ (అగ్రదత్తుని) గొంతకాలమువఱకుఁ దనయింటనే గోప్యముగఁ బెనిచి, యబ్బాలునిఁ దనయింటనే యుంచుకొనిన తద్రహస్యము ప్రభువునకుఁ దెలియవచ్చుననియు, దానఁ దనకు ముప్పువాటిల్లుననియునెంచి యగ్రదత్తుని తండ్రియగు నత్రిదత్తునిదగ్గఱకుఁ గొంపోయి యాతని కొప్పగించి యా రహస్యమును బోధించెను. అత్రిదత్తుఁడును గడుసంతసమంది యీరహస్యమును వెలిబుచ్చిన అహిదంసకునివలనఁ దమకును ముప్పువాటిల్లునని తలఁచి భరతఖండమునంగల కురుదేశమునుండి యొకబాలకునిఁ దెచ్చి పెంచుకొనుచుండినటులఁ బ్రకటించిరి. ఆబాలునకు బ్రథమనామమగు అగ్రదత్తుఁ డనునామమును మార్చి 'కురువు' (Cyrus - గ్రీకుభాషలో కురుహః దానినే యింగ్లీషుభాషలో సైరస్ అని యుఁ బేర్కొనియుండిరి.) అను పేరును బెట్టి పిలుచుచుండిరి. అత్రిదత్తుఁడు తాను కురువంశములోఁ జేరినవాఁడనని చెప్పుకొని యుండెననియు, నాకారణమున నీబాలునకుఁ గురువని పేరుపెట్టి యుండెననియు, సూచించియుండిరి.

సైరసునకు (కురువునకు) యుక్తవయసు వచ్చువఱకు హైందవపద్ధతుల ననుసరించి గురుకులవాసమున విద్యాబుద్ధుల నాతని తండ్రి నేర్పించెను. పిమ్మట మీడియా దేశమునకుఁ గొంపోయి రాజసభలలో మెలంగువిధమును, రాజనీతి మున్నగు విద్యల నేర్పించుటకుఁగాను మాతామహుఁడగు అహీదంసకున కొప్పగించెను. అహీదంసకుఁడా బాలునిఁ దనదగ్గఱనే యుంచుకొని రాజునకర్హ్మములగు విద్యాబుద్ధుల నన్నింటిని నేర్పించుచుండెను. సైరసు అహీదంసకునకుఁ బరిచర్యలు సలుపుచు నచిరకాలముననే యహీదంసకుని కరుణాకటాక్షవీక్షణములకుఁ బాత్రుఁడగుటయేగాక సర్వజనులచే నుతిఁగాంచెను. రాజానుగ్రహమును—రాజాదరమును—గోరువారెల్లరు సైరసు నాశ్రయించుచుండిరి. సైరసుకోర్కెను అహీదంసకుఁడు గాదనక నెఱవేర్చుచుండెను. సైరసు సకలసద్గుణఖనియని యనిపించుకొనియెను. అహీదంసకుఁడేమిచేయఁదలఁచినను సైరసుతో నాలోచించియే చేయుచుండెను. అట్టి తరుణమున బాబిలోనియా రాజు మీడియా దేశముమీఁదికి దండెత్తివచ్చుటయు నహీదంసకుఁ డడ్డుపడి యుద్ధముసేయవలసివచ్చుటయు, నహీదంసకునకు సైరసు సాహాయ్యపడి జయమును జేకూర్చుటయు సంభవించియుండెను. పారశీకసామ్రాజ్య మేర్పాటుఁగావించిన సైరసుచక్రవర్తి (Cyrus the Great) యీ సైరసనియే గ్రీకు చరిత్రకారులు లోనగువారు చెప్పుచున్నారు.

పిమ్మట మాతామహుని యనుజ్ఞనువడసి సైరసు తండ్రియగు నతిద్రత్తుని కోర్కెప్రకారము తిరిగి పారశీక దేశ

మునకుఁ జేరెను. అటుఁ దండ్రియగు సత్రిదత్తునకు రాజ్యమును బరిపాలించుటయందుఁ దోడుపడుచుఁ బ్రజల యనురాగమునకుఁ బాత్రుఁడయ్యెను.

ఇటులఁ గొంతదికాలము గడవఁగా బాబిలోనియా దేశమునకును మీడియాదేశమునకును మరల యుద్ధము సంప్రాప్తమయ్యెను. ఆ యుద్ధములో సైరసు తన మేనమామయగు సువక్షతరునకు (Cyaxeres) సాహాయ్యముగాఁ బారశీకసైన్యమును దీసికొనివెళ్ళి సాహాయ్యమొనర్చి జయలక్ష్మి వరించునట్లు జేసెను.

సువక్షతరుఁ డహిందసకుని కుమారుఁడు. అహిందంసకుఁడు మీడియాసామ్రాజ్యమున కధీశుఁడైనను వృద్ధుఁడగుటచే నాతని కుమారుఁడగు సువక్షతరుఁడే పరిపాలనము నెరపుచుండెను.

బాబిలోనియాదేశమునకును మీడియాదేశమునకును జరగిన యాయుద్ధమునం దుభయులును దమకు సాహాయ్యము సేయవలసినదని హిందూదేశమునకు రాయబారముల నడపి యుండిరి. హిందూదేశపురాజుసైతము న్యాయపక్ష మంగీకరించెదనని వారితోఁ జెప్పి యుద్ధకారణముల నారయుటకై బాబిలోనియాదేశమునకును మీడియాదేశమునకును దన రాయబారుల ననిపి మీడియాదేశపురాజు న్యాయమార్గ మవలంబించియుండినట్టు లెఱింగి హిందూదేశపురాజు తనసైన్యమును బంపి మీడియాదేశపురాజునకే సాహాయ్యముఁ జేసియుండినట్టు

దెలియనగుచున్నది. ఈ యుద్ధముంగూర్చి వ్రాయుసందర్భమున జరిత్రకారు లీవిధముగఁ జెప్పియుండిరి.

"Cyaxeres was no sooner on the throne, than he was engaged in a terrible war. He was informed that the King of Babyloniyans was preparing a powerful army against him, and that he had already engaged several powerful princes on his side and amongst others, Croesus, King of Lydia; that he had likewise sent ambassadors to the King of India, to give him bad impressions of the Medes and Persians, by representing to him how dangerous a closer alliance and union between two nations already so powerful might be, since they could in the end subdue all the nations around them, if a vigorous opposition was not made to the progress of their power."‡

"సువక్షతరుఁడు (Cyaxeres) రాజ్యమును బాలింప వచ్చినవెంటనే యొక ఘోరసంగ్రామమునందు నిమగ్నుఁడు గావలసివచ్చెను. బాబిలోనియాదేశపురాజు తనతో యుద్ధముసేయుట కొక గొప్పసైన్యమును జేకూర్చియుండె ననియుఁ, బరాక్రమధౌరేయులగు రాజులను దనపక్షమునఁ జేర్చికొని యుండెననియుఁ ముఖ్యముగ 'లిడియా'(Lydia) దేశపురాజగు క్రొయిసెసు (Croesus) యొకఁడనియుఁ, బేరెన్నికగాంచుచున్న మీడియను పారశీకజాతులు రెంటికిని యేకీభావము గుదురనిచ్చిన నెంతయో యుపద్రవకరంబుగ నుండుననియు, వారియభివృద్ధికిఁ దగినయదనులో బల

‡ Vide, Xenophon's Cyropaedia. L i p. 22

మైన యుద్ధమును గలుగఁజేసి భంగపఱచకుండిన వారు తమ పరిసరరాజ్యములన్నిటిని జయింపఁగలుగుదురనియు వారి మీఁద (అనఁగా మీడియనులు, పారశీకులమీఁద) ఈర్ష్యాసూయద్వేషభావము లుదయించునట్లు లోనర్చుటకై హిందూదేశపురాజునకు రాయబార మంపినట్లును ఆతనికిఁ (సువక్షతరునకుఁ) దెలియవచ్చెను.''*

" Cyaxeres, satisfied with this answer, ordered the Indian ambassodors to be introduced. The purport of their speach was, that they were sent by the King, their master, to learn the cause of the war between the Medes and the Babylonians, and that they had orders, as soon as they had heard what the Medes should say, to proceed to the Court of Babylon, to know what motives they had to allege on their part; to the end that the King, their master, after having examined the reasons on both sides, might take part with those who had right and justice on their side. This is making a noble and glorious use of great Power: to be influenced only by justice, to seek no advantage from the division of the neighbours, but declare openly against unjust aggressor, in favour of the injured party. Cyaxeres and Cyrus answered, that they had given the Babylonians no subject of complaint, and that they willingly accepted the mediation of the King of India. It appears in the sequel he declared for the Medes."$

---

* Vide Xenophon's Cyropaedia. L i p. 22

$ Vide- The Rollius "History of Cyrus" Chap. III- page 129.

"సువక్షతరుఁ డాప్రత్యుత్తరమునకుఁ దృప్తిఁజెంది హైందవరాయబారులను బ్రవేశపెట్టుట కుత్తరువొసంగెను. వారు తమ యేలికయగు హిందూదేశపురాజుచే మీఁడియనులకును బాబిలోనియనులకును గల యుద్ధకారణము లెవ్వియో తెలిసికొనుటకు, మీఁడియనులు జెప్పినపిదప బాబిలోనియను లేమికారణములఁ జెప్పెదరో కనుఁగొనుటకయి బాబిలోనియను రాజసభకు వెడలుట కాజ్ఞనిచ్చి పంపియుండెననియు, వారుభయులు జెప్పు కారణములఁ బరిశీలించిన పిమ్మటఁ దమయేలిక న్యాయధర్మముల నవలంబించువారి పక్ష మవలంబించుననియు వారి (హైందవరాయబారుల) సంభాషణాసారమై యున్నది. న్యాయ్యముచేతనే సుముఖులగుటయు, నిటుగు పొఱుగువారి యంతఃకలహములవలని లాభమపేక్షింపకుండుటయు, నష్టిఁజెందినవారి కనుగుణ్యముగను, అన్యాయాధర్మకలహ మారంభించిన ప్రథమాపరాధిపయి యుద్ధము బ్రకటించుటయును, ననున విమె గొప్ప యధికారప్రాభవములని తెలియుచున్నది. బాబిలోనియనులు తమయం దారోపించు నేరములులేకుండుటచేతను, దామేమియు నట్టి నేరము గావించియుండలేదనియుఁ, దమ తగవులఁ బరిష్కరించుటకు హిందూదేశపు రాజు మధ్యవర్తిగానుండి పరిష్కరింపఁ దాము మనస్ఫూర్తిగ నంగీకరించుచుంటిమనియు, సువక్షతరుఁడును, నైరసును బ్రత్యుత్తరించిరి. ఆ యుద్ధములో (ఇండియారాజు) మీఁడి

యనులపక్ష మవలంబించి యుద్ధమును బ్రకటించినటులఁ గన్పట్టుచున్నది."[1]

మీడియా దేశమునకును బాబిలోనియా దేశమునకును జరగిన యీ ఘోరసంగ్రామమున హిందూదేశపు రాజుచేఁ బంపఁబడిన సైన్యము మీడియాదేశపురాజుపక్ష మవలంబించి పోరాడియుండిరి. బాబిలోనియను లోడింపఁబడిరి. లిడియా (Lydia) దేశపురాజగు క్రొయిసను (Croesus) ను బందీగాఁ బట్టుకొనిరి. లిడియాదేశపు ముఖ్యపట్టణమగు సార్డిసు (Sardis)ను బట్టుకొనిరి. మీడియాదేశపు వృద్ధరాజుకుమారుఁడగు సువక్షతరుఁడు తమకు సంప్రాప్తమైన విజయముచే మదోన్మత్తుఁడై యుండెను. మీడియాదేశీయులు బాబిలోనియనుల పయిఁ దమకుఁ గలిగిన దిగ్విజయమునకు సైరసు కారకుఁడని గ్రహించి యాతనినే యెక్కుడుగ గౌరవింపనారంభించిరి. తనదేశపు బ్రజలు తనకంటె సైరసు నెక్కుడుగ బ్రేమించి గౌరవించుటను జూచినకొలఁది సువక్షతరునకు సైరసునందసూయజనించి నానాటి కభివృద్ధియై యీర్ష్యగామారి విరోధభావమంకురించెను. జననకాల విశేషముంబట్టి మీడియాదేశ విధ్వంసకుఁడగునని, జ్యోతిశ్శాస్త్రవేత్తలు చెప్పుటచే శిరచ్ఛేదముఁగావింప ననుజ్ఞనీయఁబడిన తన మేనల్లుఁడగు నగ్రదత్తుఁడే యాతఁడని యనుమానముఁజెంది తనతండ్రియగు అహిదంసకునితో నాలోచనలుఁగావించి కపటోపాయముల సైరసును దుదముట్టింపఁ గుట్రలుపన్నెను. సువక్షతరుఁడు గావించు

---

1 See - Rollins "History of Cyrus" Ch. III p. 129.

కుట్రలను సైరసు గ్రహించి మీడియాదేశమునుండి తప్పించుకొని పాఱిపోయి పారశీకదేశమునుజేరి పారశీకులను మీడియాదేశపు రాజుపైఁ దిరుగుబాటొనరించునట్లు ప్రోత్సహించి పారశీకసైన్యముల సాహాయ్యముచే మీడియనుల నెదుర్కొని యుద్ధముసేయ సమకట్టెను. ప్రథమమున మీడియనులు సైరసు నోటుపుచ్చెను. సైరసు తండ్రియగు అత్రిదత్తుఁడా యుద్ధములోఁ జంపఁబడియెను. మీడియనులు సైరసును వెనుకకుఁ దఱిమి పార్స్వగడమువఱకు వచ్చియుండిరి. అట్టితఱుణమున మీడియనులు తనపై దండెత్తివచ్చియుండిరనియు, వారితో యుద్ధముసేయ సైన్యనివహంబుల సమకూర్చుకొనుటకుం దగు ధనమొసంగవలసినదనియు, దైవకృపచేఁ దనకు జయము సేకూఱినయెడలఁ దనకు సహాయ్యము సేసినందులకుఁ దాను మిత్రభావముతో మెలంగుచు సహాయకారిగా నుందు ననియు, హిందూదేశపురాజునకు సైరసు రాయబారమంపెను. ఈ రాయబారమందినవెంటనే హిందూదేశపురాజు సైరసునకుందగుసాహాయ్యమొనర్చియుండుటయేగాక, మోమోటమిఁ జెందక వలయునపుడెల్లఁ దెలిపినచో వలయు సాయమంతయుఁ జేసెదనని వాగ్దానమొనర్చియుండెను. ఇవ్విషయమై చరిత్రకారులు చెప్పిన విషయముల గమనింపఁ దగియున్నది.

" In this interval, ambassadors from the King of India, with a large sum of money for Cyrus, from the King their master, who has also ordered them to assure him, that he was very glad he had acquainted him with what he wanted; and that he was willing to be his friend and ally; and

if he still wanted more money, he had nothing to do but to let him know; and that in short, he had ordered his ambassadors to pay him the same absolute obedience to himself. Cyrus received these obliging offers with all possible dignity and gratitude. He treated the ambassadors with the utmost regard and made them noble presents."$

"ఈ మధ్యకాలములోఁ దమ యేలికయగు హిందూ దేశపురాజుచేఁ బంపఁబడిన రాయబారులు సైరసు కిమ్మని పంపిన యమితధనమును దీసికొనివచ్చిరి. తనకు (సైరసుకు) కావలసినదేదియో యెఱింగించినందులకుఁ జాలసంతోషించితిననియు, స్నేహితుఁడుగను, సహాయ్యకారిగను మెలంగుట కిష్టపడియుంటిననియు, నింకను ద్రవ్యమవసరమగు నెడలఁ దనకుఁ దెలియఁజేయుటకంటె నెక్కువేమియుఁ జేయ నక్కఱలేదనియు, ముఖ్యముగఁ దనరాయబారులు తనకే విధముగ విధేయులై ప్రవర్తించుచుండిరో యావిధముగనే విధేయులై వర్తించునట్లు లుత్తరువు లిచ్చియుంటిననియు నాతనితో (సైరసుతో) గట్టిగాఁ జెప్పవలసినదని వారికాజ్ఞాపించియుండెను. మహోపకారమగు నాకోర్కెలను సైరసు సంభావ్యమగు మర్యాదపూర్వకంబగు కృతజ్ఞతాసూచకముగ నంగీకరించి రాయబారుల నధికముగ గౌరవించి వారికి గొప్ప పారితోషకముల నొసంగెను."†

హిందూదేశపురాజు సైరసునకుఁ జేసిన వాగ్దానము ననుసరించి వలయు సాహాయ్యముఁ జేసియుండెను. ఇండియాదేశపు

$ See - Rollins 'History of Cyrus' - Chap. III p. 136.
†. Rollins "History of Cyrus" Ch. III p 136.

రాజు కావించిన సాహాయ్యముచేత సైరసు మీాడియనులతో యుద్ధముసేసి సంపూర్ణవిజయుఁడగుటయేగాక మీాడియా దేశ మునుజయించి స్వాధీనముజేసికొనియుండెను. అహిదంసకుఁడును సువక్షతరుఁడును బారిపోవుచుండ వారిని వెంబడించి పట్టుకొని చెరసాలయందునిచెను. మీాడియా దేశమును పారశీక దేశ మునఁ జేర్చుకొని సైరసు పారశీకసామ్రాజ్యమును స్థాపించి యుండెను.

సైరసు మీాడియా దేశమును స్వాధీనపఱుచుకొని పార శీక సామ్రాజ్యము (Persian Empire)ను క్రీ. పూ. 550 సంవత్సరమున స్థాపించియుండినట్లు చరిత్రకారు లంగీకరించియుం డిరి. ఈవిషయమునుగుఱించి చరిత్రకారులు కొందఱుసెప్పిన వాక్యములఁ గొన్నిఁటిఁ బరికింతము.

"Undoubtedly we ought not to regard Cyrus as a prince of the old population, but as a member of the newly immigrated Aryan Nobility; whether he was Persian or Mede must remain a disputed point, but this was immeterial when he once became a prince. It is still uncertain which country he belonged and how great his territory was. Nabonidus terms a 'petty vassal' of the Great Mede; that, however, may only express the contrast between him and the Great King. The Babylonian Chronicle, which deals with the events of this period, calls him, upto the capture

of Ecbatana and the overthrow of Astyages "King of Anzan", but afterwards 'King of Parsu (Persia)", Cyrus had in fact, as the tradition puts it, made use of the Persians for his purposes, and had therefore been recognised by them as their leader. Whether the Persians at an early period, as Herodotus implies, were already subject to the Median Kings or now for the first time really took an active part in the internal struggles of Media, Cyrus in any case knew how to avail himself of their help against the Sovereign whom he wished to dethrone."

" We can at least take it for proved that Cyrus— whether himself a Persian or not- was able to overthrow the Median Royal house, only by the help of the Persians. The revolution has no further significance. Since the Medes themselves had taken part in the conspiracy, their position remained untouched, and they were for the future the Governing people by the side of the Persians. The difference between the two peoples was indeed only that between two independent tribes. It is not surprising that Cyrus, now designated himself King of Persians since he was bound to give up the honour and preference to the people who built up his power and supported his claims. But he was soon destined to be more than this,

and he made the Persians and Medes the ruling people of the Entire East. After Astyages had been taken prisoner by Cyrus, the latter's Empire extended as far as the Lydian frontier."*

" Stripped off its romantic features, Herodotus's narrative of the rise of Cyrus is in fundamental harmony with the new document which we possess on the subject, in the shape of annals inscribed on a Babylonian tablet. According to Herodotus, Cyrus and the Persians revolted; Harpagus, the Mede, who was in league with him, was despatched against him. A part of the Median army fought, but another part went over to Cyrus or fled. In a second battle Astyages was defeated and taken prisoner. Now the tablet tells us among other things "and against Cyrus, the King of Anshan............went and Ishtivigu, his army revolted against him and in hands took, to Cyrus they gave him." Thereupon it proceeds Cyrus took Ecbatana (Pers: Agbatana—and Skt-Agrapattana the chief or capital city.) and carried of rich booty to Anshan. This summary account of Babylonian annalist by no means excludes the supposition that Cyrus had fought a previous

* Vide. The Article on Media & Persians in Harmsworth's History of the World.

battle against Astyages. Both accounts say that the treachery and faithlessness of the army procured Cyrus the Victory. We might even harmonise the Babylonian document with Ctesis' narrative that Cyrus was first hard pressed and driven back as far as Pasargadae, if there were not other grounds, quite apart from its fabulous embellishments, which render this account improbable."

"The date of the overthrow of Astyages, and the taking of Ecbatana is, according to Babylonian tablet, the sixth' year; and as it is in the highest degree possible that the years in this memorial are those of the Babylonian King Nabunaid (Nabonidus?) we must place these events in the year 550 B. C."†

"సైరసు ఆదిమవాసులలోని రాజకుటుంబమునఁ జేరిన వాఁడు గాఁడనియు, నూత్నముగా వలసవచ్చిన యార్యుల రాజకుటుంబములం జేరినవాఁడనియు రూఢిగా నెన్నవచ్చును. ఆతఁడు పారశీకుఁడా లేక మీడియా వాస్తవ్యుఁడా యనునది వివాదాంశముగ నుండవలసినదే! కాని యాతఁడు రాజైనందున బ్రభుస్థాన మాక్రమించికొని ప్రభువుగ నెన్నఁబడినపు డావిషయము ప్రధానముగాదు. ఆతఁ డేదేశస్థుఁడో యాదేశ విస్తీర్ణమెంతయో యిప్పటికిని స్పష్టముగఁ దెలి

† Vide. Encyclopaedia Brittanica, 9th. Ed, Vol. XVIII - p, 565 - Article on Persia.

యుటలేదు. మీడియాసామ్రాజ్యమునం దొక చిన్న సామంతుఁడని "నబోనిడసు" చెప్పియున్నాఁడు. అది యాతనికిని పెద్దరాజునకును (సామ్రాట్టునకును) గల తారతమ్యమును గనఁబఱుపవచ్చును. ఆ కాలమునందలి చరిత్రాంశములఁ దెలియఁజేయు బాబిలోనియాదేశ చరిత్రమాతనిని (సైరసును) ఎక్బటనమును బట్టుకొని అహిదంసకుని (Astyages) జయించువఱకును అంజాన్ దేశపురాజనియు, దరువాతికాలమున పార్సు (పర్షియా) దేశపు రాజనియుఁ బేర్కొనుచున్నది. వాస్తవముగ సంప్రదాయ చరిత్రలు చెప్పుచున్నటుల సైరసు తన యుద్దేశమును నెఱవేర్చుకొనుటకుఁ బారశీకుల నాధారముఁ గావించుకొనియుండెను. అక్కారణముచేతనే వారు (పారశీకులు) సైరసును దమ నాయకునిగా నేర్పాటుఁ జేసికొనియుండిరి. హెరొడొటసు (Herodotus) అభిప్రాయపడినటులఁ బారశీకులు ప్రాచీనకాలమునందు మీడియనురాజులకు లోఁబడియుండినవారైనను లేక మీడియాదేశములోని యంతఃకలహములలోఁ బాల్గొనుట కదియే ప్రారంభమని యెంచినను సైరసు తాను రాజ్యభ్రష్టునిఁ గావింపఁదలఁచిన చక్రవర్తిపైఁ దిరుగుబాటొనరించి తానేవిధముగ వారి సహాయ్యముఁ బొందవలసియుండెనో గుర్తెఱిఁగియుండెను."

"సైరసు పారశీకుఁడైనను గాకున్నను బారశీకుల సహాయ్యముచే మీడియాదేశపు రాజకుటుంబము వారిని సింహాసన భ్రష్టులను గావించియుండెనని స్పష్టముగ నెంచవచ్చును.

అంతకంటె నా తిరుగుబాటు అధికముగఁ గనఁబడుచదు. ఆ కుట్రలో మీడియనులుగూడఁ జేరియుండుటచే వారిస్థితి యందేమియు మార్పు కలుగలేదు. పారశీకులతోఁబాటు భవిష్యత్కాలమునఁ బరిపాలకులుగ నుండిరి. పారశీకరాజకుటుంబములకును మీడియాదేశపు రాజకుటుంబములకును భేదభావ మంకురించియుండలేదు. వా రుభయులమధ్యఁ గలభేదము రెండు ప్రత్యేక తెగలవారనుటమాత్రమే! తనకు సాహాయ్యపడి తన యధికారము నెలకొల్పుటకుఁ దోడ్పడిన పారశీకులకు ముందుగా గౌరవముచూపించుటకై సైరసు పారశీకులకురాజునని చెప్పికొనియుండుట యేమియు వింతగాదు. కాని యచిరకాలములోనే యింతకంటె నెక్కువగానుండు అదృష్టముండెను. పారశీకులు మీడియనులు ప్రాగ్దేశమునంతయుఁ బరిపాలించువారుగఁ జేసెను. సైరసు అహిదంసకుని బందీగాఁ దీసికొనిన తరువాత సైరసురాజ్యము లిడియా (Lydia) దేశమువఱకును విస్తరించియుండెను."[1]

"అద్భుతముగఁ జెప్పఁబడిన సంగతులనువిడిచిచూచిన 'సైరసు' అభివృద్ధినిగుఱించి హెరొడోటసు చెప్పిన చరిత్రమావిషయమునుగుఱించి మనకు లభ్యమైన బాబిలోనియను శాసనములోని ముఖ్యాంశములకు సరిపోవుచున్నది. హెరొడోటసు మతానుసారముగ సైరసును బారశీకులును దిరుగుబాటొనరించిరి. సైరసుతోఁ గుట్రలోఁజేరిన మీడి

1 "The Article on Media & The Persians" in Harmsworth's History of the World.

యాదేశస్థుఁడగుహార్పేగసు సైరసుతో యుద్ధముసేయుటకు బంపఁబడియెను. వీఁడియునుసైన్యములో గొంతభాగము పోరాటమునలిపిరి. మిగిలినభాగము సైరసుతోఁజేరుటయో పారిపోవుటయో సంభవించెను. రెండవయుద్ధములో అహిదంసకుఁ డోడింపఁబడి బందీగాఁ బట్టుకొనఁబడియెను. ఇష్టువిగ్గు, అన్షాన్ రాజగు సైరసుమీఁదికిఁ బోరాటమునకు వెళ్లెననియు, నాతనిసైన్యము తిరుగుబాటొనరించి సైరసుతోఁజేరి యాతనికి, ఒబిలెటు (బాబిలోనియా నూతన శాసనము) చెప్పుచున్నది. పిమ్మట సైరసు ఎక్బటనమును (Ecbatana- అగ్రపట్టణమును) స్వాధీనపఱుచుకొని కొల్లఁగొట్టినధనమును అన్షామునకుఁ దీసికొనిపోయినట్లును జెప్పుచున్నది. బాబిలోనియా చరిత్రకారునిచేఁ జెప్పఁబడిన యీ సంక్షేపచరిత్ర మహిదంసకునకును సైరసునకును, అంతకుముందు యుద్ధములు జరగియుండునను నూహ నెంతమాత్రమును ద్రోసివేయుటలేదు. ఆ రెండు చరిత్రలును సైన్యముయొక్క ద్రోహమును, విశ్వాసఘాతుకమును, సైరసునకు జయమును జేకూర్చెననియే చెప్పుచున్నవి. ప్రపథమమున సైరసునకడ్డువడి పశర్గడేయి (Pasargadae) వఱకును దఱుముకొని పోబడియెనని స్టీసిసు (Ctesis) చెప్పినకథతో బాబిలోనియను పత్రములోనికథ సరిపోవుచున్నది.

"అహిదంసకుని రాజ్యభ్రష్టతయు, ఎక్బటనమును Ecbatana-అగ్రపట్టణమును)పట్టుకొనుటయు నాఱవ (6)

సంవత్సరమైయుండెనని బాబిలోనియను టేబిలెటు (శాసనము) వలనఁ దెలియుచున్నది. జ్ఞాపకార్థమేర్పఱిచిన యిప్పత్రమునఁ జెప్పఁబడిన వత్సరములు బాబిలోనియా రాజగు నబునాయిడ్ లేక నబోనిడసు (Nabunaid or Nabonidus) కాలమునుండి లెక్కింపఁబడినట్లు లన్నివిధముల నెన్నదగియుండుటచే నీసంగతి (అనఁగా అహిందంసకుని రాజ్యభ్రష్టత, అగ్రపట్టణమును పట్టుకొనుట, పారశీక సామ్రాజ్యము సైరసుచే నెలకొల్పఁబడుట) క్రీ. పూ. 550 సంవత్సరములో జరగియుండెనని చెప్పవలెను $

మీడియాసామ్రాజ్యాంతమును, పారశీకసామ్రాజ్యము నెలకొనిన క్రీ. పూ. 550 సంవత్సరము ప్రపంచ ప్రాచీనచరిత్రయందుఁ జాల ముఖ్యమగు వత్సరము. మీడియను సామ్రాజ్యమును పాలించిన కడపటి రాజులగు నహిందంసకుఁడు, సువక్షతరుఁడు ననువారల రాజ్యభ్రష్టులఁ గావించి మీడియను సామ్రాజ్యమును రూపుమాపి పారశీకులను మీడియనులను సమ్మేళనముఁ గావించి సింహాసనాధిష్ఠితుఁడయి పారశీకసామ్రాజ్యమును స్థాపించిన సైరసుచక్రవర్తి (Cyrus the Great) తన రాజ్యప్రారంభకాలమునుండి యనఁగాఁ గ్రీ. పూ. 550 సంవత్సరమునుండి శకకాలము లెక్కించునటులఁ జేసియుండెననియు, విస్మరింపఁజాలని యీ శకకాలప్రారంభమును బ్రపంచమందలి యన్ని దేశములవారునుఅన్ని జాతులవారును నంగీకరించి

$ "The Article on Persia" in Encyclopaedia of Brittanica. (9th. Edn.) Vol. XVIII p 565.

యుండిరనియు, గ్రీకుచరిత్రకారుఁడగు హెరొడోటసు చెప్పి యున్నాఁడు. ఇట్టి స్థితిలో నాకాలమునందలి హైందవులును సైరసునకు సువక్షతరునికాలమునందే బాబిలోనియనులతోఁ బోరాడునపుడును, బిమ్మట విరాడియనురాజగు నహిందంసకుని మీఁదను ఆతని కుమారుఁడగు సువక్షతరుని మీఁదను దిరుగు బాటొనరించి పోరాటములు సలుపునపుడును, సైన్యమును బంపియు, వలయు ధనమొసంగియు సాహాయ్యముఁ జేసినట్టియుఁ బారశీకసామ్రాజ్య స్థాపనమొనర్చుట కన్నివిధములఁ దోడ్పడి నట్టియు, హిందూదేశపు రాజులును నాదేశపుఁ బ్రజలును, నా కాలమునఁ దమ దేశములయందుఁగూడ నీ శకకాలమును సంతోషముగ నంగీకరించియుండురనుట సహజము. "ఆసన్ మఘాసుమునయః" అను శ్లోకమునఁ బ్రస్తావించఁబడినట్టియు, జ్యోతిశ్శాస్త్రవేత్తలగు వరాహమిహిరుఁడు మున్నగువారల సిద్ధాంతగ్రంథములయందుఁ బేర్కొనఁబడినట్టియు, శకకాలము, శకేంద్రకాలము, శకనృపకాలము, శకభూపకాల మనునవి యన్నియుఁ గ్రీ. పూ. 550 సంవత్సరమున సైరసుచక్రవర్తిచే నేర్పాటుఁచేయఁబడిన పారశీకసామ్రాజ్యస్థాపనతోఁ బ్రారంభింపఁబడిన శకకాల ప్రశంసయనియే కానిపించుచున్నది. ఆ కాలమునందలి హైందవచరిత్రకారులును, సిద్ధాంతవేత్తలును, జరిత్రకారులును, సిద్ధాంతగణితములు మున్నగువానిని తెలుపుటకై పేర్కొనిన శకకాల మదియేయైనట్టు గన్పట్టుచున్నది.

ప్రాచీనాధునిక చరిత్రకారులందఱును సైరసు చక్రవర్తిచేఁ బారశీకసామ్రాజ్యస్థాపనము క్రీ. పూ. 550 సంవత్సర

మునఁ గావింపఁబడియుండినట్టు లంగీకరించిన విషయమే ! ప్రాచీన గ్రీకుపండితుల ట్లే చెప్పియుండిరి. బాబిలోనియా శాసన మట్లే చెప్పుచున్నది. పారశీకులనే శకనులనియు, శకరాజుల నియు హైందవులనుచుండిరి. నూతన సామ్రాజ్యమును నెల కొల్పికొని నూతనశకమును బ్రారంభించుటచే నాతనిని శక . రాజు (శకనులరాజు) అనియుందురనియుఁ జెప్పఁదగియున్నది. కావున శకనులని పేర్కొనంబడుచుండిన పారశీకుల శకమును శకకాలమనియు, (శకనులకాలమనియు) శకేంద్రకాలమనియు, శకనృపతి కాలమనియు, శకభూపకాలమనియు, బ్రాచీన హైందవులు పేర్కొనియుండిరనియుఁ జెప్పఁదగియున్నది. మఱియు హైందవులు తమదేశ చరిత్రాంశములను తమశకాబ్దముల తోడఁ గాకుండ విదేశీయ శకాబ్దములతోఁగూడ సంబంధము గలుగఁజేసి పేర్కొనిన భవిష్యత్కాలమునఁ గాలనిర్ణయమున కెక్కుడు సహకారిగనుండుననితలంచి యట్లు తమదేశమునాను కొనియున్న విదేశీయులగు శకనుల శకాబ్దములతోడను సంబంధము గలుగఁజేయుచు వారిశకకాలమును బేర్కొనుచుండి నట్లును దలంపనై యున్నది.

వరాహమిహిరుఁడు మున్నగువారు సూచించిన శకకాలము శాలివాహనశకకాలమనియెంచి కొందఱు పాశ్చాత్య, హైందవ చరిత్రకారులును, బండితులును, భారతయుద్ధ కాల నిర్ణయమును గావించియుండిరి. కలియుగ ప్రవేశకాలము క్రీ. పూ. 3102 సంవత్సరమని యొప్పికొనియుండిరి. కొందఱొప్పి కొనక విపరీతసిద్ధాంతము లొనర్చియుండిరి. "ఆసన్మఖా

సుమునయః" అనుశ్లోకమునఁ బ్రస్థావించబడిన శకకాలము శాలివాహన శకకాలమనుభ్రమచేఁ గ్రీ. పూ. 2448 (2526—78) సంవత్సరములకిందట యుధిష్ఠిరుని కాలమైనట్లును, గలియుగ ప్రవేశమయినపిమ్మట 653 సంవత్సరముల ప్రాంతమునఁ గురుపాండవులయుద్ధము జరగియుండినట్లును కల్హణపండితుఁడు సూచించియుండెను. ఇయ్యది ప్రాచీన హైందవ వాఙ్మయమునందుఁ జెప్పఁబడిన విషయములకు విరుద్ధముగనున్నది. భారతయుద్ధానంతరము 36 సంవత్సరములయనంతరము శ్రీకృష్ణనిర్యాణముతో కలియుగ ప్రారంభమైయుండెననియు ననఁగాఁ గల్హణుని యభిప్రాయము ననుసరించియును గ్రీ. పూ. 3102 సంవత్సరమునఁ గలియుగ మారంభమైయుండెననియుఁ జెప్పఁబడియుండెను. కల్హణుని గణితమునే సరియనియెంచినచో శ్రీకృష్ణనిర్యాణమయినపిమ్మట 653 సంవత్సరములకు భారతయుద్ధమున శ్రీకృష్ణుఁడు పాండవులపక్షమునఁ బార్థునిరథసారథియై తోడ్పడినటులఁ జెప్పవలసి వచ్చుచున్నది. కలియుగప్రవేశమయి 25 సంవత్సరములు గడచినపిమ్మట ననఁగా 26 సంవత్సరమున యుధిష్ఠిరుఁడు స్వర్గారూఢుఁడైనట్లును, లోకములో యుధిష్ఠిరుని జ్ఞాపకార్థ మప్పటినుండి లౌకికాబ్దము ప్రారంభింపఁబడియుండినట్లును జరిత్రలు చెప్పుచున్నవి. కావున కల్హణపండితుని సిద్ధాంతము చరిత్రాంశములకు విరుద్ధముగఁ గన్పట్టుటయేగాక యసంభవముగఁగూడఁ గన్పట్టుచున్నది.

వరాహమిహిరునిచేఁ జెప్పఁబడిన "ఆసన్మఖాసుమునయః" అను శ్లోకమునుబట్టి యుధిష్ఠిరునకును శకకాలమునకును

మధ్యఁగల కాలవ్యవధి 2526 సంవత్సరములని తెలియుచున్నది. ఆశ్లోకమునఁ బేర్కొనిన శకకాలము శకసామ్రాజ్యప్రారంభ కాలమునుండియునాసామ్రాజ్యస్థాపకుఁడగు సైరసుచే గ్రీ.పూ. 550 సంవత్సరమున నేర్పాటుసేయఁబడిన శకకాలమయియుండు నని సమన్వయముచేసినచో యుధిష్ఠిరునికాలము క్రీ. పూ. 3076 (2526 + 550) సంవత్సరమున నంతమైనట్లు గన్పట్టుచున్నది. కలియుగ ప్రవేశమయి 25 సంవత్సరములు గడచిన తరువాత ననఁగా 26 సంవత్సరమున యుధిష్ఠిరుఁడు స్వర్గస్థుడైనట్లు చెప్పఁ బడియుండుటచే గ్రీ. పూ. 3102 సంవత్సరమునఁ గలియుగము ప్రారంభమయినటులఁ జూపట్టెడిని. ఇవియన్నియుఁ బ్రాచీన హైందవచరిత్రలు, పురాణేతిహాసములు, ఐతిహ్యములు మున్నగునవి చెప్పుచున్నటులఁ గలియుగకాలము మున్నగువానికి సరిపోవుచున్నవి. కాన వరాహమిహిరుఁడు మున్నగువారలు చెప్పిన శకాలము, శకకేంద్రకాలము, శకనృపకాలము, శకభూపకాలము లనునవి క్రీ. పూ. 550 సంవత్సరమున సైరసుచే స్థాపింపఁబడిన శకసామ్రాజ్యకాలమనియె స్పష్టముగఁ జెప్ప నొప్పుచున్నయది. అయ్యది ప్రాచీనహైందవ వాఙ్మయమునం దుదహరింపఁబడిన గణితములకును, గాలనిర్ణయముల కును సరిపోవుచున్నది. కలియుగ ప్రవేశకాలమునకుఁ బూర్వము 37 సంవత్సరములక్రిందట మహాభారతయుద్ధము జరగియుండి నట్లు జెప్పఁబడియుండుటచేఁ గ్రీ. పూ. 3139 (3102 + 37) సంవత్సరమున మహాభారతయుద్ధము జరగియుండెనని చెప్పఁదగి యున్నది.

## వరాహమిహిరుని కాలము.

ఇఁక వరాహమిహిరుని కాలమును గనుంగొనఁ బ్రయత్నింతము. వరాహమిహిరుఁడు హోరాశాస్త్రము, సిద్ధాంత ద్వాదశము, బృహత్సంహిత, లఘుజాతకము, పంచసిద్ధాంతిక మొదలగు గ్రంథముల రచియించెను. పంచసిద్ధాంతికను శక నృపకాలము 427 సంవత్సరమున రచియించినటులఁ గొందఱు సెప్పుచుఁ బంచసిద్ధాంతికలోని యీ క్రిందిశ్లోక మాధారమను చున్నారు.

"శ్లో॥ సప్తాశ్వివేదసంఖ్యం శకకాల మపాస్యచైత్రశుక్లాదౌ
అర్థాస్తమితేభానౌ యవనపురే సోమదివసాద్యే॥"[1]

వరాహమిహిరుఁడు అహర్గణితమును జేయువిధమును జెప్పుసందర్భమున జరుగుచుండు శకకాల సంవత్సరములనుండి 427 మినహాయించి పై శ్లోకములయందు నిర్వచింపఁబడిన విధమున గణితముసేయుమని చెప్పియుండెను. దీనింబట్టి వరాహమిహిరుఁడు గణితముచేయునప్పటికి శకకాలము 427 సంవత్సరములు గడచియుండెననియు నపుడే యాగ్రంథమును రచించి యుండెననియు నూహించి చెప్పుచు నయ్యదియే యాతనికాల మనుచున్నారు.

వరాహమిహిరుఁడు శకకాలము 509 సంవత్సరమునఁ జనిపోయినటు లామరాజు చెప్పియుండెననుచున్నారు. వీనియందుఁ జేర్కొనఁబడిన శకకాలవత్సరములు శాలివాహన శకవ

1 Panchasidhantika Ch. I- V. 8.

త్సరములనియెంచి శాలివాహనశకము క్రీ. శ. 78 సంవత్సర మునఁ బ్రారంభమైనట్లు జెప్పఁబడియుండుటచే వరాహమిహిరు నిచేఁ బంచసిద్ధాంతికయందుఁ జెప్పఁబడినసంఖ్య 427 అపుడు జరుగుచున్న శకకాలవత్సరమని భావించి వరాహమిహిరుఁడు జన్మించినవత్సరము క్రీ. శ. 505 (427 + 78) సంవత్సరమయి యుండెననియు, నాతఁడు మరణించినకాలము క్రీ. శ. 587 సం వత్సరమయియుండుననియుఁ గొందఱు పాశ్చాత్య భారతీయ పండితులు సిద్ధాంతములుచేసియుండిరి. వారిచేఁ బేర్కొనఁబడిన శకకాలవత్సరములు శాలివాహన శకవత్సరములని యేలయెం చవలయునో కారణములు చెప్పినవారుకారు. క్రీ. పూ. 57 సం వత్సరమున శకస్థాపనముఁగావించిన విక్రమశకవత్సరము లనిగాని క్రీ. పూ. 457 సంవత్సరమున శకస్థాపనముఁగావించిన శ్రీహర్ష వర్ధన విక్రమాదిత్య శకవత్సరము లనిగాని భరతఖండమున వా డుకలోనుండు మఱియేయితర శకవత్సరము లనిగాని యేలచెప్పఁ గూడదో కారణములను జూపించినవారుకారు. వరాహమిహి రుఁడు క్రీస్తుశకము తరువాతఁ జాలకాలమునకుఁ బుట్టినవాఁడని చూపింపఁదలఁచిన తమయుద్దేశ్యమునకు దాదాపు సరిపోవుచు న్నందున శాలివాహన శకవత్సరములనిచెప్పియుంటిమన్న సహే తుకముగఁ గన్పట్టునేమో? వరాహమిహిరుని పంచసిద్ధాంతి కలో శకకాలము 427 అని తెలియజేయు 'సప్తాశ్వివేద' సం ఖ్యావాచకమును, వరాహమిహిరుని చరమకాలము శకకాలము 509 సంవత్సరమని ఆమరాజు చెప్పియుండినట్లు చెప్పఁబడు సం ఖ్యావాచకమును సరియైనవేనాయనువిషయ మాలోచనీయము.

## కాళిదాసు.

రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము, ఋతుసంహారము, శాకుంతలము, మాళవికాగ్నిమిత్రము, విక్రమోర్వశీయము, శ్రుతబోధ, శృంగారతిలకము, జ్యోతిర్విదాభరణము, ఉత్తరకాలామృతము, శృంగార రసాష్టకము, సేతుబంధము, కర్పూరమంజరి, శ్యామలాదండకము, పుష్పబాణవిలాసము, ప్రశ్నోత్తరమాల, కుంతేశ్వరదౌత్యము, రాక్షసకావ్యము, నవరత్నమాల, స్వరశాస్త్రసారమను శత్రుపరాభవశాస్త్రము మున్నగునవి కాళిదాసకవికృతములని చెప్పుచున్నారు. శాకుంతల, విక్రమోర్వశీయ, మాళవికాగ్నిమిత్రములను నాటకత్రయ గ్రంథకర్తయగు కాళిదాసును, రఘువంశము, మేఘసందేశము, కుమారసంభవములను గావ్యత్రయకర్తయగు కాళిదాసును వేర్వేఱువ్యక్తులని కొందఱనుచున్నారు. జ్యోతిర్విదాభరణకర్తృత్వము కాళిదాసున కారోపింపఁ గొందఱనుమానించుచుండిరి. కాళిదాస నామధేయులు ముువ్వురు నలువురున్నటులఁ దెలియుచున్నది. పరిశోధనలుసల్పినచో నంతకధికముగనుండిన నుండవచ్చును. ఈవిషయమిట్లుండఁ గాళిదాసను నామముగల కవియే లేఁడనియు, నయ్యదిబిరుదు నామమనియు గొందఱనుచున్నారు. ఏది యెటులున్నను గాళిదాసకర్తృత్వమున కారోపింపఁబడినగ్రంథముల కర్తయగు కాళిదాసొక్కఁడా లేక భిన్నభిన్నవ్యక్తులాయను సంశయము వొడముచున్నది. శత్రుపరాభవ శాస్త్రమున మాత్రము గ్రంథకర్త తనపితృగోత్రములను

"శ్లో॥ ఆసీత్కాశ్యపవంశజోఽర్క తనయాతీరాధివాసోద్విజ।
శ్రౌతస్మార్తవిచారసార చతుర శ్రీభానుభట్టస్సుధీః ।
తత్పుత్రో హరిభక్తినిర్మల తనుర్జ్యోతిర్విదామగ్రణీ ।
శాస్త్రం శత్రుపరాభవాఖ్యమ కరోచ్ఛ్రీ కాళిదాసః
కవిః॥"

అని చెప్పుకొనియున్నాఁడు. కాని తక్కిన గ్రంధములయందా యా గ్రంధకర్తయని చెప్పఁబడు కాళిదాసు పితృగోత్రనామము లవాఙ్మానసగోచరములుగనున్నవి. మఱియుఁ గాళిదాసు జననాదికములను గుఱించి వింతకథలఁ బెక్కింటిని జెప్పుచుండిరి. వాని నిజానిజములెట్లున్నను వీ రేకాలపువారై యుండినదియుఁ జరిత్రాంశముల నారయఁ దెలిసికొనుట యనవసరముగాదు. శత్రుపరాభవ శాస్త్రకర్తయగు కాళిదాసు జ్యోతిర్విదాభరణ కర్తయగు కాళిదాసునకంటె భిన్నుఁడనియుఁ దరువాతివాఁడనియుఁ దెలియుచున్నది. జ్యోతిర్విదాభరణకర్తయగు కాళిదాసును, ఉత్తరకాలామృతకర్తయగు కాళిదాసును, మాళవాధీశుఁడగు విక్రమార్కుని కాలమునందుండినటులఁ జెప్పుకొని యున్నారు. ఈ రెండుకావ్యములకర్తయు నొకే వ్యక్తియై యుండునని తోఁచెడిని. కాళిదాసు ఉత్తరకాలామృతమును విక్రమార్కునికిఁ గృతియిచ్చి చెప్పినట్టందలి ప్రథమశ్లోకములగు

"శ్లో॥ శ్రీమద్వక్త్ర చతుష్టయాచ్యుత హరస్వర్నాయకాద్యై
స్సురైః । కార్యారంభవిధౌ సమర్చిత పదద్వంద్వం ద్విపేం
ద్రాననం। పాశాద్యాయుధలడ్డుకప్రవిలసద్ధస్తైశ్చతుర్భిర్యుతం।
శ్రీమద్విక్రమ సూర్యపాలనవరం వందే భవానీసుతమ్ ॥

శ్లో॥ కామేశస్య సువామభాగనిలయాం భక్తాఖిలేష్టార్థదాం।
శంఖం చక్రమథాభయంచవరదం హస్తైర్దధానాం శివాం।
సింహస్థాం శశిఖండమౌళి లసితాం దేవీం త్రినేత్రోజ్వలాం।
శ్రీమద్విక్రమ సూర్యపాలనవరాంవందేమహాకాళికామ్॥"

అను వానివలనఁ దెలియుచున్నది.

జ్యోతిర్విదాభరణమును రచించిన కాళిదాసు దా నదివరలో రఘువంశాది కావ్యత్రయమును రచియించియుండి నట్లును, శకేశ్వరుఁడగు రూమకేశాధిపతిని మహాసంగ్రామమున జయించి ఉజ్జయినిని గ్రహించినవాఁడును, శంక్వాది పండిత శ్రేష్టులను, అనేకమందిమహాకవులను, వరాహమిహిరాది జ్యోతిర్విదులను బోషించువాఁడును ఉజ్జయినీచక్రవర్తియు నగు విక్రమార్కునకు స్నేహితుఁడై నట్లును, విక్రమార్కు నాస్థానమందుండు నవరత్నములలో దా నొకఁడై నట్లును, జెప్పుకొని యున్నాఁడు.

"శ్లో॥ యోరూమకేశాధిపతిం శకేశ్వరం
జిత్వాగృహీత్వోజ్జయినీం మహాహవే।
ఆనీయసంభ్రామ్య ముమోచతం త్వహో
శ్రీ విక్రమార్కస్సమసహ్య విక్రమః॥

శ్లో॥ శంక్వాదిపండితవరాః కవయస్త్వనేకే
జ్యోతిర్విదస్సమభవంశ్చవరాహపూర్వాః
శ్రీవిక్రమార్కనృపసం సదిమాన్యబుద్ధి
స్తైరప్యహంనృపసఖాకిల కాళిదాసః॥

శ్లో॥ కావ్యత్రియం సుమతికృద్రఘువంశపూర్వం ।
పూర్వం తతస్మృతిహితం శ్రుతికర్మవాదం ।
జ్యోతిర్విదాభరణకాలవిధానశాస్త్రం ।
శ్రీకాళిదాసకవితో హితతోబభూవ॥

* * *

శ్లో॥ ధన్వంతరిక్షపణకామరసింహ శంకు
వేతాలభట్ట ఘటకర్పర కాళిదాసాః।
ఖ్యాతోవరాహమిహిరో నృపతేస్సభాయాం
రత్నానివై వరరుచిర్నవ విక్రమస్య॥*

మఱియు నీజ్యోతిర్విదాభరణమును గలియుగాబ్దము 3068 సంవత్సరమున రచియించినటులఁ జెప్పియున్నాఁడు.

శ్లో॥ వర్షేఃసింధురదర్శనాం బరగుణై ర్యాతేకలౌసంస్థితే(3068)
మాసేమాధవసంజ్ఞితేఽత్రవిహితో గ్రంథక్రియోపక్రమః॥♦

కలియుగము 3068 సంవత్సరములు గడచుచుండఁగా మాధవమాసమునందనఁగా వైశాఖమాసమునం దీగ్రంథరచన కుపక్రమించినటులఁ జెప్పుకొనియున్నాఁడు. ఇప్పుడు కలియుగాబ్దము 5030 సంవత్సరము జరుగుచున్నది. కావున రఘువంశాదికావ్య కర్తయగు కాళిదాసు జ్యోతిర్విదాభరణ మిప్పటికి 1962 (5030–3068) సంవత్సరములకిందట ననఁగాఁ క్రీ. పూ. 33 (1962–1929) సంవత్సరమున రచించినటు లగపడుచున్నది.

* (జ్యోతిర్విదాభరణం–22 అశ్వాసము.)

♦ జ్యోతిర్విదాభరణము 22–అశ్వాసము.

ఈ మహాకవి తాను మాళవదేశాధీశుఁడగు విక్రమార్కు నాస్థానమునందుండినట్లు స్పష్టముగఁ జెప్పకొనియుండెను. మాళవదేశాధీశుఁడగు విక్రమార్కుఁడు క్రీ. పూ. 57 సంవత్సరమున విక్రమశకము నేర్పాటుసేసినటులఁ బ్రాచీనచరిత్రలు చెప్పుచున్నవి. విక్రమార్కు నాస్థానమునందుండు నవరత్నములలోఁ దానొకఁడనని జ్యోతిర్విదాభరణమునఁ జెప్పియుండిన

"శ్లో॥ ధన్వంతరిక్షపణకామరసింహ శంకు
వేతాళభట్ట ఘటకర్పర కాళిదాసాః
ఖ్యాతో వరాహమిహిరోనృపతేః సభాయాం
రత్నానివై వరరుచిర్నవ విక్రమస్య॥

అను శ్లోకమునుబట్టి ప్రఖ్యాతిఁ జెందిన వరాహమిహిరుఁడు, మహాకవి కాళిదాసునకును, మాళవదేశాధీశుఁడగు విక్రమార్కునకును సమకాలికుఁడయినట్లు స్పష్టమగుచున్నది. నవరత్నములగు వరాహమిహిర కాళిదాసాదుల నాస్థానపండితులుగాఁ గల యా విక్రముఁడెప్పటివాఁడై నదియు స్పష్టముగఁ దెలిసికొనఁ గలిగిన వరాహమిహిర కాళిదాసాదులకాలమును గనుఁగొనుటకు సాహాయ్యకారిగనుండును.

## నేపాళవంశావళీప్రశంస.

నేపాళదేశమును బరిపాలించిన రాజవంశములలో నాలవదియగు ఠాకురువంశమునఁ దొల్లింటిప్రభువగు నంశువర్మ పరిపాలన మొనర్చుకాలమున మాళవాధీశుఁడగు విక్రమాదిత్యుఁడు నేపాళదేశమునకు వచ్చినట్లును నొకశకము నేర్పాటుఁ

గావించినట్టును నేపాళవంశావళి చెప్పుచున్నది. * ఈ వంశావళి క్రీ. పూ. 3102 సంవత్సరమునఁ బ్రవేశమైన కలియుగప్రవేశమునకుఁ బూర్వమునుండియు పదియేఁడవ శతాబ్దమువఱకు నేపాళదేశమును బరిపాలించిన రాజవంశములయొక్కయు నానాయావంశములలోఁజేరిన పరిపాలకులయొక్కయు, వంశావళులను, వారివారి రాజ్యపరిపాలనాకాలపరిమితులు మున్నగు విషయములను జెప్పుచున్నది. అందు నేపాళదేశమునుబరిపాలించిన మొదవరాజవంశము సూర్యవంశమనియు, నావంశమునభూమివర్మ మొట్టమొదటివాఁడనియు, నాయన కలియుగము 1389 సంవత్సరమున బట్టాభిషిక్తుఁడయ్యెననియుఁ జెప్పఁబడియున్నది. భూమివర్మ క్రీ. పూ. 1713 (3102-1389) సంవత్సరమునఁ బట్టాభిషిక్తుఁడై యుండెను. ఆ యా రాజవంశములలోఁ బరిపాలించిన రాజుల పరిపాలనాకాలములు కలియుగాబ్దములలోఁ జెప్పఁబడియున్నవి. ఆ వంశావళియందుఁ జెప్పఁబడిన కాలపరిమితులను బట్టి సూర్యవంశములో నిఱువదియేడవ ప్రభువగు శివదేవవర్మ క్రీ. పూ. 338 సంవత్సరమునఁ బరిపాలన సలుపుచున్నటుల స్పష్టముగఁ గన్పట్టుచున్నది. ఆఱవవంశమగు ఠాకురువంశములో మొట్టమొదటిప్రభువగు నంశుమంతుఁడు కలియుగాబ్దము 3000 సంవత్సరమునఁ బట్టాభిషిక్తుండయినటుల స్పష్టముగఁ జెప్పఁబడియుండెను. అయ్యది క్రీ. పూ. 101 సంవత్సరమగుచున్నది. అంశుమంతుఁ డఱువదెన్మిదేఁడులు పరిపాలన మొనర్చినట్లు చెప్పఁబడియుండెను. కావున అంశుమంతుఁడు క్రీ. పూ. 101

* Nepal Vamsavali- published in Indian Antiquery vol, XIII pp. 411-428

సంవత్సరము మొదలు క్రీ. పూ. 33 సంవత్సరమువఱకు రాజ్యమును బాలించినటులఁ జెప్పనగును. ఈ అంశుమంతుని పరిపాలనాకాలమున మాళవాధీశుఁడగు విక్రమాదిత్యుఁడు నేపాళదేశమునకుంజని శకము నేర్పాటుఁగావించెనని చెప్పఁబడియుండుటచే నయ్యది క్రీ. పూ. 101 క్రీ. పూ. 33 సంవత్సరముల మధ్యకాలములోనై యుండునని స్పష్టముగఁ దేలుచున్నది.

ఐదవరాజవంశమగు సూర్యవంశమున కట్టకడపటివాఁడును 31 రాజును అగు విశ్వదేవవర్మకు నంశుమంతుఁ డల్లుఁడయినట్లును, విశ్వదేవవర్మ యనంతరము రాజ్యమునకు వచ్చినట్లును జెప్పఁబడియున్నది. విశ్వదేవవర్మ 51 సంవత్సరములు పరిపాలనసల్పెను. విశ్వదేవవర్మకుఁ బూర్వము విష్ణుదేవవర్మ 47 సంవత్సరములును, నాతనికి ముందు భీమదేవవర్మ 36 సంవత్సరములును, భీమదేవవర్మకు ముందు నరేంద్రవర్మ 42 సంవత్సరములును, నరేంద్రవర్మకుఁ బూర్వము శివదేవవర్మ 61 సంవత్సరములును, బరిపాలన మొనర్చినట్లును జెప్పఁబడియున్నది. కలియుగాబ్దము 3000 సంవత్సరమునం దనఁగాఁ గ్రీ. పూ. 101 సంవత్సరమున విశ్వదేవవర్మయనంతర మాతని యల్లుఁడును ఠాకురువంశములో మొట్టమొదటివాఁడు నగునంశుమంతుఁడు పట్టాభిషిక్తుఁడయ్యెనని చెప్పఁబడియుండుటచేఁ విశ్వదేవవర్మ పరిపాలనము క్రీ. పూ. 101 సంవత్సరమునాఁటి కంతమైనట్లు గన్పట్టుచున్నది. కావున

అంశుమంతుఁడు క్రీ. పూ. 101 మొ॥ క్రీ. పూ. 33 వఱకును

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| నైదవరాజవంశమగు సూర్యవంశములో 31 రాజగు విశ్వదేవవర్మ | ,, | 152 | ,, | ,, | 101 | ,, |
| 30 ,, విష్ణుదేవవర్మ | ,, | 199 | ,, | ,, | 152 | ,, |
| 29 ,, భీమదేవవర్మ | ,, | 235 | ,, | ,, | 199 | ,, |
| 28 ,, నరేంద్రదవర్మ | ,, | 277 | ,, | ,, | 235 | ,, |
| 27 ,, శివదేవవర్మ | ,, | 338 | ,, | ,, | 277 | వరకును |

రాజ్యపాలనముఁ గావించినటులఁ దెలియుచున్నది.

ఈ శివదేవవర్మశాసనములందు హర్షశకవత్సరములుదాహరింపఁబడియుండెను. ఇతనికిఁ బరమభట్టారక మహారాజాధిరాజ శివదేవవర్మయని సంపూర్ణబిరుదునామము గలదు. ఇతని శాసనములం దొకదానియం దీతఁడు హర్షశకము 119 సంవత్సరమునఁ బట్టాభిషిక్తుఁడయినటులఁ జెప్పికొనియుండెను. డాక్టరు ఫ్లీటు మున్నగుపాశ్చాత్యపండితు లీశివదేవవర్మ పేర్కొనిన హర్షశకవర్షములు కన్యాకుబ్జమును గ్రీ. శ. 606 సంవత్సర ప్రాంతమునఁ బరిపాలనసల్పినట్లుఁ జెప్పఁబడు హర్షవర్ధన శిలాదిత్యునిచే స్థాపింపఁబడిన శకవత్సరములనిచెప్పుచు శివదేవవర్మ క్రీ. శ. 725 (606 + 119) సంవత్సరమునఁ బట్టాభిషిక్తుఁడయ్యెనని నిర్ధారణచేయుచుఁ గడుసాహసముతో నేపాళరాజవంశావళియందు కలియుగాబ్దవత్సరములు తప్పుగాఁజెప్పఁబడియెనని త్రోసివేయుచు, చరిత్రాంశముల తాఱుమాఱు గావించియుండిరి. హర్షశబ్దనామసామ్యము కనఁబడినంతమాత్రమున

కన్యాకుబ్జమున కధీశుఁడగుహార్షవర్ధనశిలాదిత్యుఁడే యీ శకకర్త యని యిమ్మహనీయు లాకాశపంచాగము గుణించి ప్రాచీనవాఙ్మయమునం దుల్లేఖింపఁబడిన చరిత్రాంశములన్నియుఁ దప్పుల తడకయని మనకుఁ బ్రసాదించిన గగనకుసుమహారముల కూర్పెంతవఱకు నిలుచునో కనుఁగొందము.

## హార్షశక ప్రశంస.

కన్యాకుబ్జమునకురాజగు హార్షవర్ధనశిలాదిత్యుఁడు క్రీస్తుశక మేఁడవశతాబ్దాదిని కన్యాకుబ్జ (కనోజి) రాజ్యమును బరిపాలించియుండినట్టు జెప్పుచున్నారు. ఆయన శకస్థాపనముఁ గావించియుండినట్టు లెచ్చటను చెప్పఁబడియుండలేదు. బాణకవి యీతని యాస్థానపండితుఁడుగనుండి యీతనిచరిత్రమును వ్రాసియుండెను. హార్షవర్ధన శిలాదిత్యుఁడు పరిపాలనసల్పిన కాలమునఁ జైనాదేశయాత్రికుఁడగు హూయానుత్సాంగు భరతఖండమునఁ బర్యటనముసలిపినట్లు జెప్పఁబడియుండెను. ఆయన క్రీ. శ. 629 మొదలు 645 సంవత్సరమువఱకుఁ బర్యయటనము నేసినటులఁ జెప్పుచున్నారు. ఆతఁడు భరతఖండముయొక్కచరిత్రాంశములఁ గొన్నింటిని రచించెను. అందుఁ గన్యాకుబ్జప్రభువగు హార్షవర్ధనశిలాదిత్యుఁడు శకము నేర్పాటుఁగావించినటులఁ జెప్పఁబడియుండలేదు. ఇతరచరిత్రలును గన్యాకుబ్జమునఁ బరిపాలనసల్పిన హార్షవర్ధనశిలాదిత్యుఁడు తనపేర నూతనశకము నేర్పాటుఁగావించియుండినట్లు చెప్పకుండినను నాతని యాస్థానకవియై యాతని జీవితచరిత్రను రచించిన బాణకవియైనను జెప్పకుండునా? ఆకాలమునభారతదేశమునఁ బర్యటనమొనర్చిన

హానుత్సాంగేని ఆవిషయమునుజెప్పకుండునా? అది యుపేక్షిం చియూఱకుండవలసిన విషయమా? కాదు. క్రీస్తుశక మేఁడవ శతాబ్దాదియందుఁ గన్యాకుబ్జమును బాలించినటులఁ జెప్పబడు హర్షవర్ధనశిలాదిత్యుఁడే యొకనూతనశకస్థాపనముఁగావించియుం డినచో వారావిషయమును దప్పక యుదాహరించియేయుండెడి వారు. వారలెవ్వఱును హర్షవర్ధనశిలాదిత్యుఁడు శకస్థాపనమొ నర్చినటులఁ జెప్పియుండమి కన్యాకుబ్జప్రభువగు హర్షవర్ధనశిలా దిత్యుఁడు శకస్థాపనముఁ గావించియుండలేదనియు, నేపాళవం శావళిలోఁజేరిన పరమభట్టారక మహారాజాధిరాజ శివదేవవర్మ యొక్క శాసనములో నుదాహరింపఁబడిన హర్షశకమునకును, క్రీ. శ. ఏఁడవ శతాబ్దమునఁ గన్యాకుబ్జమును బరిపాలించినట్లు జెప్పఁబడు హర్షవర్ధనశిలాదిత్యునకును సంబంధమేమియు లేదని స్పష్టముగఁ జెప్పఁదగియున్నది.

శివదేవవర్మశాసనమునఁ జెప్పఁబడిన హర్షశకప్రశంస కన్యాకుబ్జమునుబాలించిన శ్రీహర్షవర్ధనశిలాదిత్యునకు సంబం ధములేదనిచెప్పుచో నిఁక నది యేశకప్రశంసయై యుండెనో కనుఁగొనవలసియుండును. నేపాళవంశావళి చరిత్రయందుఁ గలి యుగాబ్దవత్సరముల సంఖ్యలను, నా యా వంశములయందుఁ జేర్చఁబడిన యా యా రాజుల పరిపాలనాకాలపరిమితి వత్స రములును, స్పష్టముగఁ జెప్పఁబడినవి. వాని నాధారముగఁ దీసికొని గణితమువేసిన హర్షవత్సరముల జేర్చుచు శాసన మును బ్రచురముజేసిన పరమభట్టారక మహారాజాధిరాజ శివ దేవవర్మ క్రీ. పూ. 338 సంవత్సరము మొదలు క్రీ. పూ. 277

సంవత్సరమువఱకుఁ బరిపాలనమొనర్చియుండెనని యిదివఱలో గనుఁగొనియుంటిమి. ప్రస్తుతప్రస్తావనశాసనమునుబట్టి యా శివదేవవర్మ హర్షసంవత్సరము 119 సంవత్సరమున సింహాసనాధిష్ఠితుఁడైనట్లు గన్పట్టుటచే నాతనిచేఁ బేర్కొనఁబడిన హర్షశకము క్రీ. పూ. 457 (338 + 119) సంవత్సరమునఁ బ్రారంభమయినటులఁ జెప్పవలసియుండును.

అటులేని ఏఁడవ శతాబ్దాదియందుఁ గన్యాకుబ్జమును బాలించినట్లు జెప్పఁబడు శ్రీహర్షవర్ధనశిలాదిత్యుని ప్రశంస కాదనియే స్పష్టముగఁ జెప్పఁదగియుండును. ఇఁక నే శకవత్సరములను సూచించుచుండెనో కనుఁగొనవలసియుండును. మాళవదేశాధీశుఁడగు శ్రీహర్షుఁడు క్రీ. పూ. 457 సంవత్సరమున శకనులనుజయించి భారతదేశమునుండి (భరతఖండమునుండి) తఱిమివైచి హర్షశకము నేర్పాటుఁ గావించియుండినట్లు లిదివఱలోఁ జెప్పియుంటిమి. ఆ దిగ్విజయము తరువాత శ్రీహర్షుఁడు 'శకారి' యనియు, 'శకాంతకుఁడ' నియు 'విక్రమాదిత్యుఁడ'నియు బిరుదు నామములనుగూడ బొంది యుండెను. భరతఖండమునఁ గొంతభాగము నాక్రమించుకొని నూతనరాజ్యము నేర్పాటుగావించుకొని పరిపాలించుచుండిన విదేశీయులగు శకనులను శ్రీహర్షుఁడు జయించి భారతదేశమునుండి పారదోలియో—లేక లోఁబఱచుకొనియో—తిరిగి హిందూరాజన్యుల పరిపాలనముక్రిందకు గొనివచ్చుట హైందవులెల్లఱును సంతసింపఁదగినవిషయమే యైయున్నది. అయ్యది దేశచరిత్రయందుఁ బ్రధానమగుమార్పుగ నెంచఁదగియుండెను.

అక్కారణమునఁ దనవిజయసూచకముగ నేర్పాటుగావింపబడిన శకమును హైందవరాజులెల్లను నంగీకరించి తమతమ దేశముల యందు వాడుకొనుచుండిరనిన యసంభవమేమియుఁ గన్పట్టదు. అటులనే నేపాళదేశమునందును హార్షశకమును బేర్కొనియుండి రనుటకు సందేహామేమియుఁ గానరాదు. కనుకనే శివదేవవర్మ హార్షశకవత్సరముల ప్రశంస గావించియుండెనని చెప్పనగును. మాళవదేశాధీశుఁడగు శ్రీహర్షునిచే స్థాపింపఁబడిన శకము క్రీ. పూ. 457 సంవత్సరమునం బ్రారంభమైయుండుటచేతను, శివ దేవవర్మ హార్షవత్సరములు 119లో పట్టాభిషిక్తుఁడయినటులఁ జెప్పఁబడియుండుటచేతను, శివదేవవర్మ క్రీ. పూ. 338 (457-119) సంవత్సరమునఁ బట్టాభిషిక్తుఁడైనటులఁ గన్పట్టుచున్నది. ఇయ్యది నేపాళవంశావళియందుఁ బేర్కొనఁబడిన కలియుగాబ్దముల గణితమునుబట్టివచ్చెడు శివదేవవర్మపరిపాలనా ప్రారంభ కాలము క్రీ. పూ. 338 సంవత్సరమునకు సరిపోవుచున్నది.

ఈ హార్షశకప్రశంస హైందవవాఙ్మయమునంగాక సుప్రసిద్ధ మహమ్మదీయ చరిత్రకారుఁడగు "అల్బెరూనీ" పండితుఁడు రచించిన హిందూదేశచరిత్రమునందును గావింపబడి యుండెను. హార్షశకము ముఖ్యముగ నేపాళదేశమునందును, ఉత్తర హిందూదేశమునందును వ్యవహరింపఁబడుచుండినటులఁ జెప్పి యున్నాఁడు. పారశీకులు ప్రధానముగ నేర్పఱుచుకొనిన యాదగర్డు (Yazdagard) వత్సరము (Gauge Year) 400 వత్సరమును హిందూదేశమునందప్పటికి వాడుకలోనుండిన ముఖ్య

శకముల వత్సరములకుసరిపోల్చి చెప్పియుండెను. ఆ సంవత్సరము అనఁగా 400 సంవత్సరము

| | | |
|---|---|---|
| శ్రీహర్షశకము | 1488 | సంవత్సరమును |
| విక్రమశకము | 1088 | ,, |
| శాలివాహనశకము | 953 | ,, |
| కలియుగాబ్దము | 4132 | ,, |

అయి యుండెనని చెప్పియున్నాఁడు.[1]

పారశీకుల ప్రమాణవత్సరమగు 400 సంవత్సరము క్రీ. శ. 1031 సంవత్సరమని చరిత్రకారులంద ఱొప్పుకొనుచున్నారు. ఈ మహమ్మదీయ చరిత్రకారుఁడు చెప్పినగణితమునుబట్టి

| | | | |
|---|---|---|---|
| కలియుగము | క్రీ. పూ. | 3102 | సంవత్సరమునను |
| శ్రీహర్షశకము | ,, | 457 | ,, |
| విక్రమశకము | ,, | 57 | ,, |
| శాలివాహనశకము | క్రీ. శ. | 78 | ,, |

ప్రారంభమయ్యుండినటుల స్పష్టపడుచున్నది.

హైందవ ప్రాచీనవాఙ్మయ చరిత్రలయం దుల్లేఖింపఁబడిన చరిత్రాంశములను గనుఁగొనుపట్టున నా యా వాఙ్మయ చరిత్రలయందుఁ జెప్పఁబడిన శకాబ్దములను గాలపరిమితులను గణితపద్ధతులను గనుఁగొనుటయు, వాని ననుసరించిన సరియగు కాలనిర్ణయముసేయుట కనువగునా కాదా యని చూచుటయు, వీనికి నన్యములగు నిదర్శనము లెవ్వియైననున్న వేమో తెలిసి

1 Vide. 'Alberuni's' India, - translated & published by Dr. E. C. Sachan - Vol II- Chap 49- pp. 5-7.

కొనుటయు, నితరదేశచరిత్రజ్ఞులరచన లెవ్వియేనిఁగలవేమో లక్షించుటయు, వీని నన్నింటిని విమర్శించి సమన్వయముఁజేసి కాలనిర్ణయ సిద్ధాంతములఁజేయ గడంగుటయుఁ జరిత్రకారుల కర్తవ్యము. తాము ముందుగనే యూహించి నిశ్చయించిన యభిప్రాయముల కనుకూలించునట్లు లేదేనొక శకకాలమున కింకొక శకకాల మంటఁగట్టి ప్రాచీనహైందవులచేఁ జెప్పఁబడిన కాలనిర్ణయములను జరిత్రాంశములను దాఱుమాఱొనర్చి ప్రాచీనహైందవవాఙ్మయము, చరిత్రలు, పురాణములు మున్నగునవన్నియు దోషభూయిష్టములనియు, హంసపాదులుపెట్టి వ్రాయఁబడినవనియు, గొండంతల గోఱంతలఁ గావించి, కుతర్కములఁజేయుచుఁ ద్రోసి రాజనఁ జూచుటయు, విపరీతసిద్ధాంతములఁ గావించుటయుఁ జరిత్రకారుల ధర్మము గాదు. నేపాళరాజవంశావళిని ద్రోసిరాజనుటయు, నందుఁ బేర్కొనబడిన రాజులలో నొకరగు శివదేవవర్మ తన శాసనములఁ దొకదానియందు హర్షశకము 119 సంవత్సరమున సింహాసనాధిష్ఠితుఁడయినట్లు జెప్పుకొనియుండుటచేనామసామ్యము నాధారముగాఁదీసికొని కన్యాకుబ్జమును బాలించిన శ్రీహర్షవర్ధనశిలాదిత్యునిచే నొకశకము స్థాపింపఁబడినట్లును, శివదేవవర్మశాసనమునఁ బేర్కొనఁబడినవత్సరము లాశకవత్సరములేననియు లోకమును భ్రమింపఁజేయుచు డాక్టరు ఫ్లీటు మున్నగువారిచేఁ బ్రసాదింపఁబడిన గగనకుసుమహారమునందలి కుసుమములు తమంతటఁ దామువిడివడి యెట్లు భూపతనమగుచుండెనో కనుఁగొంటిరా? క్రీ. శ. 1031 సంవత్సరమున భారతదేశ చరి

త్రను రచించిన అల్బైరూనీ పండితుఁడప్పటికి భారతదేశమున వాడుకలోనుండిన బెక్కుశకములను వానివత్సరములను బ్రశంస గావించియుండెనేగాని కన్యాకుబ్జమును (కనోజి - Kanouj)ని బరిపాలించిన హర్షవర్ధశిలాదిత్యుఁ డొకశకమును స్థాపించియుండి నట్లుగాని, యట్టి శకవత్సరము లెచ్చటనైనను వాడుకలోనుండి నట్లుగాని చెప్పియుండలేదు. అయ్యాదియుఁ గన్యాకుబ్జమును బాలించిన హర్షవర్ధన శిలాదిత్యుఁ డొకశకమును స్థాపించియుం డలేదనియు, నాతనిపేరుతో హైందవులొకశకమును బ్రశంసించి యుండలేదనియుఁ బ్రబలనిదర్శనముగ జెప్పఁదగియున్నది. కావున డాక్టరు ఫ్లీటు (Dr. Fleet) మున్నగువార లద్దానింగూర్చి చేసిన కాలనిర్ణయవిధానము సరికాదనియు, దప్పనియు, స్పష్టముగఁ జెప్పఁదగియున్నది.

## వి క్ర మ శ క ప్ర శం స.

మహమ్మదీయ చరిత్రకారుఁడగు "అల్బైరూనీ" పండితుఁడు విక్రమశకము క్రీ. పూ. 57 సంవత్సరమునఁ బ్రారంభమయినట్లు జెప్పియుండెను. క్రీ. పూ. 57 సంవత్సరమునుండి ప్రచారమందుండిన విక్రమశకము ఉజ్జయినీ ప్రభువగు విక్రమాదిత్యునిచేఁ బ్రచారముసేయఁబడిన శకమైయుండినట్లులంద ఱంగీకరించి యుండిరి. కాన మాళవదేశాధీశుఁడగు విక్రమాదిత్యునిచే నేర్పాటుఁజేయఁబడిన విక్రమశకము క్రీ. పూ. 57 సంవత్సరమునఁ బ్రారంభమయినటుల స్పష్టముగఁజెప్పదగి యున్నది. ఇయ్యదియుఁ గలియుగాబ్దము 3000 సంవత్సరమున సింహాసనాధిష్ఠితుఁడై క్రీ. పూ. 101 సంవత్సరము మొదలు

క్రీ. పూ. ౩౩సంవత్సరమువఱకు నేపాళదేశమున రాజ్యపాలనమొనరించిన యంశుమంతుని పరిపాలనాకాలమున మాళవదేశాధీశుఁడగు విక్రమాదిత్యుఁడు నేపాళదేశమునకు వెడలి యొకశకము నందు నేర్పాటుఁజేసియుండెనని చెప్పఁబడిన చరిత్రాంశమునకును సరిపోవుచున్నది.

ప్రొఫెసరు మాక్సుముల్లరు (Prof. Max Muller) పండితుఁడు వరాహమిహిరాదిసిద్ధాంత శాస్త్రవేత్తలు వారి సిద్ధాంతగ్రంథములయం దుదాహరించిన శకకాలము శాలివాహనశకకాలమే యనిభావించి క్రీ. పూ. 57 సంవత్సరమున విక్రమశకమును స్థాపించిన విక్రమాదిత్యుని యాస్థానపండితులుగనుండు నవరత్నములలో వరాహమిహిరుఁడొక్కఁడై యుండినచో నా విక్రమాదిత్యుఁడు క్రీ. శ. ఆఱవశతాబ్దమందుండినవాఁడుగ నుండవలెనని చెప్పియుండిరేగాని కారణములఁ జూపెట్టినవారుకారు. ప్రొఫెసరు వీబరు (Prof. Weber) పండితుఁడీ విక్రమాదిత్యునిఁ గ్రీ. శ. 1050 సంవత్సరమునఁ బరిపాలించుచున్న భోజుఁడేనని చెప్పసాహసించిరి. కాని నిదర్శనములఁ జూపినవారుకారు. క్రీ. పూ. 57 సంవత్సరమున మాళవదేశమును బరిపాలించిన విక్రమాదిత్యునకే భోజుఁడను నామాంతరముండియుండునని యేలచెప్పఁగూడదో? ఇందులకు ముఖ్యకారణమిదివఱలోఁ జెప్పినట్లు హైందవప్రాచీనత కాధునికత్వము నారోపింపఁదలంచుటయేనని స్పష్టముగఁ జెప్పనొప్పును. హైందవప్రాచీన చరిత్రాంశములవాస్తవమును గనుఁగొనుటకు సక్రమ పరిశీలనావిమర్శలనుగావించినట్లు గన్పట్టదు. అటులఁ

గావించకపోవుటయేగాక క్రీ. పూ. 57 సంవత్సరమునఁ బ్రారంభమైన విక్రమశకము యథార్థముగ నాసంవత్సరముననే ప్రారంభమైయుండలేదనియుఁ, గ్రీస్తుశకప్రారంభమైనయాఱవశతాబ్దముననో పదియవశతాబ్దముననో సిద్ధాంతవేత్తలు సిద్ధాంతములఁజేయుచుఁ దమసిద్ధాంతములకుఁ బ్రాచీనతను గలుగఁజేయుటకై కల్పించుకొనిన యొక సాంకేతికశకమనియుఁ బాశ్చాత్య పండితులును వారి యనుయాయులును గొందఱు చెప్ప సాహసించిరి. ప్రొఫెసరు వీబరుపండితుని వితండవిమర్శనావిధానమును గనఁబఱచుటకై మఱియొక విషయమును గనఁబఱచెదను. అయ్యదియు శకకాలనిర్ధారణప్రశంశకు సంబంధించియుండుటచే నిచటఁ జెప్పవలసివచ్చుచున్నది.

## భాస్కరాచార్యుల కాలప్రశంస.

మహేశ్వరోపాధ్యాయుల (మహాదేవుని) కుమారుఁడగు భాస్కరాచార్యులు (భాస్కరుఁడు) సిద్ధాంతశిరోమణి, కర్ణకుతూహలము, లీలావతీగణితము, బీజగణితము మున్నగు గ్రంథముల రచించియుండెను. భాస్కరాచార్యులు సిద్ధాంతశిరోమణియందలి గోళాధ్యాయమునఁ దానాగ్రంథమును రచించుట కారంభించినకాలమును, దన జననకాలమును దెలుపుచు నీ క్రిందిశ్లోకమును జెప్పియున్నాఁడు.

"శ్లో॥ రసగుణపూర్ణ (1036) మహీసమ శకనృపసమయేఽభవన్మమోత్పత్తిః
రసగుణవర్షేణ (36) మయా సిద్ధాంతశిరోమణీరచితః॥"[1]

శకనృపకాలము 1036 సంవత్సరమునఁ దాను జన్మించినట్లును దనకు 36 సంవత్సరముల వయసున సిద్ధాంతశిరోమణి గ్రంథమును రచించినట్లును జెప్పుకొనియుండెను. సిద్ధాంతశిరోమణి శకనృపకాలము 1072 సంవత్సరమున రచింపఁబడినట్లు దెలియుచున్నది. ఇందుఁ జెప్పఁబడిన శకనృపకాలము శాలివాహన శకాబ్దమున కంటఁగట్టి భాస్కరుఁడు క్రీ.శ. 1114(1036 + 78) సంవత్సరమున జన్మించియుండెననియు, "సిద్ధాంతశిరోమణి" గ్రంథమును క్రీ. శ. 1150 (1072 + 78) సంవత్సరమున రచించియుండెననియు, మన పాశ్చాత్యపండితులును వారియనుయాయులగు భారతీయపండితులును గొందఱు వ్రాసికొనియుండిరి. సుప్రసిద్ధమహమ్మదీయచరిత్రకారుఁడగు అల్బెరూనీ పండితుఁడు హిందూదేశచరిత్రను వ్రాసియుండెనని తెలిసికొనియుంటిమి. అతఁడాచరిత్రను గ్రీ. శ. 1031 సంవత్సరమున వ్రాసియుండెను. ఇయ్యది పాశ్చాత్యపండితులసిద్ధాంతము ననుసరించి భాస్కరుని జన్మవత్సరమని చెప్పబడు సంవత్సరమునకుఁ బూర్వము 84 (1114-1030) సంవత్సరములక్రిందటనే వ్రాయఁబడియుండినటుల స్పష్టముగఁ గన్పట్టుచున్నది.

---

1 సిద్ధాంతసిరోమణి—గోళాధ్యాయము. p. 401. Verse 58. (Lucknow Editn.)

ఆల్బేరూనీపండితుఁడు మహాదేవుని(మహేశ్వరోపాధ్యాయుని) కుమారుఁడగు భాస్కరునిచే రచింపఁబడిన కర్ణసారమను (కర్ణకుతూహలము) గ్రంథము తమదేశములో క్రీస్తుశకము తొమ్మిదవ శతాబ్దప్రాంతముననే ప్రచారములోనుండినటులఁ జెప్పియున్నాఁడు. దీనివలనఁ బాశ్చాత్యపండితులచే భాస్కరుని జన్మకాలమని చెప్పఁబడినసంవత్సరమునకుఁ బూర్వము షుమారు మూఁడుశతాబ్దములకాలముక్రిందటనే ప్రచారములోనుండినటులఁ దెలియుచున్నది. ఇయ్యది భాస్కరాచార్యుని జన్మకాలము క్రీ. శ. 1114 సంవత్సరమని పాశ్చాత్యపండితులచేఁ జేయఁబడిన సిద్ధాంతములను మొదలంట నిర్మూలముఁగావించుచున్నది. ఆల్బేరూనీపండితుని రచనలు భాస్కరునిచేఁ బేర్కొనఁబడిన శ క నృ ప కా ల ము శాలివాహనశకకాలము గాదనియు మఱియొకశకకాలమైయుండుననియు స్పష్టముగభోధించుచున్నవి. ఇవ్విషయము ప్రొఫెసరు వీబరు(Prof. Weber) పండితుని కలవరపరచినది. రామాయణకథ మిథ్యయని చెప్పుటకు సాహసింపఁ దొడ్పడినవాదపటిమ వారికిచట నుపకరించినదిగాదు. ఆకాశపంచాంగముల గుఱించి యూహాపోహాలచే హైందవప్రాచీనచరిత్ర కాలనిర్ణయములుగావించి నిర్మింపఁదలఁచిన యాకాశహర్మ్యము నేలఁగూలిపోవుచున్నది. ఈ విషమసమస్యకు సమాధానముజెప్పుట యసంభవముగాఁ గన్పట్టినది. ఈ విషమసమస్యను బరిష్కరించుటకుఁ దన యసమర్థతను దానొప్పుకొనుచున్నానని వీబరుపండితుఁడే చెప్పుకొనియుండెను.[1]

---

1 Weber's History of Indian Literature - p. 262.

అయ్యది శాలివాహనశకకాలముగాదని వాస్తవమగు కాలనిర్ణయమునకుఁగడంగిన తాము తలఁచినట్లు హైందవచరిత్ర,సిద్ధాంతములు మున్నగువాని కాధునికత్వమారోపించుటకుమాఱు ప్రాచీనతనుదెచ్చిపెట్టుట సంభవించును. శకనృపకాలము, శక కాలముల ప్రశంస శాలివాహనశకముగాదనియు, మఱి యేయితర శకప్రశంసయో యైయుండుననిచెప్పిన నింకను ప్రాచీనత గలుగఁజేసినట్లుఁలగును. చివఱకు సమాధానము చెప్పుటకుం దగుమార్గముఁగానక ఆల్బేరూనిచేఁ బేర్కొనఁబడినమహాదేవుని కుమారుఁడగు భాస్కరుఁడును, గణకుతూహల గ్రంథకర్తయు సిద్ధాంతశిరోమణి గ్రంథకర్తయు నగుమహాదేవుని కుమారుఁడగు భాస్కరుఁడును వేర్వేరువ్యక్తులని చెప్పుటకంటె మఱియొక మార్గము గానవచ్చుటలేదనిరి.[1] మనలనుగూడ నట్లే విశ్వసింపుమనిరి.

శకకాలము, శకేంద్రకాలము, శకనృపకాలము, శక భూపకాలము లన నొక్కటేననియు, నది పారశీకులు సైరసు (Cyrus the Great) నాయకత్వమునఁ బారశీకసామ్రాజ్యమును నెలకొల్పిన క్రీ. పూ. 550 సంవత్సరమునుండి యేర్పడిన శకకాలమనియు నిదివఱలోఁ గనుఁగొనియుంటిమి. వరాహమిహిరునిచేఁ బేర్కొనఁబడిన శకకాలమయ్యదియై యున్నది. వరాహమిహిరునిచే రచింపఁబడిన బృహత్సంహితను బట్టియే వరాహమిహిరుఁడు శకకాలము, శకేంద్రకాలము, శకభూప

1 Weber's History of Indan Literature p. 262.

కాలము, శకనృపకాలముల నొక్కటిగనే భావించి చెప్పినటులఁ గన్పట్టుచున్నది.

"శ్లో॥ శతాని వర్షాణి శకేంద్రకాలా
చ్ఛతాని రుద్రైర్గుణయేచ్చతుర్భిః ।
నవాష్టపంచాష్టయుతాని కృత్వా
విభాజయేచ్ఛూన్య శరాగరామైః॥ 20
లబ్ధేనయుక్తం శకభూపకాలం
సంశోధ్యషష్ట్యా విషయైర్విభజ్య
యుగాని నారాయణపూర్వకాణి
లబ్ధాని శేషాః క్రమశః సమాస్స్యుః॥$" 21

ఈ శ్లోకములందు శకేంద్రకాలము (శకచక్రవర్తికాలము (Era of Saka Emperor) శకభూపకాలము (శకరాజుకాలము—Era of Saka King) అనునవి రెండును శకకాలము నకుఁ బర్యాయపదములుగ నుపయోగించినటులఁ గన్పట్టుచున్నది. సిద్ధాంతశిరోమణియందు భాస్కరునిచేఁ జేర్కొనఁబడిన శకకాలము నదియేమైనట్లు గానిపించుచున్నది. అట్లేని చరిత్రాంశములు సరిపోవునేమో కనుఁగొందము. భాస్కరుఁడు శకనృపకాలము 1036 సంవత్సరమున జన్మించెను. అనఁగా క్రీ. శ. 486 (1036—550) సంవత్సరమున జన్మించినట్లును, సిద్ధాంత శిరోమణి గ్రంథమును క్రీ. శ. 522 (486 + 36) సంవత్సరమున రచియించినట్లును తేలుచున్నది. కర్ణకుతూహలమును శక నృపకాలము 1105 సంవత్సరమున రచియించినట్లు జెప్పఁబడి

$ బృహత్సంహిత. III Chapter.

యుండుటచేఁ గ్రీ. శ. 555 (1105—550) సంవత్సరమున రచియించినటులఁ జెప్పఁబడియున్నది. ఇయ్యది ఆల్బేరూనీ పండితుఁడు హిందూదేశచరిత్రను రచించుటకుఁబూర్వమే నైదుశతాబ్దములకాలముకిందట నైయుండెను. తమదేశమునందుఁ గ్రీ. శ. తొమ్మిదవశతాబ్దములో భాస్కరునిచే రచింపబడిన కర్ణసారము (కర్ణకుతూహలము) ప్రచారమందుండినటులఁ జెప్పియుండెను. అయ్యది భాస్కరుఁడు కర్ణకుతూహలమును రచించిన దాదాపు మూఁడుశతాబ్దములకాలము తరువాతిదని చెప్పఁదగియున్నది. భరతఖండమున నాఱవశతాబ్దమున రచింపఁబడిన గ్రంథము విదేశములయందు బ్రచారముజరుగుట కా కాలమునందు మూఁడుశతాబ్దములు పట్టినదనిన యసంభవమేమియు లేదు. వాస్తవమున నాకాలమునందు విదేశీయులిద్దానిప్రాముఖ్యతనుగ్రహించి తమదేశమునందుఁ బ్రపంచించుటకెక్కువ కాలవ్యవధి పట్టియుండును. బహుశః మహమ్మదీయు లీభరతఖండముపై దండయాత్రలుసల్పుటకుఁ బ్రారంభించినకాలమునఁ దీసికొనివెళ్లియుందురని స్ఫురించుచున్నది. భాషాభేదములంబట్టి మహమ్మదీయులు కర్ణకుతూహలమునుదానినే కర్ణసారమని పిలిచినమాత్రమున నయ్యవి రెండును వేర్వేరుగ్రంథములని యెంచుటకు వీలులేదు. ఆల్బేరూనీ పండితుఁడు చెప్పినవిషయములనుబట్టి చూచిన నయ్యవి భిన్నగ్రంథములని యనుమానించుటకేని గారణములు గన్పట్టవు. భాషాభేదముంబట్టి గ్రీకు చరిత్రకారులు పేర్కొనిన సాంద్రసిట్టసు, సాంద్రకుట్టసు, సాండ్రకోటసు నామధేయములు చంద్రగుప్తుని నామధేయములనియు,

ఛాలింబో(త్రాయనునది పాటలీపుత్త్రమునకుఁ బేరనియు నెంచి నట్లు మహమ్మదీయ చరిత్రకారుఁడగు ఆల్బేరూనీ పండితుఁడును, దదితర మహమ్మదీయులును గర్ణకుతూహలమునే కర్ణసారమని పేర్కొనియుండినట్లు లేలయెన్నకూడదు? అట్లులెంచుటయే నన్నివిధముల సమంజసమని కన్పట్టుచున్నది. చరిత్రాంశములకును సరిపోవుచున్నది. ఆల్బేరూనీచేఁ బేర్కొనఁబడిన మహాదేవుని కుమారుఁడగు భాస్కరునిచే రచింపఁబడిన కర్ణసారమును, మహాదేవునికుమారుఁడగు భాస్కరునిచే రచింపఁబడిన కర్ణకుతూహలమును నొకేగ్రంథమనియు, వాని రచించిన భాస్కరుఁడొక్కఁడేననియుఁ జెప్ప నొప్పుచున్నది. ఈ భాస్కరునిచేఁ జెప్పఁబడిన శకనృపకాలము శకసామ్రాజ్యమును స్థాపనంబొనర్చిన శకనులరాజగు సైరసుచక్రవర్తి (Cyrus the Great)చే స్థాపింపఁబడిన శకవత్సరముల ప్రశంశయనియు, స్పష్టముగఁ జెప్పనొప్పుచున్నది.

మహేశ్వరోపాధ్యాయుల (మహాదేవుని) కుమారుఁడగు భాస్కరాచార్యులు రచించిన సిద్ధాంతశిరోమణి కాలమానాధ్యాయమునఁ దనకాలమున వర్తమానకాల దినగణితమును గుఱించి చర్చించుసందర్భమున—

"శ్లో॥ యాతాః షణ్మనవః యుగాని భమితాన్యన్యద్యుగాంఘ్రిత్రయం । నందాద్రీందు గుణాశ్చ విక్రమనృపశ్యాంతే కలేర్వత్సరాః॥"[1]

అని చెప్పియుండెను.

---

1 సిద్ధాంత శిరోమణి - కాలమానాధ్యాయము, శ్లో. 28.

కలియుగము 3179 సంవత్సరమున విక్రమనృపుఁ డంత మొందెనని చెప్పియున్నాఁడు. దీనింబట్టి విక్రమనృపుఁడు క్రీ.శ. 78 (3179-3101) సంవత్సరమున నంతమొందినటులఁ దెలియుచున్నదిగదా! ఈ శ్లోకమునందలి 'విక్రమనృపస్యాంతే' యనుదానికి మారు 'శకనృపస్యాంతే' యను పాఠాంతముతో కలకత్తాయందుఁ బ్రకటితమైన యొక ముద్రితప్రతియందుఁ గన్పట్టుచున్నది. హైందవసాంప్రదాయమునుబట్టి శాలివాహనుఁడు విక్రమార్కునితో యుద్ధముఁజేసి సంహరించి తద్విజయచిహ్నముగ నొకశకమును స్థాపించినటులఁ గన్పట్టుచున్నది. శాలివాహనునకు శకనృపుఁడను నామధేయముండినటుల గన్పట్టదు. విక్రమనృపస్యాంతేయను పాఠాంతరమేసరియని చెప్పఁదగియున్నది. శకకాలమన శాలివాహనశకమని లోకమును భ్రమింపఁజేయుచున్న సిద్ధాంతము ననుసరించి యీ శ్లోకమందలి 'విక్రమనృపస్యాంతే' యనుదానిని 'శకనృపస్యాంతే' యని యనవసరముగ సవరణచేసినట్లు గన్పట్టుచున్నది. కావున 'విక్రమనృపస్యాంతే' యను పాఠాంతరమే సరియైనదని చెప్పఁదగియుండును. దీన విక్రమార్కుఁడు కలియుగము 3179 సంవత్సరమున నన క్రీ. శ. 78 (3179-3101) సంవత్సరమునఁ జనిపోయినట్లు భాస్కరాచార్యులచేఁ జెప్పఁబడియుండెను. అయ్యది యితర చరిత్రాంశములకును సరిపోవుచున్నది.

## భట్టోత్పలుని కాలప్రశంస.

వరాహమిహిరునిచే రచింపఁబడిన బృహత్సంహితయను సిద్ధాంతగ్రంథమునకుఁ జింతామణి యను పేరితో "భట్టోత్ప

లుఁడు” వివృత్తిని (వ్యాఖ్యను) రచియించియుండెను. అందు భట్టోత్పలుఁ డావివృత్తిని శాకే 888 సంవత్సరము చైత్రశుక్ల పంచమి గురువారమునాఁడు రచియించినట్టు లీక్రింది శ్లోకముం జెప్పియుండెను.

“శ్లో॥ చైత్రమాసస్య పంచమ్యాం
సితాయాం గురువాసరే
వస్వష్టాష్టమితేశాకే (888)
కృతేయం వివృతిర్మయా॥”

భట్టోత్పలుఁడు కళ్యాణవర్మ, బ్రహ్మగుప్తుఁడు, మంజుల గుప్తుఁడు మున్నగు సిద్ధాంతవేత్తలఁ బేర్కొనియుండెను. దీనిం బట్టి వారందఱును భట్టోత్పలునకుఁ బూర్వమునందుండిన వారని స్పష్టముగ జెప్పఁదగియుండును. భట్టోత్పలునిచేఁ బ్రశంసచేయఁబడిన ‘వస్వష్టాష్టమితేశాకే’ యనునది 888 శకవత్సరములనియు, ఆ శకవత్సరములు క్రీ. పూ. 550 సంవత్సరమునఁ బ్రారంభింపఁబడిన శకసామ్రాజ్యకాలమునుండి ప్రారంభమైన శకవత్సరములై యుండునని యెంచిచూచిన భట్టోత్పలుఁడు వివృత్తిని(చింతామణిని) రచియించినది క్రీ. శ. 338 సంవత్సరమైనటులఁ గన్పట్టుచున్నది. ఇయ్యది వరాహమిహిరుఁడు క్రీస్తుశక మాఱవశతాబ్దమునందుండినవాఁడని చెప్పు చరిత్రకారులవాదమునకు భంగకరముగ నుండెను. భట్టోత్పలుని చింతామణిగ్రంథమును బాపుదేవశాస్త్రిగారు ప్రచురించియుండిరి. అం దీశ్లోకమును బైఁజెప్పిన విధముగనే ప్రచురించియుండిరి. బొంబాయిలో నాగరలిపితోడను, జెన్నపురియందుఁ

దెలుఁగు లిపితోడను బ్రకటింపఁబడిన చింతామణి గ్రంథముల యందును బై శ్లోక మావిధముగనే ప్రచురింపఁబడినది. వరాహ మిహిరుఁడు క్రీ. శ. ఆఱవశతాబ్దమునం దున్న వాఁడని మహా మహోపాధ్యాయ సుధాకరద్వివేది పండితులవా రభిప్రాయమును వెలిబుచ్చియుండిరి. అది పాశ్చాత్యపండితులు లోనగువారు శకకాలమన క్రీ. శ. 78 సంవత్సరమునుండి ప్రారంభమైన శాలి వాహన శకవర్షములై యుండుననెడి భ్రమతోఁ గావించిన సిద్ధాంతములంబట్టి గైకొనినటులఁ గన్పట్టెడిని. ఏ తదభిప్రాయ మునను సరించి యాశ్లోకమునఁ జెప్పఁబడిన శకవర్షములు శాలి వాహనశకవర్షములకంటెఁగట్టి భట్టోత్పలుఁడు క్రీ. శ. 966 (888 + 78) సంవత్సరమునఁ జింతామణియనుపేరితో వివృతిని రచియించినట్లు జెప్పఁదలచిరి. కానివారికిఁ గంఠగతంబగు గొప్ప చిక్కొకటి తటస్థించినది. భట్టోత్పలుఁడు తాను చైత్రశుక్ల పంచమి గురువాసరమునాఁ డావివృతిని (చింతామణిగ్రంథ మును) రచియించినట్లు స్పష్టముగఁ జెప్పియుండెను. క్రీ శ. 996 సంవత్సరమునందలి చైత్రశుక్ల పంచమితిథి గురువాసరము కాదయ్యెను. ఈ ఘోరవిపత్తునుండి తప్పించుకొనుటకు మార్గ ముంగానక మన సుధాకరద్వివేదిపండితులవారు ప్రథమపాఠమునే తమకనుగుణ్యముగ మార్పుఁగావింపఁదలఁచి

"శ్లో॥ ఫాల్గుణస్యద్వితీయాయా మసితాయాంగురౌర్దినే ।
వస్వష్టాష్టమితే శాకేకృతేయం వివృతిర్మయా॥"*

అని దిద్దియుండిరి.

---

* సుధాకరద్వివేదిపండితునిచే బ్రచురింపబడిన గణకతరంగిణి—పొరట 22.

శ్రీ సుధాకర ద్వివేదిపండితులవారనుకొన్నయట్లు క్రీ. శ. 996 సంవత్సరమున భట్టోత్పలుఁడు చెప్పినతిథి గురువాసరము కాలేదు, ఆ సంవత్సరమునం దేమాసములోనేని శుక్లపంచమితిథి గురువాసరమై యుండునేమోనని యన్వేషించినను గానరాలేదు. చివఱకు మాసమును, బక్షమును, దిథిని, అన్నింటిని మార్పుఁజేసియుండిరి. తాముఁ గావించిన మార్పును బట్టి సరిపోవుననిరి, మన ద్వివేదిగారు సిద్ధాంతగ్రంథమునకు వ్యాఖ్యను వ్రాయఁబూనినపుడు ముందుఁగాఁ దాము నిర్ధారణ సేయఁదలపెట్టిన సిద్ధాంతములకో సరిపోవుట లేదని మూలమును ఛేదించియుఁ, దలలు విఱచి మార్పులుచేసియు, మసిపూసి నేరేడుపండును జేయఁదలంచుటకంటెఁ దమకుండు గణితశాస్త్ర పరిజ్ఞానమును విమర్శనాశక్తిని నుపయోగించి పరిశీలనచేసి భట్టోత్పలునివంటి సుప్రసిద్ధ సిద్ధాంతవేత్త తాను సూచించిన కాలమును దెలియఁజేయుపట్టున కనంబఱచిన మాస, పక్ష, తిథి, వాసరములు చెప్పుటయం దట్టిఘోరమగు తప్పువ్రాఁత వ్రాసియుండునా? కానిచో దాని యాదార్థ్యమేమి? యని ముందు వెనుక లారసి సిద్ధాంతీకరించియుండిన ఋజుమార్గావలంబులై యుందురుగదా! భట్టోత్పలుఁడు గ్రంథమునురచించిన మాస, పక్ష, తిథి, వారములు తెలిసియే సక్రమముగనే చెప్పియుండెను. ఇంత స్వల్పవిషయమును దెలిసికొనఁజాలక భట్టోత్పలుఁడు పొరఁబడియుండెననుట కేమాత్రమవకాశముఁ గన్పట్టదు. లేకరి లోపమనుటకును నవకాశములేదు. అన్నిప్రతులయందు నొకేరీతిగ నుండెను. గణితమువేసి చూచిన క్రీ. శ. 338 సంవ

త్సరమునందలి చైత్రశుక్ల పంచమితిథి గురువాసరమై యుండి నటులఁ బెక్కురుసిద్ధాంతులు చెప్పుచుండిరి. శ్రీయుత నారాయణశాస్త్రిగారును అట్లే చెప్పియుండిరి.[1] భట్టోత్పలుఁడు విన్నతిని(చింతామణిని)రచించినటులఁ జెప్పఁబడిన మాస, పక్ష, తిథి, వారములుగల సంవత్సరము క్రీ. శ. 338 సంవత్సరమునందలి ఆ యా మాస, పక్ష, తిథి, వాసరములకు సరిపోవుచున్నటులఁ జెప్పఁబడుచుండుటచే భట్టోత్పలునిచేఁజెప్పఁబడిన శకకాలము 888 సంవత్సరము క్రీ. పూ. 550 (888-338) సంవత్సరమునఁ బ్రారంభమైయుండు శకకాలమయినట్లు స్పష్టముగఁజెప్పనొప్పుచున్నది. కావున భట్టోత్పలునిచేఁ బేర్కొనఁబడిన శకకాల ప్రశంస, శకసామ్రాజ్యముతోఁ బ్రారంభమయిన శకకాలవత్సరముల ప్రశంసయనియే చెప్పఁదగియున్నది. భట్టోత్పలుఁడు చెప్పిన సంవత్సర, మాస, పక్ష, తిథి వారములన్నియు సక్రమముగనుండఁగా వానినిసవరించుటకు మనద్వివేదిగారు సాహసించినందులకుమాత్రము మన మబ్బురంపడవలసివచ్చుచున్నయది. అటుపైని అపార్థములఁ గల్పించి విపరీతసిద్ధాంతముల నొనర్చినందులకు విచారపడవలసివచ్చుచున్నది. వారి గణకతరంగిణి 129 పొరటలో "వస్వష్టాష్ట (888) శాకే, చైత్ర, శుక్ల, పంచమ్యాంగురౌ" యనియే చెప్పియుండిరి. అచ్చట మార్పుసేయఁబడిన పూర్వశ్లోకవిషయమును సమన్వయముఁజేసి చెప్పినవారుకారు. అద్దానింగూడ పూర్వశ్లోకానుసారముగ దిద్దినవారునుంగారు. ఇయ్యదియే వారివాదదౌర్బల్యమును నిరాఘాట

1 Age of Sankara by T. S. Narayana Sastry.

ముగ సూచించుచున్నది. భట్టోత్పలుఁడు వరాహమిహిరుని బృహత్సంహితకుఁ జింతామణియనుపేరితో వివృతిని రచించిన క్రీ. శ. ౯౩౮ సంవత్సరమునకుఁబూర్వమే వరాహమిహిరుఁడుండినట్లును, బృహత్సంహితను రచించియుండినట్లును స్పష్టముగఁ జెప్పనొప్పుచున్నది. ఇయ్యది క్రీస్తుశక మాఱవశతాబ్దమున వరాహమిహిరుఁడుండినటులఁ గావింపఁబడిన సిద్ధాంతమును మూలచ్ఛేదముఁ గావించుచున్నది.

## ఆర్యభట్టు కాల ప్రశంస.

వరాహమిహిరుఁడు సిద్ధాంతవేత్తయగు నార్యభట్టుచే రచియింపఁబడిన యార్యభట్టీయ మను సిద్ధాంతగ్రంథమును పేర్కొనియుండెను. ఆర్యభట్టు క్రీ. శ. ఐఁదవ శతాబ్దాంతమందుండినటులఁ గొందఱుప్రాచ్యపాశ్చాత్య పండితులు సిద్ధాంతములు గావించుచు నార్యభట్టీయమునుపేర్కొనియుండుటచే వరాహమిహిరుఁడు క్రీ. శ. ఆఱవ శతాబ్దమునం దుండియుండెనను సిద్ధాంతమును బలపఱుచుచున్నదని చెప్పుచుండిరి. వరాహమిహిరునిచే పేర్కొనఁబడిన యార్యభట్టకాలమునందుండినది కనుఁగొందము. ఆర్యభట్టొక సిద్ధాంతగ్రంథమునురచించి యుండెను. దానినే ఆర్యభట్టీయమని పేర్కొనుచున్నారు. అందీరీతిగాఁ జెప్పఁబడియుండెను.

"శ్లో॥ షష్ట్యబ్దానాంషడ్భిర్యదావ్యతీతాస్త్రయశ్చయుగపాదాః।
అధికావింశతిరబ్దాస్తదేహ మమజన్మనోఽతీతాః॥"‡

‡ ఆర్యభట్టీయము—కాలక్రియాపాదము శ్లో. 10.

కలియుగము 360 (60 × 6) సంవత్సరములకుఁ దానిఱువది (20) సంవత్సరముల వయసుకలిగి యుండినట్లు ఆర్యభట్టు చెప్పుకొనియున్నాఁడు. కలియుగము 360 సంవత్సరము క్రీ. పూ. 2742 (3102-360) సంవత్సరమగుచున్నది. అప్పటికిఱువదిసంవత్సరముల వయస్సుకలవాఁడనని చెప్పుకొనియుండుటచేఁ గ్రీ. పూ. 2762 సంవత్సర మాతనిజన్మకాలమైనటులఁ దెలియుచున్నది.

శ్రీ సుధాకరద్వివేది పండితుఁడు బ్రచురించిన గ్రంథమున నీశ్లోకము ప్రథమపాదమునందలి వత్సరసంఖ్యను సవరణచేసి నీవిధముగఁ బ్రచురించియుండెను.

"శ్లో॥ షష్ట్యబ్దానాం షష్టిర్యదా
వ్యతీతాస్త్రయశ్చయుగపాదాః
అధికావింశతిరబ్దా
స్తదేహ మమజన్మనోఽతీతాః॥"

ఇట్లు మార్పుఁగావించిన యీశ్లోకముంబట్టి "కలియుగము 3600 (360 × 60) సంవత్సరములు గడచునాఁటికిఁ దనకిఱువది (20) సంవత్సరముల ప్రాయమని యార్యభట్టు చెప్పుకొనినట్లు గన్పట్టుచున్నది. ఈ శ్లోకమున సుధాకరద్వివేది పండితుఁడు గావించిన సవరణసరియైనదాయను విషయము యోజింపవలసియున్నది. కలియుగము 3600 సంవత్సరము క్రీ. శ. 498 (3600-3102) సంవత్సరమగుచున్నది. ఈసవరణముబట్టి యార్యభట్టు క్రీ. శ. 498 సంవత్సరమునాటికి 20 సంవత్సరముల

ప్రాయముగలిగియుండినట్లు జెప్పఁదగియుండును. ఆర్యభట్టీయ మునఁ గలియుగాబ్దముల ప్రశంసమాత్రమే చేయఁబడియుం డెను. మఱి యే యితర శకవత్సరప్రశంసచేయఁబడియుండలేదు. క్రీ. శ. 498 సంవత్సరమునాఁటికి శాలివాహనశకము, విక్రమా ర్కశకము, హర్షశకము, మున్నగు శకములెన్నియో వాడుక లోనుండి యుండినట్లు స్పష్టముగఁ గన్పట్టుచున్నది. క్రీ. శ. 498 సంవత్సరమునకుఁ బూర్వమున రచియింపఁబడిన గ్రంథములలో నా యా గ్రంథకర్తలప్పటికి వాడుకలోనుండిన శకవత్సరముల ప్రశంసగావించియుండఁగా నార్యభట్టు ఇతర శకప్రశంసగావిం చక కలియుగాబ్దములనుమాత్రమే పేర్కొనుటను బట్టిచూడ ఆర్యభట్టు సిద్ధాంతగ్రంథము ను రచించుకాలమున నితరశకము లెవ్వియుఁ బ్రారంభమై యుండలేదని బోధపడుచున్నది.

శ్రీ సుధాకరద్వివేదిపండితుఁడు పాశ్చాత్యవిద్వాంసుల మార్గమునను సరించి వరాహమిహిరుఁడు క్రీ. శ. 505 సంవ త్సరమునఁ బంచసిద్ధాంతికను వ్రాసియుండెనను సిద్ధాంతము నవ లంబించియుండెను. ఆర్యభట్టు కలియుగము 360 సంవత్సర మున నుండెనని యంగీకరించిన యార్యభట్టుచే రచింపఁబడిన సిద్ధాంతములఁ బేర్కొనిన వరాహమిహిరుఁడు క్రీ. శ. ఆఱవ శతాబ్దమునకుఁ బూర్వమునందుండె ననెడి యన్యసిద్ధాంతముల కనుకూలముగనుండెను. ఎటులైనను వరాహమిహిరునిచేఁ బే ర్కొనఁబడిన యార్యభట్టు క్రీస్తుశక మొదవళతాబ్దమున నుండి నటులఁ జూపించిన వరాహమిహిరుఁడంతకుఁ బూర్వముండి నటులఁ జెప్పెడు సిద్ధాంతములు నిరాధారములని కనబఱుప

వచ్చుననియుఁ దమసిద్ధాంతమును బలపఱుచుకొనవచ్చుననుఁ దలంపుతో 'షష్ట్యబ్దానాం షడ్భిర్వ్యదా' యను శ్లోకభాగ మును 'షష్ట్యబ్దానాం షష్ఠిర్వ్యదా' యని సవరణగావించి యుండినటులఁ గన్పట్టుచున్నది. ఆర్యభట్టీయము ప్రాచీన వ్రాతప్రతులలో 'షష్ట్యబ్దానాం షడ్భిర్వ్యదా' యను పాఠాంత రమే కన్పట్టుచున్నది.

వీరు సూచించినటుల ఆర్యభట్టు క్రీ. శ. 498 సంవత్స రమునను, వరాహమిహిరుఁడు క్రీ. శ. 505 సంవత్సరమునను సిద్ధాంతగ్రంథముల రచియించియుండిరనియే యెంచెదము. అటులైన ఆర్యభట్టును, వరాహమిహిరుఁడును సమకాలికులై యుండినటుల గన్పట్టుచున్నదని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. ఆర్య భట్టుకంటె వరాహమిహిరుఁడు వయోవృద్ధుఁడైనట్టును గన్పట్టు చున్నది. ఆర్యభట్టు సిద్ధాంతగ్రంథమును రచియించిన తరువాత నేఁడుసంవత్సరములకు వరాహమిహిరుఁడు పంచసిద్ధాంతికను ర చియించినటులఁ జెప్పవలసియుండును. వరాహమిహిరుఁడు తన సిద్ధాంత గ్రంథమునఁ బ్రాచీనసిద్ధాంతుల సిద్ధాంతములను జే ర్కొను సందర్భమున ఆర్యభట్టీయము ప్రాచీనసిద్ధాంతగ్రంథ ములలో నొక్కటియైనటులఁ జెప్పియుండెను. ఆర్యభట్టు తనకు సమకాలికుఁడై యుండి తనతోపాటుసిద్ధాంతగ్రంథమును వ్రాయ గడంగి తనకంటె నాఱేఁడులుముందు సిద్ధాంతగ్రంథమును రచిం చినమాత్రనే యాతనిసిద్ధాంతమును బ్రాచీనసిద్ధాంతముగా నం గీకరించి వరాహమిహిరుఁడు ప్రస్తుతించియుండునా? అటులెన్నఁ టికిని జరగియుండనేరదు. ఆ కాలమునందు జ్యోతిర్విదాభరణ

మును రచించిన కాళిదాసు సైతము సమకాలీనులుగానుండు వరాహమిహిరాదుల సిద్ధాంతములఁ బేర్కొనవలసినప్పుడు

"మత్వావరాహమిహిరాది మతైరనేకైః"

అనియే చెప్పియుండెనుగాని తనకంటె ముందుగ వరాహమిహిరుఁడు సిద్ధాంతగ్రంథముల రచియించియుండినను వరాహమిహిరుని ప్రాచీనసింద్ధాంత గ్రంథకర్తగ పరిగణించియుండెనా? లేదు. సమకాలికుల నెప్పుడటులఁ జెప్పియుండరు. తనకన్న నెన్నియో శతాబ్దములకుఁబూర్వ మాతఁడు (ఆర్యభట్టు) సిద్ధాంతగ్రంథమును రచియించియుండినంగాని యాతనిని (ఆర్యభట్టుని) బ్రాచీనసిద్ధాంతవేత్తగా వరాహమిహిరుఁ డంగీకరించియుండఁడు. అట్టు లంగీకరించియుండుననుటయు నసంభవము. కాన వరాహమిహిరుఁ డార్యభట్టీయము ప్రాచీనసిద్ధాంతములలో నొకటిగఁ జెప్పియుండుటనుబట్టియే యార్యభట్టు క్రీ. శ. ఐఁదవశతాబ్దాంతమున నన క్రీ. శ. 498 సంవత్సర ప్రాంతమునందుండినవాఁడు కాఁడనియు నంతకుబూర్వ మెన్నియో శతాబ్దముల క్రిందటం గల సిద్ధాంతగ్రంథకర్తయనియు స్పష్టముగఁ గన్పట్టుచున్నది. కలియుగము 3600 సంవత్సరమని సుధాకర ద్వివేదిపండితుఁడు గావించిన సవరణ సత్యేతరమనియు విదితమగుచున్నది. కలియుగము 360 సంవత్సరమునం దార్యభట్టుండినట్లు జెప్పెడు పాఠాంతరమేసరియని స్పష్టముగఁ జెప్పఁదగియున్నది. ప్రాచీన సిద్ధాంతవేత్తలలో నార్యభట్టొకఁడని చెప్పఁబడిన వరాహమిహిరుని వాక్యములే అద్దానిని బలపఱుచుచున్నవి.

జోన్సుపండితుని సిద్ధాంతము.

పరాశర సిద్ధాంతములోఁ జెప్పఁబడిన కాలపరిస్థితులను బట్టి క్రీస్తుశకారంభమునకుఁబూర్వము పన్నెండు శతాబ్దముల కంటె నధికకాలముక్రిందట భారతయుద్ధము జరగియుండఁ జాలదని సర్ విల్లియం జోన్సు (Sir William Jones) పండితుఁడొకవ్యాసమునం దీవిధముగఁ జెప్పియుండెను.

"It is now clearly proved that the first Purana contains an account of the deluge, between which and the Mahommedan conquests, the History of genuine Hindu Government must, of course be comprehended; but we know from an arrangement of seasons in the astronomical works of Parasara that the War of the Pandavas could not have happened earlier than the twelfth Century before Christ, and Seleucus must, therefore, have reigned about nine Centuries after the war. Now the age of Vicramaditya is given................"†

"ప్రిథమపురాణము ప్రళయమునుగుఱించి చెప్పుచున్నటు లిప్పుడు స్పష్టముగ ఋజువుకాఁబడుచున్నది. ఆ ప్రళయమునకును మహమ్మదీయుల విజయమునకును నడుమ నిజమైన హైందవరాజ్యచరిత్ర యిముడ్పఁబడవలెను. పరాశరుని సిద్ధాంతగ్రంథమునఁ జెప్పఁబడిన కాలపరిస్థితులనుబట్టి పాండవుల మహాసంగ్రామము క్రైస్తవశకమునకు పన్నెండుశతా

† Asiatic Researches, Vol. IV p 6

బ్దములకంటెఁ బూర్వకాలమున జరగియుండనేరదు. కావున నాయుద్ధమునకు దాదాపు తొమ్మిదిశతాబ్దముల కాలము తరువాత సెల్యూకసు పరిపాలించి యుండవలెను. ఇప్పుడు విక్రమాదిత్యునికాలము తెలిసికొనఁబడినది. * * * "[1]

ఆ వ్యాసముననే మఱియొకచోట

"........ ........ ........ ........ and may in round numbers consider the twelve and three hundredth years before Christ as two certain Epochs between Rama who conquered Silan, a few centuries after the flood, and Vicramaditya who died at Ujjain fifty seven years before the beginning of our Era".[2]

" * * * ప్రళయకాలముతరువాతఁ గొన్ని శతాబ్దములకు సిలోనును జయించిన రామునకును, మన శక కాలమునకుముం దేఁబదియేఁడవవత్సరమున "ఉజ్జయిని" లోఁజనిపోయిన విక్రమాదిత్యునకును—మధ్యకాలములోఁ గ్రీస్తుజననమునకుఁబూర్వము పన్నెండువందలు(B.C. 1200), మూఁడువందలు (B.C. 300) సంవత్సరములు రెండును రెండుముఖ్యకాలములుగఁ బరిగణింపవచ్చును." [3]

వీరు ప్రథమపురాణమున నేదియో చెప్పినవారుకారు. పురాణములు, కల్పప్రళయములు, మహాప్రళయములు, ప్రళయములు మున్నగు పెక్కుఁప్రళయములనుగుఱించి చెప్పుచున్నవి.

---

1 Asiatic Researches Vol, IV p. 6.

2 Asiatic Researches: Vol. IV p 11

3 Asiatic Researches Vol. IV, p. 11.

అందే ప్రళయమో, యెంతకాలము క్రిందట జరగియుండెనో చెప్పి నవారుకారు. బైబిలునందుఁ జెప్పఁబడిన ప్రళయమని వారియభిప్రాయమైనట్లు లెంచినను అయ్యది క్రీ. పూ. 3000 సంవత్సరముల పై కాలము క్రిందట జరగియుండినట్లుఁ జెప్పఁబడియుండెను. ప్రాయశః వారు బైబిలులోఁ జెప్పఁబడిన ప్రళయముగనే గ్రహించినట్లు గన్పట్టుచున్నది. మాళవదేశాధీశుఁడగు విక్రమాదిత్యుఁడు "ఉజ్జయిని" యందుఁ గ్రీ. పూ. 57 వ సంవత్సరమునఁ జనిపోయినట్లు సిద్ధాంతము సేసియుండిరి. ఆధారముల గనంబఱచినవారుకారు. క్రీ. పూ. 57 వ సంవత్సర ప్రాంతమున విక్రమాదిత్యుఁడను ప్రభువుండినట్టు లొప్పికొనినందులకై నను సంతసింపవలసినదే! విక్రమాదిత్యుఁడు క్రీ. పూ. 57 సంవత్సరమున శకమునేర్పాటుఁగావించినట్లును క్రీ. శ. 78 సంవత్సరమువఱకు జీవించియుండినట్టు జెప్పుచుండిరి. విక్రమాదిత్యుఁడు క్రీ. పూ. 57 సంవత్సరమున శకమునేర్పాటుఁ గావించినట్లును, 135 సంవత్సరములు పరిపాలనమొనర్చినట్లును, క్రీ. శ. 78 సంవత్సరమున శాలివాహనునిచే నోడింపఁబడినట్లును అయినీఅక్బరీ యను గ్రంథమున అబుల్ ఫజల్ అల్లామీా పండితుఁడు చెప్పియున్నాఁడు.[1] ఇట్టిసందర్భములలో విక్రమాదిత్యుఁడు క్రీ. పూ. 57 సంవత్సరమునఁ జనిపోయినట్లు నిరాధారముగ సిద్ధాంతముం జేయుట వింతఁగఁ దోఁపకమానదు. అట్టి నిరాధారసిద్ధాంతముల నంగీకరించుటకంటె పరిహాసాస్పద మింకొకటి కన్పట్టదు.

---

1. Ain-i- Akbari by Abul Fazal Allami- Translated by E. C. Sachan Vol. II p. 15.

ఇట్టి సిద్ధాంతమునుగావించుపట్టున జోన్సుపండితుఁ డీవిధముగఁ జెప్పియుండెను.

"A Sanskrit history of the celebrated Vicramaditya was inspected at Benares by a Pandit who would not deceive me and could not himself have been deceived: nor have my friends in that city been able with all their exertions to produce a copy of it."†

"సంస్కృతమున రచియింపబడిన విక్రమాదిత్యుని చరిత్రను గాశీపట్టణము (వారణాసి) నందొక పండితునిచేఁ జూడఁబడినది. ఆయన నన్ను మోసముచేసియుండఁడు. ఆయనయు మోసపోయియుండఁడు. ఆ పట్టణమునందలి నా స్నేహితులెంత యత్నించినను దానిప్రతిని సంపాదింపఁజాలక పోయిరి."

చూచితిరా! ఈ పండితుని యభిప్రాయమున కనుకూలమగునట్లు జెప్పిన వాక్యములయం దెంతవిశ్వాసమో! అట్టివాక్యముల నొడివినవారియం దెంతనమ్మకమో! వారీ చర్చకుఁబూని కొనకపూర్వ మెన్నియోశతాబ్దములక్రిందట వ్రాసిన పండితుల వ్రాతలయం దేల యట్టినమ్మకముండకూడదు? తమపండితునిచేఁ జెప్పఁబడినచరిత్రను దాము చూచియుండలేదు. దానికొఱకై యెందఱుప్రయత్నించినను సంపాదింపఁజాలకుండిరఁట! అట్టి రూపహీనమగు చరిత్రగలదని నామరహితమగు పండితుఁడెవ్వఁడో చెప్పినవాక్యములనమ్మి యిట్టి విపరీతసిద్ధాంతముల గావిం

† Asiatic Researches Vol. IV- p. 7.

చుట, అట్టి సిద్ధాంతములనే వేదవాక్యములుగనమ్మి ప్రక్షిప్తాంశములువ్రైచుట, వానింబురస్కరించికొని నిజచరిత్రాంశముల వెల్లడిఁజేయు వాఙ్మయమంతయు ననుమానాస్పదమనితోసిపుచ్చుటయుఁజూడఁ జోద్యముగఁ గన్పట్టకమానదు.

సర్ విల్లియం జోన్సు పండితుఁడు పరాశరుని సిద్ధాంతగ్రంథమునఁ జెప్పఁబడిన కాలపరిస్థితులనుబట్టి మహాభారతయుద్ధకాలము క్రీస్తు పుట్టుటకుఁబూర్వము పన్నెండవ శతాబ్దముకంటె నెక్కువకాలముక్రిందట జరగియుండనేఱదని యూహించి చెప్పియుండిరి. అట్టి యూహకుఁ గారణములు చెప్పినవారు కారు. పరాశరునిచేఁజెప్పబడిన కాలపరిస్థితు లేవియో వారివ్యాసమున స్పష్టముగఁ జెప్పినవారు కారు. పరాశరునకును భారతయుద్ధమునకును గలసంబంధమేమిటో చెప్పినవారు కారు. బహుశః భారతయుద్ధవీరులగు పాండవులకుఁ బితామహుఁడుగఁ జెప్పఁబడిన వ్యాసులవారి తండ్రియగు పరాశరుఁడని జోన్సుపండితుఁడు భ్రమపడియుండునని తోఁచుచున్నది. ఆ పరాశరుఁడే యీ పరాశరుఁడని వారివ్యాసమున ఋజుమార్గములఁ గనంబఱచియుండలేదు. హైందవవాఙ్మయమునుబట్టి భారతయుద్ధకాలమునందుండినట్లు జెప్పఁబడిన వ్యాసులతండ్రి పరాశరుఁడని నమ్మినపు డావాఙ్మయమునఁజెప్పిన పరాశరునికాల మేలనమ్మఁగూడదు? వ్యాసులు (వ్యాసమహర్షి) భారతయుద్ధకాలమునకుఁ బూర్వ మెన్నియోవేల సంవత్సరములనుండి యుండినట్లు జెప్పఁబడియుండెనే? అయ్యది నిజముకాదనుటకేమికారణములఁ గనఁబఱచియుండిరి. పరాశరస్మృతి, విష్ణుపురాణము మున్నగువాని

విరచించిన పరాశరమహర్షియే యిప్పరాశరసంహిత లేక పరాశరతంత్రమునురచించిన పరాశరుఁడనిచెప్పుట కేమియాధారములను జూపించుచుండిరి. అట్టి యాధారములును గన్పట్టవు. హైందవవాఙ్మయమును విమర్శించిచూచిన సిద్ధాంతకర్తలలోఁ బరాశరనామధేయులు వేర్వేరుకాలములయందుఁ బెక్కురుండినట్లు గన్పట్టుచున్నది. సిద్ధాంతగ్రంథమగు పరాశరసంహిత, లేక పరాశరతంత్ర గ్రంథకర్తయగు పరాశరుఁడే కురుపాండవుల పితామహుఁడనిచెప్పబడు వ్యాసమహర్షితండ్రియగు పరాశరమహర్షి యని విశ్వసింపవలసినదిగాఁ గోరుచుండిరి. వారు పోయినపోకడలనే తక్కుంగల పాశ్చాత్యపండితులును బోయియుండిరి. కాని మహాభారతయుద్ధ కాలనిర్ణయమునం దొకరివత్సరముతో నింకొకరేకీభవింపరైరి. బృహత్పరాశరహోరాశాస్త్రము, మధ్యపరాశరీయము, లఘుపరాశరీయము,వృద్ధపరాశరీయము మున్నగు వేర్వేరు సిద్ధాంతగ్రంథములు గన్పట్టుచున్నవి. ఆయాగ్రంథముల రచించిన పరాశరులు వేర్వేరువ్యక్తులుగాఁ గన్పట్టుచున్నారు. వారిలో నెవరినైనను వ్యాసమహర్షితండ్రియగు పరాశరమహర్షి యనిచెప్పుట కేమియు నాధారములు గన్పట్టుటలేదు. సిద్ధాంత గ్రంథములుగాక యితరగ్రంథములను రచించిన పరాశరనామధేయులెందఱో గాన్పించుచుండిరి. మనయిష్టమువచ్చినట్లు వారి నామసామ్యమునుబట్టి యెవ్వరినామమైనను బరాశరమహర్షి నామమునకంటఁగట్టి క్రీస్తునకుఁబూర్వము పన్నెండవశతాబ్దమున కేగాక క్రీస్తుశకారంభమైన తరువాత నిప్పటివఱకేవత్సరమునకు

లాఁగవలయునన్న నావత్సరమునకు లాఁగుటకుపీలగునని వేఱుగఁ జెప్పనవసరములేదు.

ఇఁటులనే సిద్ధాంతశాస్త్రకర్తయగు గర్గునిచేఁ జెప్పఁబడిన కాలపరిస్థితులనుబట్టి మహాభారతయుద్ధకాలము నిర్ధారణ నేయఁబడవచ్చునని కొందఱు పాశ్చాత్యవిద్వాంసులు రాద్ధాంతములు సల్పియుండిరి. ప్రాయశః వారును శ్రీకృష్ణబలరాముల గురువని చెప్పఁబడిన గర్గాచార్యులవారేయని యభిప్రాయులైనటులఁ గన్పట్టుచున్నది. ఈ గర్గసిద్ధాంతగ్రంథము సంపూర్ణముగ లభించుటలేదుగాని తరువాతకాలపు సిద్ధాంతవేత్తలు గర్గసిద్ధాంతములోనివని క్రోడీకరించుచుండిన కొన్ని శ్లోకములు మాత్రమే కానవచ్చుచున్నవి. వరాహమిహిరుని బృహత్సంహితకుఁ జింతామణియను వివృతిని(వ్యాఖ్యానమును-Commentary) రచించిన భట్టోత్పలుఁడు గర్గునియభిప్రాయముగూడఁ దమ యభిప్రాయముతో నేకీభవించినట్లు క్రోడీకరించిన

"శ్లో॥ యదానివర్తతేఽప్రాప్తో
ధనిష్ఠా ముత్తరాయణే ।
ఆశ్లేషార్ధం దక్షిణో ప్రాప్త
స్తదావిద్యాన్మహాభయమ్॥"

అను శ్లోకమునననుసరించి గర్గునికాలమునందును బరాశరుని కాలమునందువలె నుత్తరాయన దక్షిణాయనములు బ్రవేశించియుండెనని కొందఱు చెప్పుచున్నారు. ఆశ్లోకమునకు

"సూర్యుఁడు ధనిష్ఠానక్షత్రమును జేరకపూర్వ ముత్తరాయనగతుఁడైనను, ఆశ్లేషార్ధమునకుఁ జేరకపూర్వము దక్షి

ణాయనగతుఁడై నను మహాభయమువాటిల్లునని తెలిసికొన వలెను.”

అనియర్థము చెప్పఁదగియుండునేగాని గర్గునికాలములో నుత్తరాయన దక్షిణాయనము లావిధముగ జరగియుండెనని యే మాత్రమును సూచించుటలేదు. అట్లు లెంచుటకును అవకాశముఁ గాన్పించుటలేదు. గర్గుని యభిప్రాయములును బరాశరుని యభిప్రాయములును నేకీభవించినటులఁ జెప్పఁబడిన మాత్రిన సిద్ధాంత గ్రంధకర్తయని చెప్పఁబడు గర్గునకును శ్రీకృష్ణుని గురువనిచెప్పఁబడు గర్గాచార్యునకును నెవ్విధంబగు సంబంధముకలదని చెప్పుటకు నవకాశముఁ గన్పట్టుటలేదు. ఈ సిద్ధాంతగ్రంధకర్తయగు గర్గుఁడు శాలిశూకుని బేర్కొనియుండె ననియు, శాలిశూకుఁడు అశోకునియనంతరము పరిపాలించి యుండెననియుఁ గావున గర్గుఁడు క్రీ. పూ. 323 సంవత్సరము కంటె ముందున్నవాఁడని చెప్పుట కవకాశములేదనియు, కావున శ్రీకృష్ణుని గురువనిచెప్పఁబడు గర్గాచార్యులే యీ గర్గుఁడని చెప్పుట కవకాశములేదనియు గోపాలయ్యరుగారు మున్నగువారలు కొందఱునేసిన సిద్ధాంతములనుబట్టియే తేలుచున్నది. కాని ప్రొఫెసర్ వీబరుమున్నగు పాశ్చాత్యవిద్వాంసులమార్గము ననుసరించి గోపాలయ్యరుగారు వేదాంగజ్యోతిషమునందలి శ్లోకమునొకదాని నాధారముచేసికొని పరాశరునికాలమునందువలె వేదాంగజ్యోతిషగ్రంధకర్త కాలమునందునుగూడ నుత్తరాయనము ధనిష్ఠానక్షత్ర ప్రారంభమునందును, దక్షిణాయన మాశ్లేషార్థమునందును బ్రారంభమైనటులఁజెప్పుచు దాని ననుసరించి

భారతయుద్ధకాల నిర్ణయమునకుఁ గడంగియుండెను. భాష్యము లలోఁ సైతము మహామహోపధ్యాయ సుధాకరద్వివేది పండితుఁడు ప్రకటించిన యాజుషజ్యోతిషగ్రంథమునం దాశ్లోక మీవిధముగనున్నది.

"శ్లో॥ ప్రపద్యేతే శ్రీవిష్టాదౌ
సూర్యచంద్రమసావుదక్ ।
సార్పార్ధే దక్షిణార్కస్తు
మాఘశ్రవణయోః సదా॥"

ఆసంపుటమునందే దానితోఁగలిపి ప్రకటింపఁబడిన అర్కజ్యోతిషగ్రంథమున మూఁడవచరణము 'సార్పార్ధేదక్షిణార్కస్య' యను స్వల్పమార్పుచే నాశ్లోకమేయున్నది. వీనింబట్టి సిద్ధాంతగ్రంథకర్తయగు పరాశరునివలె వేదాంగజ్యోతిష గ్రంథకర్త క్రీస్తుశకమునకుఁబూర్వము 14 లేక 12వ శతాబ్దములలో జీవించియుండెనని చెప్పుచుండిరి.

ఈ సిద్ధాంతగ్రంథములలోఁ జెప్పబడిన కాలపరిస్థితుల నాధారముగ దీసికొనిన మహాభారతయుద్ధకాలనిర్ణయమునకు సాహాయ్యపడునని పాశ్చాత్యవిద్వాంసులు చెప్పియుండిరి. ఆ పరిస్థితులంబట్టి కురుపాండవుల మహాసంగ్రామము క్రీస్తుశకమునకుఁబూర్వము పదునాల్గవశతాబ్దాదిలో జరగియుండునని చెప్పియుండిరి. కాలిబ్రూకు, ఆర్కిడీకన్ ప్రాట్టు, బెంట్లీ మున్నగు పాశ్చాత్యపండితులు పరాశరునకును వరాహమిహిరునకును నడుమఁ బదునాలువందలయెనుబది సంవత్సరముల కాలవ్యవధియుండినటులఁ గన్పట్టుచున్నదనియు, వరాహమిహిరునిచేఁ బేర్కొ

నఁబడిన కాలపరిస్థితులు కలియుగము 3660 సంవత్సరమునం దుండెననియు, వారిచిత్తమువచ్చినట్లులూహించి వరాహమిహిరునికాలము క్రీ. శ. 499 సంవత్సరప్రాంతముననై యుండెననియు, మహాభారతయుద్ధము క్రీ. పూ. 1181 (1680—499) సంవత్సరప్రాంతమున జరగియుండుననియుఁ జెప్పియుండిరి. వీరు అయనచలనపరిమితి సంవత్సరమునకు 50″ వికళలకాలపరిమితిగాఁ దీసికొనియుండిరి. గోపాలయ్యరుగారు వరాహమిహిరుని కాలమునకును బరాశరుని కాలమునకును నడుమ 1672 సంవత్సరముల కాలవ్యవధియుండెనని చెప్పుచు మహాభారతయుద్ధకాలము క్రీ. పూ. 1173 (1672-499) సంవత్సరమునకు లాఁగియుండిరి. వీరు కేవలము పాశ్చాత్యపండితులు చెప్పినటుల వరాహమిహిరుఁడు కలియుగము 3660 సంవత్సరము ప్రాంతమునందుండినవాఁడనియు సిద్ధాంతగ్రంథకర్తయగు పరాశరుఁడే వ్యాసమహర్షి తండ్రియగు పరాశరుఁడనియు నమ్మి యావిధముగ సిద్ధాంతమొనరించియుండిరి. అయనచలనపరిమితి సంవత్సరమునకు 50. 24″ వికళలకాలముగ వీరు గ్రహించియుండిరి.

పరాశరునికాలమున గనంబఱుపఁబడిన కాలపరిస్థితులు భారతయుద్ధకాలనిర్ణయమునకుఁ దోడ్పడుచున్నవని రాద్ధాంతములుసల్పుచుఁ బలువురుపాశ్చాత్య, హైందవవిద్వాంసులు సిద్ధాంతముల బ్రతిపాదించియుండుటచే వేదాంగజ్యోతిష,ఆర్యజ్యోతిష కాలములందును, గర్గపరాశర్యాదుల కాలములయందున్నటులఁ జెప్పఁబడిన కాలపరిస్థితులను గ్రహించుట యవసరమని తోఁపకమానదు. మఱియు వరాహమిహిరునికాలము

నందుఁ జెప్పఁబడిన కాలపరిస్థితులనుబోల్చి యక్కాలనిర్ణయ ముఁ గావించియుండినందున వరాహమిహిరుని కాలమునందుం డినట్లు చెప్పఁబడిన కాలపరిస్థితులను గమనించిన వరాహమిహి రుఁ డేకాలమునందుండినదియు, గ్రహించుటకనువగును. దానిం బట్టి విక్రమాదిత్యునికాలమును దెలిసికొనుటకును సహాయకా రిగనుండును. గనుక వానినొకించుక పరిశీలనముచేయుదము.

వరాహమిహిరుఁడు తన కాలమునఁ గనుఁగొనిన యుత్త రాయన దక్షిణాయన ప్రవేశకాలపరిస్థితులను బృహత్సంహిత యందుఁ జెప్పియున్నాఁడు. వానినే యీసిద్ధాంతములఁ బ్రసా దించినవారలందఱు క్రోడీకరించుచు విమర్శనలు సల్పియుండిరి. ఆ శ్లోకములు నీ క్రిందఁ గనఁబఱుపఁబడుచున్నవి.

"శ్లో॥ ఆశ్లేషార్ధా దక్షిణ ముత్తర
మయనం రవేధనిష్ఠాద్యమ్ ।
నూనం కదాచిదా సీత్
యేనోక్తం పూర్వశాస్త్రేషు॥ ౧

శ్లో॥ సాంప్రతమయనం సవితుఃకర్కట
కాద్యంమ్మృగాది తశ్చాఽన్యమ్ ।
ఉక్తాభావో వికృతిః
ప్రత్యక్ష పరిక్షణై ర్వ్యక్తిః॥ ౨

శ్లో॥ దూరస్థ చిహ్నవేధాదుద
యేఽస్తమయే పివాసమాప్రాంశోః।
ఛాయాప్రవేశ నిర్గమ
చిహ్నైర్వామండలే మహతి॥ 3

శ్లో॥ అప్రాప్య మకరమర్కో-విని
వృత్తో హన్తి సాపదాంయామ్యామ్ ।
కర్కటకమ సంప్రాప్తోవిని
వృత్తశ్చోత్తరాంసైన్ధ్రీమ్॥" ౮

1. "ఒకానొకప్పుడు సూర్యుఁడాశ్లేషార్ధమునకువచ్చినపుడుదక్షిణాయనమును, ధనిష్ఠాదికివచ్చినపుడుత్తరాయనమును ప్రారంభమయ్యెను. పూర్వశాస్త్రము లిట్లే చెప్పుచున్నవి.
2. ఆధునిక కాలమున (ప్రస్తుతకాలమున) సూర్యుఁడు కర్కటకరాశిలో నాదియందుఁ బ్రవేశించినపుడు దక్షిణాయనమును, మకరాదియందు ప్రవేశించినపుడుత్తరాయనమును ప్రారంభమగుచున్నది. పూర్వము జరగినదానికి భిన్నముగా జరుగుచున్నదని నీక్రిందఁ జెప్పఁబడినప్రకారము పరీక్షచేసి తెలిసికొనవచ్చును.
3. సూర్యోదయాస్తమయములగుచోట్ల దిఙ్మండలమున దూరముగా నొకగుఱుతు నేర్పాటుఁజేసికొని చూచుటవలనఁగాని, లేక యొకగొప్పవలయాకారమును రచించి దాని కేంద్రస్థానము(Centre)న నొకగడనుబ్రాంతి యాగడయొక్క నీడను జూచుటవలనఁగాని సూర్యగతిని గనుఁగొనవచ్చును.
4. మకరమునకు రాకముందు సూర్యగతిమారినచోఁ బశ్చిమదక్షిణ దిక్కులయందుఁ గీడుసంభవించును. అటులనే కర్కటకమునకు రాకముందు సూర్యునిగతి మారినచోఁ బ్రాగుత్తరదిశలయందుఁ గీడుమూడును."

అని యాశ్లోకముల భావమైనటులఁ గన్పట్టుచున్నది.

సిద్ధాంతవేత్తలు చెప్పిన గణితములను సులభముగఁ దెలిసికొనుటకై నీక్రింది విషయములు గనంబఱుపఁబడినవి.

ఖగోళశాస్త్రజ్ఞులు (Astronomers) జ్యోతిశ్చక్రమును (క్రాంతివృత్తమును—Zodaic or Ecliptic) పన్నెండు రాసులుగ విభజించియుండిరి. వానికి 1. మేషము, 2. వృషభము, 3. మిధునము, 4. కర్కాటకము, 5. సింహ, 6. కన్య, 7. తుల, 8. వృశ్చికము, 9. ధనస్సు, 10. మకరము, 11. కుంభము, 12. మీనములని వరుసగా నామంబులిడియుండిరి.

జ్యోతిశ్చక్రమును నిఱువదేడు (27) నక్షత్రములుగను విభజించియుండిరి. వానికి "అశ్వని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశీర్ష, ఆరుద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, మఘ, పుబ్బ, (పూర్వఫల్గుణి), ఉత్తర(ఉత్తరఫల్గుణి), హస్త, చిత్త్ర, స్వాతి విశాఖ, అనూరాధ, జ్యేష్ట, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణ, ధనిష్ఠ, శతభిష, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి యని వరుసగా నామంబు లిడియుండిరి.

ఒక్కొక నక్షత్రకాలము నాలుగుభాగములుగ విభజించియుండిరి. వానిని నక్షత్రపాదములందురు. ఒక్కొకరాశితొమ్మిది నక్షత్రపాదముల చేరికమైయుండెను.

జ్యోతిశ్చక్రమును (క్రాంతివృత్తమును) 360 భాగములుగ విభజించియుండిరి. ఒక్కొకభాగమును నఱువది (60) విభాగములుగను (వీనినేకళలనియుఁ బేరొకనియుండిరి), ఒక్కొక విభాగమును (కళను) నఱువది (60) యంతర్భాగములుగను (వీనినే వికళలని చెప్పియుండిరి) విభజించియుండిరి. పాశ్చాత్య

సిద్ధాంతములననుసరించి భాగములను డిగ్రీలనియు, కళలను మినిట్లనియు, వికళలను సెకండ్లనియుఁ బేర్కొనుచుండిరి.

మాసమునకు ముప్పదితిథులుగ పరిగణించుచుండిరి. జ్యోతిశ్చక్రమును (గ్రాంతివృత్తమును) ముప్పదిభాగములుగ విభజించియుండిరి. వానినే తిథికాలమని చెప్పియుండిరి. ఒక్కొక తిథికాలము 12 (360 ÷ 30) డిగ్రీల కాలమైయున్నది.

కావున ఒక్కొకరాశికాలము 30(360 ÷ 12)డిగ్రీలును, ఒక్కొకనక్షత్రకాలము 13 డిగ్రీల 20 మినిట్లును (360 ÷ 27 = 13°—20′), ఒక్కొక నక్షత్రపాదము 3 డిగ్రీల 20 మినిట్లు (13°—20′) ÷ 4 = 3°—20′ ) కాలమును అగుచున్నది.

## గర్గ, పరాశర, వరాహమిహిరుల కాలనిరూపణ.

ఇఁక బరాశర, గర్గ, వరాహమిహిరాదులచేఁ జెప్పఁబడిన అయనగతుల కాలపరిస్థితులను, ఇప్పటికాలమునంగల అయనగతులపరిస్థితులను విమర్శించి వానింబట్టి వారలేయేకాలములయందున్నదియుఁ గనుఁగొనుటకుఁ బ్రయత్నింతము.

పరాశర, గర్గులకాలమునందాశ్లేషార్ధమున సూర్యుఁడు ప్రవేశించినపుడు—అనగాఁ గ్రాంతివృత్తమున 113°—20′ (113 భాగలు 20 కళలు)కు సూర్యుఁడువచ్చినపుడు దక్షిణాయనము ప్రారంభమయ్యెననియు, ధనిష్ఠాదియందు సూర్యుఁడు ప్రవేశించినపు డనఁగాఁ గ్రాంతివృత్తము 293°—20′(293భాగల 20 కళలు)నందు సూర్యుఁడు ప్రవేశించినపు డుత్తరాయనము బ్రారంభమయ్యెననియుఁ జెప్పుచుండిరి.

వరాహమిహిరునికాలమునఁ గర్కాటకాదియందు సూర్యుఁడుండినపుడు దక్షిణాయనము ప్రారంభమయ్యెననియు (బునర్వసునక్షత్ర మంతమునకు ననఁగాఁ గ్రాంతివృత్తమున 93°–20' నకు సూర్యుఁడువచ్చినపుడు దక్షిణాయనము ప్రారంభమయ్యెననియు), మకరాదియం దుత్తరాషాఢనక్షత్ర మధ్యభాగమునకు ననఁగాఁ గ్రాంతివృత్తమున 273°–20' నకు సూర్యుఁడువచ్చిపుడుత్తరాయనము ప్రారంభమైయుండినట్లును జెప్పఁబడియున్నది.[1]

వరాహమిహిరుఁడు ప్రాచీన సిద్ధాంతములనుగుఱించి ప్రస్తావించుచు నాకాలమునం దాశ్లేషార్ధమునకు సూర్యుఁడు వచ్చినపుడు దక్షిణాయనము ప్రారంభమయ్యెననియుఁ బ్రస్తుతకాలమున ననఁగాఁ దాను పంచసిద్ధాంతికను రచించునపుఁడు పునర్వసునక్షత్ర మంతమునకు సూర్యుఁడువచ్చినపుఁడు దక్షిణాయనము ప్రారంభమగుచున్నదనియుఁ బంచసిద్ధాంతికయందు జెప్పియున్నాఁడు.

శ్లో॥ ఆశ్లేషార్ధాదాసీద్యదా
నివృత్తిః కిలోష్ణ కిరణస్య ।
యుక్తమయనం తదాఽఽసీత్
సాంప్రతమయనం పునర్వసుతః॥[2]

వరాహమిహిరుని బృహత్సంహితకు వివృత్తినిరచించిన భట్టోత్పలుఁడు సిద్ధాంతభేదములను గుఱించిచెప్పుచు నాశ్లోక

1. Varahamihira's Panchasidhantika chap II - V, 63.
2 Panchasidhantika: Chap. III - V. 59.

మును గ్రోడీకరించి పరాశరునికాలమునందువలె ప్రాచీనసిద్ధాంతుల కాలమునందును నాశ్లేషానక్షత్రము మూఁడవపాద ప్రారంభమునందు దక్షిణాయనము ప్రారంభమైయుండెననియు, వరాహమిహిరునికాలమునఁ బునర్వసునక్షత్ర మంతమునందు దక్షిణాయనముప్రారంభమైయుండెననియుఁ జెప్పియున్నాఁడు.[1]

ప్రకృతకాలమున ననఁగాఁ గలియుగము 5030 సంవత్సరమునకు సరియగు శుక్లసంవత్సరమున నుత్తరాయన దక్షిణాయన ప్రారంభకాలము లెప్పుడగుచున్నవో కనుఁగొందము. శుక్లసంవత్సర మార్గశీర్షబహుళ సప్తమీ యాదివారమునాఁడు 17 ఘడియల 13 విఘడియలకాలమప్పుడు మకరాయన ప్రారంభమని సిద్ధాంతముచేసియున్నారు.[2] మార్గశీర్షబహుళ షష్ఠీ శనివారమునాఁడు 39 గడియల 52 విగడియల కాలమప్పుడు సూర్యుఁడు మూలానక్షత్ర తృతీయపాదమునందుఁ బ్రవేశించుననియు, మార్గశీర్షబహుళనవమి మంగళవారమునాఁడు 56 గడియల 12 విగడియలకాలమునకు మూలానక్షత్ర చతుర్థపాదమునఁ బ్రవేశించుననియుఁ జెప్పఁబడియున్నది. దీనింబట్టి సూర్యుఁడు మూలానక్షత్ర తృతీయపాదములోనుండఁగా నుత్తరాయనుఁడగుట కారంభమగునట్లుఁ గన్పట్టుచున్నది. ఆగణితమును బట్టిచూచిన మూలానక్షత్ర తృతీయపాదములో 37 గడియల 21 విగడియలకాలము గడచినపిమ్మట నుత్తరాయనగతుఁడగు

1 Bhattotpala's Vivritti Chintamani - Chap. II - P. 41.

2. Huindu Almanac for the year Sukla corresponding to 1929-30- Published by Messrs. P. Doraswami Aiyangar and his Son Mr. P. Srinivasa Varadan, B. A.

నటులఁ దెలియుచున్నది. ఒక్కొకనక్షత్రపాదము జ్యోతిశ్చక్రమున 3°—20′ (3 డిగ్రీల 20 మినిట్లు) పరిమితియగునని తెలిసికొనియుంటిమి. మూలానక్షత్ర తృతీయపాదమున 37 గడియల 21 విగడియలకాలము గడచినందున నాపాదమునందు సూర్యుఁడుండునటులఁ జెప్పఁబడినసంఖ్య 196 గడియల 20 విగడియల కాలమునుబట్టి

$$\frac{3^\circ\text{—}20'}{196\ \text{గ}\ 20\ \text{విగ}} \times \frac{37\ \text{గ}.\ 21\ \text{విగ}}{1} = \frac{200 \times 2241}{11780} = \frac{44820}{1178}$$

$=38\frac{78'}{1178}$) 38 కళల (38 మినిట్లు) పరిమితిగడచునటులఁ జెప్పదగియున్నది. జ్యోతిశ్చక్రమున మూలానక్షత్ర తృతీయపాద ప్రారంభము 246°—40′ (246 భాగల 40 కళల)నందే యైయున్నది. కావున జ్యోతిశ్చక్రమున 246°—40′ + 0° - 38′ = 247° — 18′ (247 భాగల 18 కళల) యందు సూర్యుఁడుండగా నుత్తరాయన మారంభమగునట్లు గన్పట్టుచున్నది.

ఇటులనే దక్షిణాయనము శుక్లసంవత్సర జ్యేష్ఠశుక్ల చతుర్దశీ శుక్రవారమునాఁడు 56 గడియల 24 విగడియలకాలమప్పు డారుద్రనక్షత్ర ప్రథమపాదమునందు సూర్యుఁడు ప్రవేశించినట్లును, జ్యేష్ఠబహుళ ద్వితీయా యిందువాసరమునాఁడు 43 గ. 43 విగడియల కారుద్రానక్షత్ర ద్వితీయపాదమునందు సూర్యుఁడు ప్రవేశించినట్లును జెప్పఁబడియున్నది. ఈ గణితమునుబట్టి సూర్యుఁడు ప్రథమపాదములో నుండఁగా దక్షిణా

యన మారంభమయినట్లు గన్పట్టుచున్నది. ఆరుద్రనక్షత్ర ప్రథమపాదములో సూర్యుఁడు ప్రవేశించినపిమ్మట 42 గడియల 24 విగడియలకు దక్షిణాయన మారంభమయినట్లు దెలియుచున్నది. ఆ నక్షత్రపాదమున సూర్యుఁడుండుకాలముంబట్టి గతించినగడియలను గణితమువేయఁగా నారుద్ర ప్రథమపాదమున 38, మినిట్లుఁ బరిమితిగడచినట్టు లగపడుచున్నది. ఆరుద్ర ప్రథమపాదము జ్యోతిశ్చక్రమున 66°-40′ (66 భాగల 40 కళలు లేక 66 డిగ్రీల 40 మినిట్లు) యందుఁ బ్రారంభమగుచున్నది. కావున 66°–40′ + 0°–38′=67°–18′ (67 డిగ్రీల 18 మినిట్ల) యందు సూర్యుఁడు ప్రవేశించినపుడు దక్షిణాయన ప్రారంభకాలమైయుండెనని చెప్పఁదగియున్నది.

కావున మనకాలమున ననఁగా క్రీ. శ. 1929-1930 సంవత్సరములకు సరియగు శుక్లసంవత్సరమున జ్యోతిశ్చక్రమున మూలానక్షత్రము తృతీయపాదములో 247 –18′ (247 డిగ్రీల 18 మినిట్లు) యందు సూర్యుఁడు ప్రవేశించినపు డుత్తరాయనమును, నారుద్రానక్షత్ర ప్రథమపాదములో 67°–18′ (67డిగ్రీల 18 మినిట్ల) యందు సూర్యుఁడు ప్రవేశించినప్పుడు దక్షిణాయనమును బ్రారంభమైయుండినట్టు లగపడుచున్నది.

గర్గపరాశరాదుల కాలములందును, వరాహమిహిరుని కాలమునందును, బ్రకృతకాలమునందును సంభవించిన యుత్తరాయన దక్షిణాయన ప్రారంభకాలములు స్పష్టముగ నీక్షింపఁగనఁబఱుపఁబడినవి.

| | దక్షిణాయన ప్రారంభకాలము. | ఉత్తరాయన ప్రారంభకాలము. |
|---|---|---|
| 1. గర్గపరాశరాదుల కాలమున. | ఆశ్లేషానక్షత్రము మూఁడవపాదము ప్రారంభమున క్రాంతివృత్తమున 113°—20′ నకు సూర్యుఁడు వచ్చినపుడు | ధనిష్ఠాదియందుఁ గ్రాంతివృత్తమున 293°-20′నకుసూర్యుఁడు వచ్చినపుడు. |
| 2. వరాహమిహిరుని కాలమున. | కర్కాటకాది యందన పునర్వసునక్షత్ర మాంత్యమునఁ గ్రాంతివృత్తమున 93°-20′నకు సూర్యుఁడువచ్చినపుడు | మకరాదియందన నుత్తరాషాఢా నక్షత్ర మర్ధభాగమునఁ గ్రాంతివృత్తమున 273°-20′ నకు సూర్యుఁడు వచ్చినపుడు. |
| 3. ప్రకృతకాలమునఁ గలియుగము 5030 సంవత్సరము. క్రీ.శ.1929—30 శుక్ల సంవత్సరమున. | ఆరుద్ర ప్రథమపాదమునందు గ్రాంతి వృత్తమున 67°—18′ నకు సూర్యుఁడు వచ్చినపుడు. | మూలానక్షత్ర తృతీయ పాదమునందుఁ గ్రాంతి వృత్తమున 247°-18′నకుసూర్యుఁడు వచ్చినపుడు. |

వీనింబట్టి గర్గపరాశరులకాలమునందుఁ బ్రారంభమయి నట్టులూహింపఁబడిన యుత్తరాయన దక్షిణాయనప్రారంభకాలములకును, వరాహమిహిరునికాలమునందుఁ జెప్పఁబడిన యుత్తరాయన దక్షిణాయన ప్రారంభకాలములకును గ్రాంతివృత్తమున నిఱువదిభాగల (20 డిగ్రీల) కాలవ్యత్యాసము గనుపించుచున్నది. ఈ వ్యత్యాసము సూర్యునియొక్క అయనగతి లేక

అయనచలనము(Precession of the Equinoxes or Retrograde motion of the Sun) ను బట్టి కలుగుచున్నటుల సిద్ధాంతులు చెప్పుచున్నారు.

అయనచలనమువలనఁ గలిగెడు కాలవ్యత్యాసమును గురించి సిద్ధాంతులు భిన్నాభిప్రాయులుగానుండిరి. సూర్యసిద్ధాంతము ననుసరించి 54" (యేబదినాలుగు వికళలు) కాలమనియుఁ వరాహమిహిరునిమతము ననుసరించి 50" (యేఁబది వికళలు) కాలమనియు, ఫ్రెంచివిద్వాంసుఁడగు యమ్. లి. వెర్రియర్ (M. Le. Verrier ) పండితుని మతము ననుసరించి 50. 24" (50 $\frac{24}{100}$ వికళలు)కాలమనియుఁ దెలియుచున్నది, న్యూకాంబు, (Newcomb ) బెల్ ( Bell ), యంగు (young) మున్నగు నవీనసిద్ధాంతు లొక్కొక్కవత్సరమునకు 50. 2585" అనఁగా 50 26"(50$\frac{26}{100}$వికళలు) గాలవ్యత్యాసము కలుగుచున్నదనియుఁ జెప్పుచున్నారు. వరాహమిహిరునిచేఁ జెప్పఁబడిన కాలవ్యత్యాసమునకును ప్రకృతకాలమునందలి సిద్ధాంతులచేఁ జెప్పఁబడు కాలవ్యత్యాసమునకునుగల తారతమ్యత బహుస్వల్పముగ నుండుటచేతను, ఈ రెండుసిద్ధాంతములలో నెద్దాని నవలంబించినను మొత్తముమీఁద బహుస్వల్పకాలముమాత్రము వ్యత్యాసము వచ్చునట్లు లగపడుచున్నందునను, వరాహమిహిరుఁ డుదహరించిన కాలపరిస్థితులనుబట్టి వారివారి కాలములకుగల తారతమ్యముల నెఱుంగుటకు వరాహమిహిరుని మతముననుసరించి అయనగతివలనఁ గలిగెడు వ్యత్యాసము సంవత్సరమునకు 50" (ఏఁబది వికళల) కాలమనియే గణితముచేయుదము.

పరాశరాదుల కాలములోఁ గ్రాంతివృత్తమున 113°-20' (113భాగల 20 కళల) యందు దక్షిణాయన మారంభమై యుండెననియు, వరాహమిహిరునికాలములోఁ గ్రాంతివృత్తమున 93°-20'(93భాగల 20 కళల) యందు దక్షిణాయనమారంభమై యుండెననియుఁ బ్రకృతకాలములోఁ గలియుగాబ్దము 5030 సరియగు క్రీ. శ. 1929_1930 శుక్లసంవత్సరమునందుఁ గ్రాంతి వృత్తమున 67°_18' (67 భాగల 18 కళల)యందు దక్షిణాయన మారంభమయియుండెననియుఁ దెలిసికొనియుంటిమి. వీనింబట్టి పరాశరాదులకాలమునకును బ్రకృతకాలమునకును నడుమ (113°_20')_(67°_18')=46°_2' (46 భాగల 2 కళల కాలవ్యత్యాసముండినట్లును, బరాశరాదుల కాలమునకును వరాహమిహిరుని కాలమునకును నడుమ (113°_20')_(93°_20')=20° (ఇరువదిభాగల) డిగ్రీలకాలవ్యత్యాసమున్నట్లును, వరాహమిహిరుని కాలమునకును బ్రస్తుతకాలమునకును నడుమ (93°_20')_(67°_18')=26°_2'(26 భాగల రెండు కళల) కాలవ్యత్యాసమున్నట్లును గన్పట్టుచున్నది.

అయనచలనముంబట్టి సంవత్సరమునకు 50" (ఏఁబదివికళల) కాలవ్యత్యాసము గలుగుచుండుననను వరాహమిహిరుని సిద్ధాంతము ననుసరించియే కాలవ్యత్యాసములఁ గనుగొందము.

గర్గ పరాశరులకాలము—

50" (50 వికళలు) వ్యత్యాసముండిన కాలవ్యవధి 1 సంవత్సరమయినచో,

46°_2, లేక 165720" వికళల వ్యత్యాసముండిన } $\frac{165720}{50} = 3314\frac{2}{5}$

=3315 సంవత్సరము లగుచున్నది.

దీనింబట్టి గర్గపరాశరాదుల కాలమందున్నట్టు లూహింపఁబడిన దక్షిణాయనప్రవేశకాల పరిస్థితులిప్పటికి 3315 సంవత్సరములక్రిందట సంభవించియుండినట్టుఁ జెప్పదగియున్నది. అట్టి కాలపరిస్థితులుగలకాలమే గర్గపరాశరులకాలమని చెప్పినచో నయ్యది క్రీ. పూ. 1385 (3315_1930)సంవత్సరమగుచున్నది.

వరాహమిహిరుని కాలము—

50" వికళల వ్యత్యాసముండిన కాలవ్యవధి 1 సంవత్సరమయినచో,

26°_2' లేక 93720" వికళల వ్యత్యాసముండిన } కాలవ్యవధి $\frac{93720}{50} = 1874\frac{2}{5}$

or 1875 సంవత్సరములగుచున్నది.

వరాహమిహిరునిచేఁజెప్పఁబడిన దక్షిణాయనప్రవేశకాలమిప్పటికి 1875 సంవత్సరములక్రిందటఁ దటస్థించియుండినట్టు లగపడుచున్నది. అయ్యదియే వరాహమహిరునికాలమని చెప్పఁదగియున్నది. కాన నది క్రీ. శ. 55 (1930_1875) సంవత్సరప్రాంతమయినట్టు లగపడుచున్నది.

వరాహమిహిర, గర్గపరాశరాదుల నడుమనుండు కాలవ్యవధిని గనుగొందము.

50″ వికళల కాలవ్యత్యాసముండిన కాలవ్యవధి 1 సంవత్సరమయిచో

| | |
|---|---|
| 20°-0′ లేక 72000″ వికళలకాలవ్యత్యాసముండిన | కాలవ్యవధి $\frac{72000}{50}$ = 1440 సంవత్సరములగుచున్నది. |

ఉత్తరాయన ప్రారంభకాలముంబట్టి చూచినను పరాశరాదుల కాలమునకును బ్రకృతమునకును 46°-2′ (46 భాగల 2 కళల) కాలవ్యత్యాసమును, వరాహమిహిరుని కాలమునకును బ్రకృతమునకును 26°-2′ (26భాగల 2 కళల) కాలవ్యత్యాసమును, గర్గపరాశరాది సిద్ధాంతులకును, వరాహమిహిరునకును నడుమ 20°-0′ (20 భాగల) కాలవ్యత్యాసమును గాన్పించుచున్నది. ఆ కాలవ్యత్యాసములనుబట్టి గణితము వేసిచూచినను నాయూకాలముల వ్యత్యాసములు దక్షిణాయనకాల వ్యత్యాసములంబట్టి తేలినమొత్తములకే సరిపోవుచున్నది.

## స్వామి కన్నుపిళ్ళగారి సిద్ధాంతము.

వరాహమిహిరుఁడు క్రీ. శ. 550 సంవత్సరప్రాంతమునందుండినటుల దివాన్ బహద్దరు స్వామి కన్నుపిళ్లై గారి యభిప్రాయమైనట్టు లగపడుచున్నది. వారిసిద్ధాంతము నీ క్రిందఁ గనుఁబఱుపఁబడినరీతిఁ జెప్పియుండిరి.

" At present, Dakshinayana, or the Summer Solastice, falls on June 22, and according to Table IV C Vol. I of Indian Ephemeries, the Sun's mean longitude on 22nd June 1916, or the

71st completed day of the Indian Solar year, is 67. 8 degrees or 68. 1 degrees, if we include the equation. Now since each Nakshatra is $13\frac{1}{3}$ degrees in extent, it follows that the Sun's Nakshatra, when he has attained 67.8 degrees of longitude, is past the fifth Nakshatra and in the beginning of the Sixth or Ārdrā Nakshatra. It is a simple sum in Arithmetic, that when the Sun's Nakshatra at Dakshinayana was Āsleshārdha or Sarpārdha, i.e., the middle of Āslēsha, his longitude must have been $113\frac{1}{3}$ degrees (since the longitude of the commencement of Āslēsha Nakshatra is by Eye-Table S page 156 supra, 106° - 40' and its end 120° - 0').

We know from modern Astronomy that the movement of the precession is 50" of an arc per annum to the west, or one degree for every 72 years. Accordingly for the precession to have moved through an arc corresponding to the interval between $113\frac{1}{3}$ and $67\frac{3}{4}$ degrees i.e., $45\frac{7}{12}$ degrees, it must have taken $45\frac{7}{12} \times 72 = 547 \times 6 = 3282$ years. Roughly, according to this calculation, the Vedanga Jyotisha observation must have been made 3300 years before 1916 i.e., about 1400 B. C.

Now, supposing we had no information from Varahamihira himself as to when he lived, but only knew from his works that at Summer Solastice in his days the Sun was at 90 degrees and in Punarvasu Nakshatra, whereas now he is in Ardra Nakshatra and in 68 degrees longitude we might argue that the difference between these longitude i.e., 22 degrees multiplied by 72 i.e., 1584 would give us the number of years before 1916 A. D., when Varahamihira lived. The result would be A. D. 332 or Circa A. D. 300, whereas Varahamihira actually wrote about A. D. 550. Allowing the same proportion of error for previous Epochs, the antiquity of Vedanga Jyotisha observation noted in paragraph 10, may also have to be reduced by 250/1620 i. e., 2/13; in other words, from 3300 years to 2792 years before now i.e., from B. C. 1400 to B. C. 850. Using the precessional factor of modern Astronomy, one degree for 72 years, Mr. Tilak in his Orion, and Professor Jacobi in an article first published in a German Scientific Journal and reproduced in the Indian Antiquary for 1894 (page 158), simultaneously declared that the Vedanga Jyotisha preceeded Varahamihira's time by 1896 years, and that there was a still earlier

period when correct astronomical observations had been made in India, and that was when the Vernal Equinox was in Mrigasira Nakshatra, longitude 53°—20' instead of in Aswani, 0° degree longitude, as in Varahamihira's, and that that Epoch must have preceeded Varahamihira's own Epoch by $53\frac{1}{3} \times 72 = 160 \times 24 = 3960$ years i.e., that the observation was made, and the Veda in which it is supposed to be alluded to, was composed (not within, because writing came long after,) about B. C. 3500, i. e., 5400 years before now: this period also may have to be cut down by 2/13, 5400 years being reduced to the time of 900 or 1000 years and the Vedic antiquity brought down from B. C. 3500 to the region of B. C. 2500. The later date more nearly approximates what we might call the Philologist's Vedic Period (according to Maxmuller, Weber, Macdonnel's Indian Literature 1909, page 11 etc.) as distinguished from the astronomer's Vedic Period."$

" ప్రకృతకాలమున దక్షిణాయనము జూన్ నెల 22 తేది యారంభమగును. హైందవపంచాంగము ప్రధమసంపుటము నందలి IV. C పతకమునుబట్టి క్రీ. శ. 1916 సంవత్సరము జూన్ నెల 22 తేదీన అనఁగా హైందవ సౌరమానవత్సరము

$ Swami Kannu Pillai's Indian Ephemeria Vol. I Part I pp: 444-445

నందలి 71 నాఁడు పూర్తియగుసరికి సూర్యుని సరాసరివిషు వాంశ 67. 8° డిగ్రీలు లేక సమీకరణసహితముగ 68. 1 డిగ్రీలయి యున్నది. ప్రతినక్షత్రముయొక్క పరిమితి 13⅓ డిగ్రీలు (భాగలు) అగుటచే సూర్యుని విషువాంశ 67. 8 డిగ్రీలయినపుడు సూర్యుఁడైదునక్షత్రములనుదాటి యాఱవ నక్షత్రమగు నార్ద్రానక్షత్ర ప్రారంభమందుండియుండును. దక్షిణాయన ప్రవేశకాలమున సూర్యుఁడుండు నక్షత్రము 'ఆశ్లేషార్ధము లేక సార్పార్ధము' అనఁగా నాశ్లేషానక్షత్రమధ్యభాగమయినచో నాశ్లేషానక్షత్రము 106°-40' (106 భాగల 40 కళల) విషువాంశతోఁ బ్రారంభమయి 120° (120 భాగలు) డిగ్రీలతో నంతమగుచుండుటచే సూర్యుని విషువాంశ 113⅓° డిగ్రీలయి యుండవలయును.

నవీనఖగోళ సిద్ధాంతములనుబట్టి అయనచలనము 50'' వికళలకాలము పశ్చిమమునకు జరుగుచున్నట్లు మనము తెలిసికొనుచున్నారము. 72 సంవత్సరముల కొక డిగ్రీయగును. అదేవిధముగ 113⅓ డిగ్రీలకును 67¾ డిగ్రీలకును నడుమనుండు $45\frac{7}{12}$ డిగ్రీల వలయభాగము వెనుకకరుగుటకు $45\frac{7}{12} \times 72 = 547 \times 6 = 3282$ సంవత్సరములు పట్టును. ఈగణితపద్ధతినిఁబట్టి వేదాంగజ్యోతిషములోఁ జెప్పఁబడినకాలస్థితి క్రీ. శ. 1916 సంవత్సరమునకుఁ బూర్వము కొంచెమించుమించుగ 3300 సంవత్సరములక్రిందట ననఁగా క్రీ. పూ. 1400 సంవత్సరప్రాంతమునఁ గనిపెట్టబడియుండవలయును.

తానెపుడు జీవించియుండినది వరాహమిహిరుఁడు చెప్పి కొని యుండలేదనియు, నాయన రచించిన గ్రంథమునుబట్టి యాతనికాలమున దక్షిణాయనము సూర్యుఁడు 90 డిగ్రీల విషువాంశయందుఁ బునర్వసునక్షత్ర మందుండఁగాఁ బ్రారంభమై యుండెననిమాత్రమే మనము తెలిసికొనఁగలిగిన యెడలఁ బ్రకృతకాలమునందు సూర్యుఁడార్ద్రానక్షత్రమున 68 డిగ్రీల విషువాంశయందుండుటచే నీరెండు విషువాంశల వ్యత్యాసము 22 డిగ్రీలను 72చే హెచ్చింపఁగవచ్చిన మొత్తము 1584 మనకును i e. 1916 సంవత్సరమునకును వరాహమిహిరుని జీవితకాలమునకును మధ్యనుండు కాలవ్యత్యాససంవత్సరపరిమాణమని మనము వాదించియుందుము. దీనిఫలితము వరాహమిహిరుఁడు క్రీ. శ. 332 లేక క్రీ. శ. 300 ప్రాంతమునాఁటివాఁడని కనుపించును. కాని వరాహమిహిరుఁడు క్రీ. శ. 550 సంవత్సరమునఁ దనగ్రంథమును రచించెను. ఇంతకుఁ బూర్వకాలములయందుఁగూడ నీవ్యత్యాసమునకుఁ దగినట్లు దామాషాగాఁ దోసివుచ్చినయెడలఁ బై 10 పేరాలోఁ జెప్పఁబడిన వేదాంగజ్యోతిషము యొక్క ప్రాచీనతయందును 250/1620 (2/13) వంతు తగ్గింపవలసియుండును. దీనింబట్టి 3300 సంవవ్సరములనుండి 2792 సంవత్సరములకు ననఁగాఁ గ్రీ. పూ. 1400 సంవత్సరమునుండి 850 సంవత్సరమునకుఁ దగ్గింపవలసియుండును. నవీన ఖగోళశాస్త్రసిద్ధాంతములననుసరించి యొకడిగ్రీలకాలము 72 సంవత్సరములుగఁ బరిగణించి తిలకుపండితుఁడు ఓరి

యన్ (Orion) గ్రంథమునందును, ప్రొఫెసర్ జాకోబీపండి తుఁడు ప్రథమములోజర్మన్‌సైన్టిఫిక్ జర్నలునందునుపిమ్మట 1894సంవత్సరము ఇండియన్ ఆంటిక్వెరి 158పొరటలందునుఁ బ్రకటింపఁబడినట్టి వ్యాసమునందును, వేదాంగజ్యోతిషకాలము వరాహమిహిరునికాలమునకుఁబూర్వము 1896సంవత్సరములక్రిందట జరగియుండెనని యేకకాలమునందే చెప్పియుండిరి. మఱియు నంతకంటె హిందూదేశములో నిష్కర్షయగు ఖగోళపరిస్థితులచేఁ గనుఁగొనఁబడిన ప్రాచీనకాలమొక్కటికలదనియు, నయ్యది మహావిషువ (హరిపద) మై యుండెననియు, నయ్యది వరాహమిహిరుని కాలమునందువలె నశ్వనీ నక్షత్రము 0 (సున్న) విషువాంశయందుఁగాక మృగశీర్షానక్షత్రమున 53°-20' (53 భాగల 20 కళల) విషువాంశమందు జరగినకాలమనియు, నా కాలము వరాహమిహిరుని కాలమునకంటె 53⅓ × 72=160 × 72=3960 సంవత్సరములు ముందయియుండుననియు, నాపరిస్థితి కని పెట్టఁబడినకాలమును, జెప్పఁబడిన (వ్రాయబడిన కాలము కాదు. ఏలన వ్రాత చాలకాలముతరువాత యేర్పడెను గనుక) కాలమును క్రీ. పూ. 3500 సంవత్సరములప్రాంతమున ననఁగా నిప్పటికిఁ బూర్వము 5400 సంవత్సరముల క్రిందట నయియుండుననియుఁ జెప్పియుండిరి. ఈ కాలము నందుసైతము 2/13 వంతు తోసివేయువలసియుండును. 5400 సంవత్సరములలో 900 లేక 1000 సంవత్సరములు తగ్గించి వేదకాలప్రాచీనతను క్రీ.పూ. 3500 సంవత్సరముల

లనుండి క్రీ. పూ. 2500 సంవత్సర ప్రాంతమునకు తగ్గించి తీసికొనఁబడియుండెను. ఈ తుదివత్సరము ఖగోళసిద్ధాంతుల వేదకాలమునకు భేదించుచు శబ్దవ్యుత్పత్తి శాస్త్రవేత్తలచేఁ జెప్పఁబడు వేదకాలమునకు దాదాపు చేరువలోనున్నది. (మాక్సుముల్లరు, వీబరు, మాక్డొనల్ గార్ల హైందవవాఙ్మయము (1909) 11 పొరటనుండి చెప్పఁబడినదానినిబట్టి).[1]

స్వామి కన్నుపిళ్ళెగారును వరాహమిహిరునిచేఁ జేర్కొనఁబడిన శక కాలము క్రీ. శ. 78 సంవత్సరమునఁ బ్రారంభమయిన శాలివాహన శక కాలమనియే తలంచి క్రీ. శ. 550 సంవత్సరమున వరాహమిహిరుఁడు గ్రంథమును రచించినటుల నిర్ధారణ చేసికొని యా సిద్ధాంతమునే ధృవపఱచుటకయి గడంగినట్లులగపడుచున్నది. మఱియుఁ 'బునర్వసుతల్లి' అనఁగాఁ బునర్వసు నక్షత్ర నాలవపాద మారంభమున దక్షిణాయనము ప్రారంభమయినట్లుదీసికొని గణితముచేసియుండిరి. వీరిగణితమునుబట్టి వరాహమిహిరుఁడు క్రీ. శ. 332 సంవత్సరమునందుండినట్లు విదితమగుచున్నది. అయ్యది తాము తలంచినటులఁగాక, తమకు మార్గదర్శకులనితలంచిన పాశ్చాత్యవిద్వాంసులచేఁ దలంచినటులఁ గ్రీ. శ. ఆఱవశతాబ్దమున వరాహమిహిరుడుండెనని కావించిన సిద్ధాంతమునకుఁ బ్రతిబంధకముగనుండెను. ఇఁకఁగుతర్కములుగావింప మొదలిడిరి. వరాహమిహిరుఁడే క్రీ. శ. 550సంవత్సరమున గ్రంథమును రచియించియుండినట్లు జెప్పియుండెనఁట! ఆతనిగ్రంథమునఁ జెప్పఁబడినకాలపరిస్థితులు క్రీ. శ. 332

1 Swami Kannu Pallai's Indian Ephemeris vol. 1 Part 1 pp. 444-445.

సంవత్సరముననుండినట్లు లగపడుచున్నదఁట! ఆ భేదమాత్రని సిద్ధాంతముల ననుసరించిచేసిన గణితపద్ధతియందలి దోషము వలనఁగలిగినదఁట! ఆ దోషమునలనగలిగిన వ్యత్యాససంవత్సర ములంబట్టి వేదాంగజ్యోతిష ప్రాచీనతను, వేదకాలప్రాచీనతను దగ్గింపవలెనఁట! ఇయ్యది వారిమతమునకుఁ ప్రామాణ్యగ్రంథ మగు బైబిలునందలి ప్రాచీనతకంటె హైందవుల విజ్ఞానము, శాస్త్రపరిచయము,నాగరికత మున్నగునవి మిగులఁ బ్రాచీనము లయినట్లులగపడుటచే నద్దానినడంచి యాధునికత్వమారోపించు నుద్దేశ్యముతోఁ దమ కుతర్కవాదపటిమ నాముూలాగ్రముగ వినియోగపఱిచినట్లు లగపడకమానదు. వాల్మీకి మహర్షిచే జెప్పఁబడిన రామాయణ కథానాయకుఁడగు శ్రీరామచంద్రుని జాతకముంబట్టి శ్రీరాముని కాలనిర్ణయము గావించు పట్టునను, హైందవుల జాతకములపద్ధతిని గుఱించి చెప్పసందర్భ ముల ననుసరించియు వారి నిజాభిప్రాయము స్పష్టమగును. వాల్మీకులవారిచేఁ జెప్పఁబడిన గ్రహసంపుటి సరికాదని చూప ప్రయత్నించియుఁ గ్రీ. శ. ఆఱవశతాబ్దమువఱకు సూర్యచంద్రుల గతులుతక్కఁ దక్కిన గ్రహగతులను గుఱించి హైందవులకుఁ దెలియనే తెలియదనియు, గ్రహముల పేళ్లైనను దెలియునని చెప్పుటకు సందేహింపవలసియుండుననియుఁ గ్రీస్తు జననమునకుఁ బూర్వముజరగిన యలెగ్జాండరు దండయాత్రికాలమునందు గ్రీసు, రోము దేశములయందుఁ బ్రచారమందుండిన ఖాల్డియను జ్యోతిశ్శాస్త్రము హిందూదేశమునందుఁ బ్రవేశ

పెట్టఁబడియుండెననియు మున్నగు సంగతులను జెప్పియుండిరి.[1] ఎట్లులైననేమి శ్రీరాముని జననము క్రీ. పూ. 964 సంవత్సరమున నయియుండునని చెప్పిన శ్రీరామచంద్రమూర్తి జననకాలమునకుఁ జెప్పఁబడిన గ్రహసంపుటికి దాదాపు చేరువలోనుండుననిరి. క్రీస్తు జననమునకుఁ బూర్వము 3000 సంవత్సరము నుండి యీవలికాలమునం గ్రమముగ నా గ్రహసంపుటిగల వత్సరములేదని యిట్టి కుతర్కములు గావించుటకంటె హైందవులు శ్రీరామునిజనన మిప్పటికి దాదాపు యెన్మిదిలక్షల వత్సరముల పై కాలము క్రిందటనయియుండెనని చెప్పుచుండఁ గ్రీస్తు జననమునకుఁ బూర్వము 3000 సంవత్సరముల పై కాలములో నేవత్సరమైనను శ్రీరాముని జననకాలమును దెలియఁజేయుచుఁ జెప్పఁబడిన గ్రహసంపత్తి గలిగియుండెనేమో కనుఁగొనియుండిరా? లేదు. అట్టి ప్రయత్నములునేసి విమర్శించి నిజమును గనుఁగొనుటకుబదులు అలెగ్జాండరు హిందూదేశముమీఁదికి దండయాత్ర సలుపక పూర్వము హైందవులకు గ్రహముల నామములే తెలియవనిరి. పాశ్చాత్యుల దగ్గఱనుండి క్రీస్తుశకమునకుఁ గొలఁదికాలమావలనో లేక యీవలనో కొన్నిసంగతులను గ్రహించి వరాహమిహిరునికాలముననో లేక తరువాతికాలముననో యిట్టి గ్రహసంపత్తిని సృష్టించి గ్రంథములలో నిముడ్చియుందురనిరి. క్రైస్తవ మతప్రామాణ్యగ్రంథమగు బైబిలునుబట్టి సృష్టిక్రమము సుమారాఱువేల వత్సరములకంటెఁ బైకిఁబోవుటలేదు. అయ్యదియేవారు పరమావధిగఁదీసికొని చర్చించినట్లు లగపడు

1 Indian Ephemeries Vol, I part I paras 244 - 45 page 99 F & para 280 page 113.

చున్నది. వీరు నిష్పాక్షికభావముతో న్యాయమార్గమునఁ బరిశోధనలు సల్పిరనిగాని విమర్శనలు చేసియుండిరనిగాని చెప్పుటకవకాశముఁ గన్పించుటలేదు. హైందవప్రాచీనత, విజ్ఞాన, వైభవములు మున్నగునవన్నియుఁ గీస్తుశకారంభకాలమునకంటె నెక్కుడు ప్రాచీనతగలవికావనియుఁ బాశ్చాత్యులవలన హైందవులు వాని నేర్చుకొనియుండిరనియుఁ జూపు నుద్దేశమున నట్టి సిద్ధాంతముల నేర్పరించుటకుఁ బ్రయత్నములు సలిపియుండినట్టులగపడుచున్నది. వరాహమిహిరునిచేఁ బేర్కొనఁబడిన శకకాలము శాలివాహనశకకాలమని చెప్పుటకేమియు నాధారములఁ గనంబఱిచి యుండలేదు. వరాహమిహిరుఁడు చెప్పినవాక్యముల కపార్థములు గల్పింపక, వరాహమిహిరుఁడు పేర్కొనిన శకకాలము శాలివాహనశకకాలమని ముందుగ నిర్ధారణఁజేసికొనక ఆ శకకాలమేదియైయుండునని సక్రమముగఁ బరిశోధనలుఁగావించియుండినచో సరియైన సిద్ధాంతమునకే వచ్చియుందురని చెప్పఁదగియున్నది.

వరాహమిహిరుఁడు బృహత్సంహితయందు "సాంప్రతమయనం సవితుః కర్కటకాద్యం మృగాదితశ్చాన్యమ్" అని చెప్పియుండుటచేతను, గర్కటకరాశి పునర్వసునక్షత్ర తృతీయపాదము చివఱనుండి ప్రారంభమగుచుండుటచేతను వరాహమిహిరునికాలమునందు దక్షిణాయనము పునర్వసునక్షత్ర నాలవపాదారంభమునఁ బ్రారంభమయినటుల నెన్ని కొండఱు గణితముచేసి 90° డిగ్రీలు విషువాంశయందు దక్షిణాయన మారంభమయినట్లు జెప్పియుండిరి. దీనింబట్టి ప్రకృతకాలమున నార్ద్ర

ప్రథమపాదములో 67°-18′ (67° డిగ్రీల 18 మినిట్లు) విషువాంశయందు దక్షిణాయన ప్రవేశమైయుండెనని తేలుటచే వరాహమిహిరునికాలమునకును ప్రకృతకాలమునకును మధ్య 22°-42′ {(90°-0′)-(67°-18′)} కాలవ్యత్యాసమున్నట్టులగపడుచున్నది. 50″ వికళల వత్యాసముండిన నొకసంవత్సరము కాలవ్యవధియగుటచే 22°-42′ (యిఱువదిరెండుడిగ్రీల నలుఁబదిరెండుమినిట్లు) లేక 81720″ వికళల వ్యత్యాసముండిన కాలవ్యవధి $\frac{81720}{50}$ = 1634 సంవత్సరములగుచున్నది. ఈ సిద్ధాంతమునుబట్టి వరాహమిహిరునికాలమునకును ప్రకృతకాలమునకును నడుమ 1634 సంవత్సరములు గడచియుండెనని కాన్పించుటచే వరాహమిహిరుఁడు క్రీ. శ. 295 (1929-1634) సంవత్సరప్రాంతమునందుండినట్లు లగపడుచున్నది. ఈ కాలనిర్ణయ (వరాహమిహిరుఁడు క్రీ. శ. 295 సంవత్సరప్రాంతమునందుండినవాఁడని చెప్పుట) మితర సిద్ధాంతములలో దేనికిని సంబంధించుటలేదు. క్రీ. శ. మూఁడవశతాబ్దాంతమున శకకర్తయగు విక్రమాదిత్యుఁడను రాజు పరిపాలనమొనర్చుచుండినట్టు లగపడదు. మఱియు వరాహమిహిరునిచే పంచసిద్ధాంతికయందుఁ బేర్కొనఁబడిన శకకాలము 427 సంవత్సరమునకు సరిపోవుటలేదు. అయ్యది శాలివాహనశక ప్రశంసయనియెంచిన క్రీ. శ. 505 సంవత్సరమగుచుండెను. ఈ సిద్ధాంతమునుబట్టి వరాహమిహిరుఁడుగావించిన శకకాలప్రశంస క్రీ. పూ. 132 (427-295) సంవత్సరమున నారంభమైన వేఱొక శకకాలప్రశంసయని కాన్పించును. క్రీ. పూ.

132 సంవత్సరమున శకమొకటి ప్రారంభింపఁబడినట్లు చరిత్రాంశములవలనఁ దెలియుటలేదు.

పంచసిద్ధాంతికయందు

"శ్లో॥ ఆశ్లేషార్థాదాసీద్యదా
నివృత్తిః కిలోష్ణకిరణస్య
యుక్తమయనంతదాసీత్
సాంప్రతమయనం పునర్వసుతః॥

అని చెప్పఁబడియుండెను. "సాంప్రితమయనం పునర్వసుతః" అనిచెప్పుటచే నారెండుపాఠములనుగలిపి పునర్వసు మూఁడవ పాదము చివఱనుండియే కర్కటక మారంభమగుచున్నదిగాన పునర్వసు నాలవపాదము మొదటినుండియే దక్షిణాయన మారంభమయినట్టు లనువదించియుండిరి.

వరాహమిహిరుని బృహత్సంహితావిధానమును, బంచసిద్ధాంతకావిధానమును జక్కఁగాఁ బరిశీలించినచో జ్యోతిష సిద్ధాంతిములను బంచసిద్ధాంతికయందెక్కుడు విపులముగను, వివరముగను వర్ణించిచెప్పినట్టులగపడును. కావుననే బృహత్సంహితయందు 'కర్కటకాద్యమ్' అని చెప్పియుండియు ఎక్కుడు వివరముగ పంచసిద్ధాంతికయందు 'పునర్వసుతః' అని చెప్పియుండినట్టు లగపడుచున్నది. 'పునర్వసుతః' యన పునర్వసు మూఁడవపాదము చివఱనుండియనిగాని నాలవపాద ప్రారంభమునుండి యనిగాని భావింపఁదగియుండునా ? వరాహమిహిరుని యభిప్రాయమయ్యదియై యుండునా? అని గమనింపవలసియుం

డును. మఱియు 'కర్కటకాద్యమ్' యనిచెప్పుటచేఁ గర్కట కారంభమునుండియని యభిప్రాయమా? యను విషయమును గూడ నాలోచింపవలసియుండును.

ఆదియందనఁగా సామాన్యముగఁ బ్రథమకాలమునందని యర్థముఁ జెప్పదగియుండును. అట్టి యభిప్రాయముతోనే వరాహమిహిరుఁడు చెప్పినట్లుగ పడును. "కల్యాదానందనా మానః కేచిదాసన్ మహీంభుజః" అని చెప్పఁబడినపుడు నంద రాజు కలియుగప్రవేశకాలమైన 1500 సంవత్సరములకుఁ దరు వాతఁ బరిపాలనమొనర్చినటులఁ జెప్పుచు "కల్యాదా" యన కలియుగముప్రవేశమైన ప్రథమదినమునుండి యను భావముతో జెప్పఁబడియుండెనని యెంచఁదగునా? కాదు. ప్రథమకాలమందని చెప్పవలసియుండును. అట్టి యభిప్రాయముతోనే "కల్యాదా" యను దానియందలి "ఆది" శబ్దముపయోగించినట్లు లెంచ వలసియుండునని ప్రొఫెసర్ విల్సనుమున్నగు పాశ్చాత్యవిద్వాం సులుసైతము చెప్పియుండిరి. అటులనే "కర్కటకాద్యమ్" అనఁగాఁ గర్కటకరాశి ప్రథమభాగమందనిభావము సూచింపఁ దగియుండును.

"పునర్వసుతః" యనఁ బునర్వసు ప్రారంభమునుండి యనిగాని పునర్వసు చివఱనుండియనిగాని యర్థముఁ జెప్పఁదగి యుండునేగాని మఱి యే మధ్యభాగమునుండియనిగాని చెప్పు టకు భావ యవకాశమిచ్చుటలేదు. కర్కటకాదియందు దక్షి ణాయన మారంభమగునని వరాహమిహిరుఁడు స్పష్టముగఁ

జెప్పియుండుటచేఁ బునర్వసు ప్రారంభము కర్కాటకరాశియం దుండమిచేఁ బునర్వసు ప్రారంభమునుండి యని వరాహమిహిరుని యభిప్రాయము కానేరదనియుఁ బునర్వసు నక్షత్రమంతమునం దనఁగా నాలవపాదము చివఱనుండి యను భావముతోఁ జెప్పియుండెననియు స్పష్టముగఁ జెప్పఁదగియుండును. కావున వరాహమిహిరునికాలములో దక్షిణాయనము పునర్వసు చతుర్థ పాదాంతమున 93°—20' (93 భాగల 20 కళల) యందుఁ సూర్యుఁడు ప్రవేశింపఁగనే ప్రారంభమయినట్టు జెప్పఁదగియుండునే గాని 90° (తొంబది భాగల) యందుఁ బ్రారంభమయినదని చెప్పుట కవకాశము గాన్పింపదు.

కావున వరాహమిహిరుఁడు తన కాలమునందుండి నటులఁ జెప్పియుండిన కాలపరిస్థితులనుబట్టియే క్రీ. శ. 55 సంవత్సరప్రాంతమున నుండినటుల స్పష్టముగా గాన్పించుచున్నది. వరాహమిహిరునకు సమకాలికులని చెప్పఁబడు కాళిదాస, విక్రమాదిత్యులును ఆ కాలమునందుండినటులఁ జెప్పఁదగియున్నది.

## మహాభారతయుద్ధకాలము స్వామి కన్నుపిళ్ళగారి సిద్ధాంతము.

స్వామి కన్నుపిళ్లగారు మహాభారతయుద్ధము క్రీ. పూ. 2402 సంవత్సరప్రాంతమున జరగియుండునని సిద్ధాంతముఁ జేసియుండిరి. వీరి సిద్ధాంత మెంతవఱకంగీకారార్హమో యోచింత్రము. ఆ సందర్భమున వా రీవిధమునఁ జెప్పియుండిరి.

" 6. The date first mentioned, 3084 B. C. might seem to be a plausable date because it is only 18th year distant from the first year of Kaliyuga 3102 B. C. But in all probability the Kaliyuga of Mahabharata was not the same as the Kaliyuga (18th. February 3102 B. C.) which was devised by the astronomers of Varahamihira's time in the fifth or sixth century A. D. and which was the assumed date when all the planets were in mean longitude O. We have the Suryasidhanta as an authority for the statement (Suryasidhanta 1-57) that "at the end of the Golden Age (Tretayuga) all the planets by their mean motion, excepting, however, their nodes and apsides, are in conjunction in the O degree of longitude." What is true of the Golden age must be equally true of the beginning of the Kaliyuga, because according to the assumptions of Indian astronomy in the various siddhantas, every planet completes an integral number of revolutions between the beginning of one Yuga and the end of the same. Such was the reason why the astronomers of Varahamihira's time fixed upon the midnight between the 17th and 18th February 3102 B. C. as the date of O Kaliyuga according to Suryasidhanta, and sunrise on 18th. February 3102 B. C. as O Kaliyuga according to other siddhan-

tas. Of course these astronomers know that the Mahabharata referred to Kaliyuga as the beginning of a new order of things. But they probably thought that as the date of Mahabharata Kaliyuga was left in Vacuo, it was open to them to fill it up in any manner they pleased, provided it suited the purposes of astronomical computations. Varahamihira alone in a well known passage which he professes to quote from Garga, appears to have held a definite opinion as to the period of Yudhistara's reign, but unfortunately the Verse in which he states this opinion have been the subject of numerous and divergent interpretations. The apparent meaning is that "Yudhistara's reign preceeded the Saka Era by 2526 years", that is, that Yudhistara flourished Circa 78 minus 2526 years = 2448 B. C. This figure has been contraverted by Mr. Gopala Aiyer as well as by Mr. Vaidya, but there is one consideration in favour of it. Varahamihira, or rather his authority, says that **Sapta Rishis** were at the time in Magha Nakshatra and nobody has attempted to discover what this means. The Sapta Rishis were supposed to spend 100 years in each Nakshatra in succession. This is a pure convention, equalent to a reckoning by centuries because the ancient astronomers know very well

that the Sapta Rishis i.e., the constellation Ursa Major or Great Bear had no motion of the kind. It is exceedingly probable that the conventional motion of the Sapta Rishis through the Nakshatras was made to start like the motions of the planets, with the first Nakshatra was in all probability Krittika and not Aswani according to modein usage. The astronomers of Varahamihira's time knew that Krittika was the first Nakshatra in Vedic times, and in quoting a nakshatra for the Sapta Rishis in the reign of Yudhistara, they probably conferred to the ancient usage, rather than to their own fixation of Aswani as the first Nakshatra. If so, Magha would be the eighth Nakshatra and would mean the beginning of the eighth centuary reckoned from O Kaliyuga i.e., from 3102 B. C. This takes us to 2402 B. C. which is not very distant from 2448 B. C., the date recorded in Varahamihira's Verse."$

"6. తొల్దొల్తఁ జెప్పఁబడిన క్రీ. పూ. 3084 సంవత్సరము కలియుగారంభ సంవత్సరమగు క్రీ. పూ. 3102 సంవత్సరమునకుఁ బదునెన్మిదేఁడుల దవ్వునందుండుటచే సరియైన వత్సరమని కనుపించవచ్చును. కాని ఐఁదవ లేక ఆఱవ శతా

$ Indian Ephemeries, Vol, I Part I - Pages 482 - 83. Para 6 of appendix V.

బ్దమందలి వరాహమిహిరుని కాలమునంగల సిద్ధాంతులచేఁ గల్పింపఁబడినట్టియు, గ్రహములన్నియు మధ్యగతులనుబట్టి 0 (zero) విషువాంశయందుండునట్లు లూహింపఁబడినట్టియు, తేదీతో (క్రీ. పూ. 3102 సం. ఫిబ్రవరి 18 తేదీతో) నారంభమగు కలియుగము మహాభారత కలియుగముకాదు. స్వర్ణయుగాంతమున (త్రేతాయుగాంతమున) గ్రహములన్నియుఁ దమ నీచగతులను బట్టి 0 (సున్న) డిగ్రి విషువాంశయందుఁ గలిసియుండునని చెప్పుటకు సూర్యసిద్ధాంత మాధారము (సూర్యసిద్ధాంతము 1—57.) స్వర్ణయుగ సందర్భమున వాస్తవమయిన విషయము కలియుగ విషయమునం గూడ వాస్తవమయి యుండవలయును. ఏలన హైందవ ఖగోళశాస్త్రమునఁ బలువిధసిద్ధాంతములందుఁ గావింపఁబడిన యూహలనుబట్టి యొక యుగాదినుండి తద్యుగాంతము వఱకు బ్రతిగ్రహమును జ్యోతిశ్చక్రమునఁ గొన్నిమారులు సంపూర్ణముగఁ జుట్టి వచ్చుచున్నది. అయ్యదియే వరాహమిహిరుని కాలమందున్న ఖగోళశాస్త్రజ్ఞులు సూర్యసిద్ధాంతము ననుసరించి క్రీ. పూ. 3102 సంవ్సరము ఫిబ్రవరినెల 17-18 తేదులమధ్య అర్ధరాత్రమున కలియుగము 0 (సున్న) వత్సరమారంభమయియుండునని యు, నితర సిద్ధాంతముల ననుసరించి క్రీ. పూ. 3102 సంవత్సరము ఫిబ్రవరి 18 తేది సూర్యోదయముతోఁ గలియుగము 0 (సున్న) వత్సరము (కలియుగాది) ప్రారంభమయియుండునని యు, నిర్ణయించుటకుఁ గారణమయియుండెను. కలియుగము నూతన మా

ర్ష్ముల కారంభమని మహాభారతము చెప్పియుండెనని యూ ఖగోళశాస్త్రజ్ఞు లెఱుంగుదురు. ప్రాయశః మహాభారతము కలియుగారంభవత్సరమును నంధకారమున (శూన్యములో) విడిచిపెట్టుటచే (స్పష్టముగఁ జెప్పియుండని కారణముచే)— జ్యోతిషసిద్ధాంతములకు సరిపుచ్చుచు వారిష్టమువచ్చినరీతిగఁ బూర్తిచేయవచ్చునని వారు తలంచియుందురు. గర్గసిద్ధాంతములోనిదని యొక సుప్రసిద్ధ శ్లోకమును గ్రోడీకరించియుండుటచే వరాహమిహిరునకు యుధిష్ఠిరుని పరిపాలనా కాలమును స్పష్టముగఁ దెలిసియుండినట్లు లగపడుచున్నది. కాని యందువిషయమై క్రోడీకరించిన శ్లోకము పెక్కు భిన్నాభిప్రాయముల కాస్పదమయ్యెను. దానికి తేటయైనయర్థము "యుధిష్ఠిరుని పరిపాలనము శకకాలమునకుఁ బూర్వము 2526 సంవత్సరముల క్రిందట" నని యైయున్నది. కావున యుధిష్ఠిరుఁడు క్రీ. శ. 78 లో 2526 సంవత్సరములు తీసివేసిన వచ్చెడు క్రీ. పూ. 2448 సంవత్సరమున వర్ధిల్లియుండెను. గోపాలయ్యరుగారును వైద్యాగారును ఈ వత్సరముకాదని వాదించియుండిరి. కాని యీవత్సరమనుటకొక కారణము గలదు. ఆకాలమునందు సప్తర్షులు మఘానక్షత్రమునందుండి నట్లు వరాహమిహిరుఁడు లేక అతనిచేఁ జెప్పబడిన ప్రమాణ శ్లోకము సూచించుచున్నది. ఇయ్యది యేమయియుండునా యని కనుగొనుట కెవ్వఁడును బ్రయత్నించియుండలేదు. వరుసగ నొక్కొక్క నక్షత్రమునందు సప్తర్షులు శతవత్సరములుందురని తలంచుచుండిరి. ఇయ్యది శతాబ్దములను లెక్కించు

కొనుటకయి యేర్పఱుచుకొనిన సాంకేతికముమాత్రమైయున్నది. ఏలన, ప్రాచీనఖగోళశాస్త్రజ్ఞులు సప్తర్షులకు (Ursa Major or Great Bear ఉర్సామేజరు లేక గ్రేటుబేరునకు) అట్టిచలనమేమియులేదని స్పష్టముగ నెఱుంగుదురు. కలియుగారంభ తేదీని ప్రథమనక్షత్రమునుండి గ్రహముల చలనమారంభించి నక్షత్రములన్నింటిని జుట్టివచ్చునటులనే వానికి నట్టిసాంకేతికచలనమేర్పాటుఁజేసియుండిరనుట యెక్కువగ నమ్మఁదగియున్నది. నవీనాచారము ననుసరించి యశ్వినీ నక్షత్రముగాక కృత్తికానక్షత్రమే ప్రథమనక్షత్రమైనటుల సంభావించఁదగియున్నది. వరాహమిహిరునికాలము నందలి ఖగోళశాస్త్రజ్ఞులు వేదకాలమునఁగృత్తికానక్షత్రము ప్రథమనక్షత్రమై యుండినటు లెఱుంగుదురు. యుధిష్ఠిరుని కాలమున సప్తర్షులేనక్షత్రమునందుండినది చెప్పుటకుఁబ్రథ నక్షత్రమనితాము నిర్ధారణచేసినటు లశ్వినీనక్షత్రమునుండి గాక బహుశః ప్రాచీనపద్ధతి నవలంబించి చెప్పియుందురు. అటులేనిఁ గృత్తికనుండి ప్రారంభించిన మఘానక్షత్రమెన్మిదవనక్షత్రమగును. మఘానక్షత్రమున సప్తర్షులు ప్రవేశించిరనినఁ గలియుగము 0(సున్న)వత్సరము(క్రీ.పూ.3102 సంవత్సరము) నుండి యెనిమిది శతాబ్దములు గడచెనని భావమిచ్చుచున్నది. ఇయ్యది మనలఁ గ్రీ. పూ. 2402 సంవత్సరమునకుఁ గొంపోవుచున్నది. అయ్యది వరాహమిహిరుని

శ్లోకమునందుఁ జెప్పఁబడిన వత్సరమున కెక్కువ దూరములో లేదు." 1

స్వామికన్ను పిళ్లగారు యుధిష్ఠిరకాలనిర్ణయమును భారతయుద్ధకాలనిర్ణయమును గావించుపట్టున ప్రథమమునుండియు నెన్నియో నిరాధారములగు నూహలతో సిద్ధాంతప్రతిపాదనలకు గడంగియుండిరి. భారతమునఁ జెప్పఁబడిన గ్రహస్థితులను బట్టి కలియుగాదియగు క్రీ. పూ. 3102 సంవత్సరమునుండి యావలివత్సరములలో నేవత్సరమైన సరిపోవునేమోనని వెదకిరట! క్రీ. పూ. 3084; 1316; 1079; వత్సరములలో భారతములోఁ జెప్పఁబడినటుల గ్రహములు వక్రగతిలోనుండినవిగాని గ్రంథకర్త యావత్సరములనుగుఱించి చెప్పియుండలేదనియు, నా గ్రహగతులను భారతములో నిటీవల నెవ్వరో నిఱికించియుండిరనియు మామూలుపదముల నేకరువుబెట్టియుండిరి.†
వీరు కలియుగము క్రీ. పూ. 3102 సంవత్సరమున నారంభమయినట్లు లొప్పికొనుచున్నారు. హైందవులు కలియుగ ప్రవేశమునకుఁ బూర్వము భారతయుద్ధము జరగియుండెనని చెప్పుచుండఁగాఁ గ్రీ. పూ. 3102 సంవత్సరమునకుఁ బూర్వమందే వత్సరమందైన నాగ్రహగతుల పరిస్థితులుగల వత్సరముండు నేమోయని పరికింపక తరువాతివత్సరములలో వెదకిచూచిన యట్టి వత్సరము గాన్పించునా? కాన్పింపదు. అందులకు ముఖ్యకారణము భారతయుద్ధకాలము హైందవులు చెప్పునంతటి

1 Indian Ephemeries vol. I Part, I pp. 482-83.

† Indian Ephemeries - Vol I Parr I p. 482 Para 5,

ప్రాచీనకాలమునందు జరగియుండలేదని చూపించుటకై ముందుఁగా నిశ్చితాభిప్రాయులై యుండుటయే! అట్టి అభిప్రాయమును బలపఱుచుటకై ప్రాచీనహైందవ వాఙ్మయమున నున్న యంశములు సరిగావనియు నిటీవల నిఱికింపఁబడినవనియును చెప్పఁదలఁచిరి. జ్యోతిశ్శాస్త్రవేత్తలు చెప్పు కలియుగమును, భారతమునఁ జెప్పఁబడిన కలియుగమును నొక్కటిగాదనియు వేర్వేరనియు వీరూహించి సిద్ధాంతప్రతిపాదనలకుఁ గడంగుటను బట్టియే వీరి భావము వెల్లడియగుచున్నది. కలియుగ ప్రారంభమగు క్రీ. పూ. 3102 సంవత్సరమునకును గ్రీ. పూ. 3084 సంవత్సరమునకును బదునెన్మిదేఁడుల వ్యత్యస్తముండుటచే నది కాఁజాలదఁట! జ్యోతిశ్శాస్త్రవేత్తలచేఁ జెప్పబడిన కలియుగము భారతమునఁ జెప్పఁబడిన కలియుగముగాదని వీ రూహించుటకు గల యాధారము లేమిటో చెప్పినవారు కారు. జ్యోతిశ్శాస్త్రవేత్తలు నిర్ధారణఁ జేసిన కలియుగము గ్రహములన్నియు 0 (సున్న) నీచవిషువాంశ యందున్నపు డారంభమైనటుల నెంచిరఁట! వీని కాధారముల గనంబఱచినవారు కారు. ఆకాశపంచాంగ మొకదాని బరికల్పించి నమ్మవలసినదనుచున్నారు. స్వర్ణయుగాంతమున గ్రహములన్నియుఁ దన నీచగతులనుబట్టి 0 (సున్న) డిగ్రి విషువాంశ యందుండెనని సూర్యసిద్ధాంతము చెప్పుచున్నదనియు, త్రేతాయుగాంతమున గ్రహములన్నియు 0 (సున్న) డిగ్రి విషువాంశ యందుండిన విషయము వాస్తవమైన—వీరి మతమద్దికాదని స్ఫురితము—కలియుగారంభములోఁగూడ నట్లుండుట వాస్తవమఁట! ఇది వీరియూహ. ఆ కారణమువలననే సూర్యసిద్ధాంతము

ననుసరించి శాస్త్రవేత్తలు కలియుగము క్రీ. పూ. 3102 సంవత్సరము ఫిబ్రవరినెల 17–18 తేదులనడుమ నర్ధరాత్రిమున ప్రారంభమయియుండునని చెప్పియుందురఁట! తదితర సిద్ధాంత వేత్తలు 18 తేది సూర్యోదయముతో నారంభమయ్యెనని చెప్పిరఁట! ఇయ్యవి మొదటియూహనుండి పుట్టిన చిల్లరయూహలు! కలియుగప్రారంభ కాలమును గ్రహగతులనుబట్టి చెప్పుటకు శ్రమపడిన జ్యోతిశ్శాస్త్రవేత్త లావిషయములంగూడ స్పష్టముగఁ జెప్పకుందురా! త్రేతాయుగాంతమున గ్రహములన్నియు మధ్య గతులను బట్టి 0 (సున్న) విషువాంశయందుండెనని చెప్పిన సిద్ధాంతులు ద్వాపరయుగాంతరమునఁగూడ గ్రహములన్నియు నట్లేయుండిన ఏలఁజెప్పకుందురు? అటులఁ జెప్పకుండుటనుబట్టి యే యట్టిస్థితి ద్వాపరయుగాంతమునఁ గలిగియుండలేదనిగాని, కలుగదనిగాని స్పష్టముగ స్ఫురించుచున్నది. గ్రహములన్నియుఁ బ్రతి యుగాంతమందును అట్టులోకేయంశయందుండునని గ్రంథ కర్తయొక్క యుద్దేశ్యమైనట్లే చెప్పక త్రేతాయుగాంతమున మాత్రము గ్రహములన్నియుఁ దమ నీచగతులనుబట్టి 0 (సున్న) విషువాంశయందుండెనని యేలఁ బ్రత్యేకించి చెప్పును? దీనిం బట్టియే గ్రంథకర్తయుద్దేశ్య మయ్యదికాదనియు, లేదా, గ్రంథ కర్త త్రేతాయుగాంతపుఁ బరిస్థితుల నెఱింగినవాఁడై ద్వాపర యుగాదిలోనుండినవాఁడయి యుండవలెననియుఁ జెప్పఁదగియుండును. అటులఁ గాదనిన బ్రతియుగాంతమందును గ్రహములన్నియుఁ దమ నీచగతులను బట్టి (సున్న) 0 డిగ్రి విషువాంశయందుండునను నభిప్రాయముగలవాఁడు కాఁడనియు స్పష్టముగఁ

జెప్పఁదగియుండును. అట్టియభిప్రాయమే గ్రంథకర్తకుఁ గలిగి యుండిన స్పష్టముగ నావిధముగఁ జెప్పియుండునేగాని త్రేతా యుగాంతమున నట్టి పరిస్థితులు గలిగియుండెనని ప్రత్యేకించి చెప్పవలసిన యగత్యము గన్పట్టదు. మఱియుఁ బ్రతియుగము నకుంగల పరిమాణవత్సరములసంఖ్య భేదముగనే చెప్పఁబడి యుండెను.

ఒక్కొకగ్రహము 0 (సున్న) డిగ్రి విషువాంశనుండి క్రాంతివృత్తమును జుట్టివచ్చుటకుఁ బెక్కువత్సరములుపట్టును. ఆ యా గ్రహగతులనుబట్టి యొకమారుచుట్టివచ్చు వత్సరముల సంఖ్యలలో భేదములుండును. ఒక్కొకగ్రహ మొకమారు క్రాంతివృత్తము జుట్టివచ్చుకాలమున కా గ్రహయుగమని పే ర్కొనుచున్నారు.

ఇటులనే కుజయుగము 355 సంవత్సరములనియు
బృహస్పతియుగము 344 సంవత్సరములనియు
బుధయుగము 363 సంవత్సరములనియు
శుక్రయుగము 235 సంవత్సరములనియు
శనియుగము 383 సంవత్సరములనియు

మన పిళ్లగారే చెప్పియుండిరి.§ గ్రహములన్నియుఁ దొలుత 0 డిగ్రీయందుఁ బ్రారంభించి తిరిగి యన్నియు 0 డిగ్రియందుఁ జేరుట కెన్నివత్సరములోపట్టును. అట్టు లిదివఱకెన్ని మాఱులోఁ దిరిగియుండెను. అయ్యది గణితముచే నెఱుంగదగినవిషయము.

§ His Indian Ephemeries Vol; I Part I Page 128 - (1922 Ed.)

త్రేతాయుగాంతమున గ్రహములన్నియుఁ దమ నీచగతులను బట్టి 0 విషువాంశయందుండెనని చెప్పఁబడియుండగా నట్టి స్థితి యిదివఱ కెంతకాలముక్రిందట గలిగియుండినట్టు లగపడుచున్న దో వీరిఁగల జ్యోతిషసిద్ధాంత గణితశాస్త్ర పరిజ్ఞానముచేఁ జూచియుండిరా? లేదు. అట్లు గావించిన ప్రాచీనహైందవచరిత్ర మతిపురాతనకాలమునకుంబోవును. కలియుగ ప్రవేశమునకుఁ బూర్వము 37 సంవత్సరములక్రిందట భారతయుద్ధము జరగి యుండినటులఁ జెప్పఁబడుచుండ, కలియుగము క్రీ. పూ. 3102 సంవత్సరములనుండి ప్రారంభమయ్యెనని చెప్పుచు భారతయుద్ధ కాలమునందుండినట్టు చెప్పఁబడిన గ్రహసంపుటికై యీావలికా లమున నన్వేషించిన నేమిప్రయోజనము? గణితముచేఁ గనుఁ గొనుటకు నియమములేర్పడియుండఁగా నట్టినియమముల ననుస రించి గణితముసేసి వాస్తవమారయుటకు బ్రయత్నింపక నొక యుగాంతమునం దట్లుజరగియుండినఁ గలియుగారంభమునగూడ నట్లే జరగియుండవలెనని యూహించి భారతమునఁ బ్రశంసింపఁ బడిన కలియుగారంభకాలమును, సిద్ధాంతవేత్తలచేఁ జెప్పఁబడు కలియుగ ప్రారంభకాలమును వేర్వేరనితలఁచి భారతయుద్ధ కాలనిర్ణయమునకుఁ గడంగియుండిరి. తాము నిర్ధారణసేయుదలం చిన భారతయుద్ధకాలమునందున్నట్లు చెప్పఁబడిన గ్రహస్థితులు ప్రతిబంధకముగ నుండుటచేనయ్యవి యిటీవలికాలముననిముడ్చి రనియు, సరిగాలేవనియు త్రోసివైచినట్లు గన్పట్టుచున్నది.

వరాహమిహిరునిశ్లోకమునఁ బ్రస్తావింపఁబడిన శక కాలము శాలివాహనశకమని సిద్ధాంతముఁ గావించుకొని

క్రీ. పూ 2448 సంవత్సరమున యుధిష్ఠిరుని పరిపాలనాకాల మైయుండునని వరాహమిహిరుఁ డభిప్రాయ పడియుండెననియు, సప్తర్షులు మఘానక్షత్రమునం దుండినట్లు చెప్పఁబడిన విషయములం గమనింపకయే యట్టియభిప్రాయమును వెలిబుచ్చి యుండినట్లు నిర్ధారణచేసుకొని పిళ్లగారీసిద్ధాంతప్రతిపాదనకుఁ గడంగినట్లు లగపడుచున్నది. యుధిష్ఠిరుఁడు పరిపాలనం బొనర్చుకాలమున సప్తర్షులు మఘానక్షత్రమునం దుండినట్లుచెప్పుచు, యుధిష్ఠిరుని పరిపాలనాకాలమునకును శకకాలమునకును, మధ్యగల కాలవ్యవధి 2526 సంవత్సరములని చెప్పిన వరాహమిహిరుఁడు గాని తదితరులుగాని యద్దాని గమనింపలేదనుట సమంజసమా? లేక వరాహమిహిరునిభావమును మన పిళ్లగారు గ్రహింపలేకుండిరనుట సమంజసమా? సప్తర్షులు మఘానక్షత్రమందుండిరని చెప్పినవిషయమును గనుఁగొనుట కెవ్వఁడును బ్రయత్నించి యుండలేదఁట! సప్తర్షిమండలమునకుఁ దక్కినగ్రహములకువలె చలనములేనట్లు ప్రాచీనహైందవులకు స్పష్టముగఁ దెలియునఁట! శతాబ్దముల కాలగణితమునకై హైందవసిద్ధాంతులు సాంకేతికముగ నేర్పఱచుకొని యుండిరఁట! గ్రహగతులనుబట్టి కాలభేదములఁ దెలిసికొనుట కవకాశముండినట్లు ప్రాచీనహైందవు లెఱుంగుదురని సూచించినందులకేని హైందవులు సంతసింపవలసి యుండును. చలనములేని సప్తర్షిమండలమును గాలగణితమునకు సాంకేతికముగ నేర్పాటుఁజేసికొనిన నేమిప్రయోజనమని ప్రాచీన హైందవసిద్ధాంతులట్లు గావించియుండిరో కారణములఁ జెప్పిన వారు కారు. పురాణములయందును, గలియుగ రాజవృత్తాం

తాది ప్రాచీన హైందవవాఙ్మయమునందును సప్తర్షులు వేర్వేరు కాలములందు వెవ్వేరు నక్షత్రములందుండినట్లు జెప్పఁబడి యున్నది. వానిని వీరు గమనించినట్టు లగపడదు. వీరూహించి చెప్పినట్లు సప్తర్షి మండలమునకుఁ జలనముండినట్లు ప్రాచీన హైందవ శాస్త్రజ్ఞు లెఱుంగకుండిన చరిత్రాంశముల కాలనిర్ణయమును దెలియఁజేయు సందర్భమున వెవ్వేరుకాలములలో వెవ్వేరు నక్షత్రములందు సప్తర్షులుండినటులఁ జెప్పుటయే సంభవింపదు. వీరి యూహానుబట్టి సప్తర్షి మండలమునకుఁ జలనము లేదని ప్రాచీన హైందవసిద్ధాంతు లెఱుంగుదురనితలంచినను ఒక్కొక్క నక్షత్ర మొక శతాబ్దకాలమువఱకు సప్తర్షి మండలమునకు దగ్గఱగ నొక నిర్ణీతస్థానమునఁ గన్పట్టుచుండుననియు, నాకారణమున సప్తర్షులానక్షత్రమందుండినట్లు సాంకేతిక మేర్పఱుచుకొని యుందురనియు స్పష్టముగఁ జెప్పవలసియుండును. సప్తర్షిమండలముండు నక్షత్రమును, ఆ నక్షత్రమున సప్తర్షి మండలముండునని చెప్పఁబడిన వత్సరములకాలపరిమితియు సక్రమముగ లేవని మన పిళ్ళగారు చెప్పుటలేదు. వారి వాదమదియని కానిపించుటలేదు. సప్తర్షి మండలమునకు స్వతస్సిద్ధముగఁ జలనముండెనని ప్రాచీన హైందవులెఱింగియుండి సప్తర్షియుగ ప్రశంసచేసియుందురనితలంచినను లేక నక్షత్రచలనములఁబట్టి యొక్కొక్క నక్షత్రము ప్రతి దినము నొక శతాబ్దకాలపర్యంతము సప్తర్షిమండలమునకు సమముగ నొక నిర్ణీతస్థానమునఁ గన్పట్టుచుండుననియు నా కారణమున సప్తర్షిమండల మానక్షత్రమందుండునని సాంకేతికముగ సప్తర్షి యుగ ప్రశంసచేసియుందురనియుఁ దలంచినను, ప్రాచీన

హైందవ గ్రంథకర్తలచేఁ జెప్పఁబడిన సప్తర్షియుగ ప్రశంసనుబట్టి కాలనిర్ణయములకుఁ గడంగిన నెట్టి ప్రతిబంధకమును గన్పట్టదు.

ప్రాచీనహైందవ గ్రంథకర్తలు ప్రాచీన చరిత్రాంశముల కాలముల నెఱుంగుటకై యీ సప్తర్షిమండలచలనము ననుసరించి లేక పిళ్ళగారూహించినట్లు సప్తర్షిమండల సాంకేతికయుగ ప్రశంసనుబట్టి కొన్ని గుఱుతుల నిచ్చియుండిరి. యుధిష్ఠిరుని రాజ్యకాలమున సప్తర్షులు మఘానక్షత్రమునందుండిరనియు, మఘానక్షత్రమునందుండిన శతవత్సరములకు యుధిష్ఠిరశతమనియుఁ గలియుగము ప్రవేశించి యిఱువదియైదు వత్సరములు గడచిన పిమ్మట ఆశ్లేషానక్షత్రమునకు వచ్చియుండిరనియు, నక్కాలమున యుధిష్ఠిరుఁడు స్వర్గారోహణుఁడయ్యెననియు, నదిమొదలు యుధిష్ఠిర జ్ఞాపకార్థము లౌకికాబ్ద మేర్పాటుకాఁబడియుండెననియు, నిఱువదేడవ యాంధ్రరాజు పరిపాలనాకాలమున మరల నాశ్లేషానక్షత్రమునఁ బ్రవేశించిరనియు, నందభూపతి రాజ్యకాలమున శ్రవణానక్షత్రమునందుండిరనియు, నాంధ్రరాజుల రాజ్యారంభకాలమున కిఱువదినాల్గవ నక్షత్రమునందురనియుఁ బునర్వసునక్షత్రమునకు రెండవమారువచ్చినప్పుడు గుప్తవంశమువారి రాజ్యము దీనగతిఁజెందుననియు నున్నగు విషయములెన్నియో చెప్పఁబడియున్నవి. సప్తర్షిమండలమునకుఁ జలనము లేదనిగాని—సప్తర్షిమండల సాంకేతికయుగ గణితమువలనఁ బ్రయోజనము లేదనిగాని—ప్రాచీనహైందవ గ్రంథకర్తలును, సిద్ధాంతవేత్తలును దలంచియుండిన కాలనిర్ణయమును గావించుపట్టున పనిలేక, ప్రాలుమాలి కాకులలెక్కవేసి యుండిరందుమా? లేక దాని

భావమును గ్రహించుకొనఁజాలక మనము కాకులలెక్క గణిత ముచే నాకాశపంచాంగమును గుణించుటకు సాహసించుచుంటి మందుమా? వీరి వాదమునందు మనము గమనింపవలసినవిషయ మింకొకటికలదు.

వేదకాలమునందుఁ గృత్తికానక్షత్రము ప్రాథమికనక్షత్ర ముగ హైందవులు పరిగణించినట్లు వరాహమిహిరునికాలము నందలి సిద్ధాంతవేత్త లెఱుంగుదురఁట! వేదకాలమునందు జ్యో తిషసిద్ధాంతములకుఁ గృత్తికానక్షత్రమును బ్రథమనక్షత్రముగ హైందవు లెంచియుండిరనుట యింకొకయూహ! వేదములు మున్నగువానియందు యజ్ఞయాగాది క్రతువుల నాచరింప నా రంభింపవలసినకాలములను, అట్టివాని నాచరించుటకు ప్రాముఖ్య మగునక్షత్రములను జెప్పుసందర్భమున నక్షత్రములన్నిటియందు గృత్తికానక్షత్రమునకుఁ బ్రాముఖ్యతనిచ్చి ప్రథమస్థానమిచ్చి యుండినట్టు లగపడునేగాని జ్యోతిషసిద్ధాంతములకుఁ బ్రథమ స్థాన మివ్వఁబడియుండినట్టు లగపడదు.

వేదకాలమునందు గృత్తికానక్షత్రము ప్రథమనక్షత్రము గాఁ బరిగణింపఁబడియుండినట్లు వరాహమిహిరుని కాలమునం దలి సిద్ధాంతవేత్తలు గుర్తెఱిఁగియే ప్రాచీనపద్ధతిననుసరించి సప్త ర్షిమండలమును గృత్తికానక్షత్రమునుండిలెక్కించి యుధిష్ఠిరుని పరిపాలనాకాలమున మఘానక్షత్రమునందుండెనని చెప్పియుండి రనుట స్వామికన్ను పిళ్ళెగారి మఱియొక నిరాధారమగు నూహ. ఆయూహ నాధారముజేసికొని కృత్తికానక్షత్రము

నుండి లెక్కించినచో మఘానక్షత్ర మెనిమిదవనక్షత్రమగుచున్న దనియు, నొక్కొకనక్షత్ర మొక్కొకశతాబ్ద కాలమైయుండు టచే యుధిష్ఠిరుని కాలము కలియుగారంభమునకు దరువాత యేడువందల సంవత్సరములకుఁబిదప నగుననియుఁ, గలియుగము క్రీ. పూ. 3102 సంవత్సరమునఁ బ్రారంభమగుటచే యుధిష్ఠిరుని పరిపాలనాకాలము క్రీ. పూ. 2402 (3102–700) సంవత్సర ప్రాంతమున నై యుండుననియుఁ జెప్పియుండిరి. మహాభారతయుద్ధకాలము క్రీ. పూ. 2402 సంవత్సర ప్రాంతమున నై యుండునను భావమును గనంబఱచియుండిరి. వీరు ముందుగా నిర్ధారణచేసికొనిన సంవత్సరమునకు భారతయుద్ధకాలమును సరిపుచ్చుటకై నిరాధారములగునూహలను గల్పించుకొనియుండిరి. తక్కిన గ్రహములవలె సప్తర్షిమండలము సామాన్యగతిని ముందుకు నడువక చిత్రముగ వెనుకకునడచుచుండునని హైందవ సిద్ధాంతులు జెప్పియుండిరి. సప్తర్షిమండలము వెనుకకునడచుచుండునట్లు హైందవుల సిద్ధాంతమయియుండెనని పాశ్చాత్య సిద్ధాంతులుసైత మంగీకరించియుండిరి. సప్తర్షిమండల చలనమునుగుఱించి కర్నల్ విల్ఫర్డు (Col. Wilford) పండితుఁడు,

"The Hindus have thought proper to connect their chronology with an astronomical period of a most strange nature. It is that of Seven Rishis or Seven Stars of the Wain, which are supposed to go through the Zodaic in a retrograde motion in the space of 2700 years." $

$ Vide- Asiatic Researches- Vol. IX. p. 83.

"హైందవులు తమచరిత్రాంశముల కాలముల సత్యాద్భుతమైన జ్యోతిషసిద్ధాంతసంబధమగు యుగముతో సంధించి చెప్పుట (సంబంధము కలుగఁజేసి చెప్పుట) యుక్తమనితలంచియుండిరి. అయ్యది, 2700 సంవత్సరముల కాలపరిమితితోఁ గ్రాంతి వృత్తమును (జ్యోతిశ్చక్రమును) వెనుకనడకతోఁ జుట్టివచ్చునను సప్తర్షులు లేక సప్తర్షి నక్షత్రములచలనముతో సంబంధము కలుగఁజేయుటయే యైయున్నది."

అని చెప్పియుండెను.

ఇట్టిస్థితిలో పిళ్లెగారి వాదమునను సరించి, కృత్తికానక్షత్రము ప్రథమనక్షత్రమని ప్రాచీనసిద్ధాంతులెంచి, యుధిష్ఠిరుని రాజ్యకాలమున మఘానక్షత్రమునందు సప్తర్షులుండిరని చెప్పియుండినట్లు లెంచినను, సప్తర్షులు వెనుకకునడచుచు జ్యోతిశ్చక్రమును జుట్టివచ్చుచుందురని వారిచేతనే చెప్పఁబడియుండినందునఁ గృత్తిక మొదలు మఘానక్షత్రమిఱువదియొకటవ(21)నక్షత్రమగుచున్నది. ఇఱువదియొక్క నక్షత్రమును జుట్టివచ్చుటకు 2100 సంవత్సరముల కాలముపట్టునుగదా! కావున వీరివాదము ననుసరించి కలియుగాదిని గృత్తికానక్షత్రము ప్రథమనక్షత్రమైయుండిన యుధిష్ఠిరుని పరిపాలనాకాలము కలియుగారంభమైన పిమ్మట 2100 సంవత్సరములకగునని చెప్పవలసివచ్చును. అయ్యది క్రీ. పూ. 1002 (3102–2100) సంవత్సరము కావలసియుండును. దీనింబట్టి స్వామికన్ను పిళ్లగారిచే సూచింపఁబడిన మహాభారతయుద్ధ కాలనిర్ణయము, కలియుగకాలనిర్ణయము, యుధిష్ఠిరుని పరిపాలనాకాలనిర్ణయము సరియైనట్లు లగపడుటలేదు.

సరికాదనియే చెప్పఁగగియుండును. ప్రాచీనహైందవసిద్ధాంతు లీసప్తర్షియుగము నొక సాంకేతికయుగముగానెంచి యుధిష్ఠిరుని రాజ్యకాలమున సప్తర్షులు మఘానక్షత్రమునందుండినట్లు చెప్పి యుండిరని దలంచినను పిళ్లగారు తాము సిద్ధాంతముసేయుకాలమున నట్టి ప్రాచీనహైందవసిద్ధాంతముల ననుసరించి సప్తర్షులేనక్షత్రమునందుండిరో కనుఁగొనియుండిరా? దానింబట్టి కాలనిర్ణయముసేయఁ గడంగియుండిరా? లేదు. అట్టి పరిశీలనాపద్ధతి నవలంబించిచూచినచోఁ దా మనుకొనినట్లు యుధిష్ఠిరరాజ్యపాలనము, మహాభారత యుద్ధకాలము క్రీ. పూ. 24 వ శతాబ్దమునకుం దీసికొనివచ్చుటకవకాశముండనేరదని యెంచి యట్టి సక్రమ పరిశీలనావిధానమునకుఁ గడంగక ప్రాచీనహైందవ జ్యోతిషసిద్ధాంతముల బైపైనస్పృశించి నిరాధారమగు నూహా తరంగములలో మునిఁగితేలుచు గగనాంతరసౌధము బ్రవేశించి యాకాశపంచాంగము చేఁబూని కాలనిర్ణయమునకు గడంగి నటు లగపడుచున్నది.

## జ్యోతిషసిద్ధాంతములకుఁ గృత్తికానక్షత్రము ప్రథమ నక్షత్రమా?

కృత్తికానక్షత్రము నక్షత్రములన్నింటియందును బ్రథమ నక్షత్రమని ప్రాచీనహైందవులు జ్యోతిషసిద్ధాంతములకుంగూడఁ బరిగణించియుండిరని కొందఱితరచరిత్రకారులును భ్రాంతిపడినట్టు లగపడుచున్నది. స్వామికన్ను పిళ్లగారును వారి మార్గమునే బట్టినట్టు లఁగపడును. నక్షత్రములన్నింటియందుఁ గృత్తి

కానక్షత్రమని వేదములు మున్నగువానియం దెట్లుజెప్పఁబడి యుండెనో యోజించినట్టులగపడదు. తైత్తిరీయ బ్రాహ్మణమున నక్షత్రములలోఁ గృత్తికానక్షత్రమునకుఁ బ్రథమస్థానమీఁబడినందున వేదకాలమునఁ గృత్తికానక్షత్రము ప్రథమనక్షత్రముగ జ్యోతిషసిద్ధాంతములకుఁ బరిగణింపఁబడియుండినట్లు గోపాలయ్యరుగారు చెప్పియుండిరి. వారు సాక్ష్యముగాఁ గనఁబఱచిన భాగము లట్టియూహకవకాశ మేమాత్రము నిచ్చుటలేదు. తైత్తిరీయ బ్రాహ్మణమున

"కృత్తికాస్వగ్ని మా దధీత । ఏతద్వా అగ్నేర్నక్షత్రమ్। యత్ కృత్తికాః । స్వాయామేవైనం దేవతాయామాధాయ । బ్రహ్మవర్చసీభవతి । ముఖంవా ఏతన్నక్షత్రాణామ్ । యత్ కృత్తికాః । యఃకృత్తికాస్వగ్నిమాధత్తే ముఖ్యఏవభవతి । అథోఖలు॥"*

"అగ్నిర్వా అకామయత । అన్నాదోదేవానాం స్యామితి । స ఏతమగ్నయే కృత్తికాభ్యః పురోడాశమష్టా కపాలం నిర్వపేత్॥"†

అని చెప్పఁబడియున్నది. ఇటులనే మఱికొన్ని తావులలో

"అగ్నిర్నః పాతుకృత్తికాః"; "అగ్నయేస్వాహా"; "కృత్తికాభ్యఃస్వాహా"; "అగ్నిరగ్నే ప్రథమోదేవతానామ్"; "అగ్నిః ప్రథమః ప్రాశ్నాతు"; "అగ్నిర్ముఖం ప్రథ

* తై. బ్రా. I. 1-2-1.
† తై. బ్రా. III. 1-4.

మో దేవతానామ్"; "అగ్నిర్యజ్ఞం త్రివృతం సప్తతం
తుమ్"; అగ్ని రైతు ప్రథమో దేవతానామ్";

అనియుఁ జెప్పబడియున్నది. వీని నన్నింటినిబట్టిచూచిన వేద విహితకర్మల నాచరించుపట్టునను, యజ్ఞ యాగాదిక్రతువుల నాచ రించునప్పుడును, అగ్నియందు హోమముసేయుటయే ప్రాము ఖ్యముగ నెన్నఁబడియుండుటచే నా యా ఖర్మలకు నగ్ని దేవుని ముఖ్యదైవతముగ నెంచి యగ్ని దేవుఁడధిపతిగానుండిన కృత్తికా నక్షత్ర మట్టికర్మలనాచరించుపట్టున ప్రధాననక్షత్రముగ నెంచి యుండినట్లు లగపడుచున్నదిగాని జ్యోతిశ్శాస్త్రసిద్ధాంత నిరూ పణలయందుఁ గృత్తికానక్షత్రము ప్రథమనక్షత్రముగఁ బరిగణిం పఁబడియుండినట్లు లగపడదు. గర్గసంహితయందు సైతము

"తేషాంచ సర్వేషాం నక్షత్రాణాం కర్మసుకృత్తికాః ప్రథ మాచక్షతే । శ్రవిష్ఠాతుసంఖ్యాయాః పూర్వాలగ్నా నామ్ । అనూరాధం పశ్చిమమ్ । విద్యానాం రోహిణీ సర్వనక్షత్రాణామ్ । మఖాఃసౌర్యాణామ్ । భోగ్యానాం చాఽర్యమా॥"

యని చెప్పఁబడియున్నది. దీనింబట్టి వేర్వేరుకార్యములయందు వేదవిహితకర్మల నాచరించుపట్టున వేర్వేరు నక్షత్రములకుఁ బ్రథమస్థానముల నేర్పాటుసేసియుండినట్లు లగపడుచున్నది. ఆ కారణముచే నాయానక్షత్రములు జ్యోతిషసిద్ధాంతగణితముల కా యా కాలములయందుఁ బ్రథమనక్షత్రములుగఁ బరిగణింపఁ బడుచుండినట్లు లూహించుటకెంతమాత్ర మవకాశముండ నేరదు.

## తిలకుపండితుని సిద్ధాంతము.

శ్రీబాలగంగాధర తిలకు పండితుఁడను మహాభారత యుద్ధకాలమున మహావిషువము లేక మేషాయనము కృత్తికా నక్షత్రమున సూర్యుఁడుప్రవేశింపఁ బ్రారంభమయినట్టు లభిప్రాయపడి మహాభారతయుద్ధము క్రీస్తుజననమునకుఁబూర్వము పదునాల్గవశతాబ్దము లోజరగియుండునని సూచించియుండెను. మహాభారత మను శాసనీకపర్వములో శ్రాద్ధకర్మలు, దానధర్మములు మున్నగునవి యేయేకాలములందుఁ గావించిన నెక్కుడుఫలితముకలుగునో చెప్పెడుసందర్భమున సంక్రమణకాలములం గావించిన నెక్కుడుఫలితము కలుగునని చెప్పఁబడియుండుటచే వాని నాధారముఁజేసికొని మహాభారతకాలమునందు మేషాయనము కృత్తికానక్షత్రమునఁ బ్రారంభమయ్యెనని యభిప్రాయపడినట్టు లగపడుచున్నది. విశ్వామిత్రుఁడు త్రిశంకునికొఱకు ప్రతిసృష్టిఁగావించినట్లును శ్రవణానక్షత్రమునుండి నక్షత్రములను సృష్టించినట్లును మహాభారత మాదిపర్వతమునందు శకుంతలోపాఖ్యానముం జెప్పుసందర్భమునఁ జెప్పఁబడియుండుటచేతను, అశ్వమేధపర్వమునందు సృష్టిక్రమమును, బ్రారంభమును బేర్కొనఁబడియుండుటచేతను మహాభారతకాలమున నుత్తరాయనము శ్రవణానక్షత్రమునకు సూర్యుఁడువచ్చినపుడు ప్రారంభమయినట్టు లభిప్రాయపడి మహాభారతము క్రీస్తుశకమునకుఁబూర్వమొదవశతాబ్దములో వ్రాయబడినట్లును జెప్పియుండిరి. ‡ వీరు

‡ గీతారహస్యము 556-557 పొరటలు.

వేదాంగజ్యోతిషకాలము క్రీ. పూ. 1400 సంవత్సరముల క్రిందటనై యుండునని సూచించియుండిరి. వేదాంగజ్యోతిషకాలమునందు సూర్యుఁడు ధనిష్ఠానక్షత్రమునఁ బ్రవేశించుకాలమున నుత్తరాయన మారంభమయినట్లు జెప్పఁబడియుండెననియు, భారతకాలమున శ్రవణానక్షత్రమున సూర్యుఁడు ప్రవేశించునప్పుడుత్తరాయన మారంభమయ్యుండెననియు నా రెండుకాలములనడుమ నయనచలనముంబట్టి యొక నక్షత్రకాలము (13 భాగల 20 కళలు—అనఁగా 13 డిగ్రీల 20 మినిట్ల కాలము) కాలవ్యత్యాసము కలిగియుండెననియు, నయనచలనమునుబట్టి సంవత్సరమునకు 50 వికళల (సెకండ్ల) వ్యత్యాసము గలుగుచుండుటచే 13°—20′కాలము 960 సంవత్సరములు కాలవ్యత్యాసమగుననియు నయ్యది వేదాంగజ్యోతిషకాలమునకును మహాభారతకాలమునకును మధ్యఁగల కాలవ్యత్యాసమయియుండుననియుఁ గావున మహాభారతకాలము క్రి. పూ. 440 (1400—960) సంవత్సరములై యుండుననియు ననఁగా మహాభారతము శాలివాహనశకకాలమునకుఁ బూర్వము షుమారైదుశతాబ్దములక్రిందటఁ బుట్టియుండుననియుఁ దిలకు మహాశయుఁడు చెప్పియుండెను. వీరి సిద్ధాంతము లెంతవఱకంగీకార్యములో కనుఁగొందము.

మహాభారత మాదిపర్వమునందు శకుంతలోపాఖ్యానము చెప్పుసందర్భమున నీ క్రిందిశ్లోకములు చెప్పఁబడియున్నవి.

"శ్లో॥ మహాతేజాః స భగవాన్

స్థ దైవచ మహాతపాః

కోపనశ్చ తథాహ్యేనం
జానాతి భగవానపి॥ 27

* * * *

శ్లో॥ చకారన్యంచ లోకం వై
క్రుద్ధో నక్షత్ర సంపదా ।
ప్రతిశ్రవణ పూర్వాణి
నక్షత్రాణి చకారయః॥"* 43

ఈ శ్లోకములఁబట్టి మహా తేజశ్శాలియు, మహా తపోసంపన్నుండును, గోధ్రోద్రేకమానసుండునగు విశ్వామిత్రుఁడు సృష్టికిఁబ్రతిసృష్టిఁ గావించియుండెననియు, శ్రవణానక్షత్రము మొదలు నక్షత్రసాంప్రదాయమును సృష్టించియుండెననియు బోధపడుచున్నది. సృష్టిప్రారంభమునుగుఱించి సృష్టికర్తయగు బ్రహ్మచెప్పినట్లు మహాభారత మశ్వమేధపర్వమునం దీశ్లోకములు చెప్పఁబడియున్నవి.

"బ్రహ్మోవాచ

శ్లో॥ యదాదిమధ్య పర్యంతం
గ్రహణోపాయమేవచ ।
నామలక్షణ సంయుక్తం
సర్వం వక్ష్యామితత్వతః॥ ౧
అహఃపూర్వం తతోరాత్రిః
మాసాః శుక్లాదయః స్మృతాః ।

* మహాభారతము - ఆదిపర్వము. 7 అధ్యా.)

శ్రవణాదీని ఋక్షాణి
ఋతవః శిశిరాదయః ॥ ౭

ఈ శ్లోకములననుసరించి, యాదిమధ్యాంతములు గల వాని నాదిమధ్యాంతములఁ గూర్చియు, వాని నామలక్షణముల గుఱించియు వాస్తవము నెఱుకపఱచెదననియుఁ దొల్తొల్తఁబగలు (Day time) కలిగెననియుఁ దరువాత రాత్రికాలము (Night time) కలిగెననియు, మాసారంభమునకు శుక్లపక్షమనియు, నక్షత్రములకు శ్రవణానక్షత్రమును, ఋతువులకు శిశిరఋతువును నాదియనియు బ్రహ్మ చెప్పినట్టు లగపడుచున్నవి.

వీనిని (పై శ్లోకములను) బట్టి అం దుదాహరింపఁబడిన సందర్భములు మహాభారతయుద్ధకాలమునకుఁగాని మహాభారతము రచియింపఁబడిన కాలమునకుఁగాని సంబంధించియుండ లేదని స్పష్టముగఁ గన్పట్టుచున్నది. ఆ పరిస్థితులు విశ్వామిత్రుఁడు ప్రతిసృష్టిగావించిన కాలమునందలి పరిస్థితులకుఁగాని, లేక సృష్ట్యారంభకాలమునందలి పరిస్థితులకుఁగాని సంబంధించియుండినట్టు లగపడుచున్నది. వానినిబట్టి యీ పరిస్థితులెంతకాలముక్రిందటఁ గలిగియుండెనో కనుఁగొనిన యట్టి పరిస్థితులుగల సృష్ట్యారంభకాలమును గనుఁగొననగును. ఈ శ్లోకములనుబట్టి శ్రవణానక్షత్రము ప్రథమనక్షత్రముగఁ బరిగణించినటులఁ జెప్పియుండిరి. అట్లే ప్రాచీనకాలమునం దొకానొకప్పుడు శ్రవణానక్షత్రమును బ్రథమనక్షత్రముగఁ బరిగణించియుండిరనియే యెంచి చూచెదము.

అయనగతియందలి వ్యత్యాసముంబట్టి మహావిషువము లేక మేషాయనము ప్రతిసంవత్సరము 50" (యేఁబది వికళలు) వెనుకకు జరగుచుండును. ఇట్లే యొక నక్షత్రప్రమాణము వెనుకకు జరగినచో $\left\{\frac{13^\circ-20'}{50''}=\frac{[(13\times 60)+20]\times 60''}{50''}\right\}=$

960 సంవత్సరముల కాలవ్యత్యాసము కలుగుచుండును. 960 సంవత్సరముల పరిమితికాలమున కొకనక్షత్రము వ్యత్యాసము వచ్చును. ఒకానొకకాలమునందు మహావిషువము కృత్తికానక్షత్రప్రారంభమునఁగాని లేక శ్రవణానక్షత్ర ప్రారంభమునఁగాని సంభవించియుండెనని తలంచిన తిరిగి యా నక్షత్రప్రారంభమున సంభవించుటకు 27 × 960=25920 సంవత్సరముల కాలవ్యవధి పట్టును. దీనినిబట్టి యొక యావృత్తి (Rotation) కాలము 25,920 సంవత్సరములయినట్టు లగపడుచున్నది. అట్టి పరిస్థితులుగల కాలమునుండి యిప్పటి కెన్ని యావృత్తులు (Rotations) జరగియుండెనో! మన సిద్ధాంతశాస్త్రములనుబట్టి ప్రస్తుత సృష్ట్యాది యిప్పటికి 196,08,55,030 వత్సరములయినట్టు లగపడుచున్నది.

మహాభారతమం దొకప్పుడు శ్రవణానక్షత్రము ప్రథమ నక్షత్రముగఁ జెప్పఁబడియుండినంతమాత్రమున నక్కాలమున శ్రవణానక్షత్రమున సూర్యుఁడు ప్రవేశించఁగనే యుత్తరాయన మారంభమైయుండెనని తిలకుపండితుఁ డభిప్రాయపడుటకుఁ గారణము లేవియో తెలిపినవారు కారు. ఆ యభిప్రాయమునే

యంగీకరించిన వేదములయందును మహాభారతమునందును కృత్తికానక్షత్రము ప్రథమనక్షత్రముగఁ జెప్పఁబడియుండెననిన నా యా కాలములయందుఁ గృత్తికానక్షత్రమున ననఁగా జ్యోతిశ్చక్రమున 26°-40′ యందు సూర్యుఁడు ప్రవేశించఁగనే యుత్తరాయన మారంభమయియుండెనని చెప్పవలసియుండునుగదా? ప్రస్తుతకాలమున మూలానక్షత్రము తృతీయపాదమునందు జ్యోతిశ్చక్రమున 247 భాగల 18 కళల (247°-18′) యందు సూర్యుఁడుప్రవేశించినప్పుడు త్తరాయనమారంభమగుచుండెను. అయనచలనమునందలి వ్యత్యాసమువలనఁ దిలకుపండితుని యభిప్రాయానుసారముగ మహాభారతకాలమునకును ప్రస్తుతకాలమునకును (26°-40′) + (247°-18′) = 139°-22′ లేక 501720 వికళల వ్యత్యాసముండినట్లు లగపడుచున్నది. అయనగతినిబట్టి సంవత్సరమునకు 50 వికళల వ్యత్యాసము కలుగుచుండుటచే 139°-22′ (139 భాగల 22 కళల) కాలవ్యత్యాసము 10034 (501720″ ÷ 50″) సంవత్సరముల కాలవ్యత్యాసమగుచున్నది. మహాభారత కాలమునకును బ్రకృతకాలమునకును నడుమ 10034 సంవత్సరముల కాలవ్యవధి యుండినట్లు లగపడుచున్నది. ఈ సిద్ధాంతమునుబట్టి మహాభారత యుద్ధకాలమిప్పటికి 10034 సంవత్సరములక్రిందట ననఁగాఁ క్రీ. పూ. 9105 (10034-1929) సంవత్సరముల క్రిందట నయియుండునని చెప్పవలసియుండును. ఇది యేవిధముగఁజూచినను జరిత్రాంశములకు విరుద్ధమయియే యుండును. దీనింబట్టియే మహాభారతయుద్ధకాలమున సూర్యుఁడు శ్రవణానక్షత్రమునఁ బ్రవేశించినప్పుడుగాని కృత్తికానక్ష

త్రమునఁ బ్రవేశించినప్పుడుగాని యుత్తరాయన మారంభమయి యుండలేదని స్పష్టముగఁ జెప్పనొప్పుచున్నది. అట్టియూహాచేఁ గావింపఁబడిన కాలనిర్ణయము సరిగాదనియుఁ జెప్పనొప్పును.

## గోపాలయ్యరుగారి సిద్ధాంతము.

గోపాలయ్యరుగారును బరాశరునిచేఁ జెప్పఁబడిన విష్ణుపురాణమునందలి శ్లోకములనుబట్టి పరాశరుని కాలమునందు మహావిషువము లేక మేషాయనము కృత్తికానక్షత్ర ప్రథమపాదమున సూర్యుఁడుండఁగ సంభవించియుండెనని జెప్పియున్నారు[1] వారీక్రింది శ్లోకముల నాధార మనుచుండిరి.

"శ్లో॥ ప్రథమే కృత్తికాభాగే
యదా భాస్వాన్ తదాశశి ।
విశాఖానాం చతుర్థేఽంశో
మునేతిష్ఠత్య సంశయమ్॥ 76

శ్లో॥ విశాఖానాం యదాసూర్య
శ్చరత్యంశం తృతీయకమ్ ।
తదాచంద్రం విజానీయాత్
కృత్తికా శిరసిస్థితమ్॥ 77

శ్లో॥ తదైవ విషువాఖ్యోఽయం
కాలః పుణ్యోఽభిధీయతే ।[2]
* * * * 78

1 Chronology of Ancient India by Mr. V. Gopala Aiyer, P. 16 to 22
2 Vishnu Purana - Book II Chap VIII.

ఈశ్లోకములకు

"ఓమునీ! సూర్యుడు కృత్తికానక్షత్ర ప్రథమభాగము నందును జంద్రుఁడు విశాఖానక్షత్రము చతుర్థభాగమునందును నుండినప్పుడుగాని, లేక సూర్యుఁడు విశాఖానక్షత్రి తృతీయభాగమునందును జంద్రుఁడు కృత్తికానక్షత్ర శిరస్సునందుండినపుడుగాని మహావిషువకాలమని పిలువఁబడుచున్నది. అయ్యదియే మహాపుణ్యకాలమయ్యున్నది."

అని భావమిచ్చుచున్నది.

ఈ శ్లోకములు విష్ణుపురాణము రచియింపఁబడిన కాలమునందుఁగాని యాపురాణమును జెప్పిన పరాశరమహర్షి కాలమునందుఁగాని కృత్తికానక్షత్ర ప్రథమపాదమున సూర్యుఁడుండఁగ మహావిషువ మేర్పడియుండినట్టు లగపడుటలేదు. మహావిషువకాల మెప్పుడుగలుగునో యావిషయముంగూర్చి చెప్పఁబడియుండినట్టు లగపడుచున్నది. శ్రీయుత గోపాలయ్యరుగారు కోరిడీకరించిన పైశ్లోకములకుఁ బూర్వముననుు, దరువాతను గల శ్లోకములనువిడచి యపార్థమును వ్యక్తీకరించఁబూనిరి. వానినిగూడఁ జేర్చిచూచిన గోపాలయ్యరుగారి యభిప్రాయము తప్పనిచెప్పకయే బోధపడఁగలదు. ఆ శ్లోకములు మహావిషువకాలమన నెద్దియో నిర్వచనముసేయుటకును, అట్టి కాలములయందు దానధర్మములు, శ్రాద్ధకర్మలు మున్నగుఁవానిని గావించినపుణ్యముగలుగుననియు సూచించుటకై చెప్పబడియుండినట్లు వ్యక్తముకాఁగలదు. ఆ శ్లోకములన్నియు నీక్రిందఁగనంబఱుపఁబడినవి.

"శ్లో॥ దక్షిణాంచోత్తరంచైవ
మధ్యమం వైషువం తధా ।
శరద్వ సంతోర్మధ్యే
తద్భానుః ప్రతిపద్యతే ॥
మేషాదౌ చతులాదౌచ
మైత్రేయ విషువం స్మృతమ్ ॥
తధాతుల్య మహోరాత్రే
కరోతి తిమిరాపహః ।
దశపంచ ముహూర్తంవై
తదే తదుభయం స్మృతమ్ ॥
ప్రధమే కృత్తికాభాగే
యధాభాస్వాన్ తదాశశి
విశాఖానాం చతుర్థేఃశో
మునేతిష్ఠత్య సంశయమ్॥
విశాఖానాం యదాసూర్య
చ్చరత్యంశం తృతీయకమ్ ।
తదాచంద్రం విజానీయాత్ ।
కృత్తికా శిరసిస్థితమ్॥
తదైవ విషువాఖ్యోవై
కాలః పుణ్యోభిధీయతే ।
తదా దానాని దేయాని
దేవేభ్యః ప్రియతాత్మభిః॥

బ్రాహ్మణేభ్యః పితృభ్యశ్చ
ముఖమే తత్తుదానజమ్ ।
దత్తదానస్తు విషువే
కృతకృత్యోఽభిజాయతే॥ *

"దక్షిణోత్తర మధ్యరేఖ విషువ మనంబడుచున్నది. శరద్వసంతకాలములమధ్య సూర్యుఁ డారేఖకువచ్చినప్పు డయ్యది కలుగుచుండును.

ఓ మైత్రేయా!

మేషాదియు, తులాదియు, విషువములని తెలిసికొనవలసినది. అప్పు డహోరాత్రములు రెండును బదునైదుముహూర్తములకాలముగలిగి సమముగ సూర్యునిచేఁ జేయబడుచున్నవని తెలిసికొనుము.

ఓమునీ! కృత్తికానక్షత్ర ప్రథమభాగమునందు సూర్యుడును, విశాఖా చతుర్థభాగమునందుఁ జంద్రుఁ డుండినపుడును,

విశాఖానక్షత్ర తృతీయభాగమునందు సూర్యుఁడును, గృత్తికానక్షత్ర శిరస్సునందుఁ జంద్రుఁ డుండినపుడును

విషువకాలములని తెలిసికొనవలసినది. అయ్యవియే పుణ్యకాలములని చెప్పఁబడుచున్నవి. అట్టిసమయములందు దానములుచేసిన దేవతలు తృప్తిఁజెందెదరు.

---

*విష్ణుపురాణం అంశ II అధ్యాయం. VIII శ్లో. 78-79)

అట్టి విషువత్కాలములయందు దేవతలకును, పితృదేవతలకును దర్పణముల విడిచి బ్రాహ్మణులకు దానములఁ గావించిన యట్టి దానాదులు ఫలితము లొసంగు."

నని యీ శ్లోకముల భావమయినట్టు లగపడుచున్నది. విష్ణుపురాణమున కాత్మప్రకాశిక యను పేరుతో వ్యాఖ్యను రచించిన శ్రీధరస్వామివారాశ్లోకముల కీ క్రిందిరీతిని వివరణముం జెప్పిరి.

"ఇదానీం మహావిషువాఖ్యాం తత్ప్రశస్త్యంచాఽఽహ ప్రథమ ఇత్యాది చతుర్భిః । ప్రథమ ఇతి-ప్రథమే కృత్తికాభాగే మేషాంతే, విశాఖానాం చతుర్థేఽంశో వృశ్చికోపక్రమే, తదాశశి అసంశయమ్ యదితిష్ఠతి, తదా చంద్రార్కయో ర్ద్వయో రపిషడ్రాశివ్యవధానేన విషువావస్థితిరూపం మహావిషువమిత్య ॥76॥ శ్లోకద్వయస్యైకాన్వయః॥ విశాఖానామితి - విశాఖానాం తృతీయకమంశం తులాంతం, కృత్తికాశిరసి మేషాంతం, చంద్రియదివిజానీయాత్, తర్హి సోఽపితద్వైవ మహావిషువాఖ్యః పుణ్యకాలః॥77॥78॥ బ్రాహ్మణేభ్య ఇతి - అయంచవిషువాఖ్యః కాలః కదాచిదేవభవతి, నసర్వదా । తస్మాదతివిశిష్టమ్ । పతంతుదానజం ముఖం దానారం జాతం, వివృతం, దేవాదీనాం ముఖమ్ ॥ శ్లో ॥ ముఖమేతత్తు దేవానామ్, ఇతివాయూక్తేః—అస్మిన్కాలేదత్తం సాక్షాద్దేవా దీనాం। ముఖాదత్తం భవతీత్యర్థః ॥79॥"

విష్ణుపురాణమునకు మఱియొక వ్యాఖ్యను రచించిన విష్ణుచిత్తుఁ డాశ్లోకముల కీరీతి వ్యాఖ్యను రచించియుండెను.

"ప్రథమ ఇతి—॥శ్రు॥ ముఖంవా ఏతన్నక్షత్రాణాం యత్కృత్తికాః కృత్తికాః ప్రథమం, విశాఖే ఉత్తమమ్ । ఇత్యాది ప్రాక్కాలవిషయ శ్రుతిమూలా విషువద్ద్వయోక్తిః । కృత్తికాద్యంశే మేషాన్తే । విశాఖానాం చతుర్థేంశే వృశ్చికాద్యంశే ॥76॥ విశాఖానామితి—కృత్తికాశిర

స్తిమేషాన్తే। విశాఖా తృతీయాంశం తులాన్తమ్ ॥77॥ తద్వైవేతి—అయం చంద్రార్కయో రుభయోరపి విషువాస్థితిరూపో మహావిషువాఖ్యః పుణ్యో దానకాలః॥78॥"

ఇయ్యవి మేషవిషువు, తులావిషువుకాలముల నిర్వచన మొనర్చుటకును, నాకాలము లెప్పుడేపరిస్థితులయం దేర్పడునో తెలుపుటకును నాయాకాలములందు దేవపితృకార్యములును దానాదులనుగావించిన నేప్రయోజనముగలుగునో తెలుపుటకును జెప్పఁబడియుండెనేగాని యాశ్లోకములనుబట్టి పరాశరుని కాలమునఁ గృత్తికానక్షత్రము ప్రథమనక్షత్రముగా నెంచియుం డినట్లుగాని, మహావిషువము కృత్తికానక్షత్ర ప్రథమభాగము నకు సూర్యుఁడు వచ్చినప్పుడేర్పడి యుండెననిగాని చెప్పుట కేమాత్ర మవకాశముకాన్పించుటలేదు. కావున యీ శ్లోక ములందుఁ దెలియఁజేయఁబడిన కాలవివరములు పరాశరులవా రిచే విష్ణుపురాణమును రచియింపఁబడిన కాలమును దెలియఁ జేయుటకయి చెప్పఁబడినవికావనియు, విష్ణుపురాణము వ్రాయఁ బడినకాలమున మహావిషువకాలములు,— అందుఁజెప్పఁబడిన నక్షత్రములలో జరగియుండినట్లు సూచించుటకుఁ జెప్పఁబడినవి కావనియు స్పష్టముగఁ గన్పట్టుచున్నది. అయ్యవి మహాభారత యుద్ధకాల నిర్ణయమునకుఁగాని, యట్టికాలములందు మహాభా రతయుద్ధము జరగియుండెనని చెప్పుటకుఁగాని లేక మహాభార తము రచియింపఁబడియెననుటకుఁగాని యెంతమాత్రమును దోడ్పడఁ జాలవు.

లోకమాన్య బాలగంగాధరతిలకు పండితుఁడు అలెగ్జాం డరుచక్రవర్తి (Alexander the Great) దండయాత్రతో గ్రీకులు హిందూదేశమునకు రాకపూర్వము నక్షత్రమండలమునం గల రాశులు (మేషాదిరాశులు) ను గుఱించి హిందువులకుఁ దెలియదనియు, గ్రీకులు హిందూదేశమునకు వచ్చినతరువాతనే జ్యోతిశ్చక్రాలయమునందలి మేషాదిరాశుల నామములును గుఱ్తులును గ్రహించియుండిరనియు మున్నగు సంగతులను జెప్పియుండిరి. పాశ్చాత్య చరిత్రకారులు కొందఱు సెప్పుచున్నట్లు క్రీ. పూ. మూఁడవశతాబ్దమునకుముందు హైందవులకు మీన మేషాదిరాశుల సంజ్ఞలను గురించియు, గ్రహగతులు మున్నగు జ్యోతిషసిద్ధాంత విషయముల గుఱించియుఁ దెలియదనియు, వారు గ్రీకులనుండి నేర్చికొనియుండిరనియు వీరియభిప్రాయమై నట్లు స్ఫురించుచున్నది. పాశ్చాత్యపండితులమార్గము ననుసరించిన స్వామికన్నుపిళ్ల మొదలగువారలు కొంద ఱీవిధముననే యభిప్రాయములఁ దెలిపియుండిరి. అట్టియభిప్రాయములన్నియు నిరాధారములని గోపాలయ్యరుగారు కనఁబఱచియుండిరి. తిలకు పండితుఁడు మున్నగువా రూహించిచెప్పినట్లు విష్ణుపురాణము, పరాశరసంహితల గ్రంథకర్తయగు పరాశరుఁడు క్రీ. పూ. (13) పదమూఁడవ శతాబ్దమున వానింజెప్పియుండిరను సిద్ధాంతములు సరియని యెంచినను బరాశరులవారు జ్యోతిశ్చక్రమునంగల రాశులను గుఱించియు, అయనములు, విషువములు మున్నగు వానిని గుఱించియు విపులముగఁ జెప్పియుండుటచే గ్రీకులు హిందూదేశమునకు రాకపూర్వము షుమారు పదిశతాబ్దముల

పై కాలముక్రిందటనే, గ్రీకులు ప్రపంచచరిత్రయందొక జాతిగాఁ బరిగణింపఁబడి పేరెన్నికఁగాంచకపూర్వము బహుకాలముక్రింద టనే భారతీయులకు జ్యోతిశ్చక్రమునంగల నక్షత్ర, రాశి, సంజ్ఞలును, గ్రహములు, గ్రహగతులు, అయనములు, విషువములుమున్నగు జ్యోతిషసిద్ధాంత విషయము లన్నియుఁ బరిపూర్ణముగఁ దెలిసియే యుండెననియు, గ్రీకులనుండి హిందువులు వానిం దెలిసికొని యుండలేదనియు స్పష్టముగ నిదర్శించుచున్నవి. అటులఁగాదనిన, రాశులు, గ్రహములపేర్లు, గ్రహగతులు, అయనములు, విషువములు మొదలగువానినిగుఱించి గ్రీకులు "ఇండియా దేశమునకు వచ్చినపిదప గ్రహించినవానినే హైందవ జ్యోతిశ్శాస్త్రవేత్త లాయాగ్రంథములం దిటీవలికాలమున నిఱికించియుండిరని చెప్పినచో నట్టి పరిస్థితులంబట్టి ప్రథమమునఁ దొంటిగ్రంథమును రచియించినకాలమును నిరూపింపఁ బూనికొనుట హాస్యాస్పదమని వేఱుగఁజెప్ప నవసరముగాన్పింపదు. ఒక వేళ నట్టిపరిస్థితుల నిటీవలికాలమునం దిఱికింపఁబడినట్టు లెంచినను అట్టిపరిస్థితులంబట్టి యందుఁజెప్పబడిన ఖగోళశాస్త్ర విషయము లేకాలమునం దిఱికించినది తెలిసికొనుతలంపుతో నాపరిస్థితుల ననుసరించి కాలనిర్ణయముఁజేసిన నచ్చకాలము ఆపరిస్థితులలో జొన్పించినకాలమును దెలియజేయునేగాని తొలుతటిగ్రంథము రచియింపఁబడిన కాలనిర్ణయమునకుఁగాని యందలి కథాకాలనిర్ణయముఁ గావించుటకుఁగాని యెంతమాత్రమును దోడ్పడఁజాలదు.

---

ఓం.

# ఆంధ్రమహాసామ్రాజ్యము

—:o:—

## తృతీయాశ్వాసము.

ఏకాలమునుండి యాంధ్రులును, నాంధ్రదేశమును ప్రశంసింపఁబడియుండెను.

### సప్తర్షి మండలము—కాలనిర్ణయము.

ప్రాచీన హైందవదేశచరిత్రకాలములఁ దెలియఁజేయు పట్టున సప్తర్షు లేయేకాలములయం దేయేనక్షత్రములయందు సంచరించుచుండినదియుఁ బురాణేతిహాసాది హైందవప్రాచీన వాఙ్మయమునందు చెప్పఁబడియున్నది. ఆ యా కాలములను మనము తెలిసికొనఁగలిగిన ప్రాచీన హైందవదేశచరిత్ర యథార్థ కాలనిర్ణయముఁ గావించుట కనువగును.

సప్తర్షి మండల చలనవిధానమును గుఱించియు, ఒక్కొక్కనక్షత్రమున వారు సంచరించు కాలపరిమితిని గుఱించియుఁ గొందఱు భిన్నాభిప్రాయులైనట్టు గన్పట్టుటచే వానింగూర్చి

యుంట వివరముగ దెలిసికొనుట యనవసరముకాదు. ఈ సప్తర్షి మండలము తక్కిన గ్రహములవలె ముందునకు నడవక వెనుకకు నడచుచుండునని కొందఱు చెప్పుచుండిరి. వారి మతానుసారము సప్తర్షులు నక్షత్రమండలమున అశ్వనీనక్షత్రమునుండి క్రమముగ భరణ్యాది నక్షత్రములయందు ముందునకు నడువక, వెనుకకు ననఁగా రేవత్యాదినక్షత్రములయందు విలోమముగ సంచరించు చుందురని చెప్పుచున్నారు. మఱికొందఱు అశ్వనీనక్షత్రము నుండి క్రమముగ ముందునకనులోమగతిని సంచరించుచుందు రని చెప్పుచున్నారు. హైందవప్రాచీన వాఙ్మయమునంగల చరిత్రాంశముల వివరించుపట్టున కొండొక కాలములందీ సప్తర్షిమండలమున్న నక్షత్రములు పేర్కొనఁబడియున్నవి. అయ్యవి తచ్చరిత్రాంశములకుందగు కాలనిర్ణయము గావించుట కాధారములుగాఁ బేర్కొనఁబడియుండినట్లు లగపడుచున్నది. కావున నీ సప్తర్షిమండల చలనవిధానమును గుఱించియు, నొక్కొక్క నక్షత్రమునం దెంతేకాలముండునదియుఁ దెలిసికొనినచో నా యాకాలముల నిర్ధారణగావించుట కనుకూలించును.

సప్తర్షులు ముందునడకను (Forward motion) సంచరించు చుందురా లేక వెనుకనడకను(Retrograde motion)సంచరించు చుందురా యను రెండుసిద్ధాంతములు గన్పట్టుచున్నవి. ఇట్లుండ సప్తర్షిమండలమునకు చలనమే లేదని కొందఱి సిద్ధాంతమయిన ట్టుల గన్పట్టుచున్నది. సప్తర్షిమండలమునకు చలనము లేదని ప్రాచీనహైందవసిద్ధాంతు లెఱింగియుండిరనియు, సప్తర్షులొక్కొక నక్షత్రమున శతవత్సరము లుందురని చెప్పుచు శతాబ్దములను

లెక్కించుటకుగాను యేర్పరుచుకొనిన యొకసాంకేతిక యుగ మనియు స్వామికన్నుపిళ్లగారు చెప్పియుండిరి.$ స్వామికన్నుపిళ్లె గారట్టి సాంకేతికయుగమునుబట్టి మహాభారతయుద్ధకాలనిర్ణయము మును గావించుటనుబట్టియే సప్తర్షిమండలమునకు నైజముగ చలనము లేదని యెంచి నిర్ణీతమగు విధానమున నా సప్తర్షిమండలమునకు సమముగ నొకశతాబ్దకాల మొక్కొకనక్షత్రము గన్పట్టుచుండుననియు నద్దానినే ప్రాచీనహైందవు లొక సాంకేతికయుగముగఁ గైకొని చరిత్రకాలనిర్ణయము లు గావించుపట్టున బేర్కొనియుందురని యెంచి కాలనిర్ణయ విధానమునకుఁగడంగిన యాథార్థ కాలనిర్ణయముల౯ గావించదగియుండుననుట సిద్ధము.

యుధిష్ఠిరుని కాలమునందును, బరీక్షిత్తు కాలమునందును సప్తర్షులు మఘానక్షత్రమునం దుండినటుల౯ బురాణములు జెప్పుచున్నవి. శ్రుతర్షులుమాత్రము యుధిష్ఠిరపరీక్షితుల కాలములయందు సప్తర్షులు కృత్తికా నక్షత్రమునందుండినట్లు జెప్పియుండిరనుచున్నారు. వీనింబట్టియే తరువాతకాలమున భిన్నసిద్ధాంతములు బయలు దేఱినట్లు లగపడుచున్నది. వరాహమిహిరుఁడు శ్రుతర్షుల సిద్ధాంతము ననుసరించియుండెననియు, సప్తర్షిమండల మశ్విన్యాదినక్షత్రముల క్రమము ననుసరించి సంచరించుచుండినటుల జెప్పియుండెననియు కొందఱు జెప్పుచున్నారు. కాని వరాహమిహిరుని సిద్ధాంతగ్రంథములట్లు వాకొనుటలేదు. వరాహమిహిరుఁ డదివఱకుండు సిద్ధాంతముల నన్నిటిని గనంబఱు

$ Indian Ephemeris by Dewan Bahadur L. D. Swamikannu Pillai, Vol. I, Part I. page 483 para 6 of Appendix F.

చుచు నాయీసిద్ధాంతముల ననుసరించి కాలనిర్ణయముఁ గావించుట కనుకూలించుమార్గముల దెలియఁజేసియుండెను. ప్రాచీన సిద్ధాంతవేత్తయగు వృద్ధగర్గుని మతానుసారముగ సప్తర్షులు యుధిష్ఠిరునికాలమున మఘానక్షత్రమునం దుండిరనియు, నా యుధిష్ఠిరుని కాలమునకును శకకాలమునకును నడుమగలకాల వ్యవధి 2526సంవత్సరము లయియుండెననియుఁ జెప్పియుండెను.

శ్లో॥ ఆసన్ మఘా సుమునయః శాసతిపృథ్వీమ్ యుధిష్ఠిరే నృపతౌ. షట్ ద్వికపంచద్వియుత శకకాలస్య తస్య రాజ్ఞస్య॥*

ఈ శ్లోకమున వరాహమిహిరునిచేఁ బ్రస్తావింపఁబడిన శకకాలము శాలివాహనశక మను భ్రాంతితో యుధిష్ఠిర కాల నిర్ణయముఁ గావింపఁ గొందఱు ప్రయత్నించియుండిరి. అయ్యది క్రీ. పూ. 550 సంవత్సరమున శకసామ్రాజ్యము నెలకొల్పిన సైరసుచక్రవర్తిచే స్థాపింపఁబడిన శకవత్సరప్రశంసయని యిది వఱలోఁ కనుఁగొనియుంటిమి. వరాహమిహిరుఁ డిచ్చిన యీ కాలగణితమునుబట్టి యిప్పటి కయిదువేల యేఁడు (2526 + 550 + 1931) సంవత్సరములకు పూర్వము యుధిష్ఠిరుఁడుండి నట్లును, యుధిష్ఠిరునికాలమున సప్తర్షులు మఘయం దుండినట్లును సప్తర్షులొక్కొక నక్షత్రమున శతవత్సరములుండునట్లును జెప్పఁ బడియుండుటచే యుధిష్ఠినికాలమున సప్తర్షులు మఘానక్షత్రము నం దిప్పటి కయిదువేల నూఁటయేఁడు వత్సరముల (5007 + 100) క్రిందట బ్రవేశించి యుండిరనియు స్పష్టముగ దెలియు చున్నది. ఈ గణితమునుబట్టి యుధిష్ఠిరునికాలమునుండి ప్రస్తుత

* బృహత్సంహిత, ౧౩, అధ్యా— శ్లో. ౧.

కాలమువరకు సప్తర్షు లేబదియొక్క నక్షత్రములయందు సంచరించియుండినటులఁ దెలియుచున్నది.

మత్స్యపురాణమున

"భవిష్యేతే ప్రసఙ్ఖ్యాతాః పురాణజ్ఞైశ్రుతర్షిభిః,
సప్తర్షయ స్తథా ప్రాంశుః ప్రదీప్తే నాగ్నినాసమాః,
సప్తవింశతి భావ్యానా మాన్ధ్రాణాంతు యథాపునః."†

అని చెప్పఁబడియుండుటచే "ప్రదీప్తేనాగ్నినాసమాః" అనువాక్యమున కగ్నిదేవు డధిపతిగనుండిన కృత్తికానక్షత్రమునకు సమముగ సప్తర్షులుండిరనియు, వారు మఱల నిఱువదేడవ (27) యాంధ్రరాజుకాలమున కొక యావృత్తి(Rotation or Cycle) పూర్తిగావించి రెండవ యావృత్తియారంభించెదరనియు తర్వాతికాలపువా రభిప్రాయపడి యుధిష్ఠిరుని కాలమునందు లేక పరీక్షితునికాలమునందు సప్తర్షులు కృత్తికయందుండిరని భావించినట్లు లగపడెడిని. ఆశ్లోకములకుఁ దరువాతఁ జెప్పఁబడిన శ్లోకములయందు—

సప్తర్షయో మఘాయుక్తాః కాలేపారీక్షితే శతమ్,
ఆంధ్రాంశే చతుర్వింశా భవిష్యంతి శతంసమాః"*

అని యుల్లేఖింపఁబడియున్నది. ఇయ్యది "పరీక్షిత్తు కాలమున సప్తర్షులు మఘానక్షత్రమునందుండిన కాలము పారీక్షితశతమనియు, నాంధ్రరాజుల ప్రారంభకాలమునకు నిఱువదినాలుగు (24) శతాబ్దములు గడచును" అనియు భావమిచ్చు

†మత్స్యపురాణ. ౨౭౧ అధ్యా. ౪౦-౪౧ శ్లో.
*మత్స్యపురాణ. ౨౭౧ అధ్యా ౪౬-౪౭ శ్లో.

చున్నది. పరీక్షిత్తుకాలమున సప్తర్షులు మఘానక్షత్రమునం దుండిరని స్పష్టముగఁ జెప్పియుండుటచేఁ గృత్తికా నక్షత్రమున నుండిరనుట గ్రంథకర్తయుద్దేశ్యము కాదని స్పష్టముగఁ దెలియు చున్నది. మఱియు "ప్రదీప్తేనాగ్నినా సమాః" అను వాక్యమునకుఁ "ప్రకాశమాన మగు నగ్నిదేవుఁ డధిపతిగ నుండు కృత్తికానక్షత్రమునకు సమముగ" అనుభావము కాదనియు, నావాక్యమునకు "అగ్నితో సమానముగ ప్రకాశించెడు సప్తర్షులు" అని చెప్పుటకయి విశేషణపదముగఁ జెప్పఁబడియుండె ననియు, బోధితమగుచున్నది. అదియునుంగాక పరీక్షిత్తుకాలమున సప్తర్షులు కృత్తికానక్షత్రమునందుండిరనియు, నావాక్యముల వెంటనే యేడువశతాబ్దముల కాలవ్యవధినిఁ దెలియఁజేయునట్లు మఘానక్షత్రమునం దుండిరనియుఁ జెప్పఁబడియుండెననుట యసంగతము. సప్తర్షులు శ్రుతర్షుల మతానుసారముగఁ గృత్తికానక్షత్రమునందును, బురాణవేత్తలు వృద్ధగర్గుఁడు మున్నగువారి మతానుసారముగ మఘానక్షత్రమునందును పరీక్షితునికాలమున సంచరించుచుండిరని యెంచినను, అందలి వాక్యములం బట్టి వారశ్విన్యాది నక్షత్రముల వరుసక్రమముగ ముందునకు సంచరించుచుందురనుభావ మూహించుటకైన నవకాశము గన్పట్టదు. 'హైందవశకములు' (Book of Indian Eras) అనుగ్రంథమును రచించిన అలెగ్జాండరు కన్నింగుహామ్ పండితుఁడు సప్తర్షియుగమును గుఱించి రచించునపు డీవిషయముం గూర్చి చర్చించుచు యథార్థస్థితిని సమన్వయము గావించుకొనజాలక శ్రుతర్షులు కృత్తికానక్షత్రముగఁ దలఁచినదానినే పురాణ

వేత్తలును వృద్ధగర్గాదులును మఘానక్షత్రముగ నెంచియుండి రనియు నాయుభయమతములవారి యుద్దేశ్యమొకేనక్షత్రమును గుఱించి యుద్ఘాటించుటయే యగుననియు సమన్వయమొనర్చు చు సమర్థించితి మనుకొనియుండిరి. కాని యీాసప్తర్షియుగకాల ములను గనంబఱుచుటయందు వారిచలనమును వెనుకకుంజూపు టకుమారు ముందునకుఁ జూపియుండిరి.

సప్తర్షిమండల చలనమును గుఱించియు, సప్తర్షియుగ కాలపరిమితులను గుఱించియు ప్రాచీనహైందవవాఙ్మయ మేమి చెప్పుచున్నదో కనుఁగొందము.—

"సప్తవింశతిపర్యంతే కృత్స్నే నక్షత్రమండలే,
సప్తర్షయస్తు తిష్ఠంతి పర్యాయేణ శతంశతం.
సప్తర్షీణాం యుగంహ్యేతద్దివ్యయాసంఖ్యయా స్మృతమ్,
సమాదివ్యాః స్మృతాః సప్తదివ్యామాసాః షడేవహి.
ఋక్షాదృక్షం శతేనాబ్దైర్యాంతి చిత్రశిఖండినః,
దివ్యః సప్తర్షికాలోఽయం క్రమాదేవం ప్రవర్తతే.
సప్తర్షీణాంతు యౌ పూర్వౌదృశ్యేతేహ్యుదితేదివి
తయోస్తు మధ్యే నక్షత్రం దృశ్యతేయత్ సమంనిశి.
తేన సప్తర్షయో యుక్తా స్తిష్ఠన్త్యబ్దశతం నృణామ్,
నక్షత్రాణా మృషీణాంచ యోగస్యైతన్నిదర్శనమ్.
యదా దేవర్షయః సప్త మఖాసు విచరంతిహి,
తదా ప్రవృత్తశ్చ కలి ర్ద్వాదశాబ్ద శతాత్మకః.
యస్మిన్ కృష్ణోదివం యాత స్తస్మిన్నేవహివత్సరే,
ప్రతిపన్నం కలియుగ మితిప్రాహుః పురావిదః.

1. Book of Indian Eras by Alexander Cunningham p. 17.

యావత్ స భగవాన్ విష్ణుః పస్పర్శేమాం వసుంధరామ్
తావత్ పృథ్వీం పరాక్రాంతుం సమర్థో నాభవత్ కలిః.
యదా మఘాభ్యో యాస్యంతి పూర్వాషాఢాం మహర్షయః
తతః ప్రభృత్యేవ కలిర్వృద్ధిం యాస్యతి నిశ్చితమ్.
యదాయుధిష్ఠిరో రాజా శక్రప్రస్థే ప్రతిష్ఠితః,
తదాసప్తర్షయః ప్రాపుర్మఘాః పితృహితేరతాః.
పంచసప్తతివర్షాణి ప్రాక్ కలేః సప్త తే ద్విజాః,
మఘాస్వాసన్ మహారాజే శాసత్యుర్వీం యుధిష్ఠిరే.
పంచవింశతి వర్షేషు గతేష్వథ కలౌ యుగే,
సమాశ్రయిష్యన్త్యాశ్లేషాం మునయస్తే శతం సమాః.
తత్రైవ ధర్మపుత్రోఽపి మహాప్రస్థానమాస్థితః,
భువం పరిభ్రమన్నంతే స్వర్గమారోక్ష్యతి ధ్రువమ్.
తత్రైవ లౌకికాబ్దేపి సప్తవింశ శతాత్మకః,
ధర్మపుత్రజ్ఞాపకార్థం లోకే తావత్ ప్రవర్తితః''*

అని కలియుగరాజ వృత్తాంతము చెప్పుచున్నది. ఇయ్యది భవిష్యత్పురాణము ననుసరించియుండెను. ఈ వాక్యములనుబట్టి సప్తర్షులు నక్షత్రమండలమునఁ గల యిఱువది యేఁడు నక్షత్రముల నొక్కొక్క నక్షత్రమున శతవత్సరముల పర్యంతము నిలుచుచు నక్షత్రమండలమును జుట్టి వచ్చుచున్నారనియు, వీరొకపర్యాయ మీ నక్షత్రమండలము జుట్టివచ్చుకాలము దేవకాలమానమునం దేఁడు వత్సరముల నాఱుమాసము లగుచున్నదనియు, సప్తర్షులలోఁ బూర్వదిక్కునఁ గన్పట్టు నక్షత్రములకు మధ్యభాగమునకు సమముగా నర్ధరాత్రమునఁ జూపట్టునక్షత్రము

* Vide- Kaliyuga Rajavrittantam; Bhaga III, Chap III.

నం దాసప్తర్షులు సంచరించుచుండినట్లు లెంచవలసి యుండు ననియుఁ, కలియుగప్రవేశకాలమున సప్తర్షులు మఘానక్షత్రమున సంచరించుచుండిరనియు, శ్రీకృష్ణభగవాను లీప్రపంచమును వీడి చనినకాలముననే కలిప్రవేశమయ్యెండెననియు, అయ్యదియే కలియుగ మారంభమయియుండెననియు, శక్రప్రస్థమున (ఇంద్రప్రస్థమున) యుధిష్ఠిరుఁడు పట్టాభిషిక్తుఁడగు కాలమున సప్తర్షులు మఘానక్షత్రమునం దుండిరనియు, యుధిష్ఠిరుఁడు పరిపాలన సల్పుకాలమున మఘయందుండిన సప్తర్షులు కలియుగప్రవేశకాలమునకు బూర్వము డెబ్బదియైదు వత్సరముల క్రిందట మఘానక్షత్రమునఁ బ్రవేశించి యుండిరనియు, కలియుగమునం దిఱువదియైదు (25) వత్సరములు గడచిన పిమ్మట సప్తర్షులాశ్లేషానక్షత్రశతమునఁ బ్రవేశించిరనియు, నయ్యదియే యుధిష్ఠిరుఁడు మహాప్రస్థానముఁ జేరిన సమయమనియు, యుధిష్ఠిరుని జ్ఞాపకార్థ మప్పటినుండియే యిఱువదియేఁడు శతాబ్దముల (2700) పరిమితిగల లౌకికాబ్దము ప్రారంభింపఁబడి యుండెనని యుఁ దెలియుచున్నది. మఱియు

"సప్తర్షయస్తు వర్తన్తే యత్ర నక్షత్రమండలే,
సప్తర్షయస్తు తిష్ఠన్తి పర్యాయేణ శతం నృణామ్,
సప్తర్షీణాంతు పర్యాయే తత్స్మృతం దివ్యసఙ్ఖ్యయా,
సమాదివ్యాస్స్మృతాః సప్తదివ్యామాసా షడేవహి.

ఏభిః ప్రవర్తతేకాలో దివ్యాస్సప్తర్షిభిస్తువై,
సప్తర్షీణాంతు యౌ పూర్వౌ దృశ్యేతే హ్యుదితే నిశి,
తయోర్మధ్యేతు నక్షత్రం దృశ్యతే యత్సమం దివి,
తేన సప్తర్షయో జ్ఞేయా యుక్తా వ్యోమ్ని శతం సమాః.

నక్షత్రాణా మృషీణాంతు యోగశ్చైతన్నిదర్శనమ్,
సప్తర్షయో మఘా యుక్తాః కాలే పారీక్షితే శతమ్." ‡

అని మత్స్యపురాణమునఁ జెప్పఁబడియున్నది. ఈ వాక్యముల ననుసరించి నక్షత్రమండలమునఁగల యేనక్షత్రమున సప్తర్షులుందురో యానక్షత్రమున వారు నూఱేఁడులదాఁక నుందురనియు, నక్షత్రమండలమును సప్తర్షులు చుట్టివచ్చెడుకాలము దేవకాలమానమున నేఁడువత్సరముల యేఱుమాసముల వ్యవధి యగుచున్నదనియు, నర్ధరాత్రమున సప్తర్షి మండలమునఁ బూర్వదిక్కునను౦డు నక్షత్రములకు సమముగ నేనక్షత్రము గన్పట్టునో యానక్షత్రమున సప్తర్షులు నూఱేఁడు లుండెదరనియుఁ, బరీక్షిత్తుకాలమున సప్తర్షులు మఘయందుండిరనియు, నాకారణమున మఘయందు సప్తర్షులుండిన శతము పరీక్షిత్తు శతమని పేర్కొనఁబడియుండినట్లును దెలియుచున్నది.

దేవకాలమానమునం దొక దివ్యవత్సరము మానవకాలమానమున మున్నూటయఱువది (360) మానవవత్సరములకు సమానమని యిదివఱలో గనుఁగొనియుంటిమి. కావున యేఁడు దివ్యవత్సరముల యేఱు దివ్యమాసముల కాలము మానవ కాలమానమున నిఱువదియేఁడువందల ($7\frac{1}{2} \times 360 = 2700$) సంవత్సరము లగుచున్నది. సప్తర్షు లొక్కొక్క నక్షత్రమున నూఱేఁడులుందురని చెప్పఁబడియుండుటచే వా రొకతూరి నక్షత్రమండలమునగల యిఱువదియేఁడు నక్షత్రములను చుట్టి

‡ మత్స్యపురాణము. ౨౭౧ అధ్యా. ౪౨-౪౬. శ్లో.

వచ్చుట కిఱువదియేఁడువందల (27 × 100) సంవత్సరము లగు చున్నది. ఇదియు సప్తర్షియుగమునకు చెప్పబడిన (2700) ఇఱువదియేఁడువందల సంవత్సరముల సంఖ్యకు సరిపోవుచున్నది.

భాగవతపురాణమునందును

"సప్తర్షీణాంతుయౌ పూర్వాదృశ్యేతే ఉదితౌదివి,
తయోస్తుమధ్యేనక్షత్రం దృశ్యతేయత్సమం నిశి.
తేనైవఋషయోయుక్తా స్తిష్ఠం త్యబ్దశతం నృణామ్,
తేత్వదీయేద్విజాః కాలేహ్యధునా చాశ్రితామఘాః".*

అని చెప్పఁబడియున్నది. విష్ణుపురాణమునందును

"సప్తర్షీణాంతుయౌ పూర్వౌదృశ్యేతేహ్యుదితౌదివి
తయోస్తుమధ్యేనక్షత్రం దృశ్యతే యత్సమంనిశి
తేన సప్తర్షయోయుక్తా స్తిష్ఠం త్యబ్దశతం నృణామ్
తేతుపారీక్షితేకాలే మఘాస్వాసన్ ద్విజోత్తమ". §

అని చెప్పఁబడియున్నది. వాయుబ్రహ్మాండపురాణముల యందును నిట్లే చెప్పఁబడియున్నది.$ వీని నన్నిటినిఁబట్టి చూచినచో, సప్తర్షిమండలమునఁ బూర్వమందున్న నక్షత్రములకు సమముగా నర్ధరాత్రమున నక్షత్రమండలమున నేనక్షత్రము గన్పట్టుచున్నదో యానక్షత్రమున సప్తర్షులుండినట్లు భావింపవలసియుండుననియు, సప్తర్షు లొక్కొక్కనక్షత్రమున మానవకాల

* భాగవతము ౧౨ స్కం. ౨౭. ౨౮ శ్లో.

§ విష్ణుపురాణము ౪, అంశ. ౨౪. అధ్యా ౧౦౫. ౧౦౬. శ్లో.

$ 1. వాయు. 99 అధ్యా 2. బ్రహ్మాండపురాణము. 3. అధ్యా 74.

మానమున శతవత్సరము లుందురనియు స్పష్టముగఁ దెలియు చున్నది.

పరీక్షిత్తు కాలమునందు సప్తర్షులు కృత్తికయందుండిరను శ్రుతర్షులును, మఘయందుండిరను పురాణవేత్తలును, వృద్ధగర్గాదులును

" సప్తర్షీణాంతుయా పూర్వాదృశ్యేతే హ్యుదితౌదివి.
తయోస్తుమధ్యేనక్షత్రం దృశ్యతే యత్సమం నిశి."

అను శ్లోకమందలి "పూర్వమునం జూడఁబడెడు నక్షత్రము లేవియో నిర్ధారణగావించుపట్టున భిన్నాభిప్రాయులై యుండినట్లు లగపడుచున్నది. ఈభిన్నాభిప్రాయమే యొకేకాలమందు సప్తర్షులు కృత్తికానక్షత్రమునం దుండిరనుటకును, మఘానక్షత్రమునం దుండిరనుటకును గారణమయినటుల గన్పట్టుచున్నది. "పూర్వే" అనుపదమునకు "ముందరభాగమున లేక మొదట" యనియును, "తూర్పుదిక్కున" అనియు నర్థము జెప్పుట కవకాశము గన్పట్టుచుండెను. అట్టి యవకాశమును బురస్కరించుకొని శ్రుతర్షులు ప్రాంగణమునందుండు నక్షత్రములకు సమముగానుండు నక్షత్రమున నుండిరనియు, వృద్ధగర్గాదులును బురాణవేత్తలును దూర్పుదిక్కునందుండు నక్షత్రములకు సమముగానుండు నక్షత్రమున నుండిరనియుఁ జెప్పుటచే నీభేదాభిప్రాయములు కలుగుటకుఁ గారణమైనటు లగపడెడిని. ఈయుభయసిద్ధాంతవాదులును బరీక్షిత్తుకాలమున సప్తర్షులు వేర్వేరు నక్షత్రములయం దుండినట్లు జెప్పియుండిరే గాని యొక్కొక

నక్షత్రమున వారుండు కాలపరిమితియందుగాని వారి చలన విధానమును గుఱించిగాని భిన్నాభిప్రాయులైనట్లుగుపడుటలేదు. ఉభయమతములవారును సప్తర్షు లొక్కొక నక్షత్రమున నూ ఱేండ్లుందురనియే స్పష్టముగఁ జెప్పియుండిరి. ఈ యిరుతెగలవారి సిద్ధాంతముల గమనించిన శ్రుతర్షులు కృత్తికానక్షత్రమని పేర్కొనిన నక్షత్రమునే వృద్ధగర్గాదులు మఘానక్షత్రమని వ్రాసియుందురను కన్నింగుహామ్ పండితుఁడు గావించిన సమన్వయము సరికాదని స్పష్టముగఁ గన్పట్టును.

సప్తర్షు లేనక్షత్రమునందుండునది కనుగొనుటకయి చెప్పఁబడిన శ్లోకములకు భాగవత పురాణమునకు భావార్థదీపిక యను వ్యాఖ్యను రచించిన శ్రీధరస్వామి

"సప్తర్షీణామితి. అయమర్థ:— ప్రాగగ్రశకటాకారం తారాసప్తకం సప్తర్షిమండలం. తత్రకించిదున్నతే తేషామగ్రస్థానీయోమరీచిః, తతః పశ్చాదానమ్రయుగకంధరాకారో వసిష్ఠ స్సభార్యః. తతః పశ్చాదీషదుత్తర స్థానీయోఽంగిరాః. తతః పశ్చాచ్చతురశ్రతారాచతుష్కే ఐశాన్యే అత్రిః. తతో దక్షిణతః పులస్త్యః. పులస్త్యాత్పశ్చిమతః పులహః. తత ఉత్తరతః క్రతుః ఏవంస్థితే తేషాం మధ్యే యౌ పూర్వౌ ఉదయసమయే ప్రథమముదితౌ దృశ్యేతేతౌ పులహక్రతు సంజ్ఞౌ, తయోస్తుమధ్యే తయోస్తు పూర్వయోస్తు మధ్యేతత్సమం దక్షిణతః సమరేఖాదేవస్థిత మశ్విన్యాదిషు యదన్యతమం నక్షత్రం దృశ్యతే (౨౭) తే నేతి. తేన తథైవయుక్తాః నృణాంమబ్దశతమ్ తిష్ఠంతి. తేచ ద్విజాస్త్వదీయే కాలే అధునా మఘా ఆశ్రితా వర్తంతే. (౨౮)"

అని చెప్పియుండెను. ఈ వ్యాఖ్య

"తూర్పుదిక్కున కగ్రము గలిగి శకటాకారముగఁ (ఒక చకటా బండియాకారముగ) గన్పట్టు 7 (యేఁడు) నక్షత్రముల సముదాయము సప్తర్షిమండలము. అందు కొంచె మున్నతిగలిగి వానికగ్రమున అనగా శకటాకారముగ నుండిన యానక్షత్ర సముదాయమున; యేడికోల మొదటనుండువాఁడు మరీచి. అత నికిఁ బశ్చిమముగ వంగిన కాఁడిమూఁపువలె నుండువాఁడు భార్యాయుతుఁడగు వసిష్ఠుఁడు. ఆతనికి బశ్చిమంబునఁ గొంచ ము త్తరముగ (యేడికోలమూల) నుండువాఁడు అంగిరసుడు. ఆతనికి బశ్చిమమున చతురశ్రమముగ గన్పట్టు నాలుగు తారల యం దీశాన్యమునం దుండువాఁడు అత్రి. అతనికి దక్షిణమునఁ బులస్త్యుఁడు. ఆపులస్త్యునకు బశ్చిమమునఁ బులహుఁడు. ఆతని కు త్తరమున క్రతువు. వీరు తూర్పుదిక్కున నుదయమగు సమ యమునఁ దొల్దొల్తఁ జూడంబడు వారు పులహక్రతువులు. వారికి (పులహక్రతువులకు) మధ్య సమముగా వారికి (పులహ క్రతువులకు) ముందుభాగమున అనగా యెమురుగా దక్షిణ ముగా నుండిన అశ్వన్యాది నక్షత్రములలో నేనక్షత్రము గన్ప ట్టునో యా నక్షత్రమున సప్తర్షులుండినట్లు జెప్పబడుచున్నది. అటుల ఒక్కొక నక్షత్రమున వారు (సప్తర్షులు) మానవకాల మున శతవత్సరములుందురు. ఇవ్విధముగ నీ (పరీక్షితుని) కాలమున సప్తర్షులు మఘయందుండిరి."

అని యర్థమిచ్చుచున్నది. మఱియు విష్ణుపురాణ మున కాత్మప్రకాశికాఖ్యవ్యాఖ్యనురచించుపట్టున శ్రీధరస్వామి యాశ్లోకములకు

"సప్తర్షీణాం త్రిభిః శకటాకార కౌరాసప్తకం మునిమండలం. ప్రాగగ్రేతత్రమండలే ఈషాస్థానీయః ప్రాచ్యాం మరీచిః. తతః పశ్చాన్న ప్రయుగకంధరాకారో వసిష్ఠః సభార్యః. తతః పశ్చాదీషమన్నత ఈషా మూలస్థానీయోఽఙ్గిరాః, తదాసన్న పశ్చిమచతుష్కశ్చ ఐశాన్యే అత్రిః. అత్రేర్యామ్యః పులస్త్యః పులస్త్యాత్పశ్చిమః పులహః తమదీచ్యశ్చతుష్క వాయవ్యేక్రతుః. వసిష్ఠాద్యామ్యా సూక్ష్మతారా అరుంధతీ. తత్రమండలే ఉత్కంచ పూర్వభాగే మరీచిర్భగవాన్ అపరభాగేస్థితో వసిష్ఠస్తస్మాత్పర తోఽఙ్గిరాః. తతోఽత్రి స్తస్యాసన్నః. పులస్త్యపులహః క్రతుర్భగవానాసన్నా నుక్రమేణ పూర్వాద్యాస్తారావసిష్ఠవర ముపాశ్రితారుంధతీ సాధ్వీస్థితేతి; ఏవంస్థితే.—యా పూర్వాఉదయే ప్రథమందృశ్యాపులస్త్య క్రతుసంజ్ఞా మునిశకటస్య పశ్చాత్త్యాతథాపి పూర్వం ఉదితా దృశ్యతే. మధ్యగగన మధ్యే-తయోః తాభ్యాం సమంసమదక్షిణోత్తర రేఖాయాం య దశ్వినా ద్యన్యతమం నక్షత్రమార్గవే నావతిష్ఠతే,— తేననక్షత్రేణ తేయుక్తాః శతాబ్దంతిష్ఠంతి.—తేషాం ప్రత్యక్షం శతాబ్దస్థిత్యుక్తిః కలిగతాబ్ద జ్ఞానో ద్దేశార్థా."

అని వివరించి చెప్పియున్నాఁడు. భాగవతపురాణము నకును, విష్ణుపురాణమునకును వ్యాఖ్యనురచించుపట్టున మూాల మున గల 'నిశి' యనుశబ్దమును గమనింపక వదలియున్నాఁడు. భాగవతమునకు వ్యాఖ్యయగు భావార్థ దీపికాఖ్యవ్యాఖ్య ననుసరించి పులహక్రతువులకు నడుమను సమముగా ముందరి భాగమున నక్షత్రమండలమునం దేనక్షత్రము గన్పట్టునో యా నక్షత్రమునందు సప్తర్షులుండినట్లు లెన్నఁదగియుండునని తెలియు చున్నది. విష్ణుపురాణమునకు వ్యాఖ్య యగు నాత్మప్రకాశి

కాఖ్యవ్యాఖ్యననుసరించి పులహాక్రతువులకు సమముగ నుత్తర దక్షిణముల కొక సరళరేఖను లిఖించిన యా రేఖ నక్షత్రమండలమునందలి యేనక్షత్రమునకు సరిగానుండునో యానక్షత్రమునందు సప్తర్షులుండినటులఁ జెప్పఁదగియుండుననియుఁ దెలియుచున్నది. ఈ సిద్ధాంతము మూలమునఁ జెప్పఁబడిన విషయమునకు భిన్నముగఁ గన్పట్టుచుండెనని వేఱుగాఁ జెప్పనగత్యము లేదు. మూలమునఁ బూర్వమునఁ గన్పట్టు నక్షత్రములకు మధ్యను సమముగ నర్ధరాత్రమునఁ గన్పట్టు నక్షత్రమునందు సప్తర్షులుండినట్లు లెన్నవలసియుండునను భావమును సూచించుచుండ, 'పూర్వ' మనఁ 'దూర్పుదిశయం' దనియా లేక 'ముందరభాగము లేక యెదుటిభాగమునం'దనియా యను భిన్నాభిప్రాయములకు మూలమై భిన్నసిద్ధాంతములు బయలు దేఱి పరీక్షిత్తుకాలమున సప్తర్షులు కృత్తికానక్షత్రమునం దుండిరని శ్రుతర్షులును, మఖానక్షత్రమునం దుండిరని పురాణవేత్తలును, వృద్ధగర్గాదులును సిద్ధాంతములు జేసియుండిరి. ఆ రెండు మతములవారును సప్తర్షుల చలనవిధానమును గుఱించియు, వారొక్కొక నక్షత్రమునందుండు కాలపరిమితినిగుఱించియు భిన్నాభిప్రాయులు గాక యేకాభిప్రాయులై యుండిరి. ఎవరి సిద్ధాంతము ననుసరించి కాలనిర్ణయములు గావించినను భేదము గన్పట్టక యొకేరీతిగాఁ గాలపరిమితులు దేలుచున్నవి. ఈ సిద్ధాంతములకును మూలమునకును భిన్నముగఁ బులహాక్రతువులకు సమముగ నుత్తరదక్షిణముల కొక రేఖనులిఖించిన యారేఖ నక్షత్రమండలమునందలి యేనక్షత్రమునకు సరిగానుండునో యా

నక్షత్రమున సప్తర్షులుండినట్లు భావింపవలసియుండునని యాత్మ ప్రకాశికాఖ్యవ్యాఖ్యాకారుఁడు కడు ప్రయాసతోఁ గావించిన వ్యాఖ్యనుబట్టి సప్తర్షులు ముందునకు నడచుచుండిరను సిద్ధాంతముబయలుదేఱినట్టు లగపడుచున్నది. ఈవ్యాఖ్యను రచించిన శ్రీధరస్వామి యాశ్లోకములకుఁ బైని చెప్పఁబడిన

"యావ త్పరీక్షితో జన్మ యావ న్నందాభిషేచనమ్,
ఏతద్వర్ష సహస్రంతు జ్ఞేయం పంచాశదు త్తరమ్."

అను శ్లోకమునందుఁ బరీక్షిత్తు జన్మకాలములకును, నందుని పట్టాభిషేకమునకును నడుమంగల కాలవ్యవధియని చెప్పఁబడిన సంఖ్యను తెలియఁజేయు 'ఏతద్వర్షసహస్రంతు జ్ఞేయంపంచశతో త్తరమ్' అను పాదమునందలి 'పంచశతో త్తరమ్' అను వాక్యమునకుమారు లేఖకప్రమాదజనితమగు 'పంచాశదు త్తరమ్' అను పాఠాంతరమునుబట్టి యాశ్లోకములకుఁ దరువాత నందుని పట్టాభిషేకము మొదలు సప్తర్షులు పూర్వాషాఢానక్షత్రమునకు వచ్చువఱకుఁ గలివృద్ధియగునని చెప్పఁబడిన

" విపరీతాని దృష్ట్వాచ నిమిత్తానిహి పాండవః,
యాతే కృష్ణే చకారాథ సోఽభిషేకంపరీక్షితః.
ప్రయాస్యంతి యదాచైతే పూర్వాషాఢాం మహర్షయః,
తదానందా త్ప్రభృత్యేష కలిర్వృద్ధిం గమిష్యతి."

అను శ్లోకములనుబట్టి నందుని పట్టాభిషేకకాలమున సప్తర్షులు పూర్వాషాఢా నక్షత్రమునందుండినట్లు భావించి వానిని

సమన్వయము జేయుతలంపునఁ బ్రయత్నపూర్వకముగ నట్టి వ్యాఖ్యానము గావించియుండినట్టు లగపడెడిని. మఘానక్షత్రము నుండి, క్రమముగ లెక్కించిన పూర్వాషాఢానక్షత్రము పదు నొకండవ నక్షత్రమగుచున్నది. దీనినిబట్టి పరీక్షిత్తు జననము మొదలు మహాపద్మనందుని పట్టాభిషేకమునాటికి పదునొకం డవశతాబ్దము జరుగుచుండినట్టుల గన్పట్టుటచే దానికనుగుణ ముగనుండునటుల

" యావత్పరీక్షితోజన్మ యావన్నందాభిషేచనమ్,
ఏత ద్వర్ష సహస్రంతు జ్ఞేయం పంచశతోత్తరమ్."

అను శ్లోకమునందు "పదిహేనువందల వత్సరముల కాల వ్యవధి" యని తెలియజేయు "ఏతద్వర్షసహస్రంతుజ్ఞేయం పంచశతోత్తరమ్" అను వాక్యములను "పదివందల యేబది వత్సరముల కాలవ్యవధి" యని తెలియఁజేయునటుల మూలము నందలి 'పంచశతోత్తరమ్' అను వాక్యమును 'పంచాశ దుత్తరమ్' అని సవరణఁజేసియుందురని గన్పట్టుచున్నది. ఇయ్యది యే తర్వాతికాలమునందు సప్తర్షులు వెనుకకు నడచుటలేద నియు, ముందునకు నడచుచుండిరనియు సిద్ధాంతము బయలు దేఱుటకు కారణమయ్యెండెను. శ్రీధరస్వామియు నట్టి భ్రమ ప్రమాదములకు వశుఁడై నటులఁ గన్పట్టెడి. ఈ యాత్మప్రకాశి కాఖ్యవ్యాఖ్యనురచించిన శ్రీధరస్వామి భాగవతమునకు భావా ర్థదీపికాఖ్యవ్యాఖ్యను రచించుసందర్భమున పరీక్షిత్తు జన్మకాల మునకును మహాపద్మనందుని పట్టాభిషేకకాలమునకును నడుమ

గల కాలవ్యవధి (౧౧౧౫) పదునొకండువందల పదియేను వత్సరము లయినటులఁ గన్పట్టు

"ఆరభ్య భవతో జన్మ యావన్నందాభిషేచనమ్.
ఏతద్వర్ష సహస్రంతు శతం పంచదశోత్తరమ్."*

అను శ్లోకమునకు

"వర్ష సహస్రం పంచదశోత్తరం శతంచేతి కయాఽపివివక్షయా అవాంతరసంఖ్యేయమ్.- వస్తుతస్తు పరీక్షిన్నందయో రంతరం ద్వాభ్యాం నూనంవర్షాణాం సార్ధసహస్రంభవతి. యతః పరీక్షిత్ సమకాలం మాగధంమార్జారి మారభ్య రిపుంజయాంతా వింశతి రాజానః సహస్రవత్సరంభోక్ష్యంతీ త్యుక్తం నవమస్కంధే "యేబార్హద్రథభూపాలాః భావ్యాః సహస్రవత్సరమ్." ఇతి తతః పరంపంచప్రద్యోతనా "అష్టాత్రింశోత్తరంశతం," శిశునాగాశ్చ "షష్ట్యుత్తరశతత్రయం భోక్ష్యంతి పృథివీమ్" ఇతి అత్రైవోక్తత్వాత్."

అని వ్యాఖ్యను రచించియుండెను. ఈవ్యాఖ్య

"పదునొకండువందలపదియేను సంవత్సరముల సంఖ్యను విమర్శించిన తప్పుసంఖ్య యగుచున్నది. పరీక్షిత్తునకును నందునకును నడుమఁగల కాలము రెండుతక్కువ పదియేను వందల సంవత్సరము లగుచున్నది. పరీక్షిత్తునకు సమకాలికుఁడగు మార్జారిమొదలు రిపుంజయునివఱకిరువదిమంది రాజులు మగధరాజ్యమును వేయివత్సరములు పరిపాలన సల్పియుండిరి. బార్హద్రథులు వేయివత్సరములు పరిపాలన సల్పియుండిరని నవమస్కం

* భాగ. ౧౨ స్కం. ౨ అధ్యా ౨౬ శ్లో.

ధమునఁ జెప్పఁబడియుండెను. వారి పిమ్మట నైదుగురు ప్రద్యోతనులు 138 సంవత్సరములును, శిశునాగులు 360 సంవత్సరములును పృథివిని బాలించియుండిరి. ఆ కారణమున 1115 సంఖ్య తప్పు సంఖ్య యగుచున్నది" అను భావము నిచ్చుచున్నది. కావున ప్రథమపాఠము "ఏతద్వర్ష సహస్రంతు జ్ఞేయం పంచశతోత్తరమ్" అనియే స్పష్టముగఁ గన్పట్టుచున్నది.

విష్ణుపురాణము 4 వ అంశము 23 వ అధ్యాయమున జెప్పబడిన విషయములనుబట్టి బార్హద్రథులు భారతయుద్ధానంతరము మగధదేశమును 1000 సంవత్సరములు పాలించినట్లును, వారి యనంతరము ప్రద్యోతనులు 138 సంవత్సరములును, ప్రద్యోతనుల యనంతరమున శిశునాగులు 362 సంవత్సరములును బాలించినటుల 24 అధ్యాయమునను జెప్పఁబడియున్నది. ఈవాక్యములనుబట్టి పరీక్షిత్తు మొదలు మహాపద్మనందుని పట్టాభిషేకమువఱకు 1500 సంవత్సరములు గడచినట్లు స్పష్టముగఁ గన్పట్టుచున్నది. పిమ్మట పరీక్షిత్తునకును మహాపద్మనందునకునుగల కాలవ్యవధినిఁ దెలియఁజేయుచు "యావత్పరీక్షితో జన్మ....." అను శ్లోకమునఁ జెప్పఁబడిన "ఏతద్వర్షసహస్రంతుజ్ఞేయం పంచాశదుత్తరమ్" అను వాక్యమునందలి "పంచాశదుత్తరమ్" అను వాక్యము "పంచశతోత్తరమ్" అను వాక్యమునకుమారు లేఖకప్రమాదజనితమని స్పష్టముగాగన్పట్టుచున్నది. అట్లుకాదనిన విష్ణుపురాణమునుజెప్పిన గ్రంథకర్త పరీక్షిత్తు జన్మకాలమునుండి మహాపద్మనందుని పట్టాభిషేచనము వరకు నడుమఁగల కాలమున పరిపాలనసల్పిన రాజవంశముల

యొక్కయు రాజులయొక్కయు కాలపరిమితులను 1500 సంవత్సరములుగఁజెప్పుచు వానిమొత్తము 1050 సంవత్సరములని చెప్పియుండెననుట యసంభవమును, నసంగతమును నయియుండును. మఱియు కొన్ని ప్రాతప్రతులయందీశ్లోకభాగము "ఏతద్వర్షసహస్రంతు జ్ఞేయం పంచశతోత్తరమ్" అనియే గన్పట్టుచున్నది.

ఇట్లు లేఖకప్రమాదజనితమగు భిన్నపాఠాంతరములుగల విష్ణుపురాణమునందలి శ్లోకమునుబట్టి పరీక్షిత్తు జన్మకాలమునకును, నందునిపట్టాభిషేకకాలమునకును నడుమగల కాలవ్యవధి 1050 సంవత్సరము లగునని కన్పట్టుటచేతను, పరీక్షిత్తుకాలమున సప్తర్షులు మఘానక్షత్రమునందుండినట్లు జెప్పబడియుండుటచేతను, నందుని పట్టాభిషేకకాలమున సప్తర్షులు పూర్వాషాఢా నక్షత్రమునందుండిరని భావించి మఘనుండి వరుసక్రమముగఁ బూర్వాషాఢానక్షత్రము పదునొకండవ నక్షత్రమయి యుండుటచేతను సప్తర్షులొక్కొకనక్షత్రమున నూఱువత్సరములుందురని చెప్పబడియుండుటచేతను పరీక్షిత్తుజన్మకాలమునుండి నందుని పట్టాభిషేకకాలమునకు పదునొకండవ శతాబ్దము జరుగుచుండినట్లు లగపడుచుండుటచేతను, మూలమునఁగన్పట్టు భిన్నపాఠాంతరముల యథార్థరూపములఁగనుగొను ప్రయత్నములుగావింపక భ్రమప్రమాదములకులోనై ఆత్మప్రకాశికాఖ్య వ్యాఖ్యకారుఁడు సప్తర్షు లేనక్షత్రమున నుండునది కనుగొను విధానమున కడుప్రయాసతో గావించిన వ్యాఖ్యను పురస్కరించుకొని సప్తర్షులశ్వన్యాదినక్షత్రముల వరుసక్రమముగఁదక్షిణ

గ్రహములవలెనే ముందునకు నడచుచుండినట్లుఁలెంచి కొందఱు సిద్ధాంతములఁ గావించుచుండిరి.

సప్తర్షిమండలము తక్కిన గ్రహములవలె ముందునకు నడువక వెనుకకు నడచుచుండునటుల హైందవుల సిద్ధాంతమయ్యుండెనని కొందఱు పాశ్చాత్యసిద్ధాంతులుసయితమంగీకరించియుండిరి.

సప్తర్షిమండలము వెనుకకు నడచుచుండునా లేక ముందునకు నడచుచుండునాయను సిద్ధాంతభేదములట్లుండ సప్తర్షులేనక్షత్రమునందుండినది కనుగొనువిధానమున నీ దిగువ కనుబరచినరీతిని మూఁడు సిద్ధాంతభేదము లుండినట్లు లగపడుచున్నది.

౧. సప్తర్షులలోఁ దూర్పుదిక్కుగనుండు తారలకుమధ్య సమముగ నర్ధరాత్రమున నేనక్షత్రము గన్పట్టుచుండునో సప్తర్షులానక్షత్రమునందుందురని (ఇయ్యది పురాణవేత్తలు, వృద్ధగర్గాదుల మతమయినటు లగపడుచున్నది. పరీక్షిత్తుకాలమున సప్తర్షులు మఘానక్షత్రమునందుడిరని చెప్పియుండిరి.)

౨. సప్తర్షు లుదయించుసమయమున ముంగలిభాగమునఁ దొలుతొలుతఁగన్పట్టు పులహక్రతువులకుమధ్య సమముగ ముంగలిభాగమున నర్ధరాత్రమునం దేనక్షత్రము గన్పట్టునో యానక్షత్రమున సప్తర్షులుందురని. (ఇయ్యది శ్రుతర్షుల మతమయినటు లగపడుచున్నది. భావార్థదీపికాఖ్యవ్యాఖ్యకారుఁ డీమతమునననుసరించి చెప్పియుండినట్లు లగపడెడిని. ఈసిద్ధాంతమువలన గలియుగాదిని అనఁగా పరీక్షిత్తుకాలమున సప్తర్షులు కృత్తికా నక్షత్రమునందుండిరనుచున్నారు.

3. సప్తర్షు లుదయించుసమయమున ముందరిభాగమున దోల్ద్రొల్లఁగన్పట్టు పులహ క్రతువులకుసమముగ దక్షిణోత్తరముల కొకరేఖను లిఖించిన యారేఖ యేనక్షత్రమునందుండునో యా నక్షత్రమున సప్తర్షులుందురని.(ఇయ్యది విష్ణుపురాణమున కాత్మ ప్రకాశికాఖ్యవ్యాఖ్యకారుఁడు ప్రతిపాదించిన సిద్ధాంతము. ఈ సిద్ధాంతమునుబట్టియుఁ బరీక్షిత్తుకాలమున సప్తర్షులు మఘ యందే యుండిరనుచున్నారు. ఈసిద్ధాంతమే సప్తర్షులు ముందు నకు నడచుచుందురను సిద్ధాంతము బయలుదేఱుటకుఁ గారణ మయినట్టు లగపడుచున్నది.)

ఈ సిద్ధాంతములననుసరించి ప్రస్తుతకాలమున సప్తర్షు లే నక్షత్రమున నుండునది కనుఁగొని కాలనిర్ణయముజేయఁ బ్రయ త్నింతము. ప్రథమసిద్ధాంతము ననుసరించి సప్తర్షులు ప్రస్తుతకా లమున అనఁగా క్రీ.శ. 1929_30 సంవత్సరమునకు సరియగు శుక్ల సంవత్సరమున హస్తానక్షత్రమున నుండినట్లును, రెండవసిద్ధాం తము ననుసరించి ఆర్ద్రానక్షత్రమునందుండినట్లును, మూఁడవ సిద్ధాంతము ననుసరించి పూర్వఫల్గునీ నక్షత్రమున నుండినట్లును గన్పట్టుచున్నది. ఆయాసిద్ధాంతముల ననుసరించి సప్తర్షులాయా నక్షత్రములఁ బ్రవేశించి యాఱేఁడు(6)లై నట్లు నగపడుచున్నది.

సప్తర్షు లొక్కొకనక్షత్రముననుండు కాలపరిమితినిగురిం చియు ప్రస్తుతకాలమున కొందరు భిన్నాభిప్రాయులై నట్లుగన్పట్టు చున్నది. పురాణాదులయందును, ప్రాచీనజ్యోతిషసిద్ధాంతగ్రం థములయందును స్థూలదృష్టిన శతవత్సరములకాలము సప్తర్షు

లొకొక్కనక్షత్రమున నుందురని చెప్పఁబడియుండెను గాని వాస్తవమున నా వత్సరపరిమితి సరికాదనియు, ఒకొక్కనక్షత్రమున 160 వత్సరములపర్యంత ముండెదరనియు శ్రీమహోపాధ్యాయ ఆచంట వేంకటరాయ సాంఖ్యాయనశర్మగారు చెప్పియుండిరి.*వీ రట్టియభిప్రాయము గలిగియుండుటకు కారణము కలియుగమునందు 653 సంవత్సరములకు కురుపాండవులుండిరని చెప్పిన కల్హణపండితునివచనము లాధారముగగైకొని యుధిష్ఠిరునికాలమున సప్తర్షులు మఘయందుండినటులఁ జెప్పబడియుండుటచేతను, తామా వ్యాసమును వ్రాయుకాలమున సప్తర్షులు మఘయందుండిరని యెంచి, యుధిష్ఠిరుని కాలమునుండి తమ కాలమువఱకు సప్తర్షులు నక్షత్రమండలము నొకసారి చుట్టివచ్చి తిరిగి రెండవయావృత్తియందు మఘానక్షత్రమునందుండినటుల భావించి, కాలనిర్ణయముగావింపఁ దలపెట్టుటయే యైనటులఁ గన్పట్టెడి. సప్తర్షులొకసారి నక్షత్రమండలమును చుట్టివచ్చి మఘయందుచేరిరనిన పురాణాది ప్రాచీనవాఙ్మయమున చెప్పఁబడిన పరిమితిననుసరించి యుధిష్ఠిరుని కాలమునుండి తమకాలమువఱకు ఇఱువదియేఁడు శతాబ్దములు గడచి యిఱువదెన్మిదవ శతాబ్దము జరుగుచుండినటులఁ గన్పట్టును. దానినిబట్టి క్రీ. పూ. 8 శతాబ్దములో యుధిష్ఠిరుఁడుండినటులఁ జెప్పవలసి వచ్చును. ఈచిక్కును దాటుకొనుటకై పురాణాదులలో చెప్పఁబడిన కాలపరిమితి స్థూలదృష్టితోఁ జెప్పఁబడియుండెననియు సరికాదనియు త్రోసిపుచ్చి కలియుగాబ్దము 653 సంవత్సరము

* శారద Vol. 2, part 3, 4 & 5.

నుండి తమకాలమునకు నలువదినాలవశతాబ్దము జరుగుచున్నట్లు లగపడుచుండుటచే సప్తర్షు లొక్కొక నక్షత్రమున నూటయు ఱువది సంవత్సరములకంటె యెక్కువకాలముండెదరని గణితము చేసియుండిరి. వీరును సప్తర్షు లేనక్షత్రమున నుండునది కనుఁగొను విధానమున తృతీయసిద్ధాంతము ననుసరించియుండినటులఁ గన్పట్టెడి.

క్రి. శ. 1931 వ సంవత్సరమున సప్తర్షులు పూర్వఫల్గునీ నక్షత్రమున సంచరించుచుండినట్లు బ్రహ్మశ్రీ పోలూరు వెంకట సుబ్బయ్యశాస్త్రిగారిచే గుణింపఁబడిన ప్రజోత్పత్తినామసంవత్సరపంచాంగమునం దిట్లు జెప్పఁబడియున్నది:—

"పౌర్ణమ్యాం మార్గశీర్షేహ్నిదృష్టాస్సప్తర్షయోయుతాః, ఫల్గుణ్యాపూర్వయా నేత్రాగ్నిగగనేషు (5032) సమేకలౌ.

సప్తర్షీణాంతు యౌ పూర్వౌ దృశ్యేతేహ్యుదితేదివి, తయోస్తు మధ్యే నక్షత్రం దృశ్యతే యత్సమంనిశి.

ఋషయస్తేన తిష్ఠంతి శతఘ్నం మాసరుద్రకం (1100), తత శ్చభగణస్తేషాంశా సభారాబ్దసమ్మతః. (2475:).

యదాపురామఘా స్యాసన్ తదాకృష్ణో దివంగతః, యస్మిన్కృష్ణోదివంయాతస్తస్మిన్నేవ తదాహని,

ప్రతిపన్నంకలేర్యుగమితి పరాశరోఽబ్రవీత్,

చకారసుస్ఫుటంతత్తు కల్యాణానంద భారతీ."†

వీరి సిద్ధాంతమునుబట్టి ప్రస్తుతకాలమున సప్తర్షులు పూర్వఫల్గునీనక్షత్రమునందుండినటులఁ జెప్పుచున్నారు. వీరు మూఁ

---

† ప్రజోత్పత్తినామసంవత్సర పంచాఙ్గమ్. ౨౧ పేజీ.

డవసిద్ధాంతము "సప్తర్షు లుదయించుసమయమున ముంగలి భాగమునఁ దొలుతొలుతఁ గన్పట్టు పులహక్రతువులకు సమముగ దక్షిణోత్తరముల కొకరేఖను లిఖించిన యారేఖ యేనక్షత్రమునందుండునో యా నక్షత్రమున సప్తర్షులుందురు" అని విష్ణుపురాణమునకు వ్యాఖ్యయగు ఆత్మప్రకాశికాఖ్యవ్యాఖ్యకారుని మతము ననుసరించుచుండిరనుట స్పష్టము. ప్రస్తుతకాలమున నీసిద్ధాంతము ననుసరించి పులహక్రతువులకు సమముగ ఉత్తర దక్షిణముల కొకరేఖను లిఖించిన నయ్యది పూర్వఫల్గునీ నక్షత్రమునందుండినట్లే గన్పట్టును. ఈ సిద్ధాంతవాదులును బరీక్షిత్తు కాలమున సప్తర్షులు మఘానక్షత్రమునందుండినటులనే చెప్పుచున్నారు. మఱియు సప్తర్షు లశ్వన్యాదినక్షత్రముల వరుస క్రమముగఁ దక్కిన గ్రహములవలెనే ముందునకు సంచరించుచుందురను సిద్ధాంతమును బ్రతిపాదించుచున్నారు. కలియుగము ప్రవేశమయి యిప్పటికి 5032 (ఐదువేల ముప్పదిరెండు) వత్సరములు అనఁగా నేఁబదియొకటవ శతాబ్దము జరుగుచున్నట్లు లొప్పుకొనుచున్నారు. మహాభారతయుద్ధ మంతకుపూర్వమే జరిగియుండెననియు నొప్పుకొనుచున్నారు. ఇఁక వీరిసిద్ధాంతము ననుసరించి చూచిన పరీక్షిత్తుకాలమునుండి యిప్పటివఱకు సప్తర్షులు నక్షత్రమండలమును రెండుపర్యాయములు చుట్టివచ్చి మూఁడవయావృత్తిలో మఘనుండి రెండవనక్షత్రమగు పూర్వఫల్గునీనక్షత్రమునఁ బ్రవేశించినట్లు లగపడుచున్నది. దీనింబట్టి సప్తర్షు లేఁబదియైదు నక్షత్రములలో సంచరించి యేఁబదియాఱవ (27 + 27 + 2) నక్షత్రమునకు వచ్చినట్లు లగపడుచున్నది.

సప్తర్షులొక్కొక్క నక్షత్రమున నూఱుసంవత్సరములకాలము సంచరించెదరని పురాణాది ప్రాచీనవాఙ్మయమునఁ జెప్పఁబడిన పరిమితిననుసరించి పరీక్షిత్తుకాలము మొదలు ప్రస్తుతకాలము వఱకు నేఁబదిరెండు శతాబ్దములు గడచి యేఁబదియాఱవ శతాబ్దము జరుగుచున్నట్లు లగపడుచున్నది. వీ రాధారముగఁ గైకొనిన విష్ణుపురాణమునందు సైతము

"తేన సప్తర్షయో యుక్తా స్తిష్ఠంత్యబ్ద శతంనృణామ్,
తేతు పారీక్షి తేకాలే మఘాస్వాస న్ద్విజోత్తమ" *

అనియే చెప్పఁబడియున్నది. ఆత్మప్రకాశికాఖ్యవ్యాఖ్యకారుఁడును ఆకాలపరిమితి నంగీకరించియే చెప్పియున్నాఁడు. ఈసిద్ధాంతము ననుసరించి కాలనిర్ణయముఁగావించిన కలియుగాదినుండి యిప్పటికి యేఁబదిరెండు శతాబ్దములు గడచినటుల గన్పట్టుచున్నది. ఇయ్యది కలియుగము ప్రారంభమయి యిప్పటికి 5031 (అయిదువేల ముప్పదియొకటవ) సంవత్సరము జరుగుచున్నదను విషయమునకు ప్రతిబంధకముగ నున్నది. దీనింబట్టి వాస్తవముగజరుగుచున్న కాలపరిమితికంటె నాలుగు శతాబ్దముల పైకాలమెక్కువగ జరుగుచున్నటుల గన్పట్టుచున్నది. ఈచిక్కును దాటుకొనుటకు సప్తర్షులొక్కొకనక్షత్రమున నూఱుసంవత్సరములు సంచరించుచుందురని ప్రాచీనవాఙ్మయమున గన్పట్టు సిద్ధాంతమును రూపుమాపి ఒక్కొకనక్షత్రమునఁ బదునొకండువందల (1100) మాసములుందురనియు, నక్షత్ర

---

*విష్ణు. 4. అం. 24 అధ్యా-106 శ్లో.

మండలమును 2475 (ఇరువదినాలుగువందల డెబ్బదియైదు) వత్సరములకుఁ జుట్టివచ్చెదరనియు,

"తేన సప్తర్షయో యుక్తాః స్థిషంత్యబ్దశతం నృణామ్".

అను మూలమునందలి శ్లోకపాదమునకు

"ఋషయస్తే నతిష్ఠంతి శతఘ్నుంమాసరుద్రికం (౧౧౦౦మాసాః)
తతశ్చభగణస్తేషాం శాసభారాబ్దసమ్మితః (౨౪౭౫సం.)"

అనుపాఠాంతరముల నిర్మించి తమసిద్ధాంతము ననుసరించి కాల పరిమితిని సరిపుచ్చుచున్నటు లగపడుచున్నది. ఆత్మప్రకాశికాఖ్యవ్యాఖ్యను రచించిన శ్రీధరస్వామిమూలమున లేఖకప్రమాదజనితమగు శ్లోకమునందలి వాక్యములను మార్పుఁ గావించక యే దానినిసమర్థించుటకై సప్తర్షు లేనక్షత్రమున సంచరించుచుందురో కనుగొను విధానమునుగురించి కడుప్రయాసపూర్వకముగఁ బ్రయత్నపూర్వకముగ మూలమునకు భిన్నముగఁ బులహక్రతువులకుఁ సమముగ నుత్తరదక్షిణముల కొకరేఖను లిఖించిన యారేఖ యేనక్షత్రమునందుండునో యానక్షత్రమున సప్తర్షులు సంచరించుచున్నటులఁ దెలిసికొనవలసియుండునని వ్యాఖ్యను రచించియుండెను. కాని తనకాలమున నేనక్షత్రమునందుండినదియుఁ జెప్పినవాఁడుకాఁడు. ఆవిధానము ననుసరించి కాలనిర్ణయములను గావించుపట్టునఁ గల్గెడు ప్రతిబంధకముల నుండి తప్పించికొనుటకై మూలమున చెప్పఁబడినకాలపరిమితులనే తప్పని తుడిచివైచి నూతనకాలపరిమితుల నేర్పాటుఁగావించుటకు మూలములనే మార్చవలసివచ్చుచున్నది. ఇట్లు మనము

ప్రతిపాదించు సిద్ధాంతముల కనుకూలించునట్లు మూలమునఁ జెప్పఁబడిన విషయములనే మనయిచ్ఛవచ్చినటుల మార్పులుఁ గావించుచుండిన ప్రాచీనాధునాతన కాలములకును అధునాతన ప్రాచీన కాలములకును, సరిపుచ్చుట కవకాశము లేకుండునా?మన ప్రాచీనవాఙ్మయమునఁగన్పట్టుభిన్న భిన్న పాఠాంతరములు తాముఁ గావింపఁదలఁచిన సిద్ధాంతముల కనుకూలించునట్లు కొందఱు పండితవరేణ్యు లిట్టిమార్పులుఁగావించియుందురని చెప్పెడు వారి వచనములయందేమాత్రమైనను యథార్థముండకపోవునా యని తలంచుట కవకాశము లేక పోలేదు.

మఱియు సప్తర్షులొకసారి నక్షత్రమండలమును చుట్టి వచ్చుకాల మొకసప్తర్షియుగమనియు, నీ సప్తర్షియుగము దేవ కాలమానమున నేఁడుదివ్యవత్సరముల యాఱుదివ్యమాసముల కాలమగుచుండెననియుఁ జెప్పబడియుండెను. ఒక్కొక దివ్య వత్సరము మున్నూటయఱువది (360) మానవాబ్దములకాల మనియుఁ జెప్పఁబడియుండెను. ఈ గణితపద్ధతిననుసరించి సప్తర్షి యుగము అనఁగా సప్తర్షులొకసారి 27 (యిఱువదియేఁడు) నక్ష త్రములను జుట్టివచ్చు కాలపరిమితి దివ్యమానవత్సరపరిమితిని బట్టిచూచినను 2700 (360 × 7½) ఇఱువది యేఁడువందల మానవాబ్దములగుచున్నది. ఇయ్యది సప్తర్షులొక్కొక నక్షత్ర మున మానవాబ్దమున నూఱేడులుసంచరించుచుందురని మూల మునఁజెప్పఁబడిన పరిమితి కన్నివిధముల సరిపోవుచున్నది. దీనిం బట్టి సప్తర్షులొక్కొకనక్షత్రమునఁ బదునొకండువందల మానస ములుందురనియు, నిఱువదినాలుగువందలడెబ్బదియైదు వత్స

రములకొకసారి నక్షత్రమండలమును చుట్టివచ్చుచుందురనియు గావించెడు గణితము సరికాదని స్పష్టముగఁ గన్పట్టుచున్నది. మఱియు పరీక్షిత్తుకాలమున మఘయందుండినసప్తర్షులు ప్రస్తుత కాలమునఁ బూర్వఫల్గునియం దుండిరనియు, సప్తర్షులశ్వన్యాది నక్షత్రముల వరుసక్రమముగ ముందుకు నడచుచుందురనియుఁ గావించెడు సిద్ధాంతములును సరిగావనియు కన్పట్టుచున్నది. ఈ సిద్ధాంతప్రతిపాదనకు కారణమగు శ్రీధరస్వామి ఆత్మప్రకాశికాఖ్యవ్యాఖ్యను రచించుకాలమున నాసిద్ధాంతము ననుసరించి సప్తర్షు లేనక్షత్రమునందుండినదియు కనుఁగొని కాలనిర్ణయము గావించిచూచిన తాముసూచించినవిధానమునందలి లోపమును శ్రీధరస్వామి గ్రహించియే యుండును. శ్రీధరస్వామియట్లు కనుఁగొనుటకు ప్రయత్నించినట్లు గన్పట్టుటలేదు. వీరిసిద్ధాంతము ననుసరించిచూచిన పరీక్షిత్తుకాలమున సప్తర్షులు మఘయందుగాక పుష్యమినక్షత్రమునందుండెననియు వెనుకనడకతో సప్తర్షులు సంచరించుచుందురనియు చెప్పిన సరిపోవును.

మఘయందుండినట్లును, శ్రుతర్షులు పురాణవేత్తలు, వృద్ధగర్గాదిసిద్ధాంతులును పరీక్షిత్తుకాలమున సప్తర్షులు కృత్తికయందుండినట్లును జెప్పియుండిరనుచున్నారు. ఈభేదమిదివరలోఁ జెప్పియుండినట్లు సప్తర్షులుండునక్షత్రమును కనుఁగొనువిధానమునందుగల భిన్నాభిప్రాయములఁబట్టి కలిగియుండెను. సప్తర్షులుండు నక్షత్రమును కనుగొను విధానమునఁగల సిద్ధాంతభేదములలో మొదటిసిద్ధాంతమును అనఁగా సప్తర్షులలో పూర్వదిక్కుగనుండు తారలకు సమముగ నర్ధరాత్రమున గన్పట్టు

నక్షత్రము సప్తర్షులుండు నక్షత్రమనియెడు సిద్ధాంతముననుసరించి పురాణవేత్తలు వృద్ధగర్గాదులును పరీక్షిత్తుకాలమునందు మఘయందుండిరనియు, రెండవసిద్ధాంతమును అనఁగా సప్తర్షులుదయించుసమయమున ముంగలిభాగమునఁ దోలుతోలుతఁగన్పట్టు పులహాక్రితువులకు మధ్యను సరిగా నెదుటిభాగమునం దర్ధరాత్రిమున గన్పట్టునక్షత్రము సప్తర్షులుండు నక్షత్రమనియెడి సిద్ధాంతముననుసరించి శుక్రితర్షులు పరీక్షిత్తుకాలమున సప్తర్షులు కృత్తికయందుండిరనియుఁ జెప్పియుండినటు లగపడుచున్నది. అయావిధానముల ననుసరించిచూచిన ప్రిస్తుతకాలమున వృద్ధగర్గాదుల మతముననుసరించి హస్తానక్షత్రిమునందును, శుక్రితర్షులమతము ననుసరించి ఆర్ద్రానక్షత్రమునందును, సప్తర్షులు సంచరించుచుండినట్లు గన్పట్టుచున్నది. ఇఁక వీనినిబట్టి కాలన్నిర్ణయముజేయఁ బ్రియత్నింతము.

ప్రిథమసిద్ధాంతమునుబట్టి అనగా వృద్ధగర్గాదుల మతము ననుసరించి ప్రస్తుతకాలమున హస్తానక్షత్రముననుండు సప్తర్షులు, తక్కినగ్రహములవలెనే ముందునడకతో సంచరించుచుందురను వారిసిద్ధాంతము ననుసరించిచూచిన మఘనుండి హస్తానక్షత్రము నాలవ నక్షత్రిమగుటచే వార లొకసారి నక్షత్రిమండలమును చుట్టివచ్చి రెండవ యావృత్తిలో హస్తానక్షత్రమునకు వచ్చియుందురని దలఁచిన ముప్పదియొక్క నక్షత్రిములకాలము—అనఁగా నొక్కొక నక్షత్రిమున నూఱేండులుందురని చెప్పఁబడియుండుటచే పరీక్షిత్తుకాలమునుండి యిప్పటికి ముప్పదియొకటవ శతాబ్దము జరుగుచుండినటు లగపడును. కలియుగప్రవేశమై యిప్ప

టికి 5032 సంవత్సరము లయ్యుండెనని యంద రంగీకరించు చున్నారు. పరీక్షిత్తు కలియుగప్రవేశకాలమునకు బూర్వము ము ప్పదియేడు వత్సరముల క్రిందట ననఁగా మహాభారతయుద్ధము జరిగిన సంవత్సరముననే జననమందియుండెనని చెప్పఁబడియుండు టచే పరీక్షిత్తుకాల మిప్పటికి 5032 సంవత్సరములకు తక్కువ కాలము కానేరదు. కావున పరీక్షిత్తుకాలమున మఘయందుం డిన సప్తర్షులు నక్షత్రమండలమును రెండు పర్యాయములు చుట్టివచ్చి మూడవ యావృత్తిలో హస్తానక్షత్రమునకు వచ్చి యుండిరని చెప్పవలసివచ్చుచున్నది. అట్లులైన పరీక్షిత్తుకాలము నుండి సప్తర్షులు 58 (27 + 27 + 4) నక్షత్రముల కాలము- అనఁగా నేఁబదియెనిమిది శతాబ్దములకాలము గడపియుండి నటుల గన్పట్టుచున్నది. ఇయ్యది అన్నివిధముల చరిత్రాంశము లకు విరుద్ధముగ నుండినది. కాలనిర్ణయమున దాదాపుగ నేఁడు శతాబ్దముల కాలవ్యత్యాసము కన్పట్టుచున్నది. ఈ కాలవ్య త్యాసము సప్తర్షులు గ్రహములన్నిటివలెనే ముందుకు నడచు చుందురను వారి సిద్ధాంతము ననుసరించి గణితముచేయుట వలన కలుగుచున్నది. ఇఁక సప్తర్షులు వెనుకకు నడచుచుందు రను సిద్ధాంతముననుసరించి జూచెదము. మఘనుండి హస్తా నక్షత్ర మిఱువదియైదవ నక్షత్రమగుచున్నది. సప్తర్షులు మొ దటి యావృత్తిలోనే మఘయందుండిరనిన నిప్పటికి పరీక్షిత్తు కాలమునుండి యిఱువదినాలుగు శతాబ్దములు గడచి యిఱువది యైదవశతాబ్దము జరుగుచున్నటు లగపడును. ప్రస్తుతము కలి యుగాబ్దము 5032 సంవత్సరము జరుగుచుండుటచే సప్తర్షు

లొకసారి నక్షత్రమండలమునుచుట్టివచ్చి రెండవయావృత్తిలో హస్తానక్షత్రమునకు వచ్చినట్లుజెప్పఁదగియున్నది. అటులైనచో సప్తర్షులు పరీక్షిత్తుకాలమునుండి యేఁబదియొక్క నక్షత్రము లను చుట్టివచ్చి యేఁబదిరెండవ నక్షత్రమగు హస్తానక్షత్రమున (27 + 25) నుండిరనియు, పరీక్షిత్తుకాలమునుండి యేఁబదియొకటవ శతాబ్దము జరుగుచుండెననియు గన్పట్టుచున్నది. పరీక్షిత్తుకాలమున మఘయందుండిరి. యుధిష్ఠిరునికాలమునను మఘయందుండినట్లును, కలియుగప్రవేశమునకు పూర్వము 75 (డెబ్బదియైఁదు) వత్సరములకిందట మఘయందు ప్రవేశించియుండిరనియు, కలియుగము 25 (యిరువదియైఁదు) వత్సరములు గడచినపిమ్మట నాశ్లేషయందు బ్రవేశించియుండిరనియు చెప్పఁబడియుండెను. ప్రస్తుతకాలమున హస్తానక్షత్రమునందుఁ బ్రవేశించి యేఁడుసంవత్సరములు గడచియుండెను. దీనినిబట్టి మఘయందు సప్తర్షు లిప్పటికైఁదువేల నూఁటయేఁడుసంవత్సరముల (5032 + 75)కిందట ననఁగాఁ గ్రీ. పూ. 3177 (5107-1930) సంవత్సరమున బ్రవేశించియుండిరనియు, ఆశ్లేషానక్షత్రమున క్రీ. పూ. 3077 సంవత్సరమున బ్రవేశించియుండిరనుటయు సిద్ధము. దీనినిబట్టి సప్తర్షియుగమున ప్రస్తుతము యేఁబదిరెండవ శతాబ్దము జరుగుచుండినటుల గన్పట్టుచున్నది. ఇయ్యది అన్నివిధముల చరిత్రాంశములకు సరిపోవుచున్నది. ఈ గణితమునుబట్టి సప్తర్షులు మఘయందు కలియుగమునకుఁ బూర్వము డెబ్బదియైఁదు సంవత్సరములకాలమును కలియుగము ప్రారంభమైనతర్వాత 25 (యిరువదియైఁదు) వత్సరముల వఱకుండినట్లు స్పష్టముగఁ

దెలియుచున్నది. కావున సప్తర్షులు, పురాణవేత్తలు, వృద్ధ గర్గాదులు జెప్పినటులఁ బరీక్షిత్తు యుధిష్ఠిరకాలములయందు మఘానక్షత్రమునందుండిరనియు, వార లొక్కొక నక్షత్రమున నూతేండుల పర్యంతము సంచరించుచు వెనుకనడకతో నక్షత్రమండలమును చుట్టివచ్చుచుందురనియుఁ బ్రకృతకాలమున హస్తానక్షత్రమున సంచరించుచుండిరనియు జెప్పఁదగియున్నది.

సప్తర్షు లేనక్షత్రమున సంచరించునది కనుగొనువిధానమున రెండవ సిద్ధాంతము ననుసరించి పరీక్షిత్తుకాలమున సప్తర్షులు కృత్తికానక్షత్రమున నుండినట్లు శ్రుతర్షులయభిప్రాయమైనట్టు లిదివరలో కనఁబరచియుంటిమి. ఆ విధానమున ప్రస్తుత కాలమున సప్తర్షులు ఆర్ద్రానక్షత్రమున సంచరించుచుండినటుల జెప్పియుంటిమి. సప్తర్షిమండలము ముందునకు నడచుచుండునని యెంచిన కృత్తికనుండి ఆర్ద్ర నాలవనక్షత్రమగుచున్నది. కలియుగము ప్రారంభమయి 5032 సంవత్సరము జరుగుచుండుట చేతను, కలియుగప్రారంభమున పరీక్షిత్తుని పట్టాభిషేకమగుట చేతను, పరీక్షిత్తు కాలమునుండి సప్తర్షిమండలము రెండుపర్యాయములు నక్షత్రమండలమునుచుట్టివచ్చి మూడవయావృత్తిలో ఆర్ద్రానక్షత్రమునకు వచ్చియుండినట్లు జెప్పవలసివచ్చుచున్నది. అట్లయినచో నిప్పటికిపబదియేడు శతాబ్దములుగడచి ఏబదియెనిమిదవ శతాబ్దము(27 + 27 + 4)జరుగుచున్నటులఁ జెప్పవలసివచ్చుచున్నది. ఇయ్యది యథార్థముగ జరగినకాలమునకంటె దాదాపుగ నేడుశతాబ్దములకాల మెక్కుడుగ జరిగినటుల గన్పట్టుచున్నది. ఈవ్యత్యాసము సప్తర్షిమండలము ముందుకు

నడచుచుండు నను వారల సిద్ధాంతము ననుసరించి గావించిన గణితమునుబట్టి కలుగుచున్నది. కావున వెనుకకు నడచుచుండు నను సిద్ధాంతము ననుసరించి గణితముజేసిన కృత్తికనుండి ఆర్ద్రి యిఱువదియైదవ నక్షత్రమగుచున్నది. కలియుగము ప్రారంభ మయి యేఁబదియొకటవ శతాబ్దము జరుగుచున్నట్లుఁ జెప్పఁబడి యుండుటచే సప్తర్షిమండలమొకసారి నక్షత్రమండలమును జుట్టివచ్చి రెండవయావృత్తిలో ఆర్ద్రియందు ప్రవేశించియుండె నని చెప్పిన యేబదియొక్క శతాబ్దములు గడచి యేఁబది రెండవ శతాబ్దము (27 + 25) జరుగుచున్నటులఁ గన్పట్టుచున్నది. ఇయ్యది అన్ని విధముల చరిత్రాంశములకు సరిపోవుచున్నది. కావున సప్తర్షులు వెనుకకు నడచుచుందురనియు, ఒక్కొక్క నక్షత్రమున శతవర్షములుందురనియు స్పష్టముగ గన్పట్టుచున్నది.

ఈ రెండు సిద్ధాంతముల ననుసరించియు సప్తర్షులు వెనుకకు నడచుచుందురని యెంచిన నొకే కాలమునందు వారు (సప్తర్షులు) కత్తికానక్షత్రమునందుండిరని శ్రుతర్షులును, మఘా నక్షత్రమునందుండిరని పురాణవేత్తలును వృద్ధగర్గాదిప్రాచీన సిద్ధాంతులును భావించి చెప్పుటకు సప్తర్షు లేనక్షత్రమునందుం డునదియు కనుఁగొను విధానమున వారిలో వారికిఁగల సిద్ధాంత భేదములే కారణమయియుండెనని స్పష్టముగఁ గన్పట్టుచున్నది.

## యుధిష్ఠిరుని కాలము.

ప్రకృతము క్రీ. శ. 1929-30 సంవత్సరమునకు సరియగు శుక్లసంవత్సరమున సప్తర్షులు హస్తానక్షత్రమునందుండినట్లును,

హస్తానక్షత్రమునఁ బ్రవేశించి యాతేఁడులైనట్లును దెలిసికొని యుంటిమి. సప్తర్షులు వెనుకకు నడచుచుందురని చెప్పఁబడి యుండుటచే హస్తానక్షత్రము యుధిష్ఠిరుని కాలమునందుండి నట్లు చెప్పఁబడిన మఘానక్షత్రమున కిఱువదియైదవ (25) నక్షత్రమగుచున్నది. సప్తర్షులొక్కొక నక్షత్రమున నూతేఁడు (100) లుందురని చెప్పఁబడియుండుటచే నయ్యది యిఱువది నాల్గు (24) శతాబ్దముల కాలమగుచున్నది. అదియే యుధిష్ఠిరునికాలమని తలంచిన క్రీ. పూ. 470 (2400—1930) సంవత్సరప్రాంతమున యుధిష్ఠిరుని రాజ్యకాలమగునని చెప్పఁవలసి వచ్చుచున్నది. ఇయ్యది చరిత్రాంశములకన్నిటి కతిరిక్తముగ నుండును. కావున యుధిష్ఠిరుని కాలమునుండి సప్తర్షులొకసారి జ్యోతిశ్చక్రమును జుట్టివచ్చి రెండవయావృత్తి (Rotation) యందు మరల హస్తానక్షత్రమున కిపుడు వచ్చియుందురని చెప్పఁదగియుండును. పురాణములు మున్నగు హైందవవాఙ్మయమునం దట్లే చెప్పఁబడియుండెను. దీనింబట్టి యుధిష్ఠిరుని కాలమునుండి సప్తర్షు లిఱువదేఁడు నక్షత్రములఁ జుట్టివచ్చి తిరిగిమఘలోఁజేరి యటనుండి మరల రెండవ యావర్తిలో నిఱువదినాలుగు నక్షత్రములుదాటి యిఱువదియైదవ నక్షత్రమగు హస్తానక్షత్రమున నిప్పటికాతేఁడుల క్రిందటఁ బ్రవేశించియుండిరని చెప్పిన యుధిష్ఠిరునికాల మిప్పటికి 51 (27 + 24) నక్షత్రములపై కాలము క్రిందట ననఁగా 5106 {(51 × 100) + 6} సంవత్సరముల క్రిందట నారంభమైయుండునని విశదమగు

చున్నది. అది క్రీ. పూ. 3177 (5106-1929) సంవత్సరమగు చున్నది.

కలియుగప్రవేశము యిఱువదియైదు సంవత్సరములు గడచినపిమ్మట సప్తర్షు లాశ్లేషానక్షత్రమునఁ బవేశించినట్లును, యుధిష్ఠిరుఁడపుడు స్వర్గారోహణుండైనట్లును, యుధిష్ఠిరుని జ్ఞాపకార్థము లౌకికాబ్దమప్పుడే యేర్పాటుఁగావింపఁబడియుండిన ట్లును జెప్పఁబడియుండెను. మఘానక్షత్రపరిమితి శతవత్సరములగు టచే సప్తర్షులు క్రీ. పూ. 3077 (3177-100) సంవత్సరము నందాశ్లేషానక్షత్రమునఁ బ్రవేశించియుండినట్లుఁ దెలియు చున్నది. అయ్యదియే- అనఁగా గ్రీ. పూ. 3077-76 యుధి ష్ఠిరుఁడు స్వర్గారోహణుండైనకాలమును, లౌకికాబ్ద (Laukika Era) మారంభమైనకాలమును నైనట్లును, యుధిష్ఠిరునికాలము క్రీ. పూ. 3077 సంవత్సరముతో నంతమైనట్లును గన్పట్టుచున్నది. కలియుగమారంభమయిన 25 సంవత్సరములకుఁ దరువాత యధిష్ఠిరుఁడు స్వర్గారోహణుండైనట్లు చెప్పఁబడియుండుటచేఁ గలియుగము క్రీ. పూ. 3102 (3077 + 25) సంవత్సరమునఁ బ్రారంభమైయుండెనని చెప్పఁదగియున్నది.

శ్రీకృష్ణనిర్యాణముతోఁ గలియుగము ప్రవేశించె ననియు, శ్రీకృష్ణ నిర్యాణమునువిని యుధిష్ఠిరుఁడు సింహాస నమునం దర్జునుని పౌత్రుఁడును, నభిమన్యునిపుత్త్రుఁడు నగు పరిక్షితుని పట్టాభిషిక్తునిఁగావించి సోదరులతోఁగూడి భూప్రద క్షిణముగావించుటకు బయలుదేఱియుండెననియుఁ జెప్పఁబడి

యుండుటచేఁ బరిక్షితుని పట్టాభిషేకమును, శ్రీకృష్ణనిర్యాణమును గ్రీ. పూ. 3102 సంవత్సరమున జరగియుండెనని చెప్పఁదగియున్నది.

మఱియు భారతయుద్ధానంతరము యుధిష్ఠిరుఁడు ముప్పదియేడేండ్లు పరిపాలన మొనర్చియుండెనని చెప్పఁబడియుండుటచే యుధిష్ఠిరుని పట్టాభిషేకము క్రీ. పూ. 3139 (3102 + 37) సంవత్సరమున జరగియుండుననియుఁ జెప్పఁదగియున్నది. కావున మహాభారతయుద్ధము క్రీ. పూ. 3139 సంవత్సరప్రాంతమున జరగియుండునని చెప్పఁదగియున్నది.

ఇవి యన్నియుఁ బురాణములు మున్నగు హైందవ వాఙ్మయమునందుఁ జెప్పఁబడినకాలములకు సరిపోవుచున్నవి. మఱియు వరాహమిహిరుఁడు క్రోడీకరించిన "ఆసన్ మఘాసుమునయః" అను శ్లోకమునఁ బేర్కొనఁబడిన శకకాలము శకసామ్రాజ్య ప్రారంభకాలమగు క్రీ. పూ. 550 సంవత్సరమున నేర్పాటుకాఁబడిన శకకాలముతో గణితమువేసిన శకకాలమునకును యుధిష్ఠిరునకును మధ్యంగల కాలవ్యవధి 2526 (3076—550) సంవత్సరములగునని చెప్పంబడిన వత్సరసంఖ్యకును సరిపోవుచున్నది. కావున వరాహమిహిరునిచేఁ బేర్కొనఁబడిన శకకాలము, శకనృపకాలము, శకభూపకాలము, శకేంద్రకాలము ననునవి క్రీ. శ. 78 సంవత్సరమునుండి ప్రారంభమైన శాలివాహనశకకాలము కాదనియుఁ, గ్రీ. పూ. 57 సంవత్సరమునుండి ప్రారంభమైన విక్రమార్కశకకాలము కాద

నియుఁ, గ్రీ. పూ. 457 సంవత్సరమునుండి ప్రారంభమయిన శ్రీహర్షశకకాలము కాదనియు, క్రీ. పూ. 550 సంవత్సరమున శకనుల సామ్రాజ్యప్రారంభకాలముతో నేర్పాటుకాఁబడిన శక కాలమగుననియుఁ జెప్పఁదగియున్నది.

కావున

| | | | |
|---|---|---|---|
| 1 | మహాభారతయుద్ధకాలము | క్రీ. పూ. | 3139 సం॥ |
| 2 | యుధిష్ఠిరుని పట్టాభిషేకము | ,, | 3139 సం॥ |
| 3 | పరీక్షితుని జన్మము | ,, | 3139 సం॥ |
| 4 | శ్రీకృష్ణుని నిర్యాణము | ,, | 3102 సం॥ |
| 5 | కలియుగప్రవేశము | ,, | 3102 సం॥ |
| 6 | పరీక్షితుని పట్టాభిషేకము | ,, | 3102 సం॥ |
| 7 | యుధిష్ఠిర స్వర్గారోహణము | ,, | 3077 సం॥ |
| 8 | లౌకికాబ్దప్రారంభము | ,, | 3077 సం॥ |
| 9 | శకకాలము, శకనృపకాలము, శకేంద్రకాలము, శకభూపకాలము - ప్రారంభము | ,, | 550 సం॥ |
| 10 | శ్రీహర్షశకప్రారంభము | ,, | 457 సం॥ |
| 11 | విక్రమార్కశకప్రారంభము | ,, | 57 సం॥ |
| 12 | శాలివాహనశకప్రారంభము | క్రీ. శ. | 78 సం॥ |

అయినట్లుఁ గన్పట్టుచున్నది.

## మహాభారతము—యుద్ధకాలనిర్ణయము.

ఇతరాధారములనుండి కురుపాండవులకు జరగిన మహాభారతయుద్ధకాలము క్రీ. పూ. 3139 సంవత్సరమునందయి యుండునని కనుఁగొని యుంటిమి. భరతఖండమునఁగల రాజులందఱు నేదేనొక పక్షమువహించి కావించిన యమ్మహాసంగ్రామ మేవత్సరమున జరగియుండినది కనుఁగొనుట కేమేని నాధారములు మహాభారతమునందు గన్పట్టునేమో యన్వేషించి చూతము. మహాభారతయుద్ధమునకుఁ గథానాయకులగు కురుపాండవవీరులను గుఱించియు, వారలకు జరగిన యుద్ధమును గుఱించియు విపులముగవర్ణించి మహాకావ్యమును రచించిన మహనీయమూర్తి యితర విషయములఁ గనుఁగొనుటకుఁ గాలపరిస్థితులను దెలియఁజేసియుండెనని వానింబట్టి పలువురు భారతయుద్ధ కాలనిర్ణయము గావించునపుడు వాదోపవాదములు గావించుచుండ నా ఘోరసంగ్రామ మెపుడు జరగియుండినది తెలిసికొనుటకుం దగినకాలపరిస్థితులఁ దెలియఁజేయకుండెనా? తెలియఁజేయలేదనుకొనుట సంభావ్యమా? కాదు. నిక్కువమగుభారతయుద్ధకాలము నెఱుంగుటకుం దగినకాలపరిస్థితులు మహాభారతమునఁ జెప్పఁబడియేయున్నవి. అయ్యవి యేవియో మనము తెలిసికొని భారతయుద్ధకాల నిర్ణయము గావించెదము. అట్లు నిరూపణమగు కాలనిర్ణయము మన మిదివఱలో నితరాధారములంబట్టి తెలిసికొనిన కాలనిర్ణయముతో సరిపోవునేమో కనుఁగొందము.

మహాభారతయుద్ధ కథన మెఱుంగని భారతీయుఁ డీభరత ఖండమున లేఁడని తలంతము. అయినను ప్రస్తుత విమర్శనమున కవసరమగునంతవఱకుఁ గథాభాగమును గైకొందము. మహాభారతయుద్ధము రాజ్యవిభాగమునకై ధృతరాష్ట్ర నందనులగు దుర్యోధనాదులకును, పాండుభూపతి నందనులగు యుధిష్ఠిరాదులకును జరగియుండెను. దుర్యోధనాదులు కౌరవు లనఁబఱగిరి. యుధిష్ఠిరాదులు పాండవు లనఁబఱఁగిరి. దుర్యోధనాదులు నూర్వు రన్నదమ్ములు. దుర్యోధనుఁడు రారాజుగాఁ బరిపాలన మొనర్చుచుండెను. దుర్యోధనాదుల తండ్రియగు ధృతరాష్ట్రు డంధుఁడు. యుధిష్ఠిరున కే ధర్మరాజనియుఁ బేరు. యుధిష్ఠిరునకు భీముఁడు, అర్జునుఁడు, నకులుఁడు, సహదేవుఁడు నను వారు నల్వురు తమ్ములు. శ్రీకృష్ణ బలరాము లిద్దఱును సోదరులు. వీరు విష్ణ్వంశసంభూతులని చెప్పఁబడియుండెను. శ్రీకృష్ణుఁడు పాఁడవులపక్షమున మహాభారతయుద్ధమున బాండవమధ్యమునకు రథసారథ్యము వహించియుండెను. దుర్యోధనునకును, భీమునకును బలరాముఁడు గదాయుద్ధ విద్యను నేర్పియుండెను. శ్రీకృష్ణునకు ధర్మజ భీమార్జునుల తల్లియగు కుంతీదేవి మేనత్తయైయుండెను. శ్రీకృష్ణుని సోదరియగు సుభద్రయర్జునునకు భార్య.

కౌరవులు పాండవులతోఁ జూదమాడి పాండవుల నోడించిరి. ఆ యోటమికిఁ బ్రతిఫలముగఁ బాండవులు పన్నెండు సంవత్సరము లరణ్యావాసమును, నొకవత్సర మజ్ఞాతవాసమును గడపిన తరువాత వారికిని- గౌరవులకును ఘోరసంగ్రా

జరిగియుండెను. ఆయుద్ధమున భారతవర్షమునంగల రాజులెల్లను నేదే నొకపక్ష మవలంబించి యుద్ధముఁ గావించియుండిరి. ఆ యుద్ధమునకు ముందు పాండవులు తమకు రావలసిన యర్ధరాజ్యమును బంచవలసినదని-న్యాయ్యమని, చెప్పి పరిష్కరించుటకయి శ్రీకృష్ణునిరాయబారిగా గౌరవులకడ కంపియుండిరి. శ్రీకృష్ణుని రాయబారమువలనఁ బ్రయోజన మావంతయు గన్పట్టకుండుటచే యుద్ధమే శరణ్యమయ్యెను. అట్టియెడ నుభయపక్షములవారును యుద్ధసన్నాహములఁ గావించియుండిరి. కురుక్షేత్రమునం దుభయపక్షములవారికిఁ బదునెనిమిది దినములు యుద్ధముజరగెను. కౌరవులపక్షమున భీష్ముఁడు పదినములు సర్వసేనాధిపత్యము వహించి ఘోరసంగ్రామముఁ గావించి పదియవనాటి సాయంత్రము పాండవమధ్యమునిచే ఖండువడిపోయెను. పిమ్మట ద్రోణుఁడు సర్వసేనానాయకుఁడై యైదుదినములు పోరాడి హతుఁడయ్యెను. అటుపైని రాధేయుఁడు సకల చమూపతియై రెండుదినములు పోరి నిహతుఁడయ్యెను. అంత బదునెనిమిదవనాఁటి పూర్వాహ్ణమున మద్రదేశాధీశుఁడగు శల్యుఁ డధ్వర్యమువహించి మధ్యాహ్నమున విగతజీవుండయ్యెను. ఆనాఁడే సాయంత్రసమయమున దుర్యోధనుఁడు భీమునితోఁగావించిన గదాయుద్ధమున మడిసెను. అమ్మహాసంగ్రామంబునఁ దక్కంగలరాజన్యులును, బదునెనిమిదక్షౌహిణీల సైన్యమును హతమయ్యెను.

కురుపాండవులకు యుద్ధమే శరణ్యమని యెఱింగి వారి యుద్ధమును జూడ నిచ్ఛగింపక బలరాముఁడు గంగాతీరమునకుం

జేరి పదునెనిమిదవ దినమునఁ దన శిష్యులగు దుర్యోధన భీమసేనులకు గదాయుద్ధము జరుగునని విని వారి గదాయుద్ధకౌశలమును జూచుటకై యుద్ధభూమి కరుదెంచియుండెను. దుర్యోధన వధానంతరము యుధిష్ఠిరుఁడు జయలక్ష్మినిఁ జేపట్టి పట్టాభిషిక్తుండై పరిపాలన మొనర్చియుండెను. పదియవనాఁడు యుద్ధమున భీష్ముఁడు పడిపోయి శరతల్పగతుఁడయి ఉత్తరాయనము వచ్చువఱకును వేచియుండి తదుపరి ప్రాణములఁబాసెను. మహాభారతయుద్ధానంతరము ముప్పదియాఱు సంవత్సరములు గడచిన పిమ్మట శ్రీకృష్ణనిర్యాణము సంభవించెను. అపుడే కలియుగ మారంభమయ్యెను. శ్రీకృష్ణనిర్యాణమును విని యుధిష్ఠిరుఁడు రాజ్యమేలుటనుమాని కిరీటి పౌత్రుఁడగు (కుమారుని కుమారుఁడగు) పరీక్షితుని పట్టాభిషిక్తుఁ గావించి భూప్రదక్షిణంబొనర్చి కలియుగ మారంభమయి యిరువదియైదు (25) వత్సరములు గడచినతరువాత సప్తర్షు లాశ్లేషానక్షత్రమునఁ బ్రవేశించినపుడు స్వర్గారోహణముఁ గావించియుండెను. ఆయా సందర్భములలో మహాభారతయుద్ధ కథారచయిత చెప్పిన కాల పరిస్థితులను గమనించి చూతము.

1. దుర్యోధను సభకు శ్రీకృష్ణుఁడు కార్తీకశుక్ల ద్వాదశినాఁడు రేవతీనక్షత్రయుక్త శుభలగ్నంబున రాయబారిగా వెడలి మరల యానాఁడే యుధిష్ఠిరుని దగ్గఱకు వచ్చినటులఁ జెప్పఁబడియున్నది.

"శ్లో॥ తతోవ్యపేతేతమసిసూర్యే విమల ఉద్గతే ।
మైత్రే ముహూర్తే సంప్రాప్తే మృద్వర్చిషి దివాకరే॥౬॥

కౌముదే మాసి రేవత్యాంశరదం తేహిమాగమే ।
స్ఫీతసస్యసుఖేకాలే కల్యస్సత్త్వవతాం వరః ॥౭॥"*

మహాభారతమునకు వ్యాఖ్యను రచించిన నీలకంఠాచార్యులవా రీశ్లోకములకు వ్యాఖ్యను రచించుటలో "కౌముదే మాశి-కార్తికే । రేవత్యాం అర్జునస్య ఫల్గునీజాతస్య రేవతీ మైత్రీతారాభవతీతి ప్రసిద్ధమ్" అని చెప్పియున్నాడు, భీష్మపర్వము 18 అధ్యాయము 2 శ్లోకమునకు వ్యాఖ్యను వ్రాయుచు

"తత్రాఽయంనిష్కర్షః— కార్తిక శుక్లద్వాదశ్యాం రేవత్యాం కృష్ణప్రయాణమ్"—

శ్రీకృష్ణుఁడు కార్తికశుక్లద్వాదశి రేవతీనక్షత్రమందు రాయబారమునకయి ప్రయాణించెననుట నిశ్చయము.

అని చెప్పియున్నాఁడు.

2. తరువాత దుర్యోధనుండు యుద్ధప్రయత్నములఁ గావించి తన సైన్యమును అమావాస్య యింక నేఁడుదినము లుండఁగాఁ బుష్యమీనక్షత్రమున కురుక్షేత్రగామియగుట కాజ్ఞాపించి యుండినటులఁ జెప్పఁబడియున్నది.

"శ్లో॥ ఆజ్ఞాపయంచరాజ్ఞస్తాన్ ।
పార్థివాన్ నష్టచేతసః ।

* మహాభారతము-ఉద్యోగపర్వము. 82 అధ్యా.

ప్రియాధ్వం వై కురుక్షేత్రం ।
పుష్యోఽ ద్యేతి పునః పునః॥"* 3

3. పిదప నేఁడవనాఁటి యనంతర మమావాస్య నాఁడు ఇంద్రాధిపత్యముంగల నక్షత్రమున యుద్ధమారంభ మయినటులఁ జెప్పఁబడియుండెను.

ఇంద్రాధిపత్యముగల నక్షత్రము జ్యేష్టానక్షత్రమయి యున్నది.

"శ్లో॥ సర్వోషధి వనస్పీతః
పాలవానల్ప మక్షికః ।
నిష్పంకోరస వత్తోయో
నాత్యుష్ణః శిశిరస్సుఖః ॥ ౧౭
సప్తమాచ్చాపిదివసా
దమావాస్యా భవిష్యతి ।
సంగ్రామోయుజ్యతాం తస్యాం
తామాహుః శక్రదేవతామ్ ॥"1 ౧౮

4. మహాభారతయుద్ధ మారంభమైనపిదపఁ బదియవ నాఁటి సాయంత్రమ్ము భీష్ముఁడు మూర్ఛాగతుఁ డయ్యెను. (ఇయ్యది మార్గశీర్ష శుక్ల అష్టమి యగుచున్నది.) అంతభీష్ముఁడు శరతల్పగతుండై యుండి యుత్తరాయనము ప్రవేశమైనతరు వాత నసురులఁబాసినటులఁ జెప్పఁబడియున్నది.

---

* మహాభారతము- ఉద్యోగపర్వము. 149 అధ్యా.

1 (మహాభారతము ఉద్యోగపర్వము - ౧౪౧ అధ్యా)

5. భీష్మునియనంతరము ద్రోణుఁడు సకల సేనానాయకుండై యైదుదినములు యుద్ధముఁజేసి పదునయిదవ దినమున హతుఁడయ్యెను. (ఇయ్యది మార్గశీర్ష శుక్ల త్రయోదశి యగుచున్నది.)

"శ్లో॥ యుద్ధంకృత్వా మహద్ఘోరం
పంచాఽహాని మహాబలః ।
బ్రాహ్మణో నిహతో రాజన్
బ్రహ్మలోక మితోగతః ॥"[1] ౧౫౩

6. పిమ్మటఁ గర్ణుఁడు చమూపతియై రెండుదినములు యుద్ధముఁ జేసి నిహతుఁడయ్యెను. (ఇయ్యది మార్గశీర్ష శుక్ల పూర్ణిమ యగుచున్నది.)

"శ్లో॥ తయోర్ద్వాది వసాయుద్ధం
కురుపాండవసేనయోః ।
కర్ణసేనాపతౌ రాజన్ ।
బభూవాఽద్భుత దర్శనమ్॥"[2] ౧౫

7. ఆపిదపఁ బదునెనిమిదవనాఁటి పూర్వాహ్నమున శల్యుఁడును, సాయాహ్నమున దుర్యోధనుండును, యుద్ధముఁ జేసి హతులయిరి. (ఇయ్యది మార్గశీర్ష బహుళప్రతిపత్తు— పాడ్యమి,— యగుచున్నది.)

---

1 ద్రోణపర్వము - ౨౦౩ అధ్యా.

2 కర్ణపర్వము—౧ అధ్యా,

"శ్లో॥ తతశ్శల్యో మహారాజ కృత్వాకదన మాహవే।
పాండుసైన్యోఽథ మధ్యాహ్నే ధర్మరాజేనపాతితః॥ ౧౦
తతో దుర్యోధనోరాజాహత బంధూరణాజిరాత్ ।
అపసృత్యహ్రదం ఘోరంవివేశరిపుజాద్భయాత్॥౧౧
అథాఽపరాహ్నేతస్యాహ్నః పరిహార్యమహారథైః ।
హ్రదాదాహూయయుద్ధాయ భీమసేనేనపాతితః॥ ౧౨.
తస్మిన్ హతేమహేష్వాసేహత శిష్టాస్త్రయోరథాః ।
సంరంభాన్నిశిరాజేంద్ర జఘ్నుః పాంచాలసైనికాన్॥౧౩"[1]

8. భారతయుద్ధము పదునెనిమిదవనాఁటితో నంతమయ్యెను. కురుయోధులందఱు గతించిరి. పదునెనిమి దక్షౌహిణులసైన్యము నశించెను.

"శ్లో॥ అక్షౌహిణ్యోమహారాజ
దశచాష్టౌ సమాగతాః ।
అష్టాదశాహేనహతాః ।
కురుభిర్యోధపుంగవైః॥"[2] ౨౯.

పదునాలవనాఁటిరాత్రి ఘటోత్కచుఁడు మరణించెను. ఘటోత్కచుని మరణమునకై యుధిష్ఠిరుఁడు వగచుచుండ వ్యాసమహర్షి దర్శనమిచ్చి యిఁక నైదుదినములకు రాజ్యము స్వాధీనమగునని చెప్పినటులఁ జెప్పఁబడియున్నది.

---

1 శల్యపర్వము- ౧ అధ్యా.

2 ఆశ్రమవాసికపర్వము— ౧౧ అధ్యా.

46

"శ్లో॥ కౌరవాన్ సమరేరాజన్
ప్రతియుధ్యస్వభారత ।
పంచమేదివసేతాత్
పృథ్వీతే భవిష్యతి ॥"[1] 65

9. పదియవనాఁడు యుద్ధములో భీష్ముఁడు శరతల్పగతుఁడైన తరువాత యేఁబదియెనిమిది (58) దినములు శరతల్పగతుఁడై జీవించియుండెననియు, నుత్తరాయనము ప్రవేశమైన పిమ్మట నసురులఁ బాసెననియుఁ జెప్పఁబడియున్నది.

"శ్లో॥ దిష్ట్యాప్రాప్తోఽసి కౌంతేయ
సహామాత్యో యుధిష్ఠిర ।
పరివృత్తోహి భగవాన్
సహస్రాంశుర్దివాకరః॥ 26
అష్టపంచాశతం రాత్ర్యః
శయనస్యాఽద్యమే గతాః ।
శరేషు నిసితాగ్రేషు
యథావర్షశతం తథా॥"[2] 27

భీష్ముఁడు మహాభారతయుద్ధము ప్రారంభమైన 68 (58 + 10)దినములతరువాత మరణించినటులఁ దెలియుచున్నది. మహాభారతయుద్ధము కార్తీక బహుళ అమావాస్యనాఁడు

1 ద్రోణపర్వము - 184 అధ్యాయము.

2 అనుశాసనిక పర్వం - 167 అధ్యా.

ప్రారంభమయినటులఁ జెప్పఁబడియుండుటచే భీష్మనిర్యాణము మాఘ శుక్ల అష్టమినాఁడు జరగియుండినటుల స్పష్టమగుచున్నది. నాఁడు రోహిణీనక్షత్రమయినట్టు లగపడుచున్నది.

మహాభారతమునకు వ్యాఖ్యను రచించిన నీలకంఠుఁడు భారతయుద్ధముయొక్క ప్రారంభకాలమును గుఱించి వచించు సందర్భమున భారతయుద్ధము మార్గశీర్ష శుక్ల చతుర్దశినాఁడు మృగశీర్షానక్షత్రమునఁ బ్రారంభమయినట్లును, భీష్ముఁడు పుష్య శుక్ల అష్టమినాఁడు శరఘాతుఁడై యుద్ధముఁ జాలించియుండినట్లును, ద్రోణుఁడు త్రయోదశినాఁడు హతుఁడైనట్లును, దుర్యోధనుఁడు పదునెనిమిదవనాఁడు పుష్యబహుళ ప్రతిపద్దివసంబున హతుఁడైనట్లును, భారతయుద్ధమానాఁటితోఁ బరిసమాప్తియైనట్లును, భారతయుద్ధము పదునెనిమిదవనాఁడు శ్రవణానక్షత్రమయినట్లును, భీష్ముఁడు మాఘ శుద్ధ పంచమినాఁడు దేహత్యాగము గావించియుండినట్లును, జెప్పియున్నాఁడు. దీని నాధారముగాఁ దీసికొని కొందఱు భారతయుద్ధకాలనిర్ణయ సిద్ధాంతములఁ గొన్నిఁటిఁ బ్రతిపాదించియుండిరి. కాన వ్యాఖ్యాతయొక్క సిద్ధాంత మెంతవఱ కంగీకారార్హమో మనము తెలిసికొనుట యావశ్యకమని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. నీలకంఠుఁడు భారత సావిత్రియందలి శ్లోకముల నాధారముగఁ జూపెట్టెను. ప్రథమమున భీష్మపర్వమునందలి

"శ్లో॥ మఘావిషయగః సోమ
స్తద్దినం ప్రత్యపద్యత ।

దీప్యమానాశ్చ సమ్పేతు
దివిసప్త మహాగ్రహాః ॥"[1]

అను శ్లోకమున కిట్లు వ్యాఖ్యను రచించియుండెను.

"మఖావిషయగః సోమస్తద్దినం ప్రత్యపద్యత" ఇతి మఖాపిత్ర్యం నక్షత్రమ్, తస్యవిషయోదేశః పితృలోకః, తద్గతః సోమః। కురుపాండవ యుద్ధారంభ దినముక్తం భారతసావిత్ర్యాం—

"శ్లో॥ హేమంతే ప్రధమేమాసి
శుక్లపక్షేత్రయోదశీమ్ ।
ప్రవృత్తం భారతం యుద్ధమ్
నక్షత్రే యమదైవతమ్॥"

ప్రధమే మార్గశీర్షే అత్రత్రయోదశీ శబ్దేన తద్యుక్తా చతుర్దశ్యేవ గ్రాహ్యా ।

"అర్జునేన హతోభీష్మో
మాఘమాశోసితాష్టమి" ఇతి
"త్రయోదశ్యాంతు మధ్యాహ్నే
భారద్వాజో నిపాతితః॥"

ఇతి చాఽత్రైవ యుద్ధస్య దశమే పంచదశేచాఽహని, తయో భీష్మ ద్రోణయోరష్టమిత్రయోదశీ సంయోగ దర్శనాత్ । అత్రపాషేఽపి మాఖశబ్దోమకరాయనాభిప్రాయేణ, తదానీం తత్సంభవాత్ । "అసితా ష్టమీ" మిదిచ్ఛేదః । అన్యథాసప్తమీద్వాదశ్యో రేవతయో హననం ప్రాప్నోతి। యత్ తు, "అమావాస్యాయాం దుర్యోధన హననం"

---

1 భీష్మపర్వము - 18 అధ్యాయము - 2 శ్లోకము

అస్యామేవ భారతసావిత్ర్యముక్తం, తత్రాఽపి "అమావాస్యా" శబ్దః ఇష్టిదినే ప్రతిపద్యేవప్రయుక్తో వేదితవ్యః । యమదైవతే ఇతి భరణీనగ్రాహ్యా, కింతుయుగ్మదేవతం మృగశీర్ష మేవగ్రాహ్యమ్ తస్యహి పూర్వ దళం శుక్రదేవత్వాత్ ఆసురః । ఉత్తరార్ధం బుధదేవత్వాత్ దేవం, తేన తత్రాసురాణా ముపరమో దేవానామభ్యు దయశ్చ సిద్ధ్యతి। కించ

"శ్లో॥ చత్వారింశ దహాన్యద్య
ద్వేచమేనిః సృతస్యవై ।
పుష్యేణ సంప్రయాతోఽస్మి
శ్రవణే పునరాగతః॥"

ఇతి తత్రైవ యుద్ధారంభాదష్టాదశోఽహాని, తీర్థయాత్రాతః ఆగతస్య బలదేవస్య వచనాత్ శ్రవణే యుద్ధసమాప్తి ర్దృశ్యతే । తతః ప్రాచీనే అష్టాదశర్క్షే మృగశీర్ష యేవ యుద్ధారంభః సంభవతి, నత్వేకవింశే భరణ్యాం । అష్టాదశదినమధ్యే నక్షత్రత్రయక్షయస్య కల్పయితుమశక్యత్వాత్ । కార్తీకీ కృత్తికాయోగానుపాతేన చతుర్దశ్యాం మృగత్వైవ సంభావనాశ్చ । ఏతేన యుద్ధారంభం ప్రకృత్య "మఖావిషయగః సోమ స్తద్దినం ప్రత్యపద్యత" ఇతి భీష్మపర్వణి సంజయవాక్యాత్ మఖాయాం యుద్ధారంభ ఇత్యపినరస్తమ్ । బలదేవవాక్యవిరుద్ధత్వాత్ । శబ్దార్థసుమఖాపదేన తత్సహచరాః పితరోలక్ష్యంతే । తేనయుద్ధే మృతానాం ఉత్తమదేహ ప్రదానార్థం చంద్రస్తదాపితృలోకే సన్నిహితోఽభూదితి, స్వర్గిణాం దివ్యదేహలాభశ్చంద్రాధీన ఇతిశాస్త్రప్రసిద్ధేః । తథా ద్వాదశ్యాం రాత్రియుద్ధే చంద్రోదయకాలే—

" త్రిభాగమాత్ర శేషాయాం
రాత్రౌ యుద్ధమవర్తత,"

ఇతిద్రోణపర్వణ్యుక్తం;తత్ర,'త్రిభాగే'త్యస్యత్రిముహూర్తశేషాయామిత్యర్థః। తథా

"అష్టపంచాశతంరాత్ర్యః
శయనశ్యాఽద్యమేగతాః"

ఇతి భీష్మవచనంతు,"మాఘోయంసమనుప్రాప్తః,""త్రిభాగమాత్రః పక్షోయం" ఇతి వాక్యానుశేషానుసారాత్, అశతం. శతహీనం తథాశ్యాత్, తథా అష్టపంచ అష్టపంచాశదాత్రిత్ర్యయోవ్యతీతా ఇతివ్యాఖ్యేయమ్। విలోమశోధనాత్ అష్టపంచాశదనం శతంరాత్రయో-ద్వాచత్వారింశదాత్రిత్ర్యయోవ్యతీతాఇత్యర్థః । తదాచపౌషకృష్ణాష్టమితో మాఘశుక్లపంచమ్యాం తావతీదినసంఖ్యాపూర్యతే । పక్షస్యచతృతీయోభాగోగతోభవతి । తత్రాఽపి,ఏకతిథిక్షయాత్ పంచమ్యాః । ద్వాచత్వారింశత్తమత్వంజ్ఞేయం; శేషోభవితుమర్హతీత్యత్ర 'కార్యశేషో' దేహత్యాగాదిరేవశేషః, నతుపక్షశేష. ఇతివ్యాఖ్యాజ్ఞేయా। తత్రాఽయంనిష్కర్షః—కార్తీక శుక్లద్వాదశ్యాం రేవత్యాంకృష్ణాప్రయాణమ్; తతః పంచమ్యా ఉపరిషష్టీమారభ్య సప్తదినానిరణయిత్వా, తమపర్యష్టమేఽహాని అమావాస్యా భవిష్యతీత్యనేన, త్రయోదశదినాత్మకోఽయం కృష్ణపక్షో మహోత్పాద జనకఇతిసూచితం, క్షీణయోశ్చతిథ్యోః పక్షాంతరేపునర్వృద్ధ యాసంఖ్యా పూరణంభవతీతి, మార్గశిరకృష్ణ పంచమీమారభ్యపౌషశుక్లప్రతిపద్ ద్వాచత్వారింశీతిథిర్భవతీతి బలదేవవాక్యోక్తాదినసంఖ్యాఽచఅనుగృహీతాభవతి । యత్ తు

"సప్తమాచ్చాపి దివసాదమావాస్యా భవిష్యతి
సంగ్రామం యోజయ త్త్రతాం హ్యాహుఃశక్రదేవతామ్।
ప్రియాధ్వంవై కురుక్షేత్రం పుష్యోఽద్యేతి పునఃపునః॥

ఇత్యుద్యోగపర్వణి దుర్యోధనవాక్యం, తత్రిసంగ్రామ మిత్య నేన సంగ్రామే జయసాధనం ధారాబంధాదికం యోజయేదిత్యుక్తమ్. శక్ర దేవతా మిత్య నేన జ్యేష్ఠానక్షత్రయోగ ఉచ్యతే,సచతిధిద్వయ క్షయాత్. తత్రఅసంభవన్నపి, తత్రతిథి వదేవ నక్షత్రక్షయాద్వా, తిధినక్షత్రయో రాద్యంత యోగాద్వా గ్నేయం, ఇతి సర్వం సమంజసం । మహాగ్రహాః రాహుకేత్వో రూపగ్రహత్వాత్ సప్తైవ॥”

నీలకంఠునిచేఁ జేయఁబడిన యీవ్యాఖ్యయొక్క భావము నీక్రిందఁ గనంబఱుపఁ బడినది.

‘మఘావిషయగకి సోమ స్తద్దినం ప్రత్యపద్యత’ అని చెప్పుటనుబట్టి మఘానక్షత్రము పితృనక్షత్రము. అయ్యది పితృలోకమును గుఱించియు, సోముఁ డాపితృలోక గతుం డగుటను గుఱించియుఁ దెలుపుచున్నది. కురుపాండవ యుద్ధారంభమును గుఱించి భారతసావిత్రి యీవిధముగఁ జెప్పుచున్నది.

“హేమంతఋతువు ప్రథమమాసమందలి శుక్లపక్ష త్రి యోదశినాఁడు యముఁ డధిపతిగాఁగల నక్షత్రమున భారతయుద్ధము జరిగెను”

హేమంతఋతువునందలి ప్రథమమాసమనుటచే మార్గశీర్షము. త్రయోదశ శబ్దముచే చతుర్దశియని గ్రహింప వలెను.

‘అర్జునేన హతోభీష్మో మాఘమాసే సితాష్టమి’యని యు, ‘త్రయోదశ్యాంతు మధ్యాహ్నే భారద్వాజో

నిపాతితశ్శి' యనియుఁ జెప్పఁబడియుండుటచేఁ బది, పదు నైదుదినంబుల యుద్ధములననఁగా అష్టమి, త్రయోదశి దినములలో భీష్మద్రోణులు హతులైనటులఁ జెప్పఁబడియుం డుటచేతను, మాఖశబ్దమునకు మకరాయనమును నభిప్రా యము చేసికొని బహుళ అష్టమి యని చెప్పవలయును. గానియెడల సప్తమి ద్వాదశీలగును.

దుర్యోధనుఁడు 'అమావాస్య' నాఁడు హతుఁడైనటుల భారతసావిత్రియందుఁ జెప్పఁబడినది. అమావాస్య శబ్ద మునుబట్టి ఇష్టిదినమగు ప్రతిపత్తుగాఁ దెలిసికొనవలయును. యమదైవతే యన భరణీనక్షత్రమని గ్రహించఁగూడదు. యుగ్మదేవతానక్షత్రము (ఇద్దరధిపతులుగల నక్షత్రము) మృగశీర్షానక్షత్రమని గ్రహింపవలయును. మృగశీర్ష పూర్వ దళమనంబడు ప్రథమ భాగమునకు శుక్రుఁడధిదేవత. అసుర దేవత. ఉత్తరార్థమునకు బుధుఁడు దేవత. సురదేవత. ఇది సిద్ధము. ఏలన—యుద్ధారంభమయిన పదునెనిమిదవ దిన మునఁ దీర్థయాత్రనుండివచ్చిన బలదేవుఁడు చెప్పిన

"చత్వారింశదహాన్యద్య ద్వేచమేనిః సృతస్యవై
పుష్యేణ సంప్రయాతోఽస్మి శ్రవణే పునరాగతః॥"

(పుష్యమీనక్షత్రమున బయలుదేఱి నలువదిరెండు (40+2) దిన ములకు శ్రవణానక్షత్రంబున మరలివచ్చితి అని వ్యాఖ్యాత భావ మును సూచించియుండెను.)

అను వచనములనుబట్టి శ్రవణానక్షత్రమున యుద్ధము పరిస మాప్తియైనటులఁ గనుపట్టుచున్నది. శ్రవణానక్షత్రమునకుఁ బూర్వము పదునెనిమిదవనక్షత్రమగు మృగశీర్షానక్షత్రమున యుద్ధారంభమయి యుండెను. పదునెనిమిది దినముల నడుమ మూఁడు నక్షత్రములు క్షయముకానేరవు. చతుర్దశీ మృగ శీర్షానక్షత్రమున యుద్ధారంభమయినటులఁ జెప్పఁబడుటచే భీష్మపర్వమున 'మఘావిషయగశ్ సోమ స్తద్దినం ప్రత్యప ద్యత' యని సంజయునిచేఁ జెప్పఁబడిన వాక్యమునుబట్టి మఘానక్షత్రము యుద్ధారంభనక్షత్రము కానేరదు. అయ్యది బలదేవుని వాక్యమునకు విరుద్ధముగ నున్నది. మఘాశబ్ద ప్రయోగముచే నటనుండు పితృదేవతల నుద్దేశించి చెప్పఁ బడియుండెననియు, యుద్ధమున మృతులైనవారికి యుత్తమ దేహముల నిచ్చుటకును దేవత్వమును గలుగఁజేయుటకును జంద్రుఁడు పితృలోకమునకు సన్నిహితుఁడై యుండెననియు నెంచవలసియుండును. స్వర్గమున దివ్యదేహమిచ్చుట చం ద్రుని యధీనమని శాస్త్రప్రసిద్ధము. మఱియు ద్రోణపర్వ మునఁ బదునాలవనాఁటి రాత్రి యుద్ధమునఁ జంద్రోదయ కాలమున 'త్రిభాగమాత్రశేషాయాం రాత్రౌ యుద్ధమ వర్తత' అని చెప్పఁబడియుండెను. ఇఁట 'త్రిభాగే' యన త్రిముహూర్తశేషకాలమని యర్థమైయుండెను. మఱియు 'అష్టపంచాశతంరాత్ర్యశ్ శయనస్యాద్య మేగతాశ్', 'మాఘోయంసమనుప్రాప్తశ్,' 'త్రిభాగమాత్రపక్షోయం' అను భీష్ముని వాక్యములఁబట్టి 'అశతం' అనఁగా శతహీన

మనియు, నాకారణమున శతమున కష్టపంచాశద్రాత్రులు తక్కువయను భావమునఁ జెప్పఁబడియుండెననియు,విలోమ శోధనముచే శతమున కేఁబదియెన్మిదిరాత్రులు తక్కువ యన 42 (100—58) రాత్రులని యర్థమనియు భావము. ఆ కారణముచేఁ బుష్యబహుళ అష్టమినుండి మాఖశుక్ల పంచమినాటికి (42) నలువదిరెండు దినముల సంఖ్యయు సరిపోవుచున్నది. పక్షముయొక్క తృతీయభాగము గతించి యుండెనని చెప్పినకారణమున నొక తిథిక్షయము జరిగియుండిన పంచమియగును. నలువదిరెండుదినములని తెలిసికొనునది. 'శేషోభవితు' అనుటచే దేహత్యాగాది కార్య శేషమనియుఁ బక్ష శేషము కాదనియు గ్రహింపవలయును.

కార్తీకశుక్ల ద్వాదశి రేవతీనక్షత్రమునఁ గృష్ణుని ప్రయాణము—రాయబారమునకై సలిపిన ప్రయాణము—పంచమి తర్వాత షష్టి మొదలు ఏఁడు(7)దినములకు యుద్ధమనియుఁ దదుపరి యెన్మిదవనాఁ డమావాస్యయుందున్నదనుటఁచేఁ బదమూఁడుదినముల పక్షమనియు భావము. కృష్ణపక్షము మహోత్పాదజనకసూచితము. క్షీణించిన తిథులు మఱియొక పక్షమునఁ దిరిగివృద్ధియగుటచే సంఖ్యాపూరణమగుచున్నది. మార్గశీర్ష కృష్ణపంచమి మొదలు పౌష్యశుక్ల ప్రతిపత్తువఱకు బలదేవునివాక్యము ననుసరించి నలువదియాఱు తిథులుగడచి యుండెనని యెంచవలయును.

నీలకంఠుఁ డాధారముగాఁగైకొనిన భారతసావిత్రి యను గ్రంథమెవ్వరిచే రచింపఁబడినదియుఁ జెప్పినవాఁడు కాఁడు. దానినుండి తా నాధారములుగాఁ గైకొనినవాక్యములఁ బట్టి భారతము మూలమున స్పష్టముగఁ బలుతావులఁ జెప్పఁబడిన వాక్యముల కపార్థములు గల్పించియుఁ దా నాధారములుగఁ దీసికొనిన వాక్యములకు విపరీతార్థములను గావించియు, మహాభారతయుద్ధము మార్గశీర్ష శుక్లచతుర్దశినాఁడు మృగశీర్షానక్షత్రమునఁ బ్రారంభమయియుండెననియు, మాఘ శుక్ల పంచమినాఁడు భీష్ముఁడు దేహత్యాగముఁ గావించియుండెననియు రాద్ధాంతముఁజేసియుండెను. ఈ రాద్ధాంతము గావించుపట్టునఁ దా నాధారముగఁ గ్రోడీకరించిన

"హేమంతే ప్రథమే మాసి
శుక్లపక్షే త్రయోదశీమ్
ప్రవృత్తం భారతమ్ యుద్ధమ్
నక్షత్రే యమదైవతే॥"

యను శ్లోకమునందలి 'త్రయోదశి' శబ్దమునకు 'చతుర్దశి' యని యర్థముచేసికొనవలయు ననియు, 'నక్షత్రేయమదైవతే' యను వాక్యమునకు యమనక్షత్రము భరణియని స్పష్టముగ జ్యోతిశ్శాస్త్రాది గ్రంథములన్నియుఁ జెప్పుచుండఁగా 'మృగశీర్షా' నక్షత్రముగ నెంచవలయుననియు,

"అర్జునేన హతో భీష్మో
మాఘమాసే సితాష్టమి"

యను వాక్యమునందలి 'మాఖమాసమునకుఁ బుష్యమాస' మని యు, 'సితాష్టమి'కి 'అసితాష్ట'మనియు నర్థముఁజేసికొన వలయుననియుఁ జెప్పియుండిరి. 'అమావాస్యాం దుర్యోధన హననం' అను వాక్యమందలి 'అమావాస్యాం' అనఁగాఁ 'బ్రతిపత్తు' అని యర్థముసేసికొనవలయునఁట! బలదేవుని వచనము లని చెప్పఁబడిన శ్లోకమందలి 'శ్రవణే'అను శబ్దమునకు 'శ్రవణానక్షత్ర'మని యర్థముసేసికొనవలయునఁట! "త్రిభాగమాత్ర శేషాయం" అనఁగా మూఁడుముహూర్తముల రాత్రికాలము శేషించియుండినట్టు లర్థమును గల్పించుకొనవలయునఁట! 'అష్టపంచాశతంరాత్ర్యః............' అను భీష్మవచనము నకు శతమునకు 58 రాత్రులకాలము తక్కువయనియు, 42 రాత్రులకాలమనియు నర్థము సేసికొనవలయునఁట! ఈవిధాన మసంగత వ్యాఖ్యానముతో రాద్ధాంతములు గావించిన నీల కంఠుని వక్రగతినే యాధారముగఁ గైకొని, భీష్ముఁ డుత్తరాయనము బ్రవేశించువరకు శరతల్పగతుఁడై యుండి ఉత్తరాయన మారంభమయినపిమ్మట దేహత్యాగము గావించియుండెనని చెప్పఁబడియుండుటచే భారతయుద్ధానంతరము కొలఁదిదినము లకే మాఖశుక్లపంచమినాఁడు ఉత్తరాయన మారంభమయి యుండెననియు, నాకాలపరిస్థితిని నాధారముగాఁ గల్పనచేసి కొని గోపాలయ్యరు మున్నగువారలు భారతయుద్ధకాలనిర్ణయ మునకు గడంగియుండిరి. కాని గోపాలయ్యరుగారే నీలకంఠుని వ్యాఖ్యానము చాలయసంగతమని త్రోసిరాజనుచు నీలకం ఠుఁడు కావలయునని కడుప్రయాసపడి యపార్థమును గల్పించి

భాషాంతరీకరించియుండెననియు, దానిం బూర్వపక్షముగావింపక యూరకుండరాదనియుఁ జెప్పియుండెను.

"The commentator gives such a glaringly far-fetched interpretation, that we need not pause her to discuss it."[1]

నీలకంఠుఁ డీరీతివ్యాఖ్యానముగావించిన భీష్మపర్వము 18 అధ్యాయమందలి రెండవశ్లోకమునకుఁ బూర్వమందుండు

"శ్లో॥ యథాసభగవాన్ వ్యాసః
కృష్ణద్వైపాయనోఽ బ్రవీత్ ।
తథైవ సహితాః సర్వే
సమాజగ్ముర్మహీక్షితః॥" [2]

అనుశ్లోకమునుగలిపి చదివినచో

"మహాత్ముఁడగు కృష్ణద్వైపాయనుఁడు (వ్యాసమహర్షి) భవిష్యత్తును జెప్పినవిధిని క్షితితలమునఁగల రాజులందరునుచేరి యుద్ధభూమికి వచ్చిరి. ఆరోజున సోముఁడు మఖ యందుండ యుద్ధముప్రారంభమయ్యెను. సప్తగ్రహములు ఖగోళమునం దధికకాంతితో వెలుఁగుచుండిరి."

అని యర్థముకాఁగలదు. వ్యాసమహర్షి ముందుగఁ జెప్పినటుల పదమూడుతిథులుగల పక్షాంతమున అమావాస్యనాఁడు యుద్ధమారంభమయినట్లు భీష్మపర్వము తృతీయాధ్యాయమునఁ

1 Chronology of Ancient India by Mr. V. Gopala Aiyer - page 98
2 భీష్మపర్వము. 18 అధ్యా. 1 శ్లో.

జెప్పఁబడియున్నది. యుద్ధమారంభమయిన దినముంగూర్చి చెప్పు సందర్భమున

"శ్లో॥ చతుర్దశీం పంచదశీం
భూతపూర్వాంచ షోడశీమ్ ।
ఇమాంతునాభి జానామి
అమావాస్యాం త్రయోదశీమ్ ॥ 32
చంద్రసూర్యా వుభాగ్రస్తా
వేకాహ్నాహి త్రయోదశీమ్ ।
అపర్వణి గ్రహేణైతౌ
ప్రజాః సంక్షపయిష్యతః ॥"* 33

"పక్షమునకు 14 లేక 15 లేక 16 తిథులుండుట యెఱుంగుదుము గాని త్రయోదశినాఁ డమావాస్యయగుట ననఁగాఁ బక్షమునకు 13 తిథులగుట నిదివఱకెప్పు డెఱుంగము. మఱియు నొకేదినమున త్రయోదశినాఁడు సూర్యచంద్రగ్రహణములు కలుగుట యెఱుంగము. పర్వములు కాని కాలములయందు గ్రహణములు కలిగిన ప్రజానష్టమని చెప్పఁదగియున్నది.

అని యీ శ్లోకముల భావమై యున్నది."

ఈ శ్లోకములంబట్టి మహాభారతయుద్ధము వ్యాసమహర్షి భవిష్య దూహించిచెప్పినట్లు 13 తిథులుగల పక్షమునం దమా

* భీష్మపర్వము - 3 అధ్యా.

వాస్యనాఁడు ప్రారంభమయి యుండెననియు, యుద్ధప్రారంభ దినము అమావాస్యయనియు, నానాఁడు త్రయోదశీ-చతుర్దశీ-అమావాస్యతిథులు మూఁడును గలిసియుండెననియు విస్పష్టమగుచున్నది.

ఇటులనే మహాభారతయుద్ధానంతరము ముప్పదియాఱు వత్సరములకు యాదవకులక్షయ సమయమందుఁ గన్పట్టినట్లు మౌసలపర్వమునఁ జెప్పఁబడియున్నది.

"శ్లో॥ ఏవం పశ్యన్ హృషీకేశః ।
సంప్రాప్తం కాలపర్యయమ్ ।
త్రయోదశ్యా మమావాస్యాం
తాన్ దృష్ట్వా ప్రాబ్రవీదిదమ్॥ ౧౮.

చతుర్దశీ పంచదశీ
కృతేయం రాహుణా పునః ।
ప్రాప్తే వై భారతే యుద్ధే
ప్రాప్తా చాద్య క్షయాయ నః॥ ౧౯.

విమృశన్నేవ కాలం తం
పరిచిన్త్య జనార్దనః।
మేనే ప్రాప్తం సషట్ త్రింశం
వర్షం వై కేశిసూదనః॥" * ౨౦.

గడచిన యూరపు ఘోరసంగ్రామముగూడఁ బ్రతిపత్తు మొదలు పంచదశివఱకు 13 తిథులుగల పక్షముయొక్క చివఱ

* మౌసలపర్వము - 3 అధ్యా. 18-20 శ్లో.

దినమగు పూర్ణిమనాఁడు ప్రారంభమయి యుండెను. ఇట్లు 13 తిథులుగల పక్షము లనేకవత్సరములందుఁ గనఁబడుచుఁ బక్షమునకు 13 తిథులుండునాయని సందేహింప నగత్యములేదని స్వామికన్ను పిళ్లెగారును జెప్పియుండిరి.[1] కావున భీష్మపర్వము 3 అధ్యాయమునఁ జెప్పఁబడిన శ్లోకములనుబట్టి మహాభారత యుద్ధము 13 తిథులుకలిగిన పక్షాంతమగు నమావాస్యనాఁడు ప్రారంభమయియుండినట్లు సుబోధితమగుచున్నది.

ఉద్యోగపర్వమున మహాభారతయుద్ధము కార్తీకకృష్ణ పంచదశి లేక అమావాస్యనాఁ డిందుఁడధిపతిగా నుండు నక్షత్రమున ననఁగా జ్యేష్ఠానక్షత్రమునఁ జంద్రుఁడుండఁగఁ బ్రారంభమయి యుండెనని స్పష్టముగఁ జెప్పఁబడినవిషయము, మహాభారతయుద్ధము మార్గశీర్ష శుక్ల చతుర్దశినాఁడు మృగశీర్షానక్షత్రమునఁ జంద్రుఁడుండఁగఁ బ్రారంభమయియుండెనని కర్తృనామరహితంబగు భారతసావిత్రినుండి నాధారముగాఁదీసికొని తొలుతఁ దాను నిర్ధారణగావించుకొనిన యభిప్రాయమునకు భంగకరముగనుండుటచే "మఘావిషయగః సోమ" యను వాక్యమునకుఁ జందుఁడు పితృలోకమును సమీపించెనని నీలకంఠుఁడు వ్యాఖ్యానముగావించినటు లగపడుచున్నది. ఈవ్యాఖ్యానముంగూర్చి భారతమును ఇంగ్లీషుభాషయందు భాషాంతరీకరించిన బాబూప్రతాపచంద్రరే(Mr. Babu Pratap Chendra Ray) గారీవిధముగఁ జెప్పియుండిరి.

1. Indian Ephemeries - Vol I Part I page 8 - para 29.

" Nilakanta in a long note explains that 'Magha Vishayagah Somah' cannot mean that Soma or the Moon entered the constellation called Magha. He quotes numerous Slokas scattered throughout the Mahabharata that throw light directly or indirectly, on the question of the opening day of the battle and shows that all these lead to a different conclusion. What is meant by the Moon approaching the region of Pitris is that those who fall in battle immediately ascend to Heaven. Of course, they have first to go to the Lunar region for obtaining celestial bodies. All this implies a little delay. Here, however, in the case of those that will fall on the field of Kurukshetra, they would not have to incur even such little delay. Chandramas or Soma approached the region of Pitris so that the fallen warriors might have Celestial bodies very soon, without in fact, any necessity, on their part, to incur the delay of a journey to the Lunar-region prior to their ascention to heaven with resplendent bodies. "

" 'మఘావిషయగస్సోమ' అనఁగా మఘానక్షత్రమున జంద్రుఁడు ప్రవేశించియుండెనను నర్థముగాదని వివరించుచు నీలకంఠుఁడు విపులముగ వ్యాఖ్యానమును రచించియుండెను. యుద్ధారంభదినమును గుఱించి మహాభారతమునం దచ్చ

టచ్చటఁ బ్రత్యక్షముగను, బరోక్షముగను జెప్పఁబడిన శ్లోకములఁ బెక్కింటి నుదాహరించియుండెను. అవి యన్నియు వానియందుఁ జూపఁబడిన యభిప్రాయములకంటె భిన్నాభిప్రాయముల నిచ్చుచున్నవని చూపించియుండిరి. పితృలోకమును జంద్రుఁడు డగ్గరించియుండెననుట యుద్ధమున నిహతులయినవారలు వెంటనే స్వర్గమునుజేరెదరని యర్ధమిచ్చుచున్నది. వారు ప్రథమమునఁ బితృలోకమునకే పోవలయును. దివ్యశరీరధారులగుట కచ్చటినుండి చంద్రిలోకమునకేగవలయును. ఇటులఁగావించుటకుఁ గొంతకాలహరణమగును. భారతయుద్ధమందు నిహతులగువారల కాస్వల్పకాలవ్యవధితోఁగూడ నగత్యములేదు. పితృలోకమునుండి చంద్రిలోకమునకేఁగుటకుం దగుకాలవ్యవధి కలుగకుండఁగ భారతయుద్ధమున నిహతులగువీరులు వెంటనే దివ్యశరీరధారులయి స్వర్గారోహణులగుటకుఁగాను చంద్రుఁడు పితృలోకమును డగ్గరించియుండెను."

ప్రతాపచంద్రరేగారును నీలకంఠుని యభిప్రాయముతో నేకీభవించినట్లు స్ఫురించుచున్నది. కాని అయ్యది యెంతవఱ కంగీకారార్హమో కనుఁగొనవలసియుండును.

శ్రీకృష్ణుఁడు హస్తినాపురమునకు రాయబారిగఁ గార్తీక శుక్ల ద్వాదశినాఁడు రేవతీనక్షత్రమునఁ జందు్రిఁడుండఁగ వెడలియుండినట్లును, బిమ్మటఁ గార్తీకకృష్ణపంచమినాఁడు పుష్యమీనక్షత్రిమునఁ జంద్రుఁడుండఁగ దుర్యోధనుఁడు తన సైన్యము

నకుఁ గురుక్షేత్రగామియగుట కాజ్ఞాపించియుండెననియుఁబిమ్మట నేఁడుదినములు గడచినతర్వాత నమవసనాఁ డింద్రు డధిదేవతగా నుండిన నక్షత్రమునం దనఁగా జ్యేష్ఠానక్షత్రమునఁ జంద్రుఁడుం డఁగ ఘోరసంగ్రామ మారంభమయి యుండెననియు నుద్యోగ పర్వమున స్పష్టముగఁ జెప్పఁబడియున్నది.* భీష్మపర్వమున 'మఘావిషయగఃసోమ' అను శ్లోకమునుబట్టి సామాన్యముగ మఖయందుఁ జంద్రుఁ డుండఁగ యుద్ధమారంభమయినట్లు లగ పడుచున్నది. దీనింబట్టియే నీలకంఠుఁడు విభ్రమచేతస్కుండై వితండవాదముఁ గావించుట కొక కారణమయినట్లు గన్పట్టెడిని. యుద్ధప్రారంభ మింద్రనక్షత్రమగు జ్యేష్ఠానక్షత్రమునందయి యుండెనని యొకచోటను, పిత్రునక్షత్రమగు మఘానక్షత్రమందు యని మఱియొకచోటను జెప్పఁబడియుండెననియు భ్రమపడి వానిని సమన్వయముఁజేసికొనఁ బ్రయత్నింపకయే నీలకంఠుఁడు మృగశీర్షా నక్షత్రమునందనియు, గోపాలయ్యరుగారు చిత్తానక్ష త్రమందనియు సిద్ధాంత రాద్ధాంతములఁ గావించియుండిరి. కాని యివ్విషయమయి విమర్శనముగావించిన నారాయణ శాస్త్రిగారు

"I think the expression is capable of being reconciled with the other passages of the Mahabharata by explaining "**Magha**" to denote "**Maghavat**" by taking the thing, by a process of Lakshana or Metonomy, to indicate the possessor of the

* ఉద్యోగపర్వము. 142 అధ్యా- శ్లో. 16—18 & 150 అధ్యా. శ్లో. 3

thing or the person suggested by it; and then the expression would clearly mean that on that day on which the battle commenced the Moon was in **Jyesta** the special Nakshatra presided over by **Maghavat** or **Indra** "†

“ ‘మఖా’ శబ్దము లక్షణ లేక తాత్పర్యవృత్తి ననుసరించి యొక వస్తువుయొక్క ఖ్యామందునుగాని లేక దానివలన సూచింపఁబడు వ్యక్తినిగాని తెలియఁజేయు వస్తువునుగాని గైకొనినట్లు ‘మఖవత్’ (ఇంద్రుఁడు) అను శబ్దమునుఁ దెలుపుటకై గైకొనఁబడియుండెననిన భారతమునం దితర తావులఁ జెప్పఁబడిన వాక్యముల నన్నింటిని సమన్వయము సేయఁదగియుండునని తలంచెదను. అటులేని నివ్వాక్యము ‘మఖవత్’ లేక ఇంద్రు డధిపతిగా నుండిన జ్యేష్ఠానక్షత్రమునఁ జంద్రుఁ డుండఁగ యుద్ధమారంభమయి యుండెనని స్పష్టముగ నర్థమగుచున్నది.”

ఇయ్యది మిగుల సమంజసముగను భారతమున స్పష్టముగఁ జెప్పఁబడిన విషయముల వేనికిని విరుద్ధముగాకుండఁగను గన్పట్టుచున్నది. గోపాలయ్యరుగారును ‘మఖవత్’ అనుటకు బదులు పొరపాటున ‘మఖా’ యని వ్రాయఁబడియుండుననిరి. ఇంతవఱకు వారి యూహ సరియనియే గాన్పించుచున్నది కాని యింద్రుఁ డధిపతిగనుండిన చిత్తానక్షత్రమునందని యర్థమిచ్చుచున్నదనిరి.

† Age of Sankara. Part I p. 280.

"It may be that "Magha" is an error for "Magha-vat". The expression then would mean that the Moon had entered the region of Indra, that is the star Chitra presided over by Indra."*

నీలకంఠుఁడు వ్యాఖ్యానముచేసి చెప్పినట్లు మృగశీర్షా నక్షత్రమును, నారాయణశాస్త్రిగారు చెప్పినటుల జ్యేష్ఠానక్షత్రమును గాకుండఁగ గోపాలయ్యరుగారు 'మఘా' యను పదము 'మఘవత్' యను పదమునకుమారు పొరపాటున వ్రాయఁబడియుండునని చెప్పుచుఁ జిత్తానక్షత్రమని యర్థమును జెప్పియుండిరి. ఉద్యోగపర్వమునఁ జెప్పఁబడిన యుద్ధారంభ దినము అమావాస్యయని తెలియఁజేయు వాక్యములను విమర్శించుసందర్భమున 'శక్రదేవతమ్'అనుదాని కిందుఁ డధిపతిగనుండు జ్యేష్ఠానక్షత్రమని యొప్పుకొనియుండియుఁ దిరిగి యింద్రనక్షత్రమనుటకుఁ జిత్తానక్షత్రమని చెప్పుట వింతఁగఁ దోఁపకమానదు. అయ్యది వారి వాదదౌర్బల్యమునుగూడ సూచించుననుటకు సందియములేదు. జ్యోతిశ్శాస్త్ర సిద్ధాంత గ్రంథములయం దింద్రాధిపత్యముగల నక్షత్రము జ్యేష్ఠానక్షత్రమనియే చెప్పఁబడియుండఁగాఁ జిత్తానక్షత్రమని గోపాలయ్యరుగారు చెప్పుట సమంజసముగఁ గన్పట్టుటలేదు.

వీరు 'మఘా' శబ్దము 'మఘవత్' శబ్దమునకుమారు లేఖకప్రమాదజనిత మయినటులఁ జెప్పియుండిరి. అయ్యది సమంజసముగనే కన్పట్టుచున్నది. ఒకప్రతినిఁజూచి మఱియొకప్రతిని

* Chronology of Ancient India by Mr. V. Gopala Aiyer - page 98

వ్రాయుటయందుఁ బ్రధానప్రతియందలి వ్రాతయొక్క యాథార్థ్యస్వరూపమును గ్రహింపజాలకనో, లేక యచ్చుటఁగొన్ని యక్షరస్వరూపములు స్ఫుటముగఁ గాన్పింపకుండుటచేతనో యట్టియక్షరములను బూరణముఁ గావించుపట్టున భాషారసజ్ఞాన మెక్కువలేనికారణముననో లేక శాస్త్రపరిజ్ఞానములేని లోపముననో, లేక పూర్వోత్తరసందర్భములను గ్రహింపజాలకనో లేకరి యట్టి శబ్దములను దప్పుగవ్రాసియుండునని చెప్పిన నసంభవమేమియుఁ గన్పట్టదు. 'మఖవత్' శబ్దమనియే కవి యభిప్రాయమైయుండెననియు 'మఖా' శబ్దము లేఖకప్రమాద జనితమనియునెంచిన యాశ్లోకము

"శ్లో॥ మఖవత్ విషయః సోమ
స్తద్దినం ప్రత్యపద్యత ।
దీప్యమానాశ్చ సమ్పేతు
దివిసప్త మహాగ్రహాః॥"

అని అయియుండును. అట్లు సవరణసేసినచో నీశ్లోకమునకు

"ఇంద్రుని నక్షత్రమునఁ జంద్రుఁ డుండినపుడు యుద్ధమారంభమయ్యెను"

అని యర్థమిచ్చుచున్నది. ఇయ్యది ఉద్యోగపర్వమున

శ్లో॥ సంగ్రామోయుజ్యతాం తస్యాం।
తామాహుః శక్రదేవతామ్॥"

అనిచెప్పఁబడిన వాక్యార్థమునకును సరిపోవుచున్నది. మహాభారతమును రచించిన మహాకవి యుద్యోగపర్వమున భారతయు

ధము ఇందునక్షత్రమునఁ బ్రారంభమయియుండెనని స్పష్టముగఁ జెప్పియుండియు భీష్మపర్వమునందు మఖానక్షత్రమునందుఁగాని, లేక మన వ్యాఖ్యాత నీలకంఠుఁ డూహించినట్లు మృగశీర్షానక్షత్ర మునఁగాని, గాక గోపాలయ్యరుగారు చెప్పినటులఁ జిత్తానక్షత్ర మునఁగాని ప్రారంభమయి యుండెనని చెప్పునంతటి శాస్త్రజ్ఞాన విహీనుఁడని యెంచనగునా? ఎన్నటికట్టులెంచుట కవకాశముఁ గాన్పింపదు. భారతకర్త భీష్మపర్వమునఁగూడ నింద్రనక్షత్రమునఁ జందుఁడుండగా భారతయుద్ధ మారంభమయియుండినటులఁ జెప్పియుండెననియు నట్టిసందర్భమున కవిచెప్పిన "మఘవత్ విషయగసోమ" యను వాక్యము లేఖకప్రమాదవశమునఁ గొన్ని వ్రాఁతప్రతులయందు 'మఖావిషయగస్సోమ' యని వ్రాయఁబడియుండుననియుఁ జెప్పదగియుండును.

నీలకంఠుఁడు 'మఖావిషయగస్సోమ' అను వాక్యమును విమర్శించు సందర్భమున భారతమునందును నితరగ్రంథములందును జెప్పఁబడిన పెక్కువాక్యములఁ గోడీకరించుచు భారతయుద్ధము మార్గశీర్ష శుక్లచతుర్దశినాఁ డారంభమయి యుండెననియుఁ బుష్యబహుళ అష్టమినాఁడు భీష్ముఁడు పడిపోయి యుండెననియుఁ, బదునెనిమిదవనాటిరాత్రితో యుద్ధమంతమయియుండెననియు, నాపదునెనిమిదవనాఁడు తన శిష్యులగు దుర్యోధన,భీమసేనుల గదాయుద్ధముంజూచుటకు బలరాముఁడు వచ్చియుండెననియు, దుర్యోధనుఁడు పుష్యశుక్ల ప్రతిపత్తున హతుండయ్యెననియు, బలరాముఁడు శ్రవణానక్షత్రమున వచ్చినటులే జెప్పఁబడియుండుటనుబట్టి శ్రవణానక్షత్రమునకుఁ బూర్వము

పదునెనిమిదవనక్షత్రము మృగశీర్షానక్షత్రమగుటచే భారతయుద్ధము మృగశీర్షానక్షత్రమునఁ బ్రారంభమై యుండెననియుఁ జెప్పి యుండెను. మఱియు భీష్ముని వాక్యమునకు భీష్ముఁడు పడిన తర్వాత నలువదిరెండు దినములు జీవించియుండి దేహత్యాగము గావించియుండెననియు, భీష్ముఁడు దేహత్యాగముఁ గావించిన దినము మాఘశుక్ల పంచమి యయియుండెననియుఁ గావున భీష్మునికాలమున నుత్తరాయనము మాఘశుక్ల పంచమియం దారంభమయియుండెననియు జెప్పియుండెను.

భారతయుద్ధము మార్గశీర్ష శుక్లపక్ష త్రయోదశినాఁడు యమదేవతా నక్షత్రమునఁ బ్రారంభమయి యుండెననియు, భీష్ముఁ డష్టమిదినముననుద్రోణుఁడు త్రయోదశిమధ్యాహ్నమునను నిహతులై యుండిరనియుఁ, జెప్పుటకు భారతసావిత్రియం దొక శ్లోకమును రెండువాక్యములను నీలకంఠుఁడు క్రోడీకరించియుండెను. వాని నిదివఱలో గనఁబఱిచియుంటిమి. భారతసావిత్రిని రచించిన కవి యెవ్వరో, యేకాలపువాఁడో, చెప్పఁబడియుండలేదు. తెలియుటయును లేదు. భారతసావిత్రి యనునది పెక్కుకవులు రచించిన గ్రంథములనుండి కొన్ని కొన్ని శ్లోకములను సందర్భానుసారముగఁ గ్రోడీకరించుచు శ్రీకృష్ణుని రాయబారమును గుఱించియు విదురు నింట విందారగించుటను గుఱించియుఁ బ్రధానముగఁ గైకొని తెలియఁజేయుటకై వ్రాసినటులగపడుచున్నది. భారతసావిత్రి ప్రతులైన నొకదానితో నొకటి సరిపోవుటలేదు. వేర్వేరు పాఠాంతరములు బహుళములు గాన్పించుచున్నవి. కొన్నిటియందు నూఱుశ్లోకములకంటె

నెక్కువలేవు. కొన్నిటియం దంతకంటెc దక్కువగనే యున్నవి. ఈ భారతసావిత్రియందలి శ్లోకములు పెక్కులు భారతసారము నుండి గై కొనcబడినట్లు లగపడుచున్నది. భారతసారముకూడ నట్లే యితరగ్రంథములనుండి గై కొనిన శ్లోకముల కూర్పయి నట్లు లగపడుచున్నది. దాని నెవ్వరు రచియించినది తెలియుట లేదు. భారతసావిత్రికిc దెలుcగుభాషాంతరీకరణ మొకటి యచ్చు పడియున్నది. భారతసావిత్రి ప్రతులను గుఱించి నారాయణ శాస్త్రిగారీ విధముగc జెప్పియుండిరి.

"1834 సంవత్సరము 24 సెప్టెంబరు తేదీనc జనిపోయిన నాతండ్రిగారి స్వదస్తూరీనగల వ్రాcతప్రతియొకటి నాదగ్గర నున్నది. వ్యాఖ్యాతc (నీలకంఠుడు) క్రోడీకరించిన వాక్య ములు నాదగ్గరనుండు ప్రతియందలి వాక్యములకు భిన్న ములుగానుండుటచే నడయారు పుస్తకభాండాగారమున నున్న వ్రాతప్రతులను వెదకితిని. అక్కడ తమిళలిపితో రెండుప్రతులును, దెలుcగులిపితో నాలుగు ప్రతులును గలవు. ఒకవ్రాcతప్రతికి నింకొక వ్రాcతప్రతికిని అం దుదా హరింపcబడిన సంగతులయందును—పుస్తక పరిమాణముల యందును జాలభేదము గానిపించుచున్నది."[1]

"I have got a manuscript of the said work in the handwriting of my revered father, who died on 24th September 1884; and as some of the passages referred to by the commentator are not

---

1 Age of Sankara - Part I page 283 - 284.

to be found in identical terms in my copy, I made a special search in the Adyar Library, and found six mss- two in Grantha character and four in Telugu. There is a good deal of difference between one ms. and another, both with regard to the wording and to the extent of the book."[1]

మొత్తముమీఁద భారతసావిత్రిప్రతులన్నియు

"శ్లో॥ ద్వారవత్యాం స్థితం కృష్ణం
సమాహూయయుధిష్ఠిరః ।
సంవత్సరం ప్రార్థయామాస
కురూణాం పాండవైః సహ॥"

అనుశ్లోకముతోఁ బ్రారంభింపఁబడి

"శ్లో॥ ఆదౌపాండవ ధార్తరాష్ట్రజననం,లాక్షాగృహేదాహనం
ద్యూతస్త్రీహరణం, వనేవితరణం, మాత్స్యాలయేవర్ధనమ్
లీలాగోగ్రహణం, రణావతరణం, సంధిక్రియాజృంభణం
పశ్చాత్ భీష్మసుయోధనాదిహననం చైతన్ మహాభారతం॥"

అను శ్లోకముతోఁ బరిసమాప్తి గావింపఁబడియున్నవి. ఇయ్యది భారతయుద్ధచరిత్రను సక్రమముగఁ దెలియజేయుచుఁ జెప్పఁబడియుండలేదని స్పష్టముగఁ గన్పట్టుచున్నది. శ్రీకృష్ణుఁడు దుర్యోధనుసభకు రాయబారిగా వెడలి రారాజుగావించిన యాహ్వానమును సరకుసేయక చతుర్థకులజుఁడగు విదురునింట విందారగించినకథ మొదలుకొని చెప్పుచుండుటచే హీనకులజులయినను

1 Age of Sankara - Part I pp; 283 - 284.

భక్తులనే శ్రీకృష్ణుఁ డాదరించునని తెలియజేయుటకై చెప్పఁబడినట్లు లగపడుచున్నది. ఏవిధముగజూచినను భారతమునందు స్పష్టముగఁ జెప్పఁబడిన చరిత్రాంశములఁ గాదనిచెప్పుటకుఁ గర్తృనామరహితమగు భారతసావిత్రి ముఖ్యమగునాధారముగాఁదీసికొనఁదగిన గ్రంథముగాదని కన్పట్టుచున్నది. ఒక ప్రతితో నొకప్రతి సరిపోలక భేదము గన్పట్టుటచే వాని రచించినవారు వారియిష్టమువచ్చినరీతిని పాఠాంతరముల నెక్కించియుందురని తోఁచుచున్నది. భారతవ్యాఖ్యనురచించిన నీలకంఠుఁడాపాఠాంతరములలో నొకదానిని సవరణజేసి కనంబఱచియుండెను. ఆ ప్రతులలోఁ గొన్నిటియందు

“శ్లో॥ హేమంతే ప్రథమేమాసే<br>
శుక్లపక్షత్రయోదశే।<br>
ప్రవృత్తం భారతంయుద్ధం<br>
నక్షత్రేయమదైవతే॥”

అనియు, మఱికొన్నిటియందు

“శ్లో॥ హేమంతే ప్రథమేమాసీ<br>
శుక్లపక్ష త్రియోదశీమ్।<br>
భౌమవారే భరణ్యాంచ<br>
సంగరోఽ భూత్తదామహాన్॥”

అనియు, నింకఁగొన్నిటియందు

“శ్లో॥ హేమంతే ప్రథమేమాసే<br>
శుక్లపక్షే త్రయోదశీమ్।

ప్రవృత్తం భారతమ్యుద్ధం
కురుపాండవ యోర్మహత్॥"

అనియుఁ జెప్పఁబడియున్నది. యుద్ధవిషయమిూరీతి వర్ణింపఁబడి యున్నది.

"శ్లో॥ హేమంతే ప్రథమేమాసే శుక్లపక్షత్రయోదశీమ్।
పరివృత్తం భారతంయుద్ధం కురుపాండవ యోర్మహత్॥
సప్తమ్యాం పాతితోభీష్మః సంధ్యాయాం దశమేహని।
అష్టమ్యాం భగదత్తశ్చ నవమ్యాంచ జయద్రధః॥
దశమ్యాంచైవ సౌభద్రోమహాయుద్ధే నిపాతితః।
ఏకాదశ్యామర్ధరాత్రే హతోవీరోఘటోత్కచః॥
తతఃప్రభాత సమయేవిరాట ద్రుపదౌహతౌ।
ద్వాదశ్యాంచైవ మధ్యాహ్నేద్రోణాచార్యోరణేహతః॥
త్రయోదశ్యాంతు పూర్వాహ్నే హతోదుశ్శాసనోయుధి।
తస్మిన్నేవ మహాయుద్ధే వర్తమానే చతుర్దశీమ్।
ధనుంజయేనమధ్యాహ్నే కర్ణోవైకర్తనోహతః॥
నిఃశబ్దతూర్యం హతయోధవీర్యం।
ప్రశాంతదర్పం ధృతరాష్ట్రిసైన్యమ్।
సిరాజతే సూర్యసుతేనహీనమ్।
బృందం గృహాణా మివచంద్రహీనమ్॥
ముఖంకమలపత్రాక్షం యథాశ్రవణవర్జితం।
తథాతత్కౌరవంసైన్యమ్ కర్ణహీనంనశోభతే॥

హ తేభీష్మే, హ తేద్రోణే, కర్ణేచవినిపాతితే।
ఆశాబలవతీరాజ్ఞః శల్యోజ్జేష్యతిపాండవాన్॥
ధర్మరాజేనశల్యోఽపిపాతితేధరణీతలే।
మధ్యాహ్నేపంచదశ్యాంతు మద్రరాజోదివంగతః॥
ఉలూకః శకునిశ్చైవ యమాభ్యాంచనిపాతితౌ।
తస్మిన్నేవార్ధరాత్రేతు రాజాదుర్యోధనోహతః॥"
భీమసేనేనగదయా ద్వంద్వయుద్ధేనిపాతితః॥
అథాఽప్యామేవయామిన్యాం ద్రౌణినానిహతస్తథా।
ధృష్టద్యుమ్నః శిఖండీచ ద్రౌపద్యాః పంచచాఽత్మజాః॥
దినానిదశభీష్మాణి, భారద్వాజేన పంచచ।
దినద్వయంతుకర్ణేన, శల్యోసార్ధదినంతథా।
దినార్ధంతు గదాయుద్ధమేతత్ భారతముచ్యతే॥

తెలుఁగున బ్రచురింపఁబడిన భారతసావిత్రియందు యుద్ధ విధానముం గూర్చి యీ విధముగఁ జెప్పఁబడియున్నది.

"మార్గశిర మాసమున శుక్లపక్ష త్రయోదశీ దినమున భరణీనక్షత్రంబున భారతయుద్ధంబు ప్రవృత్తంబయ్యె; అందుఁ గృష్ణపక్ష సప్తమీ దివసంబున భగదత్తుండును, నవమినాఁడు జయద్రథుండును, దశమినాఁ డభిమన్యుండును, నేకాదశిదినంబున సైంధవుండును, అర్ధరాత్రంబున ఘటోత్కచుండును, ద్వాదశివేకువజామున విరాట ద్రుపదులును, ఆ మధ్యాహ్నంబున ద్రోణాచార్యుండును, త్రయోదశి దినంబున ననేక రాజసంఘంబులఁను, చతుర్దశి మధ్యాహ్నంబున దుశ్శాసనుండును, ఆ సాయంసమయంబున మహారథుండైన కర్ణుండును రణంబునంబడె. పిదప దుర్యోధను సైన్యంబు దైన్యంబునొంద, భేరీమృదంగాదివాద్య ఘోషంబు

లేక వీరాలాపంబులు మాని హర్షములు దొలంగి సూర్యుండులేని దినంబు నుంబోలె, జంద్రుండులేని రాత్రి పగిది కాంతివిహీనంబై కనుపించె. కమలదళంబువంటి కన్నులుకలిగిన దుర్యోధను ముఖంబు కలావర్జితంబయి శోభింపదయ్యె. తదనంతరంబున అమావాస్యయందు శకునియు, నులూకుండును సహదేవుచేతఁ దెగటారిరి. ఆ మధ్యాహ్నంబున శల్యుఁడు ధర్మరాజుచేతం బుచ్చె; ఆ సాయంసమయంబున భీమసేనుని గదాఘాతంబునఁ దొడలు విరిగి దుర్యోధనుండు పడియె. ధృష్టద్యుమ్నుండును శిఖండియు ద్రౌపదీపుత్రులేవురు నారాత్రియం దశ్వత్థామచేత హతులయిరి. ఈ విధంబున పదునెనిమిది యక్షౌహిణులు పదునెనిమిదినంబుల సమసె."

ఈ విధి భారతసావిత్రి ప్రతులయందం దెద్దానియందుఁ జూచినను మహాభారతయుద్ధము మార్గశీర్ష శుక్ల త్రయోదశి నాఁడు భరణీనక్షత్రమునఁ బ్రారంభమయ్యెననియు, భీష్ముండు పదియవనాఁడగు సప్తమినాఁటి సాయంకాలమున హతుండయ్యె ననియు, ద్రోణుఁడు ద్వాదశినాఁటి మధ్యాహ్నమునందును, గర్ణుఁడు చతుర్దశినాఁడును, శల్యుఁ డమావాస్య మధ్యాహ్నమునను, నా దినముననే దుర్యోధనుండును హతులైనటులఁ జెప్పఁబడియుండెను. భారతవ్యాఖ్యాతయగు నీలకంఠుని యభిప్రాయమున కయ్యది సరిపడినదికాదు. భారతసావిత్రి నాధారముగాఁ గైకొనినపు డద్దానియందుఁ జెప్పఁబడినట్లు జెప్పవలసి యుండెను. అటులఁగాక "హేమంతే ప్రథమేమాసే శుక్లపక్షే త్రయోదశీమ్" అను వాక్యమునందలి 'త్రయోదశి' ని 'చతుర్దశి' యని భావింపవలయుననిరి. యమదేవతానక్షత్రము

భరణీనక్షత్రమని శాస్త్రములు ఘోషించుచుండ మృగశీర్షా నక్షత్రముగ భావింపనలయుననిరి. మృగశీర్షానక్షత్రము యుగ్మ దేవతానక్షత్రమనిరి. రెండు దేవత లధిపతులుగాఁ గల నక్షత్రము విశాఖానక్షత్రముతక్క నితరనక్షత్రము లేవియును గావు. కడమ నక్షత్రములన్నియు నొక్కొక్క యధిదైవతము కలవై యున్నవి. ఇంద్రాగ్నులు విశాఖానక్షత్రమున కధిదేవతలు. మృగశీర్షానక్షత్రమునకు సోముఁడధిదేవతయైనట్లు శాస్త్రములుద్ఘోషించుచున్నవి. ఆ విషయమై నీలకంఠుఁడు చెప్పిన వాక్యము లెంతవఱకు విశ్వసనీయములో పఠితులు గ్రహింతురు గాక!

భారతయుద్ధము పదియవనాఁటి సాయంత్రము భీష్ముఁడు శరఘాతుఁడై పడిపోయిన విషయము నిర్వివాదాంశము. భారతసావిత్రి పఠితులయందు

1. 'సప్తమ్యాం పాతితో భీష్మః సంధ్యాయాం దశమేహని'

2. 'ఫల్గుణేన హతో భీష్మః కృష్ణపక్షేచ సప్తమి'

3. 'ఫల్గుణ్యాంచహతో భీష్మః కృష్ణపక్షేచ సప్తమిమ్॥'

అని భిన్నపాఠాంతరములచే భీష్ముఁడు పదియవనాఁటి సాయంత్రమునఁ గృష్ణపక్ష సప్తమినాఁడు అర్జునునిచే సంహరింపఁబడినటులఁ జెప్పఁబడియున్నది. నీలకంఠుఁడు చెప్పినటుల

'అర్జునేనహతో భీష్మో మాఘమాసే సితాష్టమిమ్॥'

అను పాఠాంతరము గన్పట్టదు. భారతసారమునందును భీష్ముని పాటును గుఱించి

"శ్లో॥ ఏవంతుపాతితో భీష్మః సంధ్యాయాందశమేదినే

* * * *

కృష్ణపక్షేతునప్తమ్యాం అర్జునేన నిపాతితః॥"*

అనియే చెప్పఁబడియున్నది.

భారతయుద్ధము మార్గశీర్షశుక్లపక్ష త్రయోదశినాఁడు ప్రారంభించినటుల భారతసావిత్రి చెప్పుచుండెనని నీలకంఠుని వ్యాఖ్య ననుసరించి చతుర్దశినాఁడు ప్రారంభింపఁబడియుండినట్టు లెంచిచూచినను అటనుండి పదియవనాఁడు నీలకంఠుఁ డుదాహరించినట్లు మాఖశుక్లఅష్టమి యెంతమాత్రము కాఁజాలదు. మాసప్రారంభము శుక్లపక్షప్రతిపత్తునుండి యగునని యెంచిన మార్గశీర్ష కృష్ణపక్షమగును. లేక మాసప్రారంభము కృష్ణపక్ష ప్రతిపత్తునుండి యగునని యెంచిన పుష్యశుక్లపక్షమగును. ఏవిధముగాఁజూచినను మాఖమాసము కానేరదు. మఱియు నీలకంఠుని మతానుసారము భారతయుద్ధము మార్గశీర్షశుక్లత్రయోదశి నాఁడారంభమైనట్టులెంచినను నీలకంఠుఁడుదాహరించిన వాక్యములనుబట్టి భీష్ముఁడు కిరీటివలన మాఘశుక్లఅష్టమినాఁడు నిహతుఁడైనటులఁ జెప్పఁబడియుండుటచే భీష్మునినిర్యాణము భారతయుద్ధము ప్రారంభమయిన 55 (యేఁబదియైదు) రోజుల కయియుండెనని చెప్పవలసివచ్చుచున్నది. నీలకంఠుఁడు వ్యాఖ్యను

* భారతసారము 62 అధ్యా. 91-95శ్లో.

రచించునప్పుడిట్టిచిక్కులు తటస్థించుటచే పౌషమాసమునకు మారు మకరాయనమని చెప్పు నభిప్రాయమున మాఘమాస మని చెప్పియుండెననియు, 'అసితాష్టమి'కి మారు పొరపా టున 'సితాష్టమి'యని చెప్పఁబడియుండెననియుఁ జెప్పియుం డెను. నీలకంఠుఁ డుదాహరించిన 'అష్టునేనహాతో భీష్మో మాఘ మాసే సితాష్టమి' యనువాక్యమును భీష్మనిర్యాణము జరగిన దినమును దెలుపుటకయి మఱియొక గ్రంథమునఁ జెప్పబడిన వాక్యమును గ్రహించియుండుననియుఁ బొరపాటున భారత సావిత్రినుండి గైకొనినట్టు లుదాహరించియుండుననియుఁ దోఁచు చున్నది. భారతయుద్ధము పదియవనాఁడు భీష్ముఁడుపడినట్లును, బిమ్మట 58 (యేబదియెనిమిది) రాత్రులుజీవించి ఉత్తరాయ నము వచ్చినతరువాత దేహత్యాగము గావించినట్లును స్పష్ట ముగ భారతమునఁ జెప్పఁబడియుండెను. భారతయుద్ధమా రంభమయినతరువాత 68 రోజులకు భీష్మనిర్యాణమయినట్టు లగపడుచున్నది. భారతయుద్ధము కార్తికబహుళ అమావా స్యనాఁడు ప్రారంభమయినట్టు లుద్యోగపర్వమునఁ జెప్పఁబడి యుండెను. కార్తికబహుళ అమావాస్యనుండి యఱువదియెని మిదవ (68) దినము మాఘశుక్లయష్టమి యగుచున్నది. మార్గ శీర్ష,పౌష, మాసములు రెంటినిఁగలిపి గణితముచేసిచూచినచో 59 (యేబదితొమ్మిది) దినములుమాత్రమేయుండును. కావున కార్తికబహుళ యమావాస్యనుండియు మాఘశుక్లయష్టమికి 68 రోజులు సరిపోవుచున్నవి. అదియునుంగాక హైందవులు సంప్రదాయముగ మాఘశుక్లయష్టమి భీష్మాష్టమియనియు,

మాఘశుక్లసప్తమి రథసప్తమియనియుఁ జెప్పుకొనుదానికిని సరి పోవుచున్నది. మాఘశుక్లసప్తమినాఁడు సూర్యుఁ డుత్తరాయ నుఁ డయ్యెననియు నంతకుబూర్వము దక్షిణాయనుఁడుగనే యుండెననియుఁ గన్పట్టుచున్నది. కాన వ్యాఖ్యాత చెప్పినట్లు భీష్ముఁడు మాఘశుక్లపంచమియందు దేహమును బరిత్యజించి యుండెనన్న దక్షిణాయనమందే యైయుండెనని చెప్పవలసియుం డును. అయ్యది భారతమునఁజెప్పఁబడిన యంశములకుఁ బ్రత్య క్షవిరుద్ధము.

ఇటులనే ద్రోణుని మరణమును గుఱించి

' త్రయోదశ్యాంతుమధ్యాహ్నే భారద్వాజో నిపాతితః'

అని చెప్పఁబడినవాక్యము భారతసావిత్రి ప్రతులయందుఁ గాన రాదు. ఇయ్యది ద్రోణుఁడు హతుఁడైనతిధిని మాత్రమే తెలి యఁజేయుచున్నది. ఏమాసమునందలి త్రయోదశియైనదియు నా శ్లోకమునఁ జెప్పఁబడియుండలేదు. మార్గశీర్షశుక్ల త్రయోదశి తిధిని జెప్పు నుద్దేశ్యముతో దానిని రచించిన గ్రంథకర్త చెప్పి యుండినట్లు దోఁచుచున్నది. ఏలన కార్తీకబహుళ యమావా స్యనాఁడు యుద్ధమారంభమయ్యెనని యుద్యోగపర్వమునఁ జెప్పఁ బడియుండెను. ద్రోణుఁడు పదునైదవనాఁటి మధ్యాహ్నమున హతుఁడయ్యెను. కార్తీక కృష్ణపక్షము 13 తిథులు మాత్రమే కలిగియుండెననియుఁ ద్రయోదశి-అమావాస్యతిథు లొక్కనాఁడే కలిసియుండెననియుఁ జెప్పఁబడియుండెను. అట్టి పక్షమునకు వెంటనే వచ్చెడుపక్షమునకు 16 తిథులుండుననియు, మొదటి

రెండుదినములయందు నొకేతిథి యుండుననియు జ్యోతిశ్శాస్త్ర సిద్ధాంతముల ననుసరించి కానిపించుచున్నది. కావున అమావాస్యనుండి త్రయోదశి పదునైదవ (15) దినమగుచున్నది. అయ్యదియు ద్రోణుఁడు మార్గశీర్ష శుక్ల త్రయోదశినాఁడు హతుఁడైనట్లు బలపఱచుచున్నది.

నీలకంఠుఁడు భారతసావిత్రినుండి యుదాహరించిన

"శ్లో॥ హేమంతే ప్రథమేమాసే శుక్లపక్షత్రయోదశీమ్।
ప్రవృత్తం భారతమ్యుద్ధం నక్షత్రేయమదైవతే॥"

అను శ్లోకము భారతయుద్ధము 15 వ దినమున ద్రోణుని యుద్ధమును గుఱించి చెప్పఁబడినట్లు భారతసావిత్రి ప్రతులయందు

1. "హేమంతే ప్రథమేమాసే శుక్లపక్షే త్రయోదశీమ్।
ప్రవృత్తం భారతంయుద్ధం కురుపాండవయోర్మహాత్॥"

(హేమంతర్తువునందలి ప్రథమమాసమున—మార్గశీర్ష మాసమున—శుక్లపక్ష త్రయోదశినాఁడు కురుపాండవులకు భారతయుద్ధము ఘోరముగ జరగెను.)

2. "హేమంతే ప్రథమేమాసే శుక్లపక్ష త్రయోదశీమ్।
భౌమవారే భరణ్యాంచ సంగరోభూత్తదామహాన్॥"

(హేమంతర్తువునందలి ప్రథమమాసమున—మార్గశీర్ష మాసమున—శుక్లపక్ష త్రయోదశీ మంగళవారము భరణీ నక్షత్రమున మహాఘోరమగు యుద్ధము జరగెను.)

అనియుఁ గన్పట్టెడు పాఠాంతరములనుబట్టి మార్గశీర్షశుక్ల త్రయోదశినాఁడు భారతయుద్ధము మహాఘోరముగ జరిగి యుండెననియే భావమిచ్చుచున్నది కాని ఆనాఁడేయుద్ధమారంభ మయినట్లు లెంతమాత్రమును జెప్పుచుండుటలేదు.

భారతసావిత్రికి మాతృకయని చెప్పఁబడు భారతసారమునం దీశ్లోకము

"శ్లో॥ హేమంతే ప్రథమేమాసి
శుక్లపక్షే త్రయోదశీమ్ ।
భౌమవారే భరణ్యాంచ
సంగరోఽభూత్తదామహాన్ ॥"[1]

అనియే చెప్పఁబడియున్నది. దీనింబట్టియు

"హేమంతర్తువునందలి ప్రథమమాసమగు మార్గశీర్షశుక్లపక్ష త్రయోదశీమంగళవారము భరణీనక్షత్రమున యుద్ధము మహాఘోరముగనుండెను"

అనియే భావమిచ్చుచున్నది.

భారతయుద్ధ వర్ణనమును బరిశీలించిన పదునైదవనాఁటి యుద్ధము మహాఘోరముగ జరగియుండినట్లు లగపడుచున్నది. పదునాలవనాఁటిరాత్రి యుద్ధముజరగినపిమ్మట దుర్యోధనుఁడు ద్రోణుని నిందించుటయు, మఱునాఁటియుద్ధమునఁ దాను పడిపోవులోపలఁ బాంచాలురనందఱనుసంహారించెదననియు, నెవరేనిఁ

1. భారతసారము - 59 అధ్యా. 42 శ్లో.

దప్పించుకొని మిగిలియుండిన నాపనినెఱవేర్చుటయే తనకోరికయని తనకుమారునకు జెప్పవలయుననియుఁ బ్రతినవట్టి పదునైదవనాఁడు యుద్ధముసేయఁగడంగినట్లు భారతము వాకొనుచున్నది. ఆనాఁటియుద్ధమున ద్రోణుఁడు మధ్యందినమార్తాండునివగిది దేజరిల్లుచు దన్నెదుర్కొను వైరివీరులనెల్లఁ యమాలయమున కతిథులఁగావించుచు ఘోరయుద్ధముఁ గావించుచుండెను. పాండవులకెక్కుడు సాహాయ్యకారిగనుండి పోరుచున్న యోధాగ్రేసరులగు విరాట ద్రుపదులు సైన్యయుతముగ సంహరింపఁబడిరి. ద్రోణునెదుర్కొనిన యోధుఁడంతిపురికేఁగుచుండెను. ఇట్లు ద్రోణుండానాఁడు ఘనీభవించిన రౌద్రరసమూర్తియోయనఁ గోటిసూర్యప్రభాభాసితుండయి ప్రతాపానలంబు నద్దెసల వ్యాపింపఁజేసి పుంఖానుపుంఖంబులుగు బాణతతి విసరుచుఁ బాండవసైన్యమంతను భస్మీపటలముఁగావించుచుండెను. ద్రోణునెదుర్కొనుట కెవ్వరును సాహసింపఁజాలకుండిరి. అట్టియెడఁ బాండవులెల్లఁ ధైర్యంబుఁదక్కి దిక్కుతోఁచక డిల్లవడియుండిరి. ఆనాఁటి ద్రోణుధాటిని దప్పించుకొనుటకు వేఱుమార్గంబుఁగానక "అశ్వత్థామహతః" అని యుధిష్ఠిరునిచే నన్నృతవాక్యమును ద్రోణుని చెవిసోకునటులఁ బలికించిరి. తన తనూజుండగు అశ్వత్థామ హతుఁడయ్యెనను విషాదవాక్యమునువిని, యుధిష్ఠిరుం డనృతసల్లాపములఁ గావించువాఁడుకాఁడనియు వాస్తవమయి యుండుననియు నమ్మి ద్రోణుఁడస్త్రసన్న్యాసముగావించెను. ఆ యదనున ద్రుపదనందనుఁడగు దుష్టద్యుమ్నుఁ డాద్రోణుని సంహరించియుండెను.

భారతసారమునఁ జెప్పఁబడినశ్లోక మీపదునైదవ దినమునఁ గురుపాండవులకు జరగిన యమ్మహాఘోర సంగ్రామమును దెలియఁజేయుటకుం జెప్పఁబడియుండినట్లు లగపడుచున్నది. యుద్ధమారంభమయినట్లు భారతమునందుఁ జెప్పఁబడినరీతిని కార్తికబహుళ అమావాస్యనుండి త్రయోదశి పదునైదవదిన మగుటయుఁ ద్రయోదశినాఁడు యమదైవత నక్షత్రమగు భరణియని చెప్పఁబడియుండుటచే యుద్ధప్రారంభదినము శక్రదైవతనక్షత్రమగు జ్యేష్ఠానక్షత్రమయియుండెనని చెప్పఁబడిన వాక్యమునుబట్టి, భీష్ముఁడు శరతల్పగతుఁడైన పదియవనాఁటి యుద్ధము మొదలు 58 (యేబదియెనిమిది) రాత్రులు గడచిన పిమ్మట మాఘశుక్ల యష్టమిని దేహత్యాగముజేసినట్లు జెప్పఁబడిన భీష్మవచనము ననుసరించి, భీష్ముఁడు శరతల్పగతుఁడైన తర్వాత ద్రోణుఁ డైదుదినములు యుద్ధముసేసి హతుడైనట్లు ప్పఁబడియుండుటచే ద్రోణుఁడు హతుఁడైన పిమ్మట 53 3-5) రాత్రులు భీష్ముఁడు జీవించియుండినట్లు లగపడుటచే , ద్రోణుఁడు చనిపోయినట్లు జెప్పఁబడిన త్రయోదశి, మార్గ శుక్ల త్రయోదశి భరణి నక్షత్రమని చెప్పఁబడియుండుటచే డు మొదలు 53 రాత్రులు గడచిన మరునాఁడు మాఘ యష్టమి రోహిణీనక్షత్రమగుచుండినందునను, అయ్యది రతమునం దుదహరింపఁబడిన దినమునకును నక్షత్రమునకును పోవుచుండుటచేతను, శ్రీకృష్ణుఁడు దుర్యోధను సభకు బారిగా కార్తికశుక్లపక్ష ద్వాదశీ రేవతీనక్షత్రమున వెడలి డినట్లుఁ జెప్పఁబడియుండుటచే ద్రోణుఁడు హతమైన

భరణీనక్షత్రము రేవతినుండి 29 నక్షత్రములు గడచియుండినను, గార్తీకశుక్ల ద్వాదశినుండి యిరువది తొమ్మిదవదినము మార్గశీర్షశుక్ల త్రయోదశి యగుచుండుటచేతను భారతసారమునందును, భారతసావిత్రియందును జెప్పఁబడిన శ్లోకములు భారతయుద్ధమునఁ బదునైదవనాఁటి యుద్ధమునుగుఱించి చెప్పఁబడిన వాక్యములనియు, మాఘశుక్ల యష్టమిని భీష్ముఁడు హతుఁడైనటులఁ జెప్పఁబడిన వాక్యము భీష్ముఁ డుత్తరాయనము ప్రవేశమైనపిమ్మట దేహత్యాగముఁ గావించిన దినమును తెలుపుటకై చెప్పఁబడినవాక్యమనియు, ద్రోణుఁడు హతుఁడైనది మార్గశీర్ష శుక్ల త్రయోదశి భరణీనక్షత్రమయి యుండుననియు స్పష్టముగఁ గన్పట్టుచున్నది. మఱియు వీనింబట్టి శ్రీకృష్ణరాయబారము జరగినతర్వాతఁ బుష్యమీనక్షత్రమున దుర్యోధనుఁడు తనసైన్యమును గురుక్షేత్రమునకు బయలుదేర నాజ్ఞయిడియుండెననియు నటుపిమ్మట నేఁడు (7) దినములకు తర్వాత అమావాస్య రానున్నదనియు, నాదినమున నింద్రాధిపత్యముగల నక్షత్రమున (జ్యేష్ఠానక్షత్రమున) యుద్ధమారంభమయియుండెననియు నుద్యోగపర్వమునఁ జెప్పఁబడియుండినప్రకారము పుష్యమీనక్షత్రము అనఁగా దుర్యోధనుఁడు తనసైన్యమును గురుక్షేత్రమునకుఁజేర నాజ్ఞనిడినదినము కార్తీకబహుళ (కృష్ణపక్ష) పంచమియు నటుపిమ్మట నేఁడుదినములు గడచినతర్వాత యుద్ధారంభమయినటులఁ జెప్పఁబడియుండుటచేతను, యుద్ధారంభమయిన పంచదశితో నాపక్షమునఁ బదమూఁడుతిథులుమాత్రమే కలవనియుఁ ద్రయోదశి, పంచదశితిథు లొక్కనాఁడే కలిసి

భారతసారమునఁ జెప్పఁబడినశ్లోక మీాపదునైదవ దినమునఁ గురుపాండవులకు జరగిన యమ్మహాఘోర సంగ్రామమును దెలియఁజేయుటకుం జెప్పఁబడియుండినట్లు లగపడుచున్నది. యుద్ధమారంభమయినట్లు భారతమునందుఁ జెప్పఁబడినరీతిని కార్తీకబహుళ అమావాస్యనుండి త్రియోదశి పదునైదవదిన మగుటయుఁ ద్రియోదశినాఁడు యమదైవత నక్షత్రమగు భరణియని చెప్పఁబడియుండుటచే యుద్ధప్రారంభదినము శక్రదైవతనక్షత్రమగు జ్యేష్ఠానక్షత్రమయియుండెనని చెప్పఁబడిన వాక్యమునుబట్టి, భీష్ముఁడు శరతల్పగతుఁడైన పదియవనాఁటి యుద్ధము మొదలు 58 (యేబదియెనిమిది) రాత్రులు గడచిన పిమ్మట మాఖశుక్ల యష్టమిని దేహత్యాగము జేసినట్లు జెప్పఁబడిన భీష్మవచనము ననుసరించి, భీష్ముఁడు శరతల్పగతుఁడైన తర్వాత ద్రోణుఁడైదుదినములు యుద్ధముసేసి హతుడైనట్లు జెప్పఁబడియుండుటచే ద్రోణుఁడు హతుఁడైన పిమ్మట 53 (58-5) రాత్రులు భీష్ముఁడు జీవించియుండినట్లు లగపడుటచే తను, ద్రోణుఁడు చనిపోయినట్లు జెప్పఁబడిన త్రయోదశి, మార్గశీర్షశుక్ల త్రయోదశి భరణి నక్షత్రమని చెప్పఁబడియుండుటచే నాఁడు మొదలు 53 రాత్రులు గడచిన మరునాఁడు మాఖశుక్ల యష్టమి రోహిణీనక్షత్రమగుచుండినందునను, అయ్యాది భారతమం దుదహరింపఁబడిన దినమునకును నక్షత్రమునకును సరిపోవుచుండుటచేతను, శ్రీకృష్ణుఁడు దుర్యోధను సభకు రాయబారిగా కార్తికశుక్లపక్ష ద్వాదశీ రేవతీనక్షత్రమున వెడలియుండినటులఁ జెప్పఁబడియుండుటచే ద్రోణుఁడు హతమైన

భరణీనక్షత్రము రేవతినుండి 29 నక్షత్రములు గడచియుండినను, గార్తీకశుక్ల ద్వాదశినుండి యిరువది తొమ్మిదవదినము మార్గశీర్షశుక్ల త్రయోదశి యగుచుండుటచేతను భారతసారమునందును, భారతసావిత్రియందును జెప్పఁబడిన శ్లోకములు భారతయుద్ధమునఁ బదునైదవనాఁటి యుద్ధమునుగుఱించి చెప్పఁబడిన వాక్యములనియు, మాఖశుక్ల యష్టమిని భీష్ముఁడు హతుఁడైనటులఁ జెప్పఁబడిన వాక్యము భీష్ముఁ డుత్తరాయనము ప్రవేశమైనపిమ్మట దేహత్యాగముఁ గావించిన దినమును తెలుపుటకై చెప్పఁబడినవాక్యమనియు, ద్రోణుఁడు హతుఁడైనది మార్గశీర్ష శుక్ల త్రయోదశి భరణీనక్షత్రమయి యుండుననియు స్పష్టముగఁ గన్పట్టుచున్నది. మఱియు వీనింబట్టి శ్రీకృష్ణరాయబారము జరగినతర్వాతఁ బుష్యమీనక్షత్రమున దుర్యోధనుఁడు తనసైన్యమును గురుక్షేత్రమునకు బయలుదేర నాజ్ఞయిడియుండెననియు నటుపిమ్మట నేఁడు (7) దినములకు తర్వాత అమావాస్య రానున్నదనియు, నాదినమున నింద్రాధిపత్యముగల నక్షత్రమున (జ్యేష్ఠానక్షత్రమున) యుద్ధమారంభమయియుండెననియు నుద్యోగపర్వమునఁ జెప్పఁబడియుండినప్రకారము పుష్యమీనక్షత్రము అనఁగా దుర్యోధనుఁడు తనసైన్యమును గురుక్షేత్రమునకుఁజేర నాజ్ఞనిడినదినము కార్తీకబహుళ (కృష్ణపక్ష) పంచమియు నటుపిమ్మట నేడుదినములు గడచినతర్వాత యుద్ధారంభమయినటులఁ జెప్పఁబడియుండుటచేతను, యుద్ధారంభమయిన పంచదశితో నాపక్షమునఁ బదమూఁడుతిథులుమాత్రమే కలవనియుఁ ద్రయోదశి, పంచదశితిథు లొక్కనాఁడే కలిసి

యుండెనని చెప్పఁబడియుండుటచేతను యుద్ధారంభదినము కార్తీకబహుళ యమావాస్య (కృష్ణపక్షపంచదశి) నాఁడగు చున్నది. యుద్ధప్రారంభము మొదలు దుర్యోధనుఁడు హతుఁ డయినట్టి పదునెనిమిదవదినము మార్గశీర్షకృష్ణపక్ష ప్రతిపత్తు దివసమగుచున్నది. నాఁడు ఆర్ద్రానక్షత్రమగుచున్నది. మహా భారతవ్యాఖ్యాత చెప్పినటుల శ్రవణానక్షత్రము కాఁజాలదు.

మార్గశీర్షశుక్లచతుర్దశి యుద్ధప్రారంభదినమనియు, నాఁడు మృగశీర్షానక్షత్రమయియుండెననియు, పుష్యబహుళ ప్రతిపత్తు యుద్ధము పరిసమాప్తమయినదినమనియు, నాఁడు శ్రవణానక్షత్ర మయియుండెననియు, నీలకంఠుఁడు చెప్పుచున్నాఁడు. అయ్యది జ్యోతిశ్శాస్త్రసిద్ధాంతములకతిరిక్తముగనున్నది. మృగశీర్షానక్షత్ర యుత పూర్ణిమగలమాసము మార్గశీర్షమాసమనియు, పుష్య మీనక్షత్రయుత పూర్ణిమగలమాసము పుష్యమాసమనియు శాస్త్రములు జెప్పుచున్నవి. మార్గశీర్ష పూర్ణిమనాఁడు మృగ శీర్షా నక్షత్రమగుటయు, పుష్యశుక్ల పూర్ణిమనాఁడు పుష్యమీ నక్షత్రమగుటయు సంభవించును. పుష్యబహుళ ప్రతిపత్తునాఁడు ఆశ్లేషానక్షత్రమగును. ఒకానొకప్పుడానాడు పుష్యమీనక్ష త్రముగాని లేక మఖానక్షత్రముగాని సంభవించుట కవకాశ ముండునేమోగాని పుష్యమీ నక్షత్రమునకుఁ దరువాతఁ బదు నాలవ (14) నక్షత్రమగు శ్రవణానక్షత్రము కాఁజాలదు.

పుష్యమీ నక్షత్రమునవెడలి తాను మరలఁ దనశిష్యు లగు దుర్యోధనభీమసేనుల గదాయుద్ధమును జూచుటకై వచ్చితి

నని బలదేవుఁడు చెప్పియుండిన వాక్యములనుబట్టి భారత యుద్ధము పదునెనిమిదవనాఁడు శ్రీవణానక్షత్రమయి యుండె ననియు నక్కారణంబున శ్రవణానక్షత్రమునకుఁబూర్వము పదునెనిమిదవనక్షత్రము మృగశీర్షానక్షత్రమగుచున్నదనియు, భరణీ నక్షత్రము కానేఱదనియు నీలకంఠుఁడు చెప్పియుండెను. బలదేవుఁడు తిరిగివచ్చినదినము శ్రీవణా నక్షత్రమయియుండెనా? బలదేవుఁడు శ్రీవణానక్షత్రమున మరలివచ్చినటులఁ జెప్పియుండెనా? యను విషయ మాలోచింపవలసియున్నది. నీలకంఠుఁడుదాహరించిన

"శ్లో॥ చత్వారింశ దహాన్యద్య
ద్వేచమేనిః సృతస్యవై ।
పుష్యేణ సంప్రయాతోఽస్మి ।
శ్రవణే పునరాగతః ॥" 1

అను బలదేవుని వాక్యమునకు

"అప్పటికి నలువదిరెండు (40 + 2) దినములకిందటఁ బుష్యమీానక్షత్రమునఁ బ్రయాణముచేసి వెడలి తిరిగి శ్రవణానక్షత్రమున వచ్చినట్టు"

లర్థముసేసికొని శ్రీవణానక్షత్రమున యుద్ధసమాప్తి యైనట్లును, నంతకుఁబూర్వము పదునెనిమిదవదినము మృగశీర్షానక్షత్రమయినట్లును, యుద్ధారంభము మృగశీర్షానక్షత్రమయినట్లును, యుద్ధా

1 ద్రోణపర్వము. 34 అధ్యా. 6 శ్లో.

రంభము మృగశీర్షానక్షత్రమునందె యైయుండినట్లును నీలకం ఠుఁడు భ్రమపడినట్లు లగపడెడిని. ఈ శ్లోకమున 'శ్రవణే' యను పదము శ్రవణానక్షత్రమను భావముతోఁ బ్రయోగింపఁబడి యుండెనాయనువిషయ మాలోచింపఁదగును.

ఈ శ్లోకమునకు నీలకంఠుఁడొనరించిన వ్యాఖ్యను విమ ర్శించుచు గోపాలయ్యరుగారీశ్లోకమునకు నీలకంఠుఁడుచెప్పెడు యర్థము సరియనియెంచినచో భారతమునం దితరతావులయందు స్పష్టముగఁ జెప్పఁబడినవిషయములకు విరుద్ధముగనుండెననియు నాకారణమున బలదేవుఁడు యుద్ధమునకుఁబూర్వము తీర్థయా త్రకేఁగినటులఁ జెప్పఁబడినవిషయములును, యుద్ధసమాప్తికాల మున నాతని పునరాగమనమునుగూర్చి చెప్పఁబడిన విషయము లును గల్పితములయి యుండుననియు, లేదా ఆశ్లోకము లేఖక ప్రమాదజనితమయి యుండెననియు, సమాధానము చెప్పఁ దగియుండునని చెప్పియుండిరి. యుద్ధభూమికి సైన్యము కదలిన దినముననే పుష్యమీనక్షత్రమున బలదేవుఁడు తీర్థయాత్రకు వెడలినటుల భారతమునందు స్పష్టముగఁ జెప్పఁబడియున్నది. ఈశ్లోకము సరియనియెంచినచో యుద్ధభూమికిఁజేరుటకు సైన్య ము బయలుదేరియుండిన పుష్యమీనక్షత్రమునకుఁ బూర్వ మిఁరువదియేఁడు దినములక్రిందటవచ్చిన పుష్యమీనక్షత్రమున బలదేవుఁడు సరస్వతీనదిప్రాంతమునకుఁ దీర్థయాత్ర కేఁగియుండె ననియుఁ దిరిగి యుద్ధపరిసమాప్తి యగుటకుముందు కొలదిదిన ములక్రిందటనే శ్రవణానక్షత్రమున మరలివచ్చినట్లుగ జెప్పవలసి

యుండునవనియుఁ జెప్పియుండిరి. అటులఁగాక ఆశ్లోకమునందుఁ దప్పుగలదనియెంచినచో 'చత్వారింశదహోన్యద్య' యనువాక్యము 'చతుర్వింశత్యహోన్యద్య' అని సవరణచేసిన సరిపోవు ననియుఁ దీర్ఘయాత్రకుఁ జనిననాఁటినుండి నలువదిరెండవదిన మునఁగాక యిఱువదినాలవదినమగు యుద్ధపరిసమాప్తిదినమునఁ దిరిగివచ్చియుండుననిచెప్పిన సరిపోవుననియుఁ బుష్యమీనక్షత్ర మునఁ దీర్ఘయాత్రకేఁగినది మొదలు భారతయుద్ధము పరిసమాప్తి జెందినవఱకు నిఱువదినాలవ (24) దినమగుటచేఁ బుష్యమీనక్షత్రమునుండి యిఱువదినాలవనాఁడు రోహిణీ నక్షత్రమగుచున్నది గాన భారతయుద్ధము రోహిణీనక్షత్రమునఁ బరిసమాప్తియయియుండెనని సిద్ధాంతమునుగావించి యాశ్లోకమును

"శ్లో॥ చతుర్వింశత్యహోన్యద్య
చాఽఽఽసన్ మేనిః సృతస్యవై ।
పుష్యేణ సంప్రయాతోస్మి
రోహిణ్యాం పునరాగతః॥"$

అని దిద్దియుండిరి.

ముద్రణాయంత్రములు లేనికాలమున వాగూ్రపకముగ జెప్పుకొనుపట్టునను, అస్పష్టములగు వ్రాతప్రతులఁజూచి వ్రాయునపుడును శబ్దసామ్యములనుబట్టియు, లేక ధ్వనిసామ్యములనుబట్టియు లేక యక్షరసామ్యములనుబట్టియు లేఖకప్రమాద దోషములవలన నొకపదమునకుమారు మఱియొకపదమును

$ Chronology of Ancient India pp. 100-101.

వ్రాయుట సంభవించియుండెననినఁ గొంతవఱకంగీకరింపనై యుండును. అటులనే 'చతుర్వింశత్' అను పదమునకును 'చత్వారింశత్' అను పదమునకును శబ్దసామ్యమేగాక అక్షర సామ్యమును గొంతవఱకుండుటచే 'చత్వారింశత్' అనుపదము 'చతుర్వింశత్' అనుపదమునకు మారు పొరపాటున వ్రాయ బడియుండెనని యెంచుటయు నావిధముగ సవరించుటయు సమంజసముగనే గన్పట్టుచున్నది కాని యాశ్లోకమునందలి 'ద్వేచ' యనుపదమును మార్చి 'చాఽఽసన్' యనియు, 'శ్రవణే' యనుపదమును 'రోహిణ్యాం' యనియును సవరణలుగావిం చుట కేమియునాధారములు గన్పట్టుటలేదు. భారతయుద్ధము రోహిణీనక్షత్రమునఁ బరిసమాప్తినొందినట్లు సిద్ధాంతప్రతిపాదన గావించుటకయి యట్టిసవరణలు గావింపఁబడియుండెనని విధి లేక చెప్పవలసి వచ్చుచున్నది. ఇటుల మనయిష్టమువచ్చి నట్లు శ్లోకములను సవరించి సిద్ధాంతప్రతిపాదనలు గావింపఁ దలఁచిన యెట్లు సిద్ధాంతముసేయ సమకట్టిన నటులనే చేయఁదగి యుండునని ప్రత్యేకించి చెప్పనగత్యములేదు. మూలమునందలి పదముల మార్చకనే వాని కపార్థములఁగల్పించి నీలకంఠుఁడు వితండవాదములఁ జేసియుండెను. నీలకంఠునియర్థము భారత మునం దితరతావుల స్పష్టముగఁ జెప్పఁబడిన విషయములకు విరు ద్ధముగ నుండెనని యాక్షేపించిన మన గోపాలయ్యరుగారు మూలములఁ దాఱుమాఱుజేసి విపరీతసిద్ధాంతములఁ గావించి యుండిరి. ఉభయులకుఁ గల తారతమ్య మియ్యదియనియే కన్పట్టుచున్నది. తాఁ గావింపఁదలఁచిన విపరీతసిద్ధాంతముల

కనుగుణ్యముగ మూలములఁ దాఱుమాఱుచేసిన నింకను భారతమున జెప్పఁబడిన విషయములకు విరుద్ధముగనుండెనని యొక్కింతయేనిఁ బర్యాలోచించినవారు కారు.

'చత్వారింశత్' అను పదము 'చతుర్వింశత్' అను పదమునకు మారు లేఖకప్రమాదజనితమనియెంచి సవరించినచో భారతమునఁ దక్కిన తావులయందా సందర్భమును గుఱించి చెప్పఁబడిన విషయములకు సరిపోవునేమో కనుఁగొనవలసియుండును. అట్లు సరిపోయిన నయ్యది లేఖకప్రమాదజనితమని యెంచి సవరణగావింపవలసియుండును.

'చత్వారింశత్' అను పదము 'చతుర్వింశత్' అను పదమునకు మారు లేఖకప్రమాదమువలన వ్రాయఁబడియుండునని తలంచి సవరణగావించిన

"శ్లో॥ చతుర్వింశత్యహాన్యద్య
ద్వేచమేనిః సృతస్యవై।
పుష్యేణ సంప్రయాతోఽస్మి
శ్రవణే పునరాగతః॥"

అని చదువఁదగియుండును. దీనింబట్టి బలదేవుఁడు యుద్ధపరిసమాప్తి దినమునకుఁ బూర్వము 26 (24 + 2) దినముల క్రిందటఁ దీర్థయాత్రగమనుఁడై తిరిగి యుద్ధపరిసమాప్తి దినమున వచ్చియుండినటుల స్ఫురించుచున్నది. శ్రీకృష్ణరాయబారము కార్తికశుక్ల ద్వాదశి రేవతీనక్షత్రమున జరగియుండెననియుఁ బిమ్మటఁ బుష్యమీనక్షత్రమున, సైన్యము కురుక్షేత్రమునకు

బయలు దేరుటం గాంచి బలదేవుఁడు తీర్థయాత్రాగతుఁడయ్యె ననియు భారతము చెప్పుచున్నది. రేవతీనక్షత్రమున కెనిమిదవ నక్షత్రము పుష్యమీనక్షత్రమగుచున్నది. బలదేవుఁడు శ్రీకృష్ణ రాయబారమునకుఁ బిమ్మటనే తీర్థయాత్రాగతుఁడై నటులఁ జెప్పఁబడియుండెను. శ్రీకృష్ణరాయబారానంతరమే యుద్ధప్రయత్నములఁ గావింపఁబడియుండెను. దుర్యోధనుఁడు తనసైన్యములకుఁ గురుక్షేత్రమునకుఁజేర నాజ్ఞయిచ్చినదియు శ్రీకృష్ణ రాయబారానంతరము వచ్చిన పుష్యమీనక్షత్రమున నయియుండెననియుఁ బ్రసిద్ధము. శ్రీకృష్ణ రాయబారమునకుఁబూర్వము బలదేవుఁడు తీర్థయాత్ర కేఁగియుండినట్లు లెంచుట కెంతమాత్ర మవకాశము గన్పించుటలేదు. కావున దుర్యోధనుఁడును, పాండవులును యుద్ధమునకు సన్నద్ధులై కురుక్షేత్రమునకుఁ దమ సైన్యములను జేర్చుట కారంభించిన "పుష్యమీనక్షత్రమున-శ్రీకృష్ణరాయబారానంతరమువచ్చిన పుష్యమీనక్షత్రమున— కురుపాండవులకు సంగరముతప్పదని నిర్ధారణచేసికొని యా సంగ్రామమును దాఁ గాంచుట కిష్టములేనివాఁడై బలదేవుఁడాదినముననే సరస్వతీనదీప్రాంతమునకుఁ దీర్థయాత్రాగతుఁడయ్యె నని చెప్పఁదగియున్నది. భారతమును అటులనే చెప్పుచున్నది.* ఆదినము శ్రీకృష్ణరాయబారమునకుతర్వాత నెనిమిదవ దినమగుచున్నది. అయ్యది కార్తీకకృష్ణ పంచమితిథి యగుచున్నది. బలదేవుఁడు యుద్ధసమాప్తదినమున దిరిగివచ్చినట్లును అప్పటికి 26 దినములకిందటఁ బుష్యమీనక్షత్రమున వెడలియుండి

* ఉద్యోగపర్వము. 157 అధ్యా. 24-25 శ్లో.

నటులఁ జెప్పఁబడియుండుటచేతను, బలరాముఁడు తీర్థయాత్రకుఁ జనిన 9 (26-17) దినములతర్వాత యుద్ధమారంభమయియుం డినట్టు లగపడుచున్నది. పుష్యమీనక్షత్రము తరువాత పది యవనక్షత్రము జ్యేష్ఠానక్షత్రమయియున్నది. అయ్యది యింద్ర నక్షత్రము. మఱియుఁ బుష్యమీనక్షత్రమునుండి 26 నక్ష త్రము ఆర్ద్రానక్షత్రమగుచున్నది. దీనింబట్టి యుద్ధపరిసమాప్తి దినమున నార్ద్రానక్షత్రమయినట్టు లగపడుచున్నది. ఇంతియ కాక భీష్ముఁడు పదియవనాఁటి యుద్ధమున శరఘాతుఁడై యటుపిమ్మట 58 (యేబదియెనిమిది) రాత్రులుండి దేహత్యా గముఁ గావించియుండినటులఁ జెప్పఁబడియుండుటచే బల దేవుఁడు తీర్థయాత్రకు వెడలినదినమునకు భీష్ముఁడు దేహత్యా గముగావించుట 76 (26 + (58—8)) దినముల తర్వాతనై నట్టు లగపడుచున్నది. బలరాముఁడు తీర్థయాత్రాగతుఁడైన పుష్యమీనక్షత్రమునుండి 76 నక్షత్రములు గడచినటులఁ గన్పట్టుటచే భీష్ముఁడు దేహత్యాగముఁ గావించినది రోహిణీనక్షత్ర మునందేయని తెలియుచున్నది. బలరాముఁడు కార్తిక బహుళ పంచమినాఁడు తీర్థయాత్రాగతుఁడైనట్టు లగపడుటచేతను, అటుపిమ్మట డెబ్బదియాఱు (76) దినముల తర్వాత ఉత్తరా యన ప్రవేశమయినపిమ్మట భీష్ముఁడు దేహత్యాగముఁ గావిం చినటులఁ జెప్పఁబడియుండుటచేతను భీష్మనిర్యాణదినము మాఘ శుక్ల యష్టమి యగుచున్నది. కావున భీష్మనిర్యాణము మాఘ శుక్ల యష్టమిని రోహిణీనక్షత్రమున జరగియుండెనని చెప్పఁదగి

యున్నది. ఇయ్యది భీష్ముఁడు హతుఁడైనటుల నీలకంఠుఁడు క్రోడీకరించిన

"అర్జునేన హతోభీష్మో
మాఖమాసే సితాష్టమి"

యను వాక్యమునందలి మాఖశుక్ల యష్టమి దినమునకు సరి పోలుచున్నది. మఱియు నవ్వాక్యము భీష్మనిర్యాణము జరగిన దినమును దెలియఁజేయు సందర్భమునఁ జెప్పఁబడియుండినట్లును, యుద్ధమధ్యమున శరఘాతుఁడై పడిపోయిన దినమును దెలియఁ జేయు సందర్భమునఁ జెప్పఁబడినది గాదనియు, భీష్ముని మరణ మునకుఁ బాండవమధ్యముఁడు కారణభూతుఁడయి యుండుటచే 'అర్జునేన హతో భీష్మో' యని చెప్పంబడియుండెననియుఁ జెప్పఁ దగియున్నది. ఇటుల 'చత్వారింశత్' అను పదము 'చతు ర్వింశత్' యను పదమునకుమారు లేఖకప్రమాదజనితమని యెంచిచూచిన నయ్యది భారతమునందుఁ బలుతావులఁ జెప్పఁ బడిన యంశములన్నిటికిని సరిపోవుచున్నది.

అటులైనచో నా శ్లోకమున 'శ్రవణేపునరాగతః' యను వాక్యము "శ్రవణానక్షత్రమునఁ దిరిగివచ్చినట్టు లర్థమిచ్చు చుండ, దానింబట్టి యుద్ధపరిసమాప్తిదినమున శ్రవణానక్షత్రమై యుండెనని కన్పట్టుచుండ, 'చతుర్వింశత్' అని సవరించిచెప్పిన యుద్ధపరిసమాప్తిదినమున 'ఆర్ద్రా' నక్షత్రమగుచున్నదిగదా సమన్వయమగుటెట్టులని కొందఱికి సందేహముకలుగకమానదు. ఆ శ్లోకమున 'శ్రవణే' యనుపదము శ్రవణానక్షత్రమని తెలుపు

భావముతోఁ బ్రయోగింపఁబడియుండెనా యని విమర్శించి చూచిన యట్టిసందేహమున కవకాశమేకన్పట్టదు. 'శ్రవణే' యను పదమునకు 'విని' యనియు నర్థముఁగలదు.

బలదేవుఁడు తీర్థయాత్రకేఁగి పుణ్యనదియగు సరస్వతీనదీతీరంబున మహర్షులతోడను బ్రాహ్మణోత్తములతోడను గాలముగడుపుచుండ యుద్ధపరిసమాప్తదినమున నారదుఁడాబలదేవునికడకేఁగి కురుపాండవులకు జరుగుచుండిన యమ్మహాసంగ్రామమునఁ గౌరవపక్షమునఁ బోరుచుండిన యోధవరులపాటును, కృపాచార్య, కృతవర్మ, అశ్వత్థామల పలాయనవిధానమును, దుర్యోధనుఁడు హతాశుఁడై ద్వైపాయనహ్రదమున దాఁగిన విషయమును, జిట్టచివఱకా దుర్యోధనుఁ డామడువు నుండి బయలువెడలి భీమసేనునితో గదాయుద్ధమున ద్వంద్వయుద్ధముగావించుటకుఁ దలపడియెననియు సవిస్తరముగఁ జెప్పియుండెననియు, అయ్యది విని బలదేవుఁడు తనశిష్యులిద్దఱకు జరుగనున్న గదాయుద్ధమునుగాంచ కుతూహలుండై తిరిగి కురుక్షేత్రమునకు వచ్చియుండినట్లును సవిస్తరముగ శల్యపర్వమునఁ జెప్పఁబడియుండెను. *

నీలకంఠునిచే నుదాహరింపఁబడిన శ్లోకమును దాని తర్వాతశ్లోకము నీవిధముగఁ జెప్పఁబడియున్నవి.

"శ్లో॥ చతుర్వింశత్యహాన్యద్య
ద్వేచమేనిః సృతస్యవై ।

* శల్యపర్వము. అధ్యా. 36—55.

పుష్యేణసంప్రయాతోఽస్మి
శ్రవణే పునరాగతః॥ ౬

"శ్లో॥ శిష్యయోర్వై గదాయుద్ధం
దృష్టుకామోఽస్మిమాధవ ।
తత స్తదాగదాహస్తౌ
దుర్యోధన వృకోదరే॥"* ౭

ఇందలి 'శ్రవణే'యను పదము 'విని'యను భావమున నుపయోగింపఁబడియుండెనని తలంచిన నాశ్లోకములు

"పుష్యమీనక్షత్రముననే నిచ్చోటుఁబాసి వెడలియుండుటచే నిప్పటికిఱువదియాఱు (24 + 2) దినములయినది. మాధవా! శిష్యులిద్దఱకు గదాయుద్ధముజరుగుననివిని (వినినవాఁడనై) దుర్యోధన వృకోదరుల గదాయుద్ధకౌశలమును గాంచ కోరికగలవాఁడనై తిరిగివచ్చియుంటిని."

అని అర్థమిచ్చుచున్నది. శల్యపర్వము 35 అధ్యాయములో నీ శ్లోకములకుఁబూర్వ మాయధ్యాయప్రారంభములోఁ జెప్పఁబడిన

"శ్లో॥ తస్మిన్యుద్ధే మహారాజ
సుసంవృత్తే సుదారుణే
ఉపవిష్టేషు సర్వేషు
పాండవేషు మహాత్మసు॥ ౧.

* శల్యపర్వము 35 అధ్యా. 6–7 శ్లో.

తతస్తాలధ్వజో రామ
స్తయోర్యుద్ధ ఉపస్థితే।
శ్రుత్వా తచ్ఛిష్యయోరాజ
న్నాజగామ హలాయుధః॥"[1] ౨.

అను శ్లోకములనుబట్టి హలాయుధుఁడగు బలరాముఁ డాతని శిష్యులిద్దఱకు గదాయుద్ధముజరుగునని వినినవాఁడై వారియుద్ధమునుగాంచుటకు వచ్చెనని చెప్పఁబడియుండినట్టు లగపడుచున్నది. కావున బలదేవునివాక్యముగ నుదాహరింపఁబడిన 'చతుర్వింశత్యహాన్యద్య' యను శ్లోకమునందలి 'శ్రవణే' యనుపదముకూడ 'విని'యను అర్థమునుబోధించు నుద్దేశ్యముతోడనే కవి ప్రయోగించియుండినటుల స్పష్టముగఁ గన్పట్టుచున్నది. ఆశ్లోకములకుఁ బూర్వోత్తరశ్లోకముల సంధానముఁ జేసి సమన్వయముఁగావించిన 'శ్రవణే'యను పదమునకు శ్రవణానక్షత్రమునఁ దిరిగివచ్చియుండెనని యర్థమును స్వీకరించుటకెంతమాత్ర మవకాశముగన్పట్టదు.

ఇఁక ద్రోణపర్వమునందు ద్వాదశినాటిరాత్రి యుద్ధకాలమునఁ జంద్రోదయవర్ణనము గావింపఁబడియుండుటచేతను

"త్రిభాగమాత్ర శేషాయాం
రాత్రౌ యుద్ధమవర్తత"

యని చెప్పఁబడియుండుటచేతను త్రిముహూర్తకాలము రాత్రి మిగిలియుండఁగా జంద్రోదయమైనట్టు లగపడుచున్నదనియుఁ

1 శల్యపర్వము 35 అధ్యా. 1-2 శ్లో.

గావున నయ్యది కృష్ణపక్షద్వాదశీరాత్రికాలమయియుండవలయు ననియు నీలకంఠుఁడు చెప్పియుండెను.

భారతయుద్ధము పదునాలవదినమునఁ బాండవమధ్యముఁడు సూర్యాస్తమయమగులోపల జయద్రథుని సంహరించెదనని శపథముచేసి సంహరించియుండెను. జయద్రథవధచేఁ గౌరవులుగ్రులై పదునాలవనాఁటి సాయంత్రము పొద్దుగ్రుంకుటతో యుద్ధమునుజాలింపక రాత్రికాలమునందుఁగూడ యుద్ధమును గావించియుండిరి. ఆరాత్రి ఘటోత్కచుఁడు వధియింపఁబడియెను. ఆనాఁటిరాత్రి యుద్ధకాలమునఁ జీకటిగానుండుటచేఁ గొంతకాలము విశ్రాంతిదీసికొని యుద్ధముసేయవచ్చునని యర్జునుఁడు కోరినటులఁ జెప్పఁబడియుండుటచేతను, బిమ్మటఁ జంద్రోదయవర్ణనము గావింపఁబడియుండుటచేతను భారతమునందితరాధారములు లేకుండిన నట్టిరాత్రి కృష్ణపక్ష రాత్రియని పక్షాంతరమున స్ఫురింపవచ్చును. ఇవ్విషయమును గోపాలయ్యరుగారు చర్చించుచు

"There is one other conflicting verse which we shall briefly discuss. On the fourteenth night of the War there was a tremendous battle between the contending parties. It is hinted in the Epic that the Moon rose up on that night after three-fourths part of it had expired. This is certainly a mistake for the New Moon having taken place on the fifth day of the War, the Moon should have disappeared below the western horizon

about an hour and half before threefourths of the night were over. On the evening of the fourteenth day of the War Arjuna's vow to kill Jayadradha having been fulfilled, the Kurus burning with revengeful thoughts, continued the strife far into the night. The Epic would have us believe that during the first half of the night a tremendous battle raged in total darkness resulting in the death of Ghatotkacha, that both the armies thereafter lay down to sleep for some time and that on the rise of the Moon at about Three O' clock in the morning, both the sides recommended their fighting. It is more probable that the war continued for as long as the Moon was shining and that the armies rested when the Moon had set. The poet was perhaps led to make this mistake by his anxiety to render the night sufficiently horrible for, Rakshasa heroes to fight with their powers of illusion. For, it must be remembered that the Rakshasa Ghatotkacha on the side of Pandavas and the Rakshasa Alayudha on the Kaurava side are represented as having made the night hideous by their powerful uncanny powers, which could be used effectively in total darkness."$

$ Chronology of Ancient India - by Mr. V. Gopala Aiyer. pp. 101- 102

"పరస్పరవిరుద్ధమైనశ్లోక మింకొకటిగలదు. దానిని సంక్షేపముగా విమర్శించెదము. ఇఱుకక్షులకును బదునాలవ నాఁటిరాత్రి ఘోరయుద్ధము జరగెను. ఆరాత్రి మూఁడు భాగములకాలము గడచినతర్వాత చంద్రోదయమైనట్లు మహాకావ్యము (భారతము)న వర్ణింపఁబడియున్నది. నిశ్చయముగ నిది యొకతప్పు. యుద్ధమారంభమయిన మొదవ నాఁడు అమావాస్యయై యుండుటనుబట్టి యానాఁడు (పదునాలవ దినమున) రాత్రికాలము మూఁడుభాగములు గడచుటకు దాదాపుగంటన్నరకుఁబూర్వమే పశ్చిమదిఙ్మండలమున జంద్రుఁడ స్తమించియుండవలయును. పదునాలవ నాఁటిసాయంత్రము జయద్రథుని సంహరించెదనని శపథమును నర్జునుఁడు నెఱవేర్చియుండుటచేఁ గౌరవులుక్రుద్ధులై కక్షసాధించుటకుఁ బొద్దుపోయినను రాత్రిపూఁటయుద్ధము గావించియుండిరి. ఆరాత్రి ప్రథమభాగమున గాఢాంధకారములో ఘోరయుద్ధము జరగియుండెననియు, నాయుద్ధమున ఘటోత్కచుఁడు వధింపఁబడియెననియుఁ దర్వాత నుభయ కక్షలవారును గొంతకాలము నిద్రించుటకై విశ్రాంతిఁ దీసికొనియుండిరనియు, రాత్రి దాదాపు (మూఁడు) 3 గంటలకుఁ జంద్రోదయమైనపిమ్మటఁ దిరిగి యుద్ధమారంభించియుండిరనియు నిమ్మహాకావ్యము మనలను విశ్వసింపవలసినదని యనుచున్నది. చంద్రుని ప్రకాశముండినంతవఱకు యుద్ధము జరగియుండెననియుఁ, జంద్రాస్తమయముతోడ యుద్ధముసేయుట చాలించియుండిరనియుఁ జెప్పిన నెక్కుడు

సంభవముగఁ గన్పట్టుచున్నది. రాక్షసులు తమ మాయా బలము నుపయోగించి యుద్ధముసేయుట కారాత్రి నిబిడాంధకారముతోఁ గూడుకొనియున్నటులఁ జూపించుటకై కవి యట్టిలోపమును గావించియుండును. పాండవుల పక్షమున రాక్షసయోధుఁడగు ఘటోత్కచుఁడును గౌరవులపక్షమున రాక్షసయోధుఁడగు అలాయుధుఁడును నంధకారమునవారాత్రిమే విజృంభించు, విచిత్రమైనట్టియు విపరీతమైనట్టియుఁ దమ మాయాశక్తులను బ్రయోగింప నారాత్రినంతయు నంధకారబంధురమై భీకరముగనుండునటులఁ గావించి యుద్ధము చేసియుండిరని చెప్పఁబడినవిషయమును మనము జ్ఞప్తియందుంచుకొనవలయును.” *

అని చెప్పియుండెను. దీనింబట్టి కవి పొరపడి చంద్రోదయవర్ణనము గావించియుండెననియు, రాక్షసయోధు లానాఁటిరాత్రి ఘోరయుద్ధము గావించియుండిరనియు, నారాక్షసమాయలచే నాఁటిరాత్రి నిబిడాంధకారముగఁ గావింపఁబడియుండెననియు, వాస్తవమున నయ్యది శుక్లపక్షద్వాదశిరాత్రియేయనియు, కృష్ణపక్షరాత్రికాదనియు, గోపాలయ్యరుగారి యభిప్రాయమైనట్టు స్ఫురించుచున్నది.

ఈ చంద్రోదయ వర్ణనవిధానము మహాభారతము ముద్రణ ప్రతులయందు ద్రోణపర్వము 185 అధ్యాయమునఁ గన్పట్టుచున్నది. ఇందునుగుఱించి విమర్శనలిపిన నారాయణశాస్త్రి గారు

* Chronology of Ancient India-pp, 101-102 by Mr. V. Gopal Aiyer;

" I consulted four mss of Dronaparva in the Adyar Library and in two of them the whole of the 185th. Adhyaya in which this description of the rise of the Moon, is given in all the printed Editions is not to be found at all, though it must be stated the other two mss do contain the passage. Then on carefully going through the various chapters before and after this, it strikes us that the whole of this Adhyaya is entirely unnecessary and uncalled for, and that it must have been a later interpolation by some other poet who wanted to give a description of the rise of the Moon"§

" నేను అడయారు పుస్తకభాండాగారమున నుండు ద్రోణపర్వము వ్రాఁతప్రతుల నాల్గింటినిఁ జూచితిని. అందు రెంటియం దీచంద్రోదయవర్ణనము గావింపఁబడినటుల ముద్రణప్రతులయందుఁ గన్పట్టు 185 అధ్యాయము బొత్తుగనేలేదు. తక్కిన రెండుప్రతులయందుఁగలదు. ఈ అధ్యాయమునకుఁ బూర్వమందును బరమందునుగల యధ్యాయములఁ బెక్కింటిని జాగ్రతగఁబరిశీలించిచూడ నీ యధ్యాయములోని సంగతులచ్చట చెప్పఁబడుట కేమియుఁ బ్రసక్తి కన్పట్టుటలేదు. కావునఁ జంద్రోదయవర్ణనము గావించు కుతూహలముతో నే కవియో నిటీవలికాలమున నిఱికించియుండునని తోఁచుచున్నది."

§ Age of Sankara, Page 300

అని చెప్పియున్నారు. పదునాలవనాఁటిరాత్రి మూఁడుముహూర్తముల కాలముండఁగా యుద్ధము మరలబ్రారంభమయ్యెనని చెప్పుటకుఁ గ్రోడీకరించిన

" శ్లో॥ త్రిభాగమాత్ర శేషాయాం
రాత్ర్యాం యుద్ధమవర్తత
కురూణాం పాండవానాంచ
సంహృష్టానాం విశాంపతే॥ "

యను శ్లోకమునందలి 'త్రిభాగమాత్ర శేషాయాం రాత్ర్యాం' అను వాక్యమునకు 'రాత్రి మూఁడుముహూర్తముల (ఆఱు ఘటికల) కాలము నిలిచియుండఁగ' నని నీలకంఠుఁ డర్థమును జెప్పియుండెను. ఇయ్యది ద్రోణపర్వము 185 అధ్యాయము లోని ప్రథమశ్లోకమయియున్నది. పదునాలవనాఁటిరాత్రి జరగిన ఘోరయుద్ధమును గుఱించి సంగ్రహముగ ధృతరాష్ట్రునితో సంజయుఁడు చెప్పుసందర్భమున 'మూఁడు భాగముల రాత్రి యింకనుండగనే యుద్ధముజరగియుండెను.' అని చెప్పఁ బడినట్లు లగపడుచున్నది. 'త్రిభాగమాత్ర శేషాయాం రాత్ర్యాం యుద్ధమవర్తత' అను వాక్యమునకు 'రాత్రి మూఁడు భాగములు శేషించియుండఁగనే యుద్ధము జరగెను' అను నర్థమును జెప్పఁదగియుండును గాని నీలకంఠుఁడు చెప్పినటుల 'మూడుముహూర్తములకాలము రాత్రి శేషించియుండఁగ'నని యర్థమిచ్చుటలేదు. అట్టి లర్థము చెప్పుటకును నవకాశము గన్పట్టుటలేదు. ఆ శ్లోకమును బరికించిన నందు యుద్ధము తిరిగి

ప్రారంభింపఁబడియుండె ననుభావమిచ్చు పదమే కానిపించుట లేదు. 'త్రిభాగమాత్ర శేషాయాం' అను వాక్యమునకు "మూఁడుభాగములు గడచిపోఁగా"నని యర్థము చెప్పుటకును నవకాశము గన్పట్టదు. మూఁడుభాగములరాత్రి మిగిలియుండఁగా ననియే యర్థము చెప్పఁకొనవలసియుండును. దీనింబట్టి చూచిన "రాత్రి మూఁడుభాగములకాలము శేషించియుండఁగా ననఁగా రాత్రి యొకభాగముకాలమున యుద్ధముజరగెను." అని భావమిచ్చుచున్నది. రాత్రియొకభాగకాలము షుమారు 7½ (యేడున్నర) ఘటికల కాలమగును. అయ్యది సూర్యాస్తమయమయినపిమ్మట మూఁడు(3)గంటలకాలము అనఁగా రాత్రి షుమారు 8¾గంటలకాలమపుడు చంద్రోదయమయినట్లు భావింపవలసియుండును.అట్టులెంచినచో నాఁడు కృష్ణపక్షచవితి రాత్రియయియుండినట్లు లగపడును. అయ్యది పదునాలవనాటిరాత్రి యని చెప్పఁబడి యుండుటచే భారతయుద్ధము శుక్లపక్ష పంచమిని బ్రారంభమయినటులఁ జెప్పవలసివచ్చుచున్నది. నీలకంఠుఁడు చెప్పినటుల మూఁడుముహూర్తములకాలము రాత్రి శేషించియుండఁగఁ జంద్రోదయమగుట యసంభవము.ఇయ్యది మార్గశీర్షశుక్ల త్రయోదశి భారతయుద్ధ ప్రారంభదివసమును నీలకంఠుని సిద్ధాంతమును మూలచ్ఛేదము గావించుచున్నది. తన సిద్ధాంతమునకుఁ బ్రతిబంధముగఁ గన్పట్టుటచేఁ 'ద్విభాగ శేషరాత్ర్యాం'అను వాక్యమునకు విపరీతార్థములను సృష్టించి యుండెను. అనుశాసనపర్వమున

"శ్లో॥ మాఘో౽యం సమనుప్రాప్తో
మాసః సౌమ్యో యుధిష్ఠిర
త్రిభాగశేషః, పక్షో౽యం
శుక్లో భవితు మర్హతి॥"

అని చెప్పఁబడిన భీష్మవచనమునందలి 'మాఘో౽యంసమనుప్రాప్తో మాసః సౌమ్యోయుధిష్ఠిర త్రిభాగశేషః' అను వాక్యము లకు

"సౌమ్యశ్చంద్రః । మాసస్యచతుర్భాగకరణేసార్థసప్త తిథేరేకైక భాగత్వాత్ । అష్టస్యర్థస్యా౽తి తత్త్వేన ప్రథమ భాగస్యావిద్యమానత్వాత్ । త్రిభాగశేషో భవితుమర్హ తీద్యర్థః । తేనా౽ద్యష్టమీత్యర్థః॥"

అని నీలకంఠుఁడే వ్యాఖ్యను రచించియుండెను. దీనింబట్టి 'త్రిభాగశేషః' అనఁగా నాలుగుభాగములలో మూఁడుభాగ ములు శేషించియుండుకాలమని నీలకంఠుఁ డొప్పుకొనుట యథార్థము. అట్టియెడఁ 'త్రిభాగమాత్రశేషాయాంరాత్ర్యాం' అన రాత్రిభాగమును నాలుగుభాగములుసేసిన మూఁడుభాగ ములకాలము రాత్రి శేషించియుండెనని చెప్పఁదగియుండునేగాని మూఁడు ముహూర్తములకాలము నిలిచియుండెనని భావించుట కేమాత్ర మవకాశమును గాన్పింపదు.

ఇఁక భీష్మనిర్యాణమునుగుఱించి భారతమునఁ జెప్పఁ బడిన విషయములను గమనింతము.

దుర్యోధనుఁడు హతుఁడైనపిదప నాశౌచముఁ నుగడపి యుద్ధమున నిహతులయిన జ్ఞాతులకును, బంధువులకును, యోధవరులకందఱకును గర్మల నాచరించి యుధిష్ఠిరుఁడు హాస్తినాపురమునకేఁగి పట్టాభిషిక్తుఁడయ్యెను. తర్వాత సోదర యుతముగ యుధిష్ఠిరుఁడు శ్రీకృష్ణభగవానుని తోడ్కొని శరతల్పశయనుఁడై యున్న భీష్మునిపాలికిం జనియెను. అట్టియెడ శ్రీకృష్ణభగవానుఁడు భీష్మునిఁజూచి

" శ్లో॥ పంచాశతం షట్చకురు ప్రవీర
శేషం దినానాంతవ జీవితస్య ।
తతశ్శుభే కర్మఫలోదయేత్వం
సమేష్యసే భీష్మ విముచ్య దేహమ్॥
ఏతేహి దేవావసవో విమానా
న్యాస్థాయ సర్వేజ్వలితాగ్నికల్పాః ।
అంతర్హితాస్త్వాం ప్రతిపాలయంతీ
కాష్ఠాం ప్రపద్యంత ముదక్పతంగమ్ ॥
వ్యావర్తమానే భగవత్యుదీచీం
సూర్యే జగత్కాల వశంప్రపన్నే ।
గంతాసిలోకాన్ పురుషప్రవీర
నావర్తతేయా నుపలభ్యవిద్వాన్॥[1]

అని చెప్పియుండెను. ఈవాక్యములనుబట్టి

---

1 శాంతిపర్వము ౫౧ అధ్యా, ౧౪-౧౭ శ్లో.

"పంచాశతం షట్చకురు ప్రవీర
శేషం దినానాంతవ జీవితస్య"

అని శ్రీకృష్ణుఁడు భీష్మునిసంబోధించి చెప్పినట్లు లగపడు చున్నది. ఆవాక్యమునకు, "ఓ కురుప్రవీరుఁడా! నీజీవితమింకను నేఁబదియాఱు (56)దినములు నిలిచియున్న" దని భావమైనటుల సూచించుచున్నది. ఈవాక్యమునకు నీలకంఠుఁడు

"పంచాశతమితి పంచాశతం షట్చేతితవ జీవితసంబంధినాం దినానాం శేషం—పంచషట్చపంచవారమావర్తితాః షడితిరిత్యా త్రింశదితిజ్ఞేయం - తావదేవ అశతం శతావధి - యద్దినానాం శతేన కతుఁం శక్యం తత్త్రిం శతాపికతుఁం శక్య మిత్యర్థః ॥ శ్లో॥ అష్టపంచాశతం రాత్ర్యః శయనస్యాద్య మేగతా ఇతి భీష్మోవక్ష్యతి - తత త్రింశద్రాత్రయః పరం శిష్టాః అష్టావింశతిరితః పూర్వం వ్యతీతా ఇతిజ్ఞేయం - తదాహి - భీష్మస్య శరతల్ప శయనానంతరం అష్టాదినాని యుద్ధం - తతోదుర్యోధనాశౌచం యుయుత్సోః షోడశదినాని—తేనసహాపురం ప్రవిశతాం పాండవానామపితావంతిదినాని- పంచవింశే సర్వేషాం శ్రాద్ధదానం—షడ్వింశే పురప్రవేశః—సప్తవింశే రాజ్యాభిషేకః—అష్టావింశే ప్రకృతిసాంత్వనం అభ్యుదయికం దానం చ—ఏకోనత్రింశే భీష్మం ప్రత్యాగమనం—తద్దినమారభ్యత్రింశద్దినాని శిష్టానీతిజ్ఞేయం॥ ౧౪॥

అని వ్యాఖను రచియించియుండెను.

నీలకంఠుఁడు 'మఖావిషయగగిసోమ' * యను శ్లోకమునకు వ్యాఖ్యను రచించుసమయమునఁ దానుగావింపఁదలచిన

---

* భీష్మపర్వము. 18 అధ్యా. 2 శ్లో.

సిద్ధాంతమున కనుగుణ్యముగ నాశ్లోకమున కపార్థములఁగల్పించి యెంతఁ దలక్రిందులయినను భీష్ముఁడు యుద్ధభూమియందుఁ గూలినపిమ్మట యేఁబదియెనిమిది (58) రాత్రులు జీవించి యుండి జీవములఁబాసినట్టు లిప్పుడొప్పుకొనక తప్పినదిగాదు. ఈ శ్లోకమునకు నీలకంఠుఁడు చెప్పిన వ్యాఖ్యయే వెనుకభీష్మ పర్వమునఁజెప్పినయర్థ మపార్థమని స్థిరపఱచుచున్నది. అట్టి యపార్థముల నాధారముగాఁగొని భారతయుద్ధము మార్గశీర్ష శుక్లత్రయోదశీ మఘానక్షత్రమునఁ బ్రారంభమయ్యెనని కావించిన సిద్ధాంతము మూలచ్ఛేదముఁ గావింపఁబడుచున్నది. ఈశ్లోకమునుబట్టి భీష్మునిజీవితకాల మప్పటికింకను ముప్పదిదినములని కావించిన సిద్ధాంతమే సరియైనదని చెప్పఁదగియున్నది. నీలకంఠుని వ్యాఖ్యనుబట్టి 'పంచాశతంషట్చ' యను వాక్యమును 'పంచాహతంషట్చ,' యనియే భావించి వ్యాఖ్యను రచించినట్టు లగపడెడిని. 'పంచాశతంషట్చ' యను వాక్యము నందలి 'శ' కారము 'హ' కారమునకు మారు లేఖక ప్రమాదజనితమయి యుండునట్టు లగపడుచున్నది. అటులేని నవ్వాక్యమునకు ముప్పదిదినములనియే భావము సిద్ధము. నీలకంఠుఁడు వ్యాఖ్యయందు విపులముగఁ గనంబఱచినట్లు భీష్మపతనమునకుఁ దర్వాత నిఱువదితొమ్మిదవ దినమున శ్రీకృష్ణభగవానుఁడు భీష్మునొద్దకుంజని యీవాక్యమును జెప్పియుండెను. ఆవాక్యమునకు ననఁగాఁ 'బంచాశతం షట్చ' యను వాక్యమున కేఁబదియాఱుదినములింకను జీవిత కాలమని చెప్పియుండినట్టులెంచిన భీష్ముఁడు యుద్ధభూమి

యందుఁ బడినతర్వాత 85 (29 + 56) దినములకు నిర్యాణము జెందినట్లుఁ జెప్పవలసివచ్చుచున్నది. ఇయ్యది భీష్మవాక్యము నకు విరుద్ధముగనుండుటయేగాక భీష్ముఁడు ఫాల్గుణమాసములో మరణించినట్లు లగపడుటయు, భారతమునం దీవిషయమును గుఱించి చెప్పినయంశములన్నిటికిని విరుద్ధమగుచున్నది. కావున 'పంచాశతంషట్చ' అను వాక్యమునందలి 'శ' కారము 'హ' కారమునకుమారు లేఖకప్రమాదజనితమనియు 'పంచాహాతంషట్చ' యను నదియే సరియైనరూపమనియు స్పష్టముగఁ జెప్పఁదగియున్నది. భీష్ముఁడు శరతల్పగతుఁడైన యనంతర మిఱువదితొమ్మిదవ (29) దినమున శ్రీకృష్ణభగవానుఁడు భీష్ముని జీవితకాలశేషమింకను ముప్పది (30) దినములని చెప్పియుండుటచే భీష్ముఁడు యుద్ధభూమియం దర్జునునిచేఁ గూల్పఁబడిన పిమ్మట నేఁబదితొమ్మిదవ (59) దినమునఁ బ్రాణముల బాసినట్లు స్పష్టమగుచున్నది. ఇయ్యది భీష్ముఁడు ప్రాణములబాయుటకుఁ బూర్వము

"శ్లో॥ అష్టపంచాశతంరాత్ర్యం
శయానస్యాఽద్య మేగతాః
శరేషునిసితాగ్రేషు
యథావర్షశతంతథా॥

మాఘోయం సమనుప్రాప్తో
మాసః సౌమ్యోయుధిష్ఠిర

త్రిభాగశేషః; పక్షోఽయం
శుక్లో, భవితుమర్హతి॥”*

అని చెప్పినవాక్యములకును సరిపోవుచున్నవి. ఉత్తరాయన మారంభమగుటయెఱింగి యుధిష్ఠిరాదులు భీష్మునికడకేగిన సమయమున భీష్ముఁడావాక్యములు యుధిష్ఠిరునితోఁబల్కియుండెను. ఈవాక్యములనుబట్టి భీష్ముఁడు యుద్ధభూమియందుఁ బడిపోయినపిమ్మట నేబదియెనిమిది (58) రాత్రులు శరతల్పగతుఁడై యుండి యేఁబదితొమ్మిదవ (59) దినమునఁ బ్రాణములఁ బాసినట్లునుఁ అయ్యది మాఘశుక్ల యష్టమినాఁటి మధ్యాహ్నకాలమయినట్లును దెలియుచున్నది. ఇఁటఁ 'త్రిభాగశేషః' యను వాక్యమునకు మాసములో మూఁడుభాగములు నిలిచి యుండెనని వ్యాఖ్యాతయగు నీలకంఠుఁడే చెప్పియుండెను. మాఘమాసములో నొకభాగ మనఁగా (7½) ఏఁడున్నరతిథుల కాలము గడచియుండెను. అయ్యది యష్టమి యగుచున్నది. సప్తమి దినముననే యుత్తరాయన మారంభమయియుండెనని యు మఱునాఁడగు అష్టమి దినమున భీష్మనిర్యాణము జరగి యుండెననియుఁ దెలియుచున్నది. ఇదియునుంగాక భీష్ముఁడు శరతల్పగతుఁడై యేయోగసాధనమున నంతకాల ముండెనని జనమేజయుఁడు ప్రశ్నింప

“శ్లో॥ శృణుష్వావహితోరాజన్
శుచిర్భూత్వా సమాహితః ।

*అనుశాసనికపర్వము 167 అధ్యా. 27-28శ్లో.

భీష్మస్య కురు శార్దూల
దేహోత్సర్గం మహాత్మనః ॥ ౨

ప్రవృత్తమాత్రేత్వయన
ముత్తరేణ దివాకరే
శుక్లపక్షస్యచాఽష్టమ్యాం
మాఘమాసస్య పార్థివ ॥ 3

ప్రజాపత్యేచ నక్షత్రే
మధ్యం ప్రాప్తోదివాకరే॥
సమావేశ యదాత్మాన
మాత్మన్యేవ సమాహితః ॥"* ౪

అని వైశంపాయనుఁడు చెప్పినవాక్యములకును సరిపోవుచున్నది. ముద్రణ ప్రతులయందును కొన్ని వ్రాఁత ప్రతులయందును మూఁడవ శ్లోక ముత్తరార్ధమును నాలవశ్లోకము పూర్వార్ధమును వదలివేయబడియున్నవి. కాని కొన్ని ప్రాచీన వ్రాఁత ప్రతులయం దాశ్లోకములు సంపూర్ణముగనే గాన్పించుచున్నవి.

వైశంపాయనుని వాక్యములనుబట్టి భీష్మనిర్యాణము మాఘశుక్ల యష్టమినాఁటి మధ్యాహ్నము ప్రజాపతి యధిపతిగ నుండు నక్షత్రమునందనఁగా రోహిణీనక్షత్రమున జరగియుండి నటులఁ దెలియుచున్నది. భీష్మనిర్యాణము భారతయుద్ధ మారంభమయిన పదియవనాఁటికిఁ దర్వాత నేఁబదితొమ్మిదవదినమున ననఁగా భారతయుద్ధ మారంభమయిన అఱువదియొనిమిది (68)

* శాంతిపర్వము 47 అధ్యా. 2-4 శ్లో.

దినములకు జరగియుండినటులఁ దేలుచున్నది. అయ్యది మాఘ శుక్లయష్టమినాఁటి మధ్యాహ్నము రోహిణీనక్షత్రమయి యుండినటులఁ దెలియుచున్నది. దీనింబట్టి భారతయుద్ధము కార్తీక మాస కృష్ణపక్షఅమావాస్యనాఁడు జ్యేష్ఠానక్షత్రమున ప్రారంభ మయియుండెననియు ధృవపడుచున్నది. మఱియు భారతమునఁ జెప్పబడిన యితరవిషయములన్నియుంగూడ సరిపోవుచున్నవి. అదియునుంగాక మాఘశుక్లయష్టమి భీష్మాష్టమియనియు, మాఘ శుక్లసప్తమి రథసప్తమియనియుఁ గలియుగమునఁ బ్రథమము నుండియు హైందవులు సంప్రదాయముగ నేఁటివఱకును జెప్పుకొనుచు నాయా తిథులు పర్వతిథులుగ నెన్నుచుండువిషయముగూడ నద్దాని యాథార్థ్యమును ధృవపఱుచుచున్నది. కాని యే వత్సర మాఘమాసమున భీష్మనిర్యాణము జరగియుండినది మనము తెలిసికొనినంగాని భారతయుద్ధ కాలనిర్ణయముగావించుట కయ్యది తోడ్పడఁజాలదు. భారతయుద్ధ కాలమును భీష్మనిర్యాణమును నొకేసంవత్సరమున జరగి యుండెనని స్పష్టముగఁ దెలియుచున్నది. భీష్ముఁ డుత్తరాయనము ప్రవేశమైనపిమ్మటనే జీవయాత్రఁ జాలించెను. భీష్మనిర్యాణమునకుఁ దొలిదినమునందనగా మాఘశుక్ల సప్తమిదినమున నుత్తరాయన మారంభమయినటులఁ గన్పట్టుచున్నది

భీష్ముఁడు మాఘశుక్లయష్టమినాఁటి మధ్యాహ్నమున రోహిణీనక్షత్రమున నిర్యాణముఁ జెందెనని తెలిసికొనియుంటిమి. మధ్యాహ్నమనుటచేఁ బదునైదు (15) ఘటికల కాలమయి యుండును. అపుడు రోహిణీనక్షత్రమనుటచేఁ జంద్రుఁడు

రోహిణీనక్షత్రమునం దుండెనని తెలియుచున్నది. జ్యోతిశ్శాస్త్ర సిద్ధాంతవేత్తలు గణితము వేసి యా దినమున రోహిణీనక్షత్రము ముప్పదిరెండు (32) ఘటికలుమాత్రమేయుండెనని చెప్పియుం డిరనియు, గడచిన కాళయుక్తి సంవత్సరపంచాంగమును గ్రహ గతులను గమనించిన భారతయుద్ధకాలమునఁ జెప్పఁబడిన తిథు లకును నక్షత్రములకునుసరిపోవుచుండెననియు,నాపంచాంగమునఁ జెప్పఁబడిన తిథి, నక్షత్రప్రమాణములనుబట్టియు భీష్మనిర్యా ణము జరగిన మాఖశుక్ల యష్టమిదినమున ముప్పదిరెండు(32) గడియలకుమించి రోహిణీనక్షత్ర ముండఁజాలదనియు శ్రీనారా యణశాస్త్రిగారు చెప్పియుండిరి. †

అష్టమిదినమున పగలు 15 గడియలకాలమప్పుడు భీష్మ నిర్యాణము జరగెనని చెప్పఁబడియుండుటచే నాఁడు భీష్మనిర్యా ణమునకుఁబిదప నింకను రోహిణీనక్షత్రము 17గడియలు జరుగ వలసియుండెను. దీనింబట్టి భీష్మనిర్యాణకాలమునకుఁ జంద్రుఁడు రోహిణీనక్షత్ర తృతీయపాదమునుగడచి చతుర్థపాదమును ప్రవేశించుట కింకను రెండుగడియల కాలవ్యవధి యుండెను. తృతీయపాదమున పదమూఁడు (13) గడియలులేక 13/15 భాగము గడచియుండెను. రోహిణీనక్షత్రము తృతీయపాదము జ్యోతిశ్చక్రమున 46 భాగల 40 కళల (46 డిగ్రీల 40 మినిట్లు) యందారంభమగుచున్నది. ఒక్కొకనక్షత్రపాదము 3 భాగల

† Age of Sankara part I- Appendix II- pp. 331-332.

20 కలల (3 డిగ్రీల 20 మినిట్లు) పరిమితియైయుండెను. కావున భీష్మనిర్యాణకాలమునఁ జంద్రుఁడు జ్యోతిశ్చక్రమున $(46^\circ-40')+13/15\ (3^\circ-20')=(46^\circ-40')+(2^\circ-53'-20'')$ $=49^\circ-33'-20''$ (49 డిగ్రీల 33 మినిట్లు 20 శెంకడ్లు) యందుండియుండినటులఁ దెలియుచున్నది.

భీష్మ నిర్యాణకాలమునకు మాఘమాసమున యేఁడున్నర ($7\frac{1}{2}$) తిథులకాలము గడచియుండెను. ఇయ్యది చంద్రునకును సూర్యునకునుగల దూరమును దెలియఁజేయును. చంద్రగతినిబట్టి యొక్కొక్క తిథికాలము జ్యోతిశ్చక్రమునఁ బన్నెండు (12) డిగ్రీల పరిమితియైయుండెను. కావున $7\frac{1}{2}$ తిథుల కాలము $12\times7\frac{1}{2}=90$ డిగ్రీల పరిమితియై యుండెను. దీనింబట్టి సూర్యునకును జంద్రునకును గలదూరము 90 డిగ్రీల పరిమితియై యుండెనని తెలియుచున్నది. జ్యోతిశ్చక్రమునఁ జంద్రుడు 49 డిగ్రీల 33 మినిట్లు 20 శెకండ్లు నందుండెనని తెలిసికొనియుంటిమి. కావున భీష్మనిర్యాణకాలమున సూర్యుఁడు జ్యోతిశ్చక్రమున $(49^\circ-33'-20'')-(90^\circ-0'-0'')=319^\circ-33'-20''$ నందుండినటు లగపడుచున్నది. అయ్యది శతభిషా నక్షత్ర చతుర్థపాదమునందయి యుండెను. 320 డిగ్రీలతో శతభిషానక్షత్రము చతుర్థపాద మంతమగును. ఉత్తరాయనము రథసప్తమినాఁడు ప్రారంభమయియుండెను. ఉత్తరాయనము ప్రవేశమయినపిదప $1\frac{1}{2}$ (ఒకటిన్నర) తిథికాలమునకు భీష్మనిర్యాణము జరగియుండెను. అక్కారణమున $1\frac{1}{2}$ తిథికాలము సూర్యునకు $1\frac{1}{2}$ డిగ్రి పరిమితి యగుచున్నది. కావున భీష్మ

నిర్యాణకాలమున జ్యోతిశ్చక్రమున $318^\circ - 3' - 20''$ $\{(319^\circ - 33' - 20'') - (1^\circ - 30' - 0'')\}$ నందు లేక శతభిషా నక్షత్రము చతుర్థపాదమునందు సూర్యుఁ డుండఁగ నుత్తరాయన మారంభమయి యుండెనని తెలియుచున్నది. మహాభారత యుద్ధమారంభమయిన తరువాత 68 దినములకు భీష్మ నిర్యాణము జరగియుండుటచే మహాభారతయుద్ధకాలమునం దుత్తరాయనము శతభిషానక్షత్ర చతుర్థపాదమున జ్యోతిశ్చక్రమున 318 డిగ్రీల 3 మినిట్లు 20 శెకండ్లయందు సూర్యుఁ డుండఁగఁ బ్రారంభమయియుండెనని తెలియుచున్నది.

ప్రకృతకాలమునఁ గ్రీ. శ. 1930 సంవత్సరమునం దుత్తరాయనము మూలానక్షత్ర తృతీయపాదమునందనఁగా జ్యోతిశ్చక్రమున 247 డిగ్రీల 18 మినిట్లయందు సూర్యుఁడుండఁగఁ బ్రారంభమగుచున్నది. మహాభారత యుద్ధకాలమునం దుత్తరాయన ప్రారంభకాలమునకును బ్రకృతకాలమునం దుత్తరాయన ప్రారంభకాలమునకును $70^\circ - 45' - 20''$ $\{(318^\circ - 3' - 20'') - (247^\circ - 18' - 0'')\}$ డెబ్బదిడిగ్రీల నలుబదియైదుమినిట్లు యిఱువది శెకండ్లకాలవ్యత్యాసము గన్పట్టుచున్నది. ఈ కాలవ్యత్యాసము అయనచలనము (Precession of the Eqninoxes)ను బట్టి కలుగుచున్నది. అయనచలనమునుబట్టి యొక్కొకవత్సరమునకు $50 . 26''$ (50 . 26 శకండ్లు) పరిమితి వ్యత్యాసము కలుగునని నవీనజ్యోతిశ్శాస్త్రవేత్తలు (Astronomers) చెప్పి యుండిరి. కావున దీనింబట్టి భారతయుద్ధకాలమునం దుత్తరా

యన ప్రారంభకాలమునకును బ్రకృతకాలమునం దుత్తరాయన ప్రారంభకాలమునకునుగల కాలవ్యవధిని కనుగొందము.

50.26 శెకండ్ల వ్యత్యాసముండిన కాలవ్యవధి యొక సంవత్సరమయిన 70 డిగ్రీల 45మినిట్లు 20 శెకండ్లు లేక 254720 శెకండ్ల వ్యత్యాసముండిన కాలవ్యవధి 254720 ÷ 5026= $5068\frac{2320}{5026}$ లేక 5069 సంవత్సరము లగుచున్నది.

మహాభారత యుద్ధకాలమునకును బ్రకృతకాలమగు క్రీ. శ. 1930 సంవత్సరమునకుఁగల కాలవ్యవధి 5069 సంవత్సరములుగఁ దేలుచున్నది. కావున మహాభారతయుద్ధ కాలము క్రీ. పూ. 3139 (5069–1930) సంవత్సర మయియున్నది.

మహాభారతయుద్ధానంతరము 37 సంవత్సరములకుఁ గలియుగము ప్రవేశమైయుండినటులఁ జెప్పఁబడి యుండుటచేఁ గలియుగ ప్రవేశకాలము క్రీ. పూ. 3102 (3139–37) సంవత్సరమైయుండెనని స్పష్టముగఁ జెప్పనొప్పుచున్నది.

శ్రీకృష్ణనిర్యాణమును గలియుగ ప్రవేశమును బరీక్షిత్తు పట్టాభిషేకము నొకే వత్సరమున జరగియుండినటులఁ జెప్పఁబడియుండుటచే శ్రీకృష్ణనిర్యాణమును, బరీక్షిత్తు పట్టాభిషేకమును గీ్రి. పూ. 3102 సంవత్సరమున జరగియుండెనని స్పష్టముగఁ జెప్పఁదగియున్నది.

మఱియుఁ గలియుగము ప్రారంభమయిన యనంతరము 25 సంవత్సరములు గడచినపిమ్మట యుధిష్ఠిర స్వర్గారోహణమును, యుధిష్ఠిరజ్ఞాపకార్థము లౌకికాబ్ద (Laukika Era)

నిర్మాణమును జరగియుండెనని చెప్పఁబడియుండుటచే నయ్యవి క్రీ. పూ. 3077–76 సంవత్సరమున జరగియుండెననియు స్పష్ట మగుచున్నది.

ఇదివఱలో నితరాధారములచేఁ గనుఁగొనిన కాలనిర్ణ యములన్నియు నిటుల భారతమునఁ జెప్పఁబడిన కాలనిర్ణయ ములతో నన్ని విధముల సరిపోవుచున్నవి.

మహాభారతయుద్ధము కురుపాండవులకుఁ గురుక్షేత్రమున జరగినదనుట నిర్వివాదాంశము. మహాభారత యుద్ధకాలమున నాంధ్రదేశ మొకప్రత్యేకపు దేశముగను, నాంధ్రులొకప్రత్యేక పరిపాలకపుఁ దెగవారుగను బేర్కొనఁబడి యుండెను. మహా భారతయుద్ధము క్రీ. పూ. 3139 సంవత్సరమున జరగియుండె నని తెలిసికొనియుంటిమి. కావున క్రీ. పూ. 3140 సంవత్సర మునకుఁ బూర్వమునుండియు భరతఖండమున నాంధ్రదేశ మొక ప్రత్యేకరాజ్యముగ నుండెననియు, నాంధ్రులొక ప్రత్యేక పరి పాలకపుఁ దెగవారుగనుండి ప్రఖ్యాతి వడసియుండిరనియు స్పష్ట ముగఁ జెప్పనొప్పుచున్నది.

—:o:—

# సవరణపట్టిక.

---

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 9 | 18 | th | the |
| 13 | 7 | ఆక్స్యసునది | ఆక్సుసునది |
| 20 | 17 | tongue | longue |
| | 23 | relie | relic |
| 24 | 5 | ఖండమునఁజొట్టి | ఖండమునఁబుట్టి |
| | 12 | యిరేనియస్ | ఐరేనియస్ |
| 28 | 19 | సిద్ధాతముల | సిద్ధాంతముల |
| | 22 | స్మృతె | స్మృత్యై |
| 29 | 1 | నతిరయోక్తులుగఁ | నతిశయోక్తులుగఁ |
| | 23 | తమ తమ | తమ మత |
| 31 | 2 | త్రోసిరాజని. | త్రోసిరాజనిరి. |
| 35 | 4 | ఐరాపాఖండ | ఐరోపాఖండ |
| 36 | 2 | Crade | Cradle |
| 41 | 21 | నలవఱచుకొన్నదియు | నలవఱచుకొన్నట్టియు |
| 42 | 23-24 | pastor-nal | pastoral |
| 43 | 9 | వింధావళి | వింధ్యావళి |
| | 21 | (Prof. dana) | (Prof. Dana) |
| 68 | 7 | జాబుదేశముపు | జాబుదేశపు |
| 69 | 16 | "ప్రలాస" | "పలాస" |
| 70 | 19 | బాక్ట్రీరియాదేశరాజు వంశా | బాక్ట్రియాదేశ రాజవంశా |
| 80 | 7 | దానభాషను | దన భాషను |

| | | | |
|---|---|---|---|
| 108 | 2 | హెందవుల | హైందవుల |
| 111 | 11 | వాదము | పాదము |
| | 17 | లొక్కక్కటి | లొక్కొక్కటి |
| | 17 | యొక్కక కల్పముగఁ | యొక్కొక కల్పముగఁ |
| 114 | 12 | మానియల్ | మానియర్ |
| 122 | 7 | వరాణాం | వర్షాణాం |
| | 14 | సహస్త్రిం | సహస్రం |
| 129 | 16 | ameals | annals |
| 134 | 6 | శతాబ్ధాంతమం | శతాబ్దాంతమం |
| 149 | 27 | was | were |
| 158 | 8 | పశంసయని | ప్రశంసయని |
| 160 | 17 | యుధిషిరుని | యుధిష్ఠిరుని |
| 163 | 4 | జెప్పనపుడు | జెప్పునపుడు |
| 165 | 11 | నృషకాలము, శకభూషకాలము, | నృపకాలము, శకభూపకాలము, |
| 166 | 5 | గలియుగప్రవేకాలము | గలియుగప్రవేశకాలము |
| 180 | 20 | నక్షత్రపుల | క్షత్రపుల |
| 202 | 13 | పాగ్దేశము | ప్రాగ్దేశము |
| 207 | 17 | షిరుఁడు | ష్ఠిరుఁడు |
| | 17 | యుధిషిరుని | యుధిష్ఠిరుని |
| | 23 | శోకము | శ్లోకము |
| 208 | 5 | సమ్వాయము | సమన్వయము |
| | 14 | శకాలము | శకకాలము |
| 225 | 4 | హర్షవరశిలాదిత్య | హర్షవర్ధనశిలాదిత్య |
| 228 | 1 | శకనృపసవరయే | శకనృపసమయే |
| 234 | 5 | పాఠాంతముతో | పాఠాంతరముతో |

| | | | |
|---|---|---|---|
| 240 | 16 | (360 × 60) | (60 × 60) |
| 252 | 5 | శ్రీవిష్టాదా | శ్రవిష్ఠాదా |
| 266 | 2 | వత్సరమయిచో | వత్సరమగుచో |
| 271 | 22 | యొకడిగ్రీల | యొకడిగ్రి |
| 272 | 14 | 160 × 72 | 160 × 24 |
| 274 | 13 | చెప్పుసందర్భ | చెప్పుసందర్భ |
| 277 | 6 | నులుఁబడి | నలుఁబడి |
| 296 | 3 | యుధిషిరుని | యుధిష్ఠిరుని |
| 300 | 6 | ఖర్మలకు | కర్మలకు |
| 318 | 19 | యుధిష్ఠిని | యుధిష్ఠిరుని |
| 321 | 20 | సస్త | సప్త |
| 329 | 1 | కౌరాసప్తకం | తారాసప్తకం |
| | 6 | వసిషా | వసిష్ఠా |
| 353 | 7 | యుధిషిరుని | యుధిష్ఠిరుని |
| | 12 | యుధిషిర | యుధిష్ఠిర |
| 362 | 10 | సహామాత్సో | సహామాత్యో |
| 364 | 14 | మాఘమాశో | మాఘమాసో |
| 365 | 24 | యుద్ద | యుద్ధ |
| 373 | 5 | her | here |
| 388 | 3 | మృరశీర్షా | మృగశీర్షా |
| | 11 | స్యోమ | స్తోవ |
| | 13 | స్యోమ | స్తోమ |
| 388 | 18 | సిరాజతే | సరాజతే |
| 391 | 9 | పఠితులు | పఠితలు |
| 411 | 19 | వర్నత | వరత |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| iii | 10 | తుధీభాస్వంతునిన్ | సుధీభాస్వంతునిన్ |
| iv | 5 | ఎవ్వానిజనకుండ హీనతేజశ్శాలి | ఎవ్వానిజనకుం డహీనతేజశ్శాలి |
| viii | 4 | రూపజీనామ రూప | రూపతి నామరూప |
| xiv | 13 | పాచ్చాత్య | పాశ్చాత్య |
| xxii | 6 | గలిగియుండనట్టులఁ బరిశీలింపకను | గలిగియుండ, నట్టులఁబరిశీలింపకను, |
| xxiii | 8 | దాడివెడలి | దాడివెడల |
| xxv | 17 | మాతృదేవతయొక్క | మాతృదేశముయొక్క |

---